# కెరటాలు

[నవల]

హిందీ మూలం :

'ఆరిగపూడి'




ప్రచురణ :

దేశ్ హిందీ అకాడమీ

హైదరాబాదు – 500 034.



## శ్రీ ఆరిగపూడి రమేష్ చౌదరి

ది. 22-11-1922 న కృష్ణా జిల్లా ఉయ్యూరులో జన్మించారు.

ది. 4-4-1983 న మద్రాసులో హృద్రోగంతో కన్నుమూశారు.

1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని కారాగార శిక్ష ననుభవించి తామ్రపత్రం అందుకొన్న స్వాతంత్ర్య సమరయోధుడు.

హిందీ భాషపై వారికిగల అధికారం అపారం.

ఖ్యాతి గడించిన అతి కొద్దిమంది ఆధునిక హిందీ నవలా రచయితల్లో ఆరిగపూడి ఒకరు. వీరి రచనలు 50కి పైగా హిందీలో వెలువడ్డాయి. వాటిలో నవలలు, కథానికలు, నాటకాలు, బాల సాహిత్యానికి సంబంధించిన రచనలు అధికం. హిందూ, ఫ్రీప్రెస్ జర్నల్, హిందుస్తాన్ టైమ్స్, నవభారత టైమ్స్, ధర్మయుగ్, సాప్తాహిక హిందుస్తాన్, కాదంబిని, సారిక, ఆజ్ మొదలుగా గల ఆంగ్ల హిందీ పత్రికా పాఠకులకు ఆరిగపూడి చిరపరిచితులు. వీరి హిందీ గ్రంథాలలో దక్షిణ భారత దేశపు సామాజిక వర్ణన, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు ప్రస్ఫుటంగా గోచరిస్తుంటాయి. వీరి రచనలు వివిధ భారతీయ భాషల్లోనే గాక రష్యన్ భాషలోకూడా వెలువడ్డాయి. పలు రచనలకు వివిధ అకాడమీల, సంస్థల బహుమతులు అందుకున్నారు.

తెలుగువారు గర్వించతగిన సాహిత్యకారులుగా ఆరిగపూడి చిరస్మరణీయులు—

# కెరటాలు

హిందీమూలం :

'ఆరిగపూడి'

తెనుగుసేత :

డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్




ప్రకాశకులు :

ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ

హైదరాబాదు – 500 [illegible]4.

# హిందీ అకాడమీ పక్షాన....

'కెరటాలు' ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ పక్షాన తెలుగులో ప్రప్రథమంగా ప్రకటించబడుతున్న అనువాద గ్రంథం. హిందీ రచయితగా ప్రఖ్యాతి గడించి 50 కి పైగా హిందీలో గ్రంథాలు రచించి హిందీ ప్రజల మన్ననల నందుకున్న కీ॥ శే॥ ఆరిగపూడి రమేష్ చౌదరి హిందీలో రచించిన 'నదీకా షోర్' అను హిందీ నవలకు డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ చేసిన తెలుగుసేత యీ 'కెరటాలు'. తెలుగు సాహిత్య సంస్కృతీ విశేషాలను హిందీ భాష ద్వారా యావద్భారతావనికి అందజేయడం, ఇతర ప్రాంతాల సాహిత్య సంస్కృతీ విశేషాలను తెలుగు భాష ద్వారా తెలుగువారికి తెలియజేయడం హిందీ అకాడమీ కార్యక్రమాలలో ఒక భాగం. ఆ ప్రకారం తెలుగు మాతృభాషగా కలిగిన ఒక ప్రఖ్యాత హిందీ రచయిత మౌలికంగా హిందీలో వ్రాసిన నవలను తెలుగు ప్రజలకు అందజేస్తున్నాం. యిదీ యీ గ్రంథ విశేషం.

ఈ నవలను తెలుగులోకి అనువదించి ప్రకటించేందుకు అనుమతించిన శ్రీమతి ఆరిగపూడి పూర్ణా రమేష్ చౌదరిగారికి, యీ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి యిచ్చిన డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారికి, బహు స్వల్పవ్యవధిలో యీ గ్రంథాన్ని ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్ వారికీ ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ పక్షాన ధన్యవాదాలు సమర్పిస్తున్నాం.

వేమూరి రాధాకృష్ణమూర్తి
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ

హైదరాబాద్,
25–3–1987.

# 1

అమావాస్య చీకటి జడలు విప్పి జగతిని కప్పివేసింది. కీచురాళ్ల శబ్దాలు నీరవ నిశ్శబ్దాన్ని చీలుస్తున్నాయి. భయంకరమైన విస్ఫోటం. పెద్ద కొండ బ్రద్దలయి నట్లుగా ధ్వని. ఎగిరిపడ్డరాళ్ళు. చెల్లా చెదురయిన కాంక్రీటుదిమ్మలు. పొంగుతూ, సుళ్ళు తిరుగుతూ వరదలా ముంచెత్తుకొస్తున్న నది.

క్షణక్షణానికి పెరుగుతున్న ప్రవాహం నదీతీరాన్ని, తీరంపైవున్న పెద్ద పెద్ద చెట్లను కూల్చివేస్తూ, తనలో కలుపుకుంటూ గ్రామం వైపు పరుగులు తీస్తున్నది. ఆ పరిగెత్తే నీటిహోరు ప్రతిధ్వనిస్తూ చీకటి రాత్రిలో మరింత భయంకరంగా తయారయ్యింది. నిద్రాదేవి గాఢ పరిష్వంగంలో జోగుతున్న ఆ తీరగ్రామ ప్రజలకు ఒక్కక్షణం జరిగిం దేమిటో అర్థం కాలేదు. అర్థం చేసుకోవటానికి వీలు లేకుండా వస్తున్న ప్రవాహం ఎవరికి వారే ప్రాణభీతితో ఎత్తైన ప్రదేశం వెతుక్కుంటూ పరుగులు తీస్తున్నారు. ఈ కష్టం చాలదా అన్నట్లు అప్పటికే మేఘావృతమైవున్న ఆకాశం, ఈదురుగాలి తోడుకాగా కుండపోతగా వర్షంకురిపించసాగింది.

గ్రామంలోని ప్రతి ఒక్కరూ ఇళ్ళువదలి బయటకు వచ్చారు. కొందరు ఆ గ్రామంలో వున్న కోటవైపు పరుగులు తీస్తుండగా కొందరు దగ్గరలోవున్న పెద్ద పెద్ద వృక్షాలపైకి ఎక్కసాగారు. కొందరు ఎత్తైన ప్రదేశాలకు చేరుకుని పెద్ద ప్రమాదాన్ని ఊహించుకుంటూ, రక్షించమని చేతులెత్తి భగవంతుణ్ణి ప్రార్థించసాగారు. మొత్తంమీద ఎక్కువ మంది సురక్షితంగా కోటలోపలకు చేరుకున్నారు. నీటిమట్టం పెరుగుతూ కోటగోడలను బలంగా తాకుతూ వేగంగా సాగుతున్నది. గ్రామంలోని చెరువు నిండిపోయింది. చెరువు గట్లు మునిగిపోయాయి. వీధుల్లో నీరు కాలువల్లాగా ప్రవహిస్తున్నది. ఎన్నో గుడిసెలు కొట్టుకుపోయాయి. కోళ్ళు, పశువులు చూస్తుండగానే ప్రవాహగతిలో కలసిపోయాయి. జరిగిన నష్టం జరగగా, కోటలో చేరిన ప్రజలు ప్రాణాలు కాపాడుకున్నామనే ఆలోచనతో గాలి పీల్చుకున్నారు.

వర్షం తగ్గగానే కాగడాలు వెలిగించబడ్డాయి. నీరుకూడా కొంచెం తగ్గినట్లు అనిపించింది. కొందరు కుర్రవాళ్ళు కోట ప్రహరీ గోడ పైకెక్కి నీటి మట్టాన్ని పరిశీలించసాగారు.

కోట చాలా పెద్దది. కొద్దికాలం క్రితం వరకు జమిందారు ఆ కోటలో పూర్తి వైభవ ప్రాభవాలతో నివసిస్తూ వుండేవాడు అయితే ప్రభుత్వం జమిందారీలు రద్దు చేయగా, పూర్వీకులనాటినుండి వుంటూవచ్చిన ఆ గ్రామం వదలి జమిందారు నగరంలో నివసించ సాగాడు. ప్రస్తుతం ఆ కోటలో జమిందారు కుటుంబ సభ్యులు ఎవరూ లేని కారణంగా ప్రజలు ఆ కోటలో తలదాచుకున్నారు. తమ గ్రామాన్ని ఆనుకుని ప్రవహించే చిన్న నదిలో ఇంత అకస్మాత్తుగా వరద వస్తుందని వారు కలలోకూడా వూహించలేదు.

"ఈ కోట లేకుంటే మనమందరం ఈ రోజు ఆ ప్రవాహంలో కొట్టుకుని పోయి వుండేవాళ్ళం." జమిందారు పెంపుడు కుక్కగా ప్రజలు భావించే ఆ కోట కాపలాదారు, జమిందారుకు నౌకరు అయిన వీరాస్వామి పెద్ద చుట్ట వెలిగిస్తూ అన్నాడు.

ఎవ్వరూ వీరాస్వామి మాటలు పట్టించుకోలేదు. జమిందారు కోటను గురించి వినే స్థితిలో వారు లేరు. ఆకస్మికంగా వచ్చిన ఈ విపత్తు కారణంగా వారంతా మూగపోయారు.

వీరాస్వామి మాత్రం తన మాటలు ఆపలేదు - "మీలో చాలా మందికి ఈ కోట చరిత్ర తెలియదు. కొంత మంది అసలు పుట్టే వుండరు. మన జమిందారు గారి తండ్రి పెద్ద జమిందారు గారి రోజుల్లో ఈ నది కోట గోడల్ని తాకుతూ ప్రవహిస్తూ వుండేది. అప్పుడప్పుడు తన ప్రతాపం చూపించినా ఈ కోటను మాత్రం ఏమీ చెయ్యలేక పోయింది. ఒకసారయితే, ఉప్పెన వచ్చినప్పుడు కోట చుట్టూ వున్న ఎత్తైన ప్రహరీ లేకుంటే ఈ కోట వుండేది కాదు. ఈ వూరూ వుండేది కాదు. ఈ కోట వున్నంతదాకా ఈ వూరిని నదిగాని, తుఫాను గానీ ఏమీ చెయ్యలేవు."

"జమిందారు బ్రతికున్నంత వరకూ నిన్ను కూడా ఎవరూ ఏమీ చెయ్యలేరు." ఒక కుర్రవాడు వ్యంగ్యంగా అన్నాడు.

"ఈ కోట సంగతి, గోడ సంగతి మాకు బాగా తెలుసు. అసలు ఇప్పుడు నదిలో ఇంత నీరు ఒక్కసారి ఎట్లా వచ్చింది, ఎందుకు వచ్చింది అన్నదే ప్రశ్న. నది ఈ విధంగా గ్రామాన్ని ముంచగూడదనే కదా ఆనకట్ట కట్టబడింది." రాజగోపాలరావు ఈ మాటలు అంటూ వుండగానే వీరాస్వామి కల్పించుకుంటూ "నీలాంటి వాళ్ళే ఎవరో ఆనకట్ట పగలుగొట్టి వుంటారు" అన్నాడు.

"నోరు సంభాళించుకొని మాట్లాడు. చింతచచ్చినా పులుపు చావలేదు. ఇక ముందిట్లా మాట్లాడితే కోటను, గోడల్ని పొగడటానికి నీ నోరు వుండదు, నువ్వూ వుండవు." రాజగోపాలరావు కొంచెం కోపంతో అన్నాడు.

రాజగోపాలరావు గ్రామంలో ఒక వర్గానికి నాయకుడు. గ్రామంలో ఎక్కువ మంది అతని అనుచరులే. అతను ఆ ప్రాంతంలో బాగా పలుకుబడి వున్న కులానికి చెందిన వాడు. రాజకీయాలలో ప్రవేశం వున్నవాడు. ఒక పార్టీవారు ప్రాణమిస్తే రెండవ పార్టీవారు అతన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తారు. జమిందారుకు, ఆయన తాబేదార్లకు రాజగోపాలరావు శత్రువుగా భావించబడుతూ వుంటాడు. అయినా జమిందారుకు పెద్దగా నష్టమేమీ లేదు. జమిందారు పలుకుబడి, అధికారం ఇంకా ఆ ప్రాంతంలో సాగుతూనే వున్నాయి.

కొంచెంసేపు నిశ్శబ్దం తరవాత వీరాస్వామి కర్ర వూపుకుంటూ కోటలోపల భవంతిలోకి వెళ్ళిపోయాడు.

"ఎవ్వరూ మునిగిపోవటం గాని, కొట్టుకుపోవటంగాని జరగలేదు కదా!" దాసు ఆదుర్దాగా అడిగాడు. దాసు కూడా జమిందారు మనిషే.

"తెల్లవారిన తర్వాతగాని తెలియదు. కాని కొద్దిమందయినా తప్పక కొట్టుకుపోయుంటారు." రాజగోపాలరావు కొంచెం గంభీరంగా అన్నాడు. వీరిద్దరి మధ్య పెద్ద సయోధ్య లేదు. ఒకరినొకరు పలుకరించుకున్నా మిత్రత్వం ఎక్కడా కనిపించదు. అయితే ఎందుకో దాసు మాటల్లో ప్రస్తుతం కొంత మెత్తదనం ధ్వనించింది.

"అన్నపూర్ణాదేవిగా రెక్కడ?" చుట్టూ కలియచూస్తూ, రాజగోపాలరావు కంటే తాను పెద్ద హోదా కలిగినవాడిలా అడిగాడు దాసు.

అన్నపూర్ణాదేవి ఆ నియోజక వర్గపు శాసన సభ్యురాలు. ఆ గ్రామంలోనే వుంటుంది. అందరూ ఒక్కసారి కలియ చూసారు. కాని ఆమె అక్కడలేదు.

# 2

ఆనకట్ట గోడపైన ఒకటిగా కలిసేవుంది కాని క్రింద రెండుగా విడిపోవటమే కాక పెద్ద గండిలాగా ఏర్పడింది. దానిలో నుండి నీరు మోత చేసుకుంటూ ప్రవహించసాగింది. అదే కాకుండా మొత్తం ఆనకట్ట గోడమీద చాలా చోట్ల పగుళ్ళు ఏర్పడ్డాయి.

రాజగోపాలరావు, అతని సహచరులు మినహా అక్కడ ఎవ్వరూ లేరు. వారు బాధతో ఆశ్చర్యంతో బ్రద్దలైన ఆనకట్టను చూడసాగారు. రాజగోపాలరావు తలవంచుకుని చేతులు వెనక కట్టుకుని ఆలోచనలో మునిగి వున్నాడు. ఈ ఆనకట్ట ఆ గ్రామ ప్రజల కలల పంట. భగ్నమైపోయిన కలలా పగిలిన ఆనకట్ట వారిని వెక్కిరించసాగింది. ఆ ఆనకట్ట ద్వారా ఆ ప్రాంతమంతా సస్యశ్యామలమై పోతుందని, అకాలపు వరదల నుండి ముక్తి లభిస్తుందని భావించిన వారి ఆకాంక్షలు, ఆలోచనలు బలంగా నాశనం చెయ్యబడినట్లయ్యాయి.

ప్రాతఃకాలపు వెలుగురేఖలు జలాశయంపై తళుక్కుమంటూ మెరుస్తున్నాయి. కొద్ది గంటల క్రితం భీకరంగా ప్రవహిస్తూ, సర్వనాశనం చేసిన ఆ నదీ జలాలు ఇప్పుడు అడుగంటి ప్రశాంతతను సంతరించుకున్నాయి. ఎవరికీ ఏమి చెప్పటానికి తోచటంలేదు.

"నీటి వత్తిడి కారణంగా ఈ ఆనకట్ట పగలలేదన్నది సుస్పష్టం. ఇక్కడ నీరు కూడా ఎక్కువ లేదు. ఎవరో ఈ ఆనకట్టను కావాలని పగలగొట్టారు. అయితే ఎందుకన్నదే అర్థం కావటం లేదు." రాజగోపాలరావు దట్టమైన తల వెంట్రుకలు సరిచేసుకుంటూ అన్నాడు.

"ఆనకట్ట కట్టుడులో ఏదైనా లోపం వుంటే కొట్టుకు పోతుందిగాని ఈ విధంగా రంధ్రం ఏర్పడదు." రాజగోపాలరావు అన్న అన్నాడు.

"ఇక్కడ ఎవ్వరూ ఎందుకని లేరు? ఇంజనీర్లు, కార్మికులు, సూపర్వయిజర్లు, వీళ్ళంతా ఏమైపోయారు? ఎక్కడికి పారిపొయ్యారు? ఏం చెయ్యాలో అర్థంకావటం లేదు." రాజగోపాలరావు కొంచెం భారంగా మాట్లాడసాగాడు.

తలోనే కార్మికుల మేస్త్రి రామయ్య కొంచెం కుంటుకుంటూ అక్కడకు
"ఆనకట్ట పని పూర్తయ్యిందని వాళ్ళందరూ నిన్ననే వెళ్ళిపోయారు.
కూడా నిన్ననే ఇచ్చివేయబడింది. మేము కూడా మా వూళ్ళు వెళ్ళి
యత్నంలో వున్నాము. ఇప్పుడు వెళ్ళాలో, వుండాలో తెలియటం లేదు"
రామయ్య.

ున్న నదిమీద ఇది చిన్న ఆనకట్ట పెద్దవాళ్ళ కిది పట్టించుకోవలసినంత
ు."

అయితే దీని మీద డబ్బులు కుప్పలుగా ఖర్చు పెట్టబడ్డాయి. కాని
వ్వరూ ఎందుకు లేరో అర్థంకావటం లేదు."

మిందారుగారు కూడా హైదరాబాద్‌లోనే వున్నారు. ఆయన మనుష్యులే
ర్‌వైజ్ చేస్తూ వున్నారు."

మైనా కానివ్వండి, ఇది ప్రమాదవశాత్తూ జరగలేదు."

అయితే ఎవరు చేసా రంటారు?"

క్కడివారు ఎవరూ చేసివుండరు. మన భూమి మనకు తల్లి వంటిది.
నకు ప్రాణంవంటిది. దీనికోసం చమటోడ్చిన మనవాళ్ళు దీనిని నాశనం
అది ఆత్మహత్యతో సమానం."

యటినుండి వచ్చిన కూలీల నడిగితే?"

ాళ్ళు తమ రెక్కల కష్టంపై ఆధారపడే శ్రామిక జీవులు. ఇటువంటి
ులు వాళ్ళకు చేతకావు. పిచ్చి ప్రశ్నలతో పొద్దున్నే వారిని వేధించటం
."

విధంగా తలా ఒక మాట అనసాగారు.

క్కడ టెలీఫోను లేదా?" అన్న ప్రశ్నకు బదులుగా వుందంటూ
రావు ప్రక్కనే వున్న రేకులషెడ్ వైపు దారితీసాడు. దానికి తాళం
తాళం పగలగొట్టి లోపలికి వెళ్ళారు. అక్కడ ఫోను వుంది కాని అది
టంలేదు. బయటవైపు ఫోను తీగలు తెగి స్థంబానికి వేళ్ళాడుతున్నాయి.
గిరిన రాళ్ళ కారణంగానయినా ఈ తీగలు తెగివుండవచ్చు, లేకుంటే
కూడా తెంపబడి వుండవచ్చు. ఏ విషయం అర్థం కావటం లేదు."

ప్పుడేం చెయ్యాలి?"

"ఈ విస్ఫోటపు ధ్వని జిల్లా ప్రధాన కార్యాలయానికిగాని, దీని ప్రతిధ్వని హైదరాబాద్‌కు గాని యింకా వినిపించి వుండకపోవచ్చు."

"ఇంత దూరంపాటు మనం వచ్చాం, టౌనుకెళ్ళి ఈ సమాచారం అంద చేద్దాం." తాను నుంచున్నరాయి పైనుండి ఆనకట్ట కాలవ ఆ వైపుకు దూకుతూ రాజగోపాలరావు అన్నాడు.

"మనం రోడ్డు వెంటవెళితే చాలా సమయం పడుతుంది. అడ్డదారినయితే త్వరగా వెళ్ళగలుగుతాం." రాజగోపాలరావు అన్న వేణుగోపాలరావు అన్నాడు.

చుట్టూవున్న కొండల్ని చూస్తూ రాజగోపాలరావు "సూర్యుడు పైకి వస్తు న్నాడు. పదిగంట లయ్యుంటుంది." అంటూ టౌనువైపు సాగాడు. కొందరు అతనిని అనుసరించగా, మరికొందరు గ్రామం వైపు వెళ్ళిపోయారు. మిగిలిన కొందరు అక్కడే వుండి ఆ శిథిలాలు చూస్తూ వుండిపోయారు.

రాజగోపాలరావు, అతని అనుచరులు సుమారు ఒక మైలు దూరం నడిచి వుంటారు. ఇంతలో వారి వెనుక పోలీసుల బృంద మొకటి రాసాగింది. "వీళ్ళు గ్రామంలోనికి రోడ్డువెంబడి వచ్చివుంటారు. ఇటునుంచి రాలేదు. ఇటునుండి వస్తే మనకు కనిపించివుండేవాళ్ళే కదా! వారు మనని వెంబడిస్తున్నారా? నాటకంలో మొదటి అంకం మొదలయ్యినట్లుందే?" రాజగోపాలరావు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"ఈ పోలీసులు దీనికి మననే బాధ్యులను చేస్తే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. నిర్దోషులైనాసరే, ఎవరో ఒకరిని అరెస్టు చేస్తే పోలీసులు కనీసం ఏదో చర్య తీసుకుంటున్నట్లు ప్రజలు భావిస్తారు కదా!" రాజగోపాలరావు నవ్వును బలవంతంగా ఆపుకుంటూ అన్నాడు.

"మనం వారికి దొరకకుండా తప్పించుకుంటే మంచిదేమో! వారు వచ్చే లోగా మనం పారిపోలేమా?" గుంపులో ఒకరు అన్నారు.

"తెలివి తక్కువ పనులు పోలీసు వారికే వదిలి వెయ్యాలి. మనం చెయ్య గూడదు. మనం పారిపోతే, వాళ్ళు మన మీద చెయ్యదల్చుకున్న నేరారోపణకు బలం చేకూరుతుంది." ఇటువంటి సమయంలో తన ఆదుర్దాను, ఆవేశాన్ని అణచు కోవటానికి రాజగోపాలరావు చిరునవ్వులు నవ్వుతుంటాడు. కాని ఇప్పుడు అతని పెదాలు స్థిరంగా వున్నాయి.

కొంచెంసేపటిలోనే పోలీసులు అక్కడికి చేరుకుని వీరిచుట్టూ గుండ్రంగా నిలబడ్డారు. ఇనస్పెక్టర్ అధికారం చూపిస్తూ బిగ్గరగా అన్నాడు - "ఎక్కడి వాళ్ళక్కడే నిలబడండి. పారిపోవటానికి ప్రయత్నిస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చి పారవేస్తాను."

"ఎందుకు?" రాజగోపాలరావు తీవ్రంగా ప్రశ్నించారు.

"నువ్వు ఎవడవురా, ఎందుకని ప్రశ్నిస్తున్నావు?" ఇనస్పెక్టరు ఖాకీ దుస్తుల దర్పం చూపించసాగాడు. "ఈ నేరంలో మీరు భాగస్తులు కాదని తెలిసిన క్షణం మిమ్మలను వదలివేస్తాను. అందాకా మాట్లాడటానికి వీలులేదు. పదండి, వెనుకకు తిరగండి."

రాజగోపాలరావు, అతని సహచరులు ఇద్దరిద్దరుగా వరసలలో నుంచోపెట్టబడ్డారు పోలీసులు వారికి నాలుగువైపులా నడుస్తున్నారు. ఎవ్వరూ మాట్లాడడం లేదు. వింత నిశ్శబ్దం అక్కడ చోటు చేసుకున్నది.

# 3

"ఆనకట్ట బ్రద్దలయ్యింది......... .....విద్రోహచర్య?"

"ప్రారంభోత్సవానికి ముందే పగిలిన ఆనకట్ట."

"చిన్న ఆనకట్ట - పెద్ద కుట్ర" "ప్రారంభోత్సవం వాయిదా."

మరుసటి రోజు పత్రికల నిండా ఆనకట్టకు సంబంధించిన ఈ వార్తలే ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

రకరకాల శీర్షికలతో వెలువడిన ఈ వార్తలు ఆయా పత్రికల విధానం మీద ఆధారపడి ప్రచురించబడ్డాయి వివిధ రాజకీయ పక్షాలను సమర్థించే పత్రికలు తమ తమ ఆలోచనకు ఆలంబనగా ఈ వార్తను మలచుకున్నాయి. ఒక పత్రిక ఆనకట్ట నిర్మాణంలోనే లోపమున్నదని సంపాదకీయం వ్రాయగా, ఇంకో పత్రిక ఇది కమూనిస్టుల చర్య అని అనుమానం వ్యక్తం చేసింది. సమాజంలోని వివిధ క్షేత్రాలలోని ప్రముఖులు ఈ సంఘటనపై రకరకాలుగా వ్యాఖ్యలు చేసారు. ప్రజా సంబంధమైన పనులు ప్రైవేటు వ్యక్తుల కప్పగిస్తే ఇటువంటివే జరుగుతాయని కొందరు విమర్శించారు. మొత్తం మీద ఈ సంఘటనపై పెద్ద గందరగోళం చెల రేగింది. ప్రజలలో అలజడి సృష్టించింది.

ప్రారంభోత్సవానికి హైదరాబాద్ నుండి వచ్చిన మంత్రిగారు బ్రద్దలైన ఆనకట్టను చూసి చాలా ఆందోళన చెందారు. "ప్రజాధనం, శ్రమ నాశనమై పోయాయి. ఇది చాలా దురదృష్టమైన సంఘటన" - మంత్రిగారు తన విచారం వ్యక్తం చేశారు. ఈ సంఘటనపై దర్యాప్తు జరిపించగలమని కూడా ఆయన ప్రకటించారు.

మంత్రిగారి వెంట జమిందారు యస్. ఆర్. వి. కె. కుటుంబరావు, ఆయన మనుష్యులు, ప్రభుత్వోద్యోగులు, స్థానిక ప్రముఖులు వున్నారు. అందరూ వివిధ కారణాలవలన విచారంలో మునిగి వున్నారు. ఈ సంఘటన జరిగినప్పుడు ఉద్యోగస్తు లేమయ్యారని కొందరు ఆగ్రహం వ్యక్తం చేశారు. దీనికి సంబంధించి వెంటనే పోలీసులకు ఎందుకు రిపోర్టు చేయ్యలేదని మరి కొందరు కూలీల మేస్త్రీ రామయ్యను కోపంతో గద్దించారు. కొందరు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించ సాగారు.

మంత్రిగారు కొట్టుకుపోగా మిగిలిన ఆనకట్టను పరీక్షించ సాగారు. జలాశయాన్ని, ఆనకట్టలను చూశారు మారు మూల ప్రాంతం. ఆనకట్టగాని, జలాశయం కాని అంత పెద్దవీ కావు. చూడదగ్గ విశేషాలేమీ అక్కడ లేవు. కాని ఈ సంఘటన కారణంగా చెలరేగిన అలజడివలన మంత్రిగారికి అదంతా చూడవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆయనకు విధానసభలో ప్రతిపక్షాల దాడికి సమాధానం చెప్ప వలసివుంది. ఈ చిన్న సంఘటన మొత్తం రాష్ట్రం మీద పెద్ద అలజడిగా మారే ప్రమాదం కూడా వుంది.

ఉన్నట్లుండి మంత్రిగారు తన చుట్టూ వున్నా ఉద్యోగస్థులపై విరుచుకు పడ్డారు.

"ఇది ఏ విధంగా జరిగిందో నాకు వెంటనే తెలవాలి మీరందరూ దీనికి బాధ్యులే. ఇక్కడ వుండవలసిన వాళ్ళు ఇది జరిగే సమయంలో ఎక్కడకు వెళ్ళారు? ఇదేదో పెద్ద కుట్రలాగ వున్నది."

తన వెంట వచ్చిన పత్రికా ప్రతినిధులను చూసి వెంటనే సర్దుకుని మంత్రి గారు "ఏమో, ఏమి జరిగిందో నాకు తెలదు. వెంటనే అన్ని విషయాలు నాకు తెలియచేయండి" అని ఉద్యోగస్థులతో అన్నారు. మంత్రిగారి వెంట వచ్చిన విలేఖర్లు ఏమి వ్రాసుకోకుండా నవ్వి ఊరుకున్నారు.

మంత్రిగారు ఫోను వున్న షెడ్ దగ్గరకు వెళ్లారు. ఆయన ఈ విషయ మంతా ముఖ్యమంత్రిగారికి వివరించ తలచుకున్నారు. ఫోను మూగపోయిందని తెలుసుకుని తలపై టోపీ సరిచేసుకుంటూ తనలో తాను అనుకున్నట్లుగా అన్నారు: "ముఖ్యమంత్రిగారే స్వయంగా ఫోను తీస్తే మనం ఏం చెప్పాలో తెలియటం లేదు. ఫోను చెడిపోవటమే మంచిదయ్యింది!"

ఆయన ముందుకు సాగారు. ప్రజ లాయన వెంటనడవసాగారు. జలాశయం ఒడ్డున ఒక చెట్టు క్రింద రాయిపై ఆయన కూర్చున్నారు.

"న్యూస్ పేపర్లున్నాయా.... .... ....?"

ఇద్దరు ముగ్గురు ప్రముఖులు తమ చేతుల్లోని పత్రికలు మంత్రిగారికి యిచ్చారు. ఒకరు తమ చేతిలోని గొడుగు తెరిచి పట్టుకోబోయారు. మంత్రిగారతనిని వారించి పత్రిక చదవ సాగారు. ప్రక్కనే వున్న ఒక ప్రెస్ ఫోటోగ్రాఫర్ మంత్రిగారిని ఆ పోజులో ఫోటో తీసాడు.

మంత్రిగారికి ఈ సంఘటనపై ఒక నిర్ణయానికి రావటానికి కొంత సమయం, ఏకాంతం అవసరమైనట్లున్నాయి. ఆయన కూడా మిగిలిన వారివలెనే ఆందోళన చెందుతున్నారు. మిగిలిన వారి వలెనే ఆయనకు కూడా ఏమి చెయ్యాలో అర్థం కావటం లేదు. ఇంత ఆకస్మికంగా జరిగిన ఈ సంఘటనపై బహిరంగంగా ఏమి మాట్లాడాలో ఆయనకు తోచటం లేదు. సభలలో తన వాక్చాతుర్యంతో ప్రజలను అందంగా మభ్యపరచగలడన్న కీర్తి కలిగిన మంత్రిగారు ప్రస్తుతం మూగపోయారు. ఆనకట్టకుపడిన గండి ద్వారా జలాశయం ఒక్కసారిగా గ్రామంపై విరుచుకు పడిన కారణంగా నష్టం మాత్రం పెద్ద ఎత్తునే జరిగింది. చాలా మంది కొట్టుకు పోయారు. చాలా మంది గాయపడ్డారు. నష్టం అంచనా వేయటంకూడా కష్టంగానే వున్నది. పరిస్థితి దారుణంగా ఉందని, ప్రాణనష్టం, ఆస్తి నష్టం బాగా జరిగిందని కొన్ని పత్రికలు వ్రాసాయి.

మంత్రిగారు పత్రికలో నుండి తల ఎత్తేసరికి, ఆయన ఎదురుగా ప్రజలు ఒక సమూహంగా నిలబడి వున్నారు. వారిలో చాలామంది తమ సర్వస్వం కోల్పోయిన వారున్నారు, కొంపలు పోయినవారు, కుటుంబ సభ్యులు కనిపించని వారు, పశువులు పోగొట్టుకున్న వారు, కట్టుబట్టలతో మిగిలినవారు అందరూ మంత్రి గారి దగ్గరకు దీనవదనాలతో చేరారు.

మంత్రిగారికి తెలుసు వారెందుకు వచ్చారో; వారికేమి చెప్పాలో. వారిని ఎలా మాటలతో సంతృప్తి పరచాలో మంత్రిగారికి కరతలామలకమే. మంత్రిగారు లేచి నుంచున్నారు విషణ్ణ ముద్రలోకి మారిన వదనంతో, జాలి నిండిన గొంతుతో ప్రకటించారు.

"మీకు జరిగిన నష్టం అంతు లేనిది. అయినా మా శక్తికొలది అన్ని విధాలా మీకు సహాయం చెయ్యటానికి ప్రయత్నిస్తాం"

గుంపులోని బాధితుల వదనాలు వికసించాయి. మంత్రిగారికి చేతులు జోడిస్తూ, రకరకాలుగా కృతజ్ఞతలు వ్యక్తం చేస్తూ అక్కడినుంచి వారు కదిలారు.

ఈ ప్రమాద పీడితుల సహాయార్థం పత్రికా ప్రతినిధుల ద్వారా మంత్రి గారు ప్రజలకు విజ్ఞప్తి చేసారు ఆయన తన విజ్ఞప్తిని పత్రికా ప్రతినిధులకు వివరిస్తూ వుండగానే జమిందారు తన సహాయంగా పదివేల రూపాయలు ప్రకటించారు. అదే వేరొక పరిస్థితులలోనయితే మంత్రిగారు ఈయన దాతృత్వాన్ని బ్రహ్మాండంగా పొగిడివుండేవారు.

మంత్రిగారు జీపు ఎక్కుతూ వుండగానే అక్కడికి హడావుడిగా చేరుకున్న పోలీసులు ఈ సంఘటనకు సంబంధించి కొందరిని నిర్బంధించిన విషయం మంత్రి గారికి చెప్పారు. పత్రికల వారికిది తాజా వార్త. హడావుడిగా వ్రాసుకోసాగారు.

మంత్రిగారి జీపు స్టార్టవుతూవుండగా శాసన సభ్యురాలు శ్రీమతి అన్నపూర్ణ ఎదురుగా జీపు దిగుతూ కనిపించారు. ఆయన వెంటనే ఆగిపోయారు. ఆమె కూడా మంత్రిగారి లాగానే హడావుడిగా హైదరాబాద్ నుండి వచ్చారు. వాస్తవంగా ఆనకట్ట ప్రారంభోత్సవానికి మంత్రిగారిని స్వయంగా వెంటబెట్టుకు రావటానికి ఆమె జమిందారుగారితో కలిసి హైదరాబాద్ వెళ్ళింది. అయితే తిరిగి వచ్చేటప్పుడు తన గ్రామంలోకి వెళ్ళటం, అక్కడ జీపు టైరు పంక్చర్ కావటం జరగకపోతే మంత్రిగారితో కలిసే ఆనకట్ట వద్దకు వచ్చి వుండేది.

"అన్నపూర్ణగారూ! ఈ దుర్ఘటనకు నేను చాలా చింతిస్తున్నాను. ఇది మిమ్మల నెంతగా కలచి వేసిందో నేనూహించగలను. సరే, జరిగి పోయిందేదో జరిగిపోయింది. ఈ దుర్ఘటన వలన నష్టపోయిన వారికి సహాయ మందించటంపై దృష్టిని సారించాలి. సహాయ పునరావాస కార్యక్రమాలు వెంటనే చేపట్టాలి. చాలా నష్టం జరిగిపోయింది. అంతేకాదు. ఈ ఆనకట్ట లబ్ధిదారులకు వెంటనే ఏ విధమయిన ఉపయోగం జరిగేటట్లు లేదు."

అక్కడివాళ్ళు తన నెక్కడ అపార్థం చేసుకుంటారోనని వెంటనే సర్దుకుని "ఆనకట్ట లబ్ధిదారులకు ప్రస్తుతం వెంటనే జరగవలసిన ఉపయోగం లేకుండా పోయింది."

ఇదంతా ఆయన ఉద్దేశించింది శాసన సభ్యురాలు అన్నపూర్ణకే అయినప్పటికీ, చూస్తున్నది మాత్రం పత్రికలు వారిపై పే

"మన మొకటి తలిస్తే భగవంతుడు వేరే తలిచాడు. దీనికి బాధ్యులైన వారిపై కఠినచర్యలు తీసుకోవాలి. దీనికి సంబంధించిన వారినందరినీ ప్రశ్నించాలి." శాసనసభ్యురాలు అన్నపూర్ణ కొంచెం ఆవేశంతో అన్నది.

"తప్పకుండా చేద్దాం. చాలా మందిని అప్పుడే నిర్బంధించినట్లు ఇనస్పెక్టర్ గారు ఇప్పుడే చెప్పారు."

"నిర్బంధించటంకాదు. నేను కేవలం పోలీసుల విచారణకు సంబంధించి మాట్లాడటం లేదు. డిపార్ట్‌మెంటల్ ఎంక్వైరీ జరిపించాలి. ప్రభుత్వమే విచారణ సంఘాన్ని నియమించి దర్యాప్తు చేయించాలి. ఆనకట్ట చిన్నదే కదా అని నిర్లక్ష్యం

చెయ్యరాదు. ప్రమాదం ఎంత పెద్దదనే ఆలోచించాలని నేను మంత్రిగారిని కోరుతున్నాను."

"దీనికి సంబంధించి మనం చేయగలిగినదంతా చేద్దాం. ఇటువంటి దుర్ఘటనలు మరల జరగకుండా చూడవలసిన బాధ్యత కూడా మన మీద వున్నది. ఇది మనకొక హెచ్చరిక వంటిది." మంత్రిగారు విలేఖర్లవైపు చూస్తూ అన్నారు. విలేఖర్ల కలాలు వేగంగా కదులుతున్నాయి.

"అన్నపూర్ణగారు భోజనానికి రావటం లేదా?" మంత్రిగారు జమిందారు వైపు చూస్తూ అన్నారు.

"వస్తున్నారు, వస్తున్నారు." జమిందారు కుటుంబరావుగారు అదుర్దాగా సమాధానమిచ్చారు.

మంత్రిగారి గౌరవార్థం జమిందారు గారి భవంతిలో విందు ఏర్పాటు ముందే జరిగింది. అన్నపూర్ణ కూడా ఆహ్వానించబడింది.

జమిందారుగారు తన కారులో అందరికంటె ముందు వెళ్ళసాగారు. ఆయన వెనక మంత్రిగారి జీప్, దానివెంట మరి నాలుగైదు జీపులు అక్కడి నుండి కదిలాయి

అన్నపూర్ణ భారంగా అడుగులు వేస్తూ ఈ దుర్ఘటన ఎలా జరిగిందో, నష్టం ఎంత ఏర్పడిందో తెలుసుకోటానికి ఆనకట్టవైపు అడుగులు వేసింది

అన్నపూర్ణ పెద్ద రంగు కాదు చామన చాయగా వుంటుంది. అయితే మోహంలో అద్భుతమైన ఆకర్షణ వుంది ముప్పై ఐదు సంవత్సరాల వయస్సుంటుంది. ఆకట్టుకునే విగ్రహం.

ఆమె కొంచెం అలసినట్లుంది. వాస్తవానికి ప్రారంభోత్సవంలో పాల్గొందామని ఆమె వచ్చింది కాని ఇక్కడ సర్వనాశనం దర్శనమిస్తున్నది.

ఈ ఆనకట్ట నిర్మాణానికి ఆమె ఎంతో కష్టపడింది. అధికారులు, చాలా మంది పెద్దవాళ్ళు ఈ ఆనకట్ట నిర్మాణాన్ని వ్యతిరేకించారు. అందుచేత ప్రస్తుత పరిస్థితులు ఆమెను చాలా కలచివేసాయి ఆమె మనస్సులో బాధ సుళ్ళు తిరుగుతున్నది. తన రాజకీయ ఆశాసౌధాలన్నీ ఆమె ఈ ఆనకట్ట నిర్మాణం పైనే నిలుపుకున్నది. ఇప్పుడవి ఆనకట్టలాగానే కుప్పకూలిపోయాయి

"ఈ నష్టం ఒక ఛాలెంజ్ వంటిదా? ఈ ఆనకట్ట మరమ్మత్తు జరగదా? జరుగుతుంది. తప్పక జరగాలి. వచ్చే వర్షాకాలానికి ముందే జరగాలి. ఏమైనాసరే జరిగి తీరాలి." మనస్సులోనే దృఢ నిశ్చయానికి వచ్చిన అన్నపూర్ణ పెద్ద పెద్ద అడుగులతో తన జీపువైపు కదిలింది.

# 4

"అయితే నువ్వు డైనమేట్ పెట్టలేదంటావా?" చేతులు ఊపుకుంటూ, కళ్ళెగరేస్తూ తీవ్రంగా ప్రశ్నించాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

ఇనస్పెక్టర్‌ను అసహ్యంగా చూస్తూ, అలక్ష్యంగా "ఊహు" అంటూ నిట్టూర్చాడు రాజగోపాలరావు.

"నువ్వూ నీ అనుచరులు కలిసి డైనమేట్‌తో ఆనకట్ట కూల్చివేసినట్లు మాదగ్గర సాక్ష్యాలున్నాయి."

"ఊహూ."

"నువ్వు కొండ ప్రక్కనుంచి పారిపోవటానికి ప్రయత్నించావు కదా?"

"ఊహూ."

"నువ్వసలు అక్కడి కెందుకు వెళ్ళావు? నువ్వు రాత్రంతా అక్కడే వున్నట్లు మాకు తెలిసింది."

ఈ ప్రశ్నలను హేళనగా తీసుకుంటున్న ముఖముద్రతో తిరిగి అదేవిధంగా "ఊహూ" అన్నాడు రాజగోపాలరావు. ఇంతలో పోలీసు స్టేషను ఎదురుగా పెద్ద గుంపు పోగవ్వసాగింది. పోలీసులు వారిని లోపలకు రానీయకుండా ఆపుతూ వున్నారు.

"ఇంతకీ అది డైనమేటా? టైంబాంబా?" ఇనస్పెక్టర్ ఈసారి గొంతు పెంచాడు. ఎంత గంభీరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నా ఇన్‌స్పెక్టర్ కేవలం విదూషకుడి లాగానే వున్నాడు.

"బాంబు పెట్టి నువ్వు గ్రామానికి వెళ్ళిపోయావు. సాక్ష్యం లేకుండా చేద్దామనుకున్నావు."

"ఊహు."

"మాకు నిన్ను ప్రశ్నించే అధికారం వుంది. నువ్వు సమాధానం చెప్పితీరాలి."

"నాకు మౌనంగావుండే అధికారం కూడా వుంది. నీ అర్థంలేని ప్రశ్నలకు సమాధానం చెప్పే అవసరం నాకు లేదు. నేను చెయ్యని నేరం నాపైరుద్దే అధికారం ఎవ్వరికీ లేదు." రాజగోపాలరావు చాలా తాపీగా అన్నాడు.

మంత్రిగారికి ఈ సంఘటనపై ఒక నిర్ణయానికి రావటానికి కొంత సమయం, ఏకాంతం అవసరమైనట్లున్నాయి. ఆయన కూడా మిగిలిన వారివలెనే ఆందోళన చెందుతున్నారు. మిగిలిన వారి వలెనే ఆయనకు కూడా ఏమి చెయ్యాలో అర్థం కావటం లేదు. ఇంత ఆకస్మికంగా జరిగిన ఈ సంఘటనపై బహిరంగంగా ఏమి మాట్లాడాలో ఆయనకు తోచటం లేదు. సభలలో తన వాక్చాతుర్యంతో ప్రజలను అందంగా మభ్యపరచగలడన్న కీర్తి కలిగిన మంత్రిగారు ప్రస్తుతం మూగపోయారు. ఆనకట్టకుపడిన గండి ద్వారా జలాశయం ఒక్కసారిగా గ్రామంపై విరుచుకు పడిన కారణంగా నష్టం మాత్రం పెద్ద ఎత్తునే జరిగింది. చాలా మంది కొట్టుకు పోయారు. చాలా మంది గాయపడ్డారు. నష్టం అంచనా వేయటంకూడా కష్టంగానే వున్నది. పరిస్థితి దారుణంగా ఉందని, ప్రాణనష్టం, ఆస్తి నష్టం బాగా జరిగిందని కొన్ని పత్రికలు వ్రాసాయి.

మంత్రిగారు పత్రికలో నుండి తల ఎత్తేసరికి, ఆయన ఎదురుగా ప్రజలు ఒక సమూహంగా నిలబడి వున్నారు. వారిలో చాలామంది తమ సర్వస్వం కోల్పోయిన వారున్నారు, కొంపలు పోయినవారు, కుటుంబ సభ్యులు కనిపించని వారు, పశువులు పోగొట్టుకున్న వారు, కట్టుబట్టలతో మిగిలినవారు అందరూ మంత్రి గారి దగ్గరకు దీనవదనాలతో చేరారు.

మంత్రిగారికి తెలుసు వారెందుకు వచ్చారో; వారికేమి చెప్పాలో. వారిని ఎలా మాటలతో సంతృప్తి పరచాలో మంత్రిగారికి కరతలామలకమే. మంత్రిగారు లేచి నుంచున్నారు విషణ్ణ ముద్రలోకి మారిన వదనంతో, జాలి నిండిన గొంతుతో ప్రకటించారు.

"మీకు జరిగిన నష్టం అంతు లేనిది. అయినా మా శక్తికొలది అన్ని విధాలా మీకు సహాయం చెయ్యటానికి ప్రయత్నిస్తాం"

గుంపులోని బాధితుల వదనాలు వికసించాయి. మంత్రిగారికి చేతులు జోడిస్తూ, రకరకాలుగా కృతజ్ఞతలు వ్యక్తం చేస్తూ అక్కడినుంచి వారు కదిలారు.

ఈ ప్రమాద పీడితుల సహాయార్థం పత్రికా ప్రతినిధుల ద్వారా మంత్రి గారు ప్రజలకు విజ్ఞప్తి చేసారు ఆయన తన విజ్ఞప్తిని పత్రికా ప్రతినిధులకు వివరిస్తూ వుండగానే జమిందారు తన సహాయంగా పదివేల రూపాయలు ప్రకటించారు. అదే వేరొక పరిస్థితులలోనయితే మంత్రిగారు ఈయన దాతృత్వాన్ని బ్రహ్మాండంగా పొగిడివుండేవారు.

మంత్రిగారు జీపు ఎక్కుతూ వుండగానే అక్కడికి హడావుడిగా చేరుకున్న పోలీసులు ఈ సంఘటనకు సంబంధించి కొందరిని నిర్బంధించిన విషయం మంత్రి గారికి చెప్పారు. పత్రికల వారికిది తాజా వార్త. హడావుడిగా వ్రాసుకోసాగారు.

మంత్రిగారి జీపు స్టార్టవుతూవుండగా శాసన సభ్యురాలు శ్రీమతి అన్నపూర్ణ ఎదురుగా జీపు దిగుతూ కనిపించారు. ఆయన వెంటనే ఆగిపోయారు. ఆమె కూడా మంత్రిగారి లాగానే హడావుడిగా హైదరాబాద్ నుండి వచ్చారు. వాస్తవంగా ఆనకట్ట ప్రారంభోత్సవానికి మంత్రిగారిని స్వయంగా వెంటబెట్టుకు రావటానికి ఆమె జమిందారుగారితో కలిసి హైదరాబాద్ వెళ్ళింది. అయితే తిరిగి వచ్చేటప్పుడు తన గ్రామంలోకి వెళ్ళటం, అక్కడ జీపు టైరు పంక్చర్ కావటం జరగకపోతే మంత్రిగారితో కలిసే ఆనకట్ట వద్దకు వచ్చి వుండేది.

"అన్నపూర్ణగారూ! ఈ దుర్ఘటనకు నేను చాలా చింతిస్తున్నాను. ఇది మిమ్ముల నెంతగా కలచి వేసిందో నేనూహించగలను. సరే, జరిగి పోయిందేదో జరిగిపోయింది. ఈ దుర్ఘటన వలన నష్టపోయిన వారికి సహాయ మందించటంపై దృష్టిని సారించాలి. సహాయ పునరావాస కార్యక్రమాలు వెంటనే చేపట్టాలి. చాలా నష్టం జరిగిపోయింది. అంతేకాదు. ఈ ఆనకట్ట లబ్ధిదారులకు వెంటనే ఏ విధమయిన ఉపయోగం జరిగేటట్లు లేదు."

అక్కడివాళ్ళు తన నెక్కడ అపార్థం చేసుకుంటారోనని వెంటనే సర్దుకుని "ఆనకట్ట లబ్ధిదారులకు ప్రస్తుతం వెంటనే జరగవలసిన ఉపయోగం లేకుండా పోయింది."

ఇదంతా ఆయన ఉద్దేశించింది శాసన సభ్యురాలు అన్నపూర్ణకే అయినప్పటికి, చూస్తున్నది మాత్రం పత్రికలు వారివైపే

"మన మొకటి తలిస్తే భగవంతుడు వేరే తలిచాడు. దీనికి బాధ్యులైన వారిపై కఠినచర్యలు తీసుకోవాలి. దీనికి సంబంధించిన వారినందరినీ ప్రశ్నించాలి." శాసనసభ్యురాలు అన్నపూర్ణ కొంచెం ఆవేశంతో అన్నది.

"తప్పకుండా చేద్దాం. చాలా మందిని అప్పుడే నిర్బంధించినట్లు ఇనస్పెక్టర్ గారు ఇప్పుడే చెప్పారు."

"నిర్బంధించటంకాదు. నేను కేవలం పోలీసుల విచారణకు సంబంధించి మాట్లాడటం లేదు. డిపార్ట్‌మెంటల్ ఎంక్వైరీ జరిపించాలి. ప్రభుత్వమే విచారణ సంఘాన్ని నియమించి దర్యాప్తు చేయించాలి. ఆనకట్ట చిన్నదే కదా అని నిర్లక్ష్యం

# 4

"అయితే నువ్వు డైనమేట్ పెట్టలేదంటావా?" చేతులు ఊపుకుంటూ, కళ్ళెగరేస్తూ తీవ్రంగా ప్రశ్నించాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

ఇనస్పెక్టర్‌ను అసహ్యంగా చూస్తూ, అలక్ష్యంగా "ఊహు" అంటూ నిట్టూర్చాడు రాజగోపాలరావు.

"నువ్వూ నీ అనుచరులు కలిసి డైనమేట్‌తో ఆనకట్ట కూల్చివేసినట్లు మా దగ్గర సాక్ష్యాలున్నాయి."

"ఊహూ."

"నువ్వు కొండ ప్రక్కనుంచి పారిపోవటానికి ప్రయత్నించావు కదా?"

"ఊహూ."

"నువ్వసలు అక్కడి కెందుకు వెళ్ళావు? నువ్వు రాత్రంతా అక్కడే వున్నట్లు మాకు తెలిసింది."

ఈ ప్రశ్నలను హేళనగా తీసుకుంటున్న ముఖముద్రతో తిరిగి అదేవిధంగా "ఊహూ" అన్నాడు రాజగోపాలరావు. ఇంతలో పోలీసు స్టేషను ఎదురుగా పెద్ద గుంపు పోగవ్వసాగింది. పోలీసులు వారిని లోపలకు రానీయకుండా ఆపుతూ వున్నారు.

"ఇంతకీ అది డైనమేటా? టైంబాంబా?" ఇనస్పెక్టర్ ఈసారి గొంతు పెంచాడు. ఎంత గంభీరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నా ఇన్‌స్పెక్టర్ కేవలం విదూషకుడి లాగానే వున్నాడు.

"బాంబు పెట్టి నువ్వు గ్రామానికి వెళ్ళిపోయావు. సాక్ష్యం లేకుండా చేద్దామనుకున్నావు."

"ఊహు."

"మాకు నిన్ను ప్రశ్నించే అధికారం వుంది. నువ్వు సమాధానం చెప్పి తీరాలి."

"నాకు మౌనంగావుండే అధికారం కూడా వుంది. నీ అర్థంలేని ప్రశ్నలకు సమాధానం చెప్పే అవసరం నాకు లేదు. నేను చెయ్యని నేరం నాపైరుద్దే అధికారం ఎవ్వరికీ లేదు." రాజగోపాలరావు చాలా తాపీగా అన్నాడు.

"నువ్వు చేసిన ఈ వెధవ పనికి సమాధానం చెప్పితీరాలి" ఇనస్పెక్టర్ పళ్ళు నూరుతూ, కోపంతో ఊగిపోతూ కుర్చీలో కూర్చుంటున్నాడు తల రుద్దు కుంటున్నాడు. కుర్చీలోంచి లేచి మూల నుంచుని ఈ తతంగమంతా చూస్తున్న రాజగోపాలరావు సహచరులవైపు తీవ్రంగా చూస్తున్నాడు. రాజగోపాలరావు తన సహచరులను శాంతంగా వుండమని సైగ చేసాడు.

కొత్తగా ఆ స్టేషన్‌కు బదిలీ అయిన కుర్ర ఇనస్పెక్టర్‌కు రాజగోపాలరావు వంటి వారితో వ్యవహరించటంలో ఏ విధమయిన అనుభవం లేదు. అందుచేత అతనికి ఏం చేయాలో తెలియటం లేదు. స్టేషన్ వరండాలోకి వచ్చి సిగరెట్ వెలిగించి అటు ఇటూ పచార్లు చేయసాగాడు. రాజగోపాలరావు నుంచి సమాధానం ఏవిధంగా రాబట్టాలా అనే ఆలోచనతో అతని తల వేడెక్కిపోయింది. రాజగోపాల రావుతో అతని మనుష్యులతో వ్యవహరించే విషయంలో అతని మనస్సులో రకరకాల ఉపాయాలు తోచసాగాయి. ఆ ప్రాంతంలోనే వున్న మంత్రిగారి వెంట విందులు వినోదాలలో మునిగివుండవలసిన తరుణంలో ఈ విధంగా స్టేషన్‌లో వుండటం ఇనస్పెక్టర్‌కు ఒకరకంగా చిరాకుగా వుంది. దానికితోడు బండరాయిలా ఉలకని పలకని రాజగోపాలరావు వ్యవహారం తలనొప్పిగా తయారయ్యింది.

బయటవున్న గుంపు అంతకంతకూ పెరగసాగింది. రాజగోపాలరావు ఆ గుంపులో తన గ్రామం వారిని చూసాడు. పోలీసులు వారిని ఆపలేకపోతున్నారు. ఆ గుంపు రెచ్చిపోతే తన కొంప మునిగిపోతుందని ఇనస్పెక్టర్ లోలోపల వణికిపోసాగాడు.

శాసన సభ్యురాలు అన్నపూర్ణ అక్కడకు సమయానికి రాకుంటే ఇనస్పెక్టర్ ఏమి చేసేవాడో ఊహించవలసిందే.

"మీరు నిరపరాధుల్ని నిర్బంధించి బాధిస్తుంటారు. మేం ఏమన్నా అంటే పై అధికార్లతో మేమేదో మిమ్మల్ని వేధిస్తున్నట్లు ఫిర్యాదులు చేస్తుంటారు." అన్నపూర్ణ కొంచెం తీవ్రంగా అంది.

ఇనస్పెక్టర్‌కు ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో అర్థం కావటం లేదు.

"నేను వీరిని ఏమీ బాధించటం లేదు. కేవలం వివరాలు తెలుసుకుంటు న్నాను. ఆనకట్ట పేల్చివేయటంలో వీరికి పాత్ర వున్నట్లు నాకు రూఢిగా తెలిసింది."

"నువ్వు చేసిన ఈ వెధవ పనికి సమాధానం చెప్పితీరాలి" ఇనస్పెక్టర్ పళ్ళు నూరుతూ, కోపంతో ఊగిపోతూ కుర్చీలో కూర్చుంటున్నాడు తల రుద్దు కుంటున్నాడు. కుర్చీలోంచి లేచి మూల నుంచుని ఈ తతంగమంతా చూస్తున్న రాజగోపాలరావు సహచరులవైపు తీవ్రంగా చూస్తున్నాడు. రాజగోపాలరావు తన సహచరులను శాంతంగా వుండమని సైగ చేసాడు.

కొత్తగా ఆ స్టేషన్‌కు బదిలీ అయిన కుర్ర ఇనస్పెక్టర్‌కు రాజగోపాలరావు వంటి వారితో వ్యవహరించటంలో ఏ విధమయిన అనుభవం లేదు. అందుచేత అతనికి ఏం చేయాలో తెలియటం లేదు. స్టేషన్ వరండాలోకి వచ్చి సిగరెట్ వెలిగించి అటు ఇటూ పచార్లు చేయసాగాడు. రాజగోపాలరావు నుంచి సమాధానం ఏవిధంగా రాబట్టాలా అనే ఆలోచనతో అతని తల వేడెక్కిపోయింది. రాజగోపాల రావుతో అతని మనుష్యులతో వ్యవహరించే విషయంలో అతని మనస్సులో రకరకాల ఉపాయాలు తోచసాగాయి. ఆ ప్రాంతంలోనే వున్న మంత్రిగారి వెంట విందులు వినోదాలలో మునిగివుండవలసిన తరుణంలో ఈ విధంగా స్టేషన్‌లో వుండటం ఇనస్పెక్టర్‌కు ఒకరకంగా చిరాకుగా వుంది. దానికితోడు బండరాయిలా ఉలకని పలకని రాజగోపాలరావు వ్యవహారం తలనొప్పిగా తయారయ్యింది.

బయటవున్న గుంపు అంతకంతకూ పెరగసాగింది. రాజగోపాలరావు ఆ గుంపులో తన గ్రామం వారిని చూసాడు. పోలీసులు వారిని ఆపలేకపోతున్నారు. ఆ గుంపు రెచ్చిపోతే తన కొంప మునిగిపోతుందని ఇనస్పెక్టర్ లోలోపల వణికిపోసాగాడు.

శాసన సభ్యురాలు అన్నపూర్ణ అక్కడకు సమయానికి రాకుంటే ఇనస్పెక్టర్ ఏమి చేసేవాడో ఊహించవలసిందే.

"మీరు నిరపరాధుల్ని నిర్బంధించి బాధిస్తుంటారు. మేం ఏమన్నా అంటే పై అధికార్లతో మేమేదో మిమ్మల్ని వేధిస్తున్నట్లు ఫిర్యాదులు చేస్తుంటారు." అన్నపూర్ణ కొంచెం తీవ్రంగా అంది.

ఇనస్పెక్టర్‌కు ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో అర్థం కావటం లేదు.

"నేను వీరిని ఏమీ బాధించటం లేదు. కేవలం వివరాలు తెలుసుకుంటు న్నాను. ఆనకట్ట పేల్చివేయటంలో వీరికి పాత్ర వున్నట్లు నాకు రూఢిగా తెలిసింది."

"ఎక్కడో వుండి ఆనకట్టలు పేల్చివేయటానికి వీరేమి సైన్సులో నిష్ణాతులు కాదు. ఆనకట్ట ధ్వంసం చేయబడినప్పుడు వీరు గ్రామంలో వున్నారు. మీకు రిపోర్టు ఇద్దామని వస్తున్నవారిని, పారిపోతున్నారని భ్రమపడి మీరు పట్టుకు వచ్చారు. ఇంత పెద్ద ఘోరం జరిగినా తెల్లవారిన తర్వాతకూడా మీకు తెలియదు." అన్నపూర్ణ స్వరంలో వ్యంగ్యం ధ్వనించింది.

"కాని వీళ్ళు-వీళ్ళు-" ఇనస్పెక్టర్ నీళ్ళు నమలసాగాడు. తనవైపు తిరిగిన ఈ దాడికి ఇనస్పెక్టర్ మెదడు మొద్దుబారిపోయింది. ఈ దాడి నుంచి ఎట్లా తప్పించుకోవాలో అతనికి అర్థం కావటం లేదు

"నేను మంత్రిగారితో మాట్లాడాను దర్యాప్తు సంఘం కూడా వేస్తామన్నారు. దానిలో పోలీసులు కూడా వుంటారు. అయినా ఇంత ఘోరం చేసినవారు మీ కోసం ఎదురుచూస్తూ వుంటారనా మీ ఉద్దేశ్యం?" అన్నపూర్ణ అదే వ్యంగ్యంతో తిరిగి ప్రశ్నించింది.

"నేను వీరిని నిర్బంధించలేదు. కేవలం విచారణ కోసం తీసుకు వచ్చాను. వీరిని లాకప్పులో కూడా వుంచలేదు." ఇనస్పెక్టర్ తనను తాను సమర్థించుకో సాగాడు.

"వీరి సంగతి నేను మంత్రిగారితో చర్చించాను. మీరు వీరిని వదిలి వేయ వచ్చు. మీకేం ఫర్వాలేదు."

"మేము చెప్పవలసింది ఏమీలేదు. మా ద్వారా మీరు తెలుసుకోవలసింది కూడా ఏమీలేదు. మేము కోరేది ఒక్కటే. ఈ ద్రోహం ఎవరు చేసారో, ఎందుకు చేసారో మీరు తెలుసుకోవాలి వారు మా జీవితాలను నాశనం చేశారు. మా ఆశలు వమ్ము చేసారు. మా కలలు కల్లలు చేసారు. మేము మిమ్మల్ని అడిగేది ఒక్కటే. మీరు రాజకీయాల చదరంగంలో మునిగిపోయి అన్యాయానికి పట్టం కట్టవద్దు. న్యాయాన్ని సత్యాన్ని మరుగు పరచవద్దు. ఆ విధంగా చేస్తే మీరు తరవాత పశ్చాత్తాపపడవలసి వస్తుంది. వ్యక్తుల కారణంగా నిర్ణయాలు మార్చుకునే వ్యక్తి నిజాయితీపరుడైన వ్యక్తి కాదని నా నమ్మకం. మీరు ఆ విధంగా వ్యవహరించటం దురదృష్టం." రాజగోపాలరావు అప్పటిదాకా త్రొక్కిపట్టిన తన వేదన వ్యక్తం చేసాడు.

"మీ దగ్గర నుంచి పాఠాలు నేర్చుకునే స్థితిలో నేను లేను." ఇనస్పెక్టర్ స్వరంలో తప్పనిసరి లొంగుబాటు. రాజగోపాలరావుని, అతని సహచరుల్ని వదిలి వేయమని మౌనంగా పోలీసులకు సైగ చేశాడు.

"మేము గ్రామం వదలి పారిపోయే వాళ్ళం కాదు. మీరు ఎప్పుడు కావలసినా మమ్మల్ని కలసి విచారించవచ్చు. అయితే ఇంత హాస్యాస్పదంగా కాదు." రాజగోపాలరావు గొంతులో హెచ్చరిక.

"ఊహు." రాజగోపాలరావు తనను హేళన చేస్తూ నిట్టూర్చిన విధంగా ఇనస్పెక్టర్ నిట్టూర్చాడు.

రాజగోపాలరావు, అతని బృందం అన్నపూర్ణతోపాటు పోలీసు స్టేషన్ బయటకు వచ్చారు. అన్నపూర్ణ వారి నందర్నీ తన జీపు ఎక్కమంది. వారందరూ గ్రామం వైపు బయలుదేరారు.

జమిందారు కుటుంబరావు వున్న ఆ గ్రామం ఒక పోలీసు స్టేషన్ ఉండ వలసినంత పెద్దది. కుటుంబరావు తండ్రి హయాంలో ప్రభుత్వం వారు ఆ గ్రామంలో పోలీసు స్టేషన్ ప్రారంభించాలని అనుకున్నారు. అయితే తమ అధి కారం అడుగంటిపోతుందనే ఉద్దేశ్యంతో ఆ ప్రతిపాదనను వీరు వ్యతిరేకించారు.

చీకటి పడసాగింది. గుడిసెల లోపలనుండి వంట చేస్తున్న గుర్తుగా పొగ మెల్లగా బయటకు రాసాగింది. ప్రజలు తమ పొలాల నుండి, తోటల నుండి ఇంటికి తిరిగి రాసాగారు. రాజగోపాలరావు రోజంతా ఏమీ తినలేదు.

"ఇవ్వాళ జమిందారుగారి యింటిలో విందు జరుగుతున్నది. మీరు రావటం లేదా?" అన్నపూర్ణ అడిగింది.

"లేదు. నేను రావటం లేదు." రాజగోపాలరావు స్పష్టం చేసాడు.

"అయితే సభకు తప్పకరండి. ఈ విందు కంటే ముందే మనం ఈ సభను ఏర్పాటు చేసుకున్నాం కదా?" అన్నపూర్ణ కంఠంలో కొంచెం నిష్ఠూరం.

"నాకు వేరే పని వుంది. ఈ మంత్రుల శుష్కప్రసంగాలు వినే తీరికా, ఓపికా నాకు లేవు."

"మీరు సభలో వుంటే అంతా ప్రశాంతంగా వుంటుందని...."

అన్నపూర్ణ గొంతులో అభ్యర్థన. రాజగోపాలరావు ఇంటి ముందు జీపు ఆగింది. ఆ వీధిలో ఇంకా నీళ్ళు కొద్దిగా వున్నాయి.

రాజగోపాలరావు భార్య చూద్దామనే ఉద్విగ్నతలో బయటికి వచ్చింది. అయితే అంతమంది జనాన్ని చూసి తలుపు చాటుకు వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ కోట వైపు తన జీపులో వెళ్ళింది. దారిలో సభకోసం జరుగు తున్న ఏర్పాట్లు పర్యవేక్షించింది.

# 5

ఆ గ్రామం చాలా చిన్నది. ఆ గ్రామంలోని కోట మాత్రం పెద్దది. అయితే అంత ప్రాముఖ్యమైనది మాత్రం కాదు. అక్కడ ఎప్పుడూ యుద్ధాలు జరగలేదు. దానిని ఎవరూ ఆక్రమించలేదు. పెద్ద చరిత్ర కలిగినంత ప్రాచీన మైనది కాదు.

కోట ముందు కట్టబడిందో, గ్రామం ముందు ఏర్పడిందో తెలియదు గాని, ప్రస్తుతం గ్రామం మాత్రం కోట చుట్టూ నాలుగు వైపుల వ్యాపించి వుంది. పెద్ద భవంతులు లేవు. చిన్న గుడిసెలు, మధ్య తరగతి పెంకుటిళ్ళు మాత్రం వున్నాయి.

గ్రామానికి కొంచెం దూరంగా వున్న కొండమీద ఒక దేవాలయం వున్నది. అది ఏడాది పొడుగున భక్తులు వచ్చేటంత ప్రసిద్ధి చెందలేదు. శిథిలమైపోతున్న గుడి భాగాలకు మరుమ్మత్తులు కూడా లేవు మరమ్మతులు చేయించటానికి డబ్బు కూడా లేదు.

"గ్రామం ఈ విధంగా దుర్దశలో వుండటానికి కారణం ఈ గుడిని, ఇందు లోని దేవుణ్ణి అలక్ష్యం చేయటమే" అంటాడు గుడి పూజారి సోమయాజులు. సోమ యాజులు పూర్వీకులు పట్ల గ్రామ ప్రజలకు గౌరవ భావం వుండేది. వారి మాట మీద గురి వుండేది. సోమయాజుల్ని మాత్రం ఎవరూ నమ్మరు.

జమిందారు లాగానే పూజారికి కూడా కార్యక్షేత్రం వుంటుంది. ఇద్దరూ పరస్పరం గౌరవం పెంచుకోవటానికి కలిసి వుంటూ వుంటారు. జమిందారు గ్రామం వదలి నగరంలో కాపురం పెట్టిన తర్వాత సోమయాజులుకు తలపోయి నట్లుగా వుంది జమిందారు పట్ల సోమయాజులకు ఏ విధమయిన వ్యతిరేక భావం లేదు.

గుడితో పాటుగా ఆ గ్రామంలో ఒక బడి కూడా వుంది. ఆ బడి పాకలలో నడపబడుతూ వున్నది. స్వాతంత్ర్యం వచ్చిన పిమ్మట ప్రారంభించబడిన బడి అది.

కోట దగ్గరగానే ఒక నూనె మిల్లు కూడా వున్నది. రేకులతో కూడిన పైకప్పు చాలావరకు తుప్పు పట్టిపోయింది. అక్కడక్కడ పెద్ద పెద్ద రంధ్రాలు కూగా ఏర్పడ్డాయి. గోడలు కూడ సగం సగం కూలిపోతూ వున్నాయి అది కూడా జమిందారు లాగానే చిక్కి శల్యమైనట్టు తోస్తుంది.

ఆ తాలూకాలోని మిగిలిన గ్రామాల లాగానే ఈ గ్రామం కూడా మురుగుతో నిండి, అలక్ష్యం చేయబడి, జీవకళ లేకుండా వుంది. అయితే దీనిని ఎవరూ పెద్దగా పట్టించుకున్నట్లు తోచదు కాని గ్రామాన్ని బాగు చేయాలనే ప్రయత్నాలు కొందరు మాత్రం అప్పుడప్పుడు చేస్తూవుంటారు. కాని ఫలితం మాత్రం పెద్దగా కలుగలేదు.

నదికి దూరంగా గ్రామానికి కొంచెం దగ్గరలో చెరువు ఒకటి వుంది. కోట కట్టడానికి అవసరమయిన మట్టి త్రవ్వబడినప్పుడు ఈ చెరువు దానంతట అదే ఏర్పడింది కోట కట్టగా మిగిలిన కొండరాళ్ళతో ఆ చెరువు చుట్టూ కట్ట నిర్మించబడింది. అనుకోకుండా జరిగినా, జమిందారు చేసిన అతి కొద్ది మంచి పనులలో ఇది ఒకటి. ఈ చెరువు చుట్టూ, నది ఒడ్డున కొన్ని ఇళ్ళు వున్నాయి. అవన్నీ ఈ గ్రామపు 'హేమ్లెట్' గా వుంటాయి. ఇక్కడ గ్రామంలోని ధనవంతులు, అన్నపూర్ణవంటి హోదా కలిగిన వ్యక్తులు వుంటూ వుంటారు.

ఈ చెరువు నీటి ద్వారా జమిందారుకు చెందిన నాలుగైదు వందల ఎకరాల భూమి సేద్యం చేయబడుతూ వుంటుంది. జమిందారు పూర్వీకులు అనుకోకుండా నెరవేర్చిన ఈ ఉత్తమ కార్యం వలన వారికే ఎక్కువ లాభం జరుగుతూ వుంది. ఎప్పుడైనా నీరు ఎక్కువై వారికి సరిపోగా మిగిలితే బయటివారికి ఇస్తూవుంటారు. అందులోనూ స్వార్థమే ప్రతి సంవత్సరం చేపలు పట్టటానికి వీలుగా తప్పనిసరిగా చెరువు నీళ్ళు ఖాళీ చేయవలసివుంది. చేపల వేలంవలన వచ్చే డబ్బు జమిందారు గారికే చేరుతుంది.

చెరువుకు దూరంగా గ్రామానికి చెందిన చాలా భూమి వుంది. అందులో పెద్దగా ఏమీ పండదు. అదునులో వర్షం పడితే వేరుశనగ పండుతుంది. లేకుంటే పొగాకు, మిర్చి, కూరగాయలు పండుతాయి. దీనివలన రైతులకు పెద్ద ఆదాయం రాదు. మిగిలినదంతా తాటి తోపులే. అదికూడా ఏదో వెనుకటి కాలంలో జమిందారుదే అని, తాటికల్లు వేలంపల్ల వచ్చే ఆదాయం కూడా జమిందారుకే చెల్లింపబడుతుంది.

జమిందారీ మొత్తానికి ఈ గ్రామమే ప్రధానంగా వుండేది అందుచేతనే జమిందారు, ఆయన కుటుంబం ఈ గ్రామంలోనే వుంటూ వుండేవారు అయితే జమిందారుకు జిల్లా అంతటా ఆస్తులున్నాయి. ఇదేకాకుండా పెద్ద మొత్తాలలో లాభాలు వచ్చే ఫ్యాక్టరీలలో వాటాలు కూడా వున్నాయి జమిందారీ హోదాయే కాకుండా ధనవంతుడుగా కూడా జమిందారుకు ఆ ప్రాంతంలో పెద్ద పేరు వుంది. రెక్కలు ముక్కలు చేసుకుంటూ బంజరు భూముల్ని సారవంతం చేసి బంగారు పంటలు పండించే రైతులే ఆ గ్రామంలో ఎక్కువ. ఆ గ్రామం మొత్తంలో కొంచెం కలిగిన కుటుంబాలు ఐదారు మాత్రమే వున్నాయి. రాజగోపాలరావు కుటుంబం వాటిలో ఒకటి. అతను శూద్రజాతికి చెందినవాడు. ఆ గ్రామంలోని హరిజనులకు కొండప్రక్కగా ప్రత్యేకమైన పల్లె వుంది.

ఆ గ్రామంలో వైశ్యులు, మంగళ్ళు, చాకలివారు, కుమ్మరులు మొదలగు వివిధ జాతులున్నారు. గ్రామంలోని ఏ జాతికి చెందనివారు కొందరున్నారు. వారికి ప్రస్తుతం ఏ వృత్తి లేదు. జమిందారు కుటుంబీకుల సేవచేస్తూ పొట్ట పోసుకుంటూ వస్తున్నారు. వారిలో జమిందారుల అక్రమ సంతానం కూడా కొందరు వున్నారు. వారి సంఖ్య గ్రామంలో రోజురోజుకు పెరుగుతూ వుంది. వారందరూ జమిందారుకు తాబేదార్లు. వీరాస్వామి వారిలో ఒకడు. అన్నపూర్ణ కూడా ఆ కుటుంబాలకు చెందినదే.

కోటలోపల పెద్ద మహల్, చాలా గదులున్న గాలిరాని రెండు మూడు ఇళ్ళు వున్నాయి. వీటిలో జమిందారుల ఉంపుడుగత్తెలు వుంటూ వుండేవారు. వాటిలో ఒకదాన్ని జమిందారుకు చెందిన ధాన్యం నిల్వచేసే గోడౌనుగా మార్చారు. శిథిలావస్థకు దగ్గరగా వున్న రెండవ దానిని ప్రభుత్వానికి అమ్మివేసారు. ఆ గ్రామంలో విలువ గలిగినదంతా జమిందారుదే. పూర్వం ప్రతి ఒక్కరి బ్రతుకు జమిందారుల అధీనంగానే భావించబడుతూ వుండేది.

ఆ గ్రామం మిగిలిన గ్రామాలకు కొంచెం పెడగా వుంటుంది. ఆ గ్రామం నుంచి బయటకు వెళ్ళే దారులు చాలా తక్కువ. రెండు మూడు మైళ్ళ విస్తీర్ణంలో ఎక్కడా మరో గ్రామం లేదు. గ్రామానికి ఒకవైపు అడవి, రెండో వైపున కొండలు, మూడవ వైపున చిన్న నది. ఈ నది ఒడ్డునుంచే కొండను చుట్టి వెళ్లే మార్గం ఐదారు మైళ్ళ దూరంలో వున్న పట్టణానికి వెళుతుంది. ఆ పట్టణానికి ఏడెనిమిది మైళ్ళ దూరంలో రైల్వే స్టేషన్ వున్నది.

ఒక మైలు తర్వాత ఈ రోడ్డుకు అడ్డంగా వెళ్ళే మరోరోడ్డు ఆనకట్ట వైపు వెళుతుంది ఆనకట్టకు కావలసిన సామాగ్రి ఈ రోడ్డుద్వారానే లారీలలో చేరవేయబడుతూ వుండేది. వాస్తవంగా ఈ రోడ్డు గ్రామం మధ్య నుండి వెళ్ళవలసివుంది. కాని జమిందారు గారి 'పుణ్యమా' అని గ్రామం బయటనుండి వెళ్ళింది. ఈ రోడ్డు ఆ తాలూకాలోని చాలా గ్రామాలను కలుపుతూ వెళుతుంది. ధైర్యం గల ఒక వ్యాపారి ఆ మార్గంలో ఒక బస్సు సర్వీసు కూడా ప్రారంభించాడు. ఈ రోడ్డు గ్రామం బయట నుంచి వెళుతున్న కారణంగా గ్రామస్థులు బస్సు దగ్గరకు కాలినడకనో, ఎడ్ల బండ్ల మీదో రావలసి వస్తుంది.

దగ్గరలో వున్న పట్టణం కూడా అంత పెద్దది కాదు. ఒకరకంగా వ్యాపార కేంద్రమైన కారణంగా జనాభా కొంచెం పెరిగింది. జమిందారు గ్రామం దాటిన తర్వాత కొండలపైన, అడవులలోనూ వున్న పల్లెలకు ఇక్కడ నుండి సరకులు రవాణా చేయబడుతూ వుంటాయి ఇక్కడ ఒక చిన్న హైస్కూల్, మిషనరీలు నడిపే ఆస్పత్రి వున్నాయి. ఒక బ్యాంకు, ఒక సహకార వ్యాపార సంస్థ వున్నవి. ఇవి మినహా అక్కడ మరేమీ లేవు.

రైల్వే స్టేషన్‌కు పదమూడు మైళ్ల దూరంలో, జాతీయ రహదారికి వంద మైళ్ళ దూరంలో, జిల్లా ప్రధాన కేంద్రానికి ఏభై మైళ్ల దూరంలో రాజధానికి రెండు వందల మైళ్ళ దూరంలో ఈ గ్రామం ఒక ద్వీపంలా వుంటుంది. బహుశా ఈ కారణంగానే ఆ గ్రామం స్వయం పోషకత్వంగా వుంటుంది. ఆ గ్రామపు అవసరాలు తక్కువే అయినా ఆ అవసరాలు తీర్చే శక్తి యింకా తక్కువగా ఉంది.

# 6

పని వున్నా లేకపోయినా రాజగోపాలరావు ప్రతి రోజూ అలవాటుగా పొలం వెళుతూ వుంటాడు. ఆయన పొలానికి అన్నపూర్ణ యింటి మీదుగా, నది ఒడ్డు నుండి వెళ్ళవలసి వుంది. పొలం వెళ్ళేటపుడో, పొలం నుండి వచ్చేటపుడో రాజగోపాలరావు అన్నపూర్ణను చూసి వస్తూవుంటాడు. కాని ఈ మధ్య అది తగ్గిపోయింది.

ఆ రోజు రాజగోపాలరావు అన్నపూర్ణను చూడటానికి వెళ్ళేసరికి, ఆమె మంత్రిగారి దగ్గరకు వెళ్ళటానికి సిద్ధమవుతూ వుంది. ఆమె రాజగోపాలరావును కూడా తనతో రావటానికి వప్పించింది.

"గణేష్ ఎక్కడవున్నాడు?" రాజగోపాలరావు ఇంటిలో అటూ ఇటు చూస్తూ అడిగాడు.

"ఆయన ఎక్కడకు వెళ్ళాడో నాకు తెలియదు. మీ మగవాళ్ళు చాలా చిత్రంగా వుంటారు. స్త్రీలు ఏం చేసినా, ఎంత గొప్పవాళ్ళయినా స్త్రీలుగానే మిగిలిపోతుంటారు. పురుషులయినంత ప్రసిద్ధులుగా స్త్రీలు ఎందుకు కాలేక పోతున్నారో తెలుసా? పురుషులు స్త్రీల మెడలో గుదిబండల్లా వుంటూ వాళ్ళను నిరంతరం క్రిందకు గుంజుతూ వుంటారు. ఆ కారణంగానే స్త్రీలు ఉన్నతులు కాలేకపోతున్నారు!" అన్నపూర్ణ నోటి నుండి మాటలు వేగంగా వచ్చాయి.

"అప్పుడప్పుడు స్త్రీలుకూడా పురుషుల్ని క్రిందకు గుంజుతూ వుంటారు."

"లేదు లేదు. మేము పురుషుల ఔన్నత్యానికే తోడుపడుతూ వుంటాము. పురుషులు లాగినట్లుగా మేము వారిని క్రిందకు లాగం. సామాజిక జీవితం కోసం స్త్రీలు ఎంత మూల్యం చెల్లించాలో మీకు తెలుసా? ఆమె భర్తకేపరాయిదయి పోతుంది. భార్య తనకంటే గొప్పదయితే ఏ భర్తా మనఃస్ఫూర్తిగా సహించలేడు. లోపల లోపల కుమిలిపోతుంటాడు. భార్యను శత్రువు లాగ చూస్తాడు. మీరే చెప్పండి. నా దోషం ఏముంది? ఆయనకోసం నేనేమి చెయ్యలేదు?" ఆమె కంఠం దుఃఖంతో పూడిపోయింది. కళ్ళు వర్షించాయి.

గణేష్ స్థానిక పాఠశాలలో అధ్యాపకుడు. భార్య అన్నపూర్ణ పదవి, పలుకుబడి కారణంగానే అతనికా ఉద్యోగం లభించింది. వాస్తవంగా అతని కుటుంబం చాలా పేదది. అతని తండ్రి దగ్గరలో వున్న మరో జమిందారు దగ్గర నౌకరుగా వుండేవాడు. గణేష్‌కు పిల్లలు లేరు. అతను పొట్టిగా, లావుగా వుంటాడు. భార్య ముందు అతను ఒదిగదుడుపుగా వుంటాడు. వారిద్దరి సంబంధం చాలా విచిత్రంగా వుంటుంది. ఒకరిపై ఒకరికున్న అనుమానం వారి వైవాహిక సంబంధాలను దెబ్బతీసింది

రాజగోపాలరావుకు ఇదంతా తెలుసు. అయినా అతను గణేష్‌ను నిందించడు. గణేష్ స్థానంలో తానున్నా అదే విధంగా వ్యవహరిస్తానని అతననుకుంటూ వుంటాడు. వారిద్దరి వైవాహిక సంబంధాలు దెబ్బతినటంలో తన భాగం కూడా వుందనుకుంటాడు రాజగోపాలరావు. ఎప్పుడు తాను అన్నపూర్ణయింటికి వెళ్ళినా గణేష్ ఏదో ఒకవంకన బయటికి వెళ్ళిపోతూ వుంటాడు. అన్నపూర్ణ భార్యగా పూర్తివిశ్వాసపాత్రురాలు కాదని రాజగోపాలరావుకు తెలుసు. స్త్రీ పురుషుల మధ్య శారీరక సంబంధం మినహా మరేమీ వుండదని గణేష్ విశ్వాసం. అయితే భార్య దగ్గర తన అనుమానాలను వ్యక్తం చేసే పరిస్థితులలో అతను లేడు. పిరికితనమే దానికి కారణమై వుండవచ్చు.

"సరే, ఆ సంగతి వదలేయ్. పబ్లిక్‌లైఫ్‌లో వున్న ఆడవాళ్ళకు ఇటువంటి బాధలతో కూడిన మూల్యం కొంత చెల్లించవలసి వుంటుంది. నువ్వేమిటి - ఈ మధ్యన అంటీముట్టనట్లుగా వుంటున్నావు? నీ స్నేహం, అభిమానం ఏమైపోయాయి? నీలో ఏదో వింత మార్పు వచ్చింది." కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది అన్నపూర్ణ.

"మనం బ్రతకటానికి మారుతూ వుంటామని, మారటానికే బ్రతుకుతూ వుంటామని, నీవంటి చదువుకున్నవారే ఒకరు చాలా రోజుల క్రితం చెప్పారు."

"అబ్బా! చాల గొప్ప విషయం చెప్పావు. మార్పు ఏదయినా హృదయం రాయిగా మారకూడదు. నువ్వు రాయిలాగా మారిపోతున్నావు. ఎం. యల్. ఏ. నయ్యి నేనేం పొందాను? శూన్యం. నా కాపురం నాశనమయ్యింది. నాకు సహాయ పడిన వారందరి స్నేహం కోల్పోయాను. ఎటుచూసిన బాధే ..." ఆమె గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

"ఇటువంటి మాటలు మానివెయ్యి. నువ్వు చిన్నదానివిగా వున్నపుడు ఎవరో పెద్ద మనిషి వదిలేసినట్లుగా, చేతులు దులుపుకోవటానికి నిన్నింత స్థాయికి తేలేదు." రాజగోపాలరావు ఏడుస్తున్న ఆడవాళ్ళను చూడలేడు. అందులోనూ నడిరోడ్డు మీద.

వాళ్ళప్పటికి నడచుకుంటూ ఊరిలోనికి వచ్చేసారు. రోడ్డు మీద వున్న గ్రామస్థులు వారికి సమస్కారాలు చెయ్యసాగారు వీరిద్దరిని గురించి ఎందరు ఎన్ని గుసగుసలుపోయినా గ్రామస్థులు వీరిని గౌరవభావంతోనే చూస్తారు.

గ్రామంలోని ప్రజలు ఎవరి పనులలో వాళ్ళున్నారు. మంత్రులు వచ్చినా వారి దినచర్యలో మాత్రం మార్పువుండదు. వారి జీవితం ఆ విధంగా సాగుతూ వస్తున్నది.

వారిద్దరు కోట దగ్గరకు వచ్చేసరికి వీరాస్వామి కోట ద్వారం నుండి కర్ర వూపుకుంటూ వస్తున్నాడు. బహుశా రాత్రంతా కాపలాకాసివుంటాడు. అతను అన్నపూర్ణకు బంధువు. అతను, అన్నపూర్ణ తండ్రి ఇద్దరు ఎప్పుడో ఒకప్పుడు జమిందారు దగ్గర కలసి పనిచేసారు అన్నపూర్ణ తండ్రి మూడు నాలుగు సంవత్సరాల క్రితమే మరణించాడు.

కోటలోనికి ఎప్పుడు పడితే అప్పుడు రాకపోకలు సాగించడానికి అన్నపూర్ణకు అనుమతి వుంది. ఆమె ఎం. ఎల్. ఏ. కాకముందు కూడా ఈ సౌకర్యం వుంది. ఆ కోటలో ఇంకనూ జమిందారు దయపై ఆమె బంధువులు చాలా మంది బ్రతుకుతున్నారు. అయితే జమిందారీలు రద్దయినప్పుడు ఒక్కసారిగా, ఏ విధమయిన నోటీసు లేకుండా జమిందారు తన తండ్రి ఉద్యోగం తీసివేసినందుకు, ఆమెకు జమిందారు పట్ల మనసులో కష్టం వున్నది. అయితే ఆ బాధను ఎప్పుడూ జమిందారు సమక్షంలో వ్యక్తం కానీయగూడదని అన్నపూర్ణకు బాగా తెలుసు

"అంతా బాగానే వున్నది కదా?" వీరాస్వామి రాజగోపాలరావు వైపు కోపంగా చూస్తూ అన్నపూర్ణను ప్రశ్నించాడు. రాజగోపాలరావంటే వీరాస్వామికి ఏమాత్రం ఇష్టంలేదు రాజగోపాలరావు, అన్నపూర్ణ కలసిరావటం అతను భరించలేకపోయాడు. అన్నపూర్ణ సమాధానం వినకుండానే వీరాస్వామి తన ఇంటివైపు సాగిపోయాడు.

వాళ్ళిద్దరూ కోటలోపల వున్న భవంతి పోర్టికోలోకి వెళ్ళారు. అక్కడ పాడుబడినట్లున్న పాతకారు ఒకటి వున్నది. అందులో ఒక అందమైన వయస్సులో ఉన్న అమ్మాయి కూర్చుంటున్నది. ఆ అమ్మాయి ఎవరో అన్నపూర్ణకు తెలుసు. ఆ అమ్మాయి అక్కడ కెందుకు వచ్చిందో రాజగోపాలరావుకు తెలుసు. అక్కడ జమిందారుగారి పెద్ద కారు గాని, మంత్రిగారు వచ్చిన జీపుగాని లేవు. దానిని బట్టే తెలిసిపోతుంది వాళ్ళిద్దరూ అక్కడ లేరని.

అన్నపూర్ణను చూడగానే ఆ అమ్మాయి వాళ్ళకు నమస్కారం చేసింది. ఆ అమ్మాయి అన్నపూర్ణ వాళ్ళ కులానికి సంబంధించినదే. ఆమెకు శీలం విషయంలో అంత మంచి పేరు లేదు. ఆమె అమ్మ చనిపోయింది. తండ్రి నిరుద్యోగి. అతను కూడా జమిందారు చేత ఉద్యోగం నుండి తొలగించబడ్డవాడే. కూతురు వయస్సుతో అతను వ్యాపారం చేస్తూ బ్రతుకుతున్నాడు.

ఆ అమ్మాయితో అబద్ధం ఆడించటం అన్నపూర్ణకు ఇష్టంలేదు. అందుకనే ఆమె అక్కడున్న కారణం ప్రశ్నించలేదు. "జమిందారుగారు లేరా!" అని మాత్రమే ప్రశ్నించింది.

నౌకరు సమాధాన మిచ్చాడు: "ఆయన ఉదయమే వెళ్ళిపోయారు."

"మంత్రిగారు కూడానా?" రాజగోపాలరావు ప్రశ్న.

"ఆయన కూడా వెళ్ళిపోయారు." లోపలి నుండి వస్తున్న సోమయాజులు బదులు చెప్పాడు. అతను లోపల ఏదో పూజచేసి వస్తున్నట్లున్నాడు. "మీరు వెళ్ళిపోయేరేమో అనుకున్నాం." అన్నపూర్ణతో అన్నాడు.

"మేమిక్కడకు రాకముందే ఆ విషయం తెలుసుకోవాలి." రాజగోపాలరావు.

"జమిందారుగారు రేపిక్కడకు వస్తారు. సాయంత్రం మద్రాసు వెళతారు. ఈ వార్త ఆయన నన్ను మీకు చెప్పమన్నారు." ఒక నౌకరు అన్నపూర్ణ పక్కకు వచ్చి మెల్లగా చెప్పాడు.

# 7

తనను కలవటానికి వచ్చే జనసమూహం లేకుంటే అన్నపూర్ణ మనసుతీరా ఏడ్చివుండేది. ఆమె మనస్సు దుఃఖంతో, నిరాశతో నిండివుంది. ఆమె భర్త యింటికి రావటంలేదు. అంతేకాదు, అతనెక్కడ వున్నాడో కూడా తెలియదు. ఈ విషయం ఎవరికీ చెప్పుకోలేదు. ఎవరి సహాయమూ పొందలేదు. ఈ విషయం బయటికి పొక్కితే లోకం కోడై కూస్తుందని ఆమె భయం.

అప్పుడప్పుడు తన సామాజికజీవితానికి 'ఫుల్‌స్టాప్' పెడదామని అనుకుంటూ వుంటుంది అన్నపూర్ణ. ఎంతగా బయటపడదామని ప్రయత్నం చేస్తోందో అంతగా అందులో కూరుకుపోతూవుంది. ఎవరైనా అందులోంచి బయటకు తోసివేయబడే వరకు, తమంత తాముగా బయటపడటం కష్టమే. అందులో బ్రహ్మాండమైన అయస్కాంత శక్తి వుంది.

అన్నపూర్ణ మనస్సు పరిపరి విధాలా పోతూవున్నది. ఆమె రేడియో పెడుతుంది. అంతలోనే ఏదైనా నవల చదువుదామని ప్రారంభిస్తుంది. అయితే దృష్టి నిలుపలేకపోతున్నది. చిన్న చిన్న విషయాలకు సైతం చికాకు పడిపోసాగింది. విచిత్రమైన పరిస్థితి.

ఆమెను రకరకాల భయాలు పీడించ సాగాయి. భర్త వరదలో కొట్టుకుపోయాడో, ఏదైనా ప్రమాదంలో చిక్కుకున్నాడో, లేకపోతే ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళాడో, వెళితే ఇన్ని రోజులు తిరిగి రాకుండా వుంటాడా? ఆమె దగ్గరే వుండిపోతాడా? నన్ను వదిలేసాడా? వదిలి వేస్తాడా?

అన్నపూర్ణ రాజగోపాలరావుకు ఎన్నో విషయాలు చెప్పింది. అయితే ఈ భయాలను గురించి చెప్పలేదు. 'ఇటువంటి సంబంధాలకు ప్రాధాన్యత యివ్వాలా? స్త్రీలకు పురుషుల వలెనే స్నేహితులు వుండరా? కుటుంబం పిల్లలు? నాకు పిల్లలు లేరు. అయినా నన్ను ఈ సమాజం విశ్వాసఘాతుకరాలు, కులట, చెడిపోయింది అనదా? ఎందుకనదు?' ఇటువంటి రకరకాల ప్రశ్నలు ఆమె మనసులో సుళ్ళు తిరగసాగాయి.

'మూల్యం వసూలు చేసే సహాయానికి విలువేముంటుంది? ఈ పురుషులు స్త్రీలను కృతజ్ఞులుగా కూడా వుండనీయరు. ఎందుకు వారి అభిమానం, ప్రేమ లైంగిక సంబంధాలవైపు దారితీస్తూ వుంటుంది? ఇంత మంచివాడు, ఉదారుడు అయిన రాజగోపాలరావు సైతం, నా భర్త పట్ల నాకు భార్యగా కర్తవ్యం వుంటుందని ఎందుకు ఆలోచించడు? నాకేం జరుగుతుందో నా భర్తకు తెలుసా? అసలు తెలుసుకునే ప్రయత్నం ఆయన చేస్తున్నాడా? దయాహీనుడు, విలాసి, స్వార్థపరుడు.' ఆమె మనస్సులోనే భర్తను నిందించసాగింది. అంతలోనే తననుతాను నిందించుకుంటూ భర్తపై దయ చూపసాగింది.

భోజనం చేసిన తరువాత రాజగోపాలరావు అన్నపూర్ణ యింటికి వచ్చాడు. కుర్చీ జరుపుకుని కూర్చుంటూ" భోజనం చేసావా? నీ వాలకం చూస్తుంటే ఏమీ తిన్నట్లు లేదు" అన్నాడు.

"నాకు ఆకలిగా లేదు."

"ఉదయం నుంచి తిరుగుతూనే వున్నావు అయినా ఆకలిగా లేదా? అసలు నేను నిన్న మా యింటికి తీసుకుని వెళ్ళవలసింది గణేష్ లేకుండా నీకు మాత్రం ఇంట్లో వంటరిగా ఎలా తినాలనిపిస్తుంది?"

"ఆయన ఆ స్త్రీతో ఎక్కడికైనా వెళ్ళిపోయాడేమో? మగవాళ్ళకు యింతకంటే మంచి ఆలోచనలు ఎందుకు వస్తాయి?"

"ఏం భయపడకు. ముందు భోజనం చెయ్యి."

"నాకేదో జబ్బు చేసినట్లుంది."

"జబ్బు! నేను దగ్గర వుండగా నీకు ఏ విధమయిన జబ్బు రాదు." రాజగోపాలరావు అన్నపూర్ణ చేతిని తన చేతిలోనికి తీసుకున్నాడు.

"నా చేతులకు ఏం జబ్బు లేదు " అన్నపూర్ణ చిరునవ్వు నవ్వుతూ అన్నది.

"అయితే ఇక్కడ వుందా?" రాజగోపాలరావు చేతులు అన్నపూర్ణ వక్షస్థలం పైకి వెళ్ళాయి.

"ఏమిటివ్వాళ ఇంత తొందర? ఎవరైనా వస్తే!" అన్నపూర్ణ ముక్కుపై వేలు వుంచుకుంది.

"మన మిద్దరం వుంటే ఎవరూ రారు."

"వద్దు, ఇప్పుడేవద్దు." అన్నపూర్ణ తన చేయి విడిపించుకుంది. వంటింట్లోకి వెళ్ళి పళ్ళెంలో అన్నం పెట్టుకొని ఎంతో ఆకలితో వున్నట్లు భోజనం చేయ సాగింది. తనకు దూరంగా వుండటానికే ఆమె ప్రయత్నం చేస్తూందని రాజగోపాల రావు అనుకున్నాడు. కొద్ది రోజుల నుండి అన్నపూర్ణ ఎందుకో అతనికి దూరంగా వుండసాగింది.

ప్రేమ ప్రసంగంలో హాస్యాన్ని నింపుతూ రాజగోపాలరావు "నువ్వు మీ ఆయన మార్గంలో నడవవచ్చు. ఎటూ అతను దారి చూపాడు కదా!" అన్నాడు.

"నా మార్గంలోనే తాను నడుస్తున్నానని, ఆయన ఎక్కడ అంటాడో అని నా భయం."

"ఉహూ."

"అయినా ఒక సమస్యలో చిక్కుకున్నావు కదా? ఏమిటి మరి....?" అన్నపూర్ణ అడిగింది.

"బహుశా అందుకేనేమో సమస్యలో చిక్కుకుంది. మనస్సు మీద వత్తిడి పెరుగుతున్నప్పుడు ఏదో ఒక వ్యాపకం వుండాలి."

"అయితే నువ్వు ఇందుకోసమే వచ్చావా?" అన్నపూర్ణ వెనుకకు తిరిగి చేతులు శుభ్రం చేసుకోవటానికి వెళ్ళింది. రాజగోపాలరావు లేచి గదిలోకి వెళుతూ వుండగా ఎక్కడ నుండో గణేష్ ఊడిపడ్డాడు. చేతిలో సిగిరెట్టు. మాసిన బట్టలు, పెరిగిన గడ్డం.

అతను తిన్నగా నూతి దగ్గరకు వెళ్ళాడు అక్కడ అతని భార్య అన్నపూర్ణ చేతులు కడుగుకుంటూవుంది. అన్నపూర్ణ అతనిని తీక్షణంగా చూసింది. అతను తల తిప్పుకున్నాడు.

కాళ్ళు చేతులు కడుగుకొని గణేష్ ఇంటి లోపలకు వెళ్ళాడు. భోజన పాత్రలు వెదుక్కోసాగాడు.

"నీకు భోజనం పెట్టటానికి నేనింకా బ్రతికే వున్నాను పట్టణంలో ఎక్కడా భోజనం దొరకలేదా?"

గణేష్ నోరు మెదపలేదు. అయితే ఇద్దరి మనస్సులలో ఒకే రకమైన ఆలోచనలు, అలజడి రాజగోపాలరావు అక్కడ లేకుండా వుంటే ఇద్దరి మధ్య తప్పనిసరిగా గొడవ జరిగి వుండేదే.

"నువ్వు ఈ రోజు స్కూలుకు వెళ్ళవలసిన పనిలేదు." అన్నపూర్ణ.

"ఎందుకని?"

"స్కూలు వరద బాధితులకు యివ్వబడింది. వరద గ్రామాన్ని ముంచి వెళ్ళిన సంగతి తెలియదా?"

"నాకు తెలియదు. తెలియకపోయినా నువ్వు చెప్పవలసిన అవసరం లేదు. నీ విషయాలలో జోక్యం చేసుకోవటం నాకిష్టం లేదు నే వెళుతున్నాను" గణేష్ తన సందేహాన్ని ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తూ బయటకు వెళ్ళిపోయాడు.

రాజగోపాలరావు పెద్ద సంకోచంలో పడ్డాడు. అతను అక్కడ వుండనూ లేడు. వెంటనే వెళ్ళనూ లేడు. ఏం చెయ్యాలో తెలియక అక్కడే వరండాలో కూర్చుండిపోయ్యాడు అన్నపూర్ణ బయటకు వెళ్ళడానికి చీర సరిచేసుకో సాగింది.

అన్నపూర్ణ తలుపు గెడవేసింది కాని తాళం వెయ్యలేదు. భర్త చుట్టు ప్రక్కల ఎక్కడో వుండి తనపై నిఘా వేస్తాడని అన్నపూర్ణ అనుమానం. అమె రాజగోపాలరావుతో కలసి యింటినుండి బయటకు రాగానే జమిందారు పంపిన మనిషి పాతకారుతో అక్కడకు వచ్చాడు. పట్నంనుండి తిరిగివచ్చిన జమిందారు అన్నపూర్ణ కోసం కారు పంపాడు.

"అతనితో కేవలం మాటలు మాత్రమే సాగించు ..." రాజగోపాలరావు గొంతులో తీవ్రత ధ్వనించింది.

రాజగోపాలరావు మనస్సులో జరుగుతున్న అలజడిని అన్నపూర్ణ గమనించింది.

# 8

ఎవరినైనా ఎక్కడకు వెళుతున్నారు? ఎందుకు వెళుతున్నారు? అని ప్రశ్నించటం మంచి శకునంగా భావించరు. అందుచేతనేకాబోలు అన్నపూర్ణ గ్రామానికి వచ్చే విషయం, వెళ్ళే విషయం ఎవరూ ప్రశ్నించరు. అంతేకాకుండా అన్నపూర్ణ మామూలుగా గ్రామం బయట ఎక్కువ, గ్రామంలో తక్కువ సమయం గడుపుతున్న కారణంగా ఆమె రాకపోకలను ఎవరూ పట్టించుకోరు. ఏ పనిమీద, ఎక్కడకు, ఎందుకు వెళుతున్నదీ ఎవ్వరూ ప్రశ్నించరు. ఆమె ఎప్పుడూ ఏదో ఒక చోటికి వెళుతూనే వుంటుంది.

జమిందారు కుటుంబరావు ఆదేశాలను పాటించి ఆమె పశ్చాత్తాప పడుతుంది అయినా మరల మరల పాటిస్తూనే వుంటుంది. జమిందారు ప్రభావం ఆమెపై ఎంతగా వుందంటే, తరచు తాను చెయ్యకూడదని అనుకున్న పనులు, తన కేమాత్రం యిష్టంలేని పనులు అతని ఆదేశంపై చేస్తూ వుంటుంది. నిజమే చెప్పాలి అని ఆమె వ్రతం పుచ్చుకోలేదు కాని అబద్ధం చెప్పటం ఆమెకిష్టం వుండదు. కాని జమిందారు కారణంగా ఆమె తరచు అబద్ధాలు చెప్పవలసి వస్తుంది.

పదమూడు మైళ్ళ దూరంలో వున్న రైల్వేస్టేషన్‌కు ఆమె జమిందారు పంపిన పాతకారులోనే వెళ్ళింది. అక్కడ వీరాస్వామి ఆమెకోసం ఎదురు చూస్తూ వున్నాడు. ఎప్పుడూ ఆమెకీ విధమైన ఏర్పాట్లే జరుగుతూ వుంటాయి. ఆమె ఎక్కిన రైలు కదలగానే, ఎవరికీ తెలియని విధంగా జమిందారుకు సమాచారం తెలియచేయబడుతుంది.

రైలులో అన్నపూర్ణకు మొదటి తరగతి కూపే రిజర్వు చేయబడింది.

రైలు బయలుదేరే స్టేషన్‌లోనే సాధారణంగా ఏ రోజుకు ఆ రోజు బెర్తు దొరకటం కష్టమయితే ఈ జమిందారులకు మధ్యస్టేషన్లో కూపేలు ఏ విధంగా దొరుకుతాయో అన్నపూర్ణ కర్థం కాదు. అన్నపూర్ణ తెలిసిన వారెవరైనా వుంటారేమోనని భయపడుతూ భయపడుతూ తనకు రిజర్వు చేసిన కూపేలోకి వెళ్ళి లోపలనుండి తలుపు వేసుకుంది.

ఆమె ఒంటరిగా వున్నప్పుడు, అందులోనూ నిదురపట్టనపుడు ఆమెకు తన గత జీవితపు వివిధ సంఘటనలు కళ్ళముందు మెదులుతూ వుంటాయి. గత సంఘటనలే కాకుండా ప్రస్తుతం తానేదో తప్పు చేస్తున్నానన్న భావన ఆమెను పీడించసాగింది. తన తండ్రి తనను ఇంటిలోనుండి గెంటివేస్తున్నట్లు, తల్లి ముంద

లిస్తున్నట్లు అనేక ఊహలు ఆమె మదిలో కదలసాగాయి. రకరకాల శక్తులు తనను పీకిస్తున్న అనుభూతిని ఆమె పొందసాగింది.

'నాకు తెలుసు నే నెందుకు వెళుతున్నానో! అక్కడ నే నేం చేస్తానో, నా చేత ఏమి చేయించబడుతుందో నాకు తెలుసు. అది అనుచితం. పాపం. ఘోరమైన తప్పు. అయితే ఈ తప్పు కొన్నివేల మంది లాభం కోసం చేస్తున్నాను. అందుచేత ఇది పాపం కాదు, పుణ్యమే. నా వ్యక్తిగతపాపం కొన్నివేల మందికి ప్రయోజనకారి అయితే అది పాపం కాదు. అయినా అదే మొదటిసారి కాదు కదా? చూడవలసింది కూడా సాధనాన్నికాదు కదా! ఉద్దేశ్యాన్నే కదా!' ఆమె తనను తాను సమర్థించుకుంటూ అంతరాత్మను నిద్రబుచ్చింది.

ఆమె నిద్ర లేచేసరికి రైలు మద్రాసు సమీపించసాగింది. ఆమె బట్టలు సవరించుకుని, సామాను సర్దుకుంది. ఇంతలో రైలు మద్రాసు స్టేషన్‌లో ఆగింది.

జమిందారు పంపిన నౌకరు స్టేషన్ బయట తన కోసం ఎదురు చూస్తుంటాడని ఆమెకు తెలుసు. ఆమె బండిదిగి స్టేషన్ బయటకు వెళ్ళింది. ఆమె బయటకు రాగానే జమిందారు పంపిన నౌకరు కారు తీసుకుని ఆమె దగ్గరకు వచ్చాడు. ఆమెను కారులో ఎక్కించుకుని హోటల్‌కు తీసుకుని వెళ్ళాడు. హోటల్‌లో ఆమెకు గది ముందే రిజర్వు చేయబడి వుంది.

ఆ హోటల్ నగరం మొత్తం మీద విలాసవంతమైనది. ఖర్చు కూడా చాలా ఎక్కువ. పాశ్చాత్య పద్ధతులతో నిండివున్న ఆ హోటల్‌లో అన్నపూర్ణ తన ఖర్చుతో ఒకపూట కూడా భోజనం చెయ్యలేదు, వుండటం సంగతి సరేసరి. క్రిందటిసారి ఆమె ఆ హోటల్‌లో దిగినప్పుడు ఉక్కిరి బిక్కిరి అయ్యింది. ఆమెకు అక్కడి భోజనం కాని, నౌకర్లు గాని, విలాసవంతమైన ఫర్నిచర్ కాని నచ్చలేదు. అవన్నీ ఆమెకు అలవాటు లేదు.

జమిందారు ఎన్ ఆర్.వి. కుటుంబరావు సాయంత్రం అయ్యేవరకు అక్కడకు రారని, తాను ఆయన ఇంటికి ఫోన్ చెయ్యకూడదని అన్నపూర్ణకు తెలుసు.

సహజంగా పిసినారి అయిన జమిందారు కుటుంబరావు ఇంత ఖరీదయిన హోటల్‌లో ఉంచటానికి కారణం అతని ఉదారత కాదు, కేవలం తన జమిందారీ గొప్పతనాన్ని ప్రదర్శించటానికే. జమిందారు తన కారు క్లబ్‌లో వదలిపెట్టి హోటల్‌కు టాక్సిలో వస్తాడని ఆమెకు తెలుసు. జమిందారు భయం భయంగా వ్యవహరించే ఈ తీరు అన్నపూర్ణకు నవ్వు పుట్టిస్తుంది. ఆయన పూర్వీకులు బహిరంగంగానే విలాసవంతమైన జీవితం గడుపుతూ వుండేవారు. అన్నపూర్ణకు ఆ హోటల్ వాతావరణం ఉక్కిరి బిక్కిరిగా వుంది. ఆమె టిఫిన్ తీసుకుని బజారుకు వెళ్ళింది.

# 9

యస్.ఆర్.వి. కుటుంబరావు గుంపుల్లో వున్నా ప్రత్యేకంగా కనబడుతూ టాడు. నిండైన విగ్రహం, తెల్లని రంగు, పెద్ద పెద్ద కళ్ళు, గిరజాలజుట్టు ... ధీరంగా, ఆకర్షణీయంగా మరొక్కసారి చూడాలనిపించే విధంగా వుంటాడు.

ఆయన హోటల్ లాంజ్‌లో నడుస్తుంటే అక్కడ వున్నవారి కళ్ళన్నీ పునపైనే కేంద్రీకరించబడ్డాయి. ఆయన వెంట ఒక తెల్లని వ్యక్తి మరొక న్నారు. సాధారణంగా జమిందారు అన్నపూర్ణను కలవటానికి ఒంటరిగానే ఎంటాడు. ప్రక్క ద్వారంగుండా వచ్చి, ఎవరూ చూడకుండా వెళ్ళిపోతుంటాడు. విధంగా అందరూ చూస్తుండగా ఎప్పుడూ రాడు.

ఆయన ఎప్పటిమాదిరిగా అన్నపూర్ణ గదిలోకి వెళ్ళకుండా ఆ అంతస్థులో పటవున్న విజిటర్స్ లాంజ్‌లో కూర్చుని అన్నపూర్ణ కోసం కబురు పెట్టాడు. న్నపూర్ణకు ఆయనను ఈ విధంగా కలవటమే యిష్టమైనప్పటికీ, జమిందారు త్తగా ఈ విధంగా ఎందుకు చేస్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు.

అన్నపూర్ణ లాంజ్‌లోకి రాగానే జమిందారు, ఆయన సహచరుడు ఇద్దరూ ఆమెకు నమస్కారం చేసారు. తన తండ్రి యజమాని తనపట్ల వ్యవహరిస్తున్న గౌరవనీయమైన తీరు అన్నపూర్ణను ఆశ్చర్యంలో ముంచివేసింది. ఆమె తన చర్యాన్ని కనపడనీయకుండా ప్రత్యభివాదం చేసింది.

"ఈయన నా స్నేహితుడు. పేరు రైట్. ఇంజనీర్ అయినప్పటికీ కాంట్రా ం చేస్తుంటాడు. మద్రాసులోనే నివాసమయినా దేశవ్యాప్తంగా పనులు చేస్తూం ను. బహుశా ఈయనను మీరు చూసి వుండవచ్చు. వీరు శ్రీమతి అన్నపూర్ణ. శాసన సభ్యురాలు." జమిందారు కుటుంబరావు వారిద్దరినీ పరస్పరం పరి పం చేసాడు.

"మీ పేరు విన్నాను. అయితే ప్రత్యక్షంగా చూడటం ఇదే ప్రథమం. మ్మలను కలవటం చాలా సంతోషం." రైట్ వినయంగా అన్నాడు. అయితే వినయంలోని కృత్రిమతను అన్నపూర్ణ పసిగట్టింది.

"ఇప్పటిదాకా ఏం చేశారు?" జమిందారు కొంచెం సేపు మౌనం తర్వాత అన్నపూర్ణను ప్రశ్నించాడు.

"సాధారణంగా స్త్రీలు ఏంచేస్తూ వుంటారో అదే చేస్తూవున్నాను. చెప్పండి ఏంచేసి వుంటానంటారో?" అన్నపూర్ణ సమాధానం చెపుతూనే సంభాషణ పొడిగించింది. అన్నపూర్ణ చాలా ఆకర్షణీయంగా వుంది. చిరునవ్వులు చిందిస్తూ, తన కలవరపాటును, ఆశ్చర్యాన్ని కప్పివేసింది.

"బహుశా చీరలు కొనివుంటారు? కొన్నారా?" రైట్ తల ఊపుతూ అన్నాడు.

"అవును, కొన్నాను."

జమిందారు కొంచెం అసహనంగా కూర్చున్నాడు. గుప్పిళ్ళు మూస్తూ, తెరుస్తూ ఏదో కూడికలు వేస్తున్నట్లు కూర్చున్నాడు. వారిద్దరి సంభాషణ పూర్తి కాగానే అన్యమనస్కంగా ప్రశ్నించాడు- "మీ సంభాషణ పూర్తయ్యిందా."

రైట్, అన్నపూర్ణ ఇద్దరూ చిరునవ్వుతో తల లూపారు.

"నే నిక్కడకు రెండు సార్లు ఫోను చేసాను. సమాధానం లేదు. బహుశా మీరు సినిమాకు వెళ్ళారనుకున్నాను." అన్నపూర్ణతో అన్నాడు జమిందారు.

"లేదు. ఒంటరిగా సినిమాకు వెళ్ళేంత ఆధునికురాలను కాదు నేను."

"అవును సినిమానుగాని, విస్కీనిగాని ఒంటరిగా ఆనందించలేము." రైట్ మాట కలిపాడు. పరిచయం పెరుగుతున్నకొలదీ మర్యాదలు పలచబడతాయి. ఏమైనా రైట్ మాటలలో మర్యాద లోపించసాగింది

"మిష్టర్ రైట్! ఇహ అసలు వ్యవహారానికి వస్తే మంచిదేమో! మనం అన్నపూర్ణగారి సమయం వృధా చేయటం మంచిది కాదు. ఆమెకు రేపు చాలా పని వున్నది. అన్నపూర్ణగారూ! మిష్టర్ రైట్ కంపెనీవారు మన గ్రామంలో వరద బాధితుల సహాయార్థం 5 వేల రూపాయలు విరాళ మివ్వటానికి నిశ్చయించుకున్నారు."

"చాలా గొప్ప విషయం. గ్రామస్థుల తరపున నేను కృతజ్ఞతలు తెలియ చేసుకుంటున్నాను. మేం నిజంగా మీకు ఋణపడి వున్నాం."

"మీరు భోజనం చేశారా?" జమిందారు ప్రశ్నించాడు.

"లేదు. నాకిక్కడి భోజనం సహించదు. వేరే హోటల్‌లో ఏదో తిన్నాను. మీరు తప్పక భోజనం చెయ్యాలి." అన్నపూర్ణ వారిని భోజనానికి ఆహ్వానించింది.

"మిష్టర్ రైట్ భోజనం చేసారు. నేను చెయ్యలేదు చెయ్యాలనిపించటం లేదు. భోజనం సంగతి వదలి వెయ్యండి. విషయాలు మాట్లాడుకుందాం."

"మీ యిష్టం "

"స్కూల్ భవనం కట్టించడానికి మీరు చేస్తున్న ప్రయత్నాలు నాకు నచ్చ లేదు. ఆ విధంగా అయితే పని సాగదు. స్కూలు ఎక్కడో గుడిసెలలో వుంది. ఒక ప్రణాళిక కూడా లేదు."

"మమ్మల్ని ఏం చేయమంటారు?"

"నేను ఈ విషయంలో ఆలస్యంగా మేల్కొన్నట్లున్నాను. ముందే శ్రద్ధ తీసుకుని వుండవలసింది. మా గ్రామం. స్కూలు భవనం నేనే కట్టించవలసింది. నేను నా బాధ్యతలను పూర్తి చేద్దామనుకుంటున్నాను."

"చాలా సంతోషం. అయితే గ్రామం పట్ల, మన ప్రాంతం పట్ల మీ శ్రద్ధ స్కూలు భవనంతోనే ఆగిపోకూడదు. మీరు మా తరపున నా బదులుగా అసెంబ్లీకి వెళ్ళాలని మా ఆకాంక్ష." జమిందారు ఉదారత వెనక వున్న వుద్దేశాన్ని తెలుసు కోవాలని అన్నపూర్ణ ప్రయత్నం.

"అబ్బేబ్బే! నాకు రాజకీయాలపట్ల పెద్ద ఆసక్తిలేదు. జీవితాన్ని చాలా వరకు చవి చూసాను. మా జమిందార్ల రోజులు పోయాయి. అయినా నేను ఎం.ఎల్.ఏ. అయ్యాననుకోండి. ఏమిటి ఫలితం? ఈ ప్రజాస్వామ్యవాదులు మమ్మ లను ఒక ప్రక్కకు నెట్టేస్తారు. ఆ విషయం వదిలివెయ్యండి" జమిందారు సిగరెట్ విదిలించాడు.

"అవును, మీరు చెప్పింది నిజం." రైట్ వంత పాడాడు.

"నా మనస్సులోని ఆలోచనలనే నేను మీకు చెపుతున్నాను. ఒకటి చెపుదా మని మరొకటి చెపుతున్నాను. స్కూలు నిర్మాణం చేపట్టమని నేను రైట్‌కు చెప్పాను. వీలయినంత త్వరగా, వర్షాలు పడకముందే నిర్మాణం పూర్తి చెయ్యమని చెప్పాను." సిగిరెట్ పొగ వదులుతూ చెప్పాడు జమిందారు.

"మీకు కృతజ్ఞతలు ఎలా తెలియచెయ్యాలో నాకర్థం కావటంలేదు." అన్నపూర్ణ ఆనందంతో, ఆశ్చర్యంతో తలమునకలవుతున్నది.

"రైట్‌కు, ఆయన కంపెనీకి నిర్మాణపు పనులలో చాలాఅనుభవం వుంది. పైగా వీరి మనుష్యులు మన ప్రాంతంలో పనులు కూడా చేస్తున్నారు. నదిమీద డామ్ కట్టింది కూడా వీరే కదా! దురదృష్టవశాత్తూ అది కూలిపోయిందనుకోండి. దానికి వీరేం చేస్తారు? స్కూలు భవనం నిర్మాణంలో ఎటువంటి ఇబ్బందులు వుండవులెండి!" జమిందారు చెప్పాడు.

"ఎప్పుడూ అదే విధంగా అవ్వదులెండి. డామ్ పగిలిపోవటం, అందునా మా తాలూకాలో అవ్వటం నాకు చాలా సిగ్గుగా, బాధగా వుంది. డామ్ ప్లాను శాంక్షన్ అయిన తర్వాత, పని మీకు అప్పగించగానే నేను నిశ్చింతగా వున్నాను. కనీసం మిమ్మలను ఒక్కసారి కూడా కలవలేదు!" అన్నపూర్ణ రైట్ వైపు తిరిగింది.

"అవును, చెప్పటం మరిచాను. డామ్ రిపేర్ చెయ్యవచ్చునని రైట్ చెపుతున్నాడు. ఎక్కువ కాలం కూడా పట్టదట. ఆయన పెద్ద ఇంజనీరన్న సంగతి మీకు తెలుసుకదా!"

"డామ్ రిపేర్ ఎంత త్వరగా చేయిస్తే అంత మంచిది. వర్షాకాలం వస్తే పక్కాగా వున్న కట్టలు కూడా జారిపోతాయి. తిరిగి మొత్తం పనంతా చేయవలసి వుంటుంది. అంతా టైమ్ మీదే ఆధారపడివుంది." రైట్ ముందుకు వంగి టిపాయ్ మీద చేతులు వుంచుతూ అన్నాడు.

"దర్యాప్తు జరుగుతూ వుంటుంది. మరమ్మత్తు పని మాత్రం ఆగకుండా జరగాలని మా కోరిక." జమిందారు కంఠంలో దర్పం కనిపించింది.

"అవును, అట్లా అయితేనే బాగుంటుంది." మరమ్మత్తులు ప్రారంభించే అధికారం తనకు లేదన్నట్లు చెప్పింది అన్నపూర్ణ.

"డామ్ నిర్మాణంలో మా పని మేము పూర్తి చేసాం. గవర్నమెంటు ఇంజనీర్లు తనిఖీ చేసి సర్టిఫికేట్ కూడా యిచ్చారు. తర్వాత డామ్ కూలినా, కూల్చబడినా బాధ్యత మాది కాదు. మాకు రావలసిన మొత్తం మాకు వచ్చేస్తే మరమ్మత్తులు ప్రారంభించవచ్చు. మీరు తల్చుకుంటే మా డబ్బు మాకు యిప్పించగలరు. మాకు ఈ మాత్రం సహాయం చెయ్యండి."

"మరమ్మత్తులు ప్రారంభించటం ఎంత ముఖ్యమో నాకు తెలుసు."

"ఈ విషయమే మీ దృష్టికి తీసుకురావటానికి మేము వచ్చాం." రైట్ చెప్పాడు.

"మరచిపోయాను. మీ ప్రయాణం ఎలా జరిగింది? కొంచెం విశ్రాంతి తీసుకోండి." జమిందారు అన్నపూర్ణతో అన్నాడు.

"బాగానే జరిగింది. కృతజ్ఞతలు."

"రేపు కలుద్దాం. మరల మాట్లాడుకోవచ్చు."

"గుడ్‌నైట్!" రైట్ అన్నపూర్ణతో అన్నాడు.

అన్నపూర్ణ చేతులు జోడించి వారి వద్ద శెలవు తీసుకుంది. జమిందారు, రైట్ కలసి కారు వద్దకు వెళుతూ వుండగా 'ఇందుకోసమేనా తనను మద్రాసు పిలిపించింది!' అనుకుంది అన్నపూర్ణ. 'జమిందారుగారు మారిపోయారా?. మారిపోతే బాగుండును. అయితే ఎంతవరకు?' ఆలోచిస్తూ, ఆలోచిస్తూ అన్నపూర్ణ తన గదిలోకి వెళ్ళిపోయింది.

# 10

పాత విషయాలు మననం చేసుకుంటూ అన్నపూర్ణ బీచ్ వద్దకు వచ్చింది. బీచ్‌లో నుంచుని ప్రెసిడెన్సీకాలేజీ వైపునుండి తాను చదివిన కాలేజీ వైపు చూడసాగింది. ఎత్తుగా పెరిగిన అశోక వృక్షాలు మూడంతస్థుల తమ కాలేజి భవనాన్ని కనుమరుగు చేసాయి. ఆమె అక్కడ నాలుగు సంవత్సరాలు గడిపింది. కేవలం జ్ఞాపకాలుగా మిగిలిన కాలం. మనస్సులోనే నవ్వుకుంది. బీచ్‌కి వచ్చే ఆడ పిల్లల వైపు ఆశగా చూసే మొగపిల్లల చూపులు ఆమెకు గుర్తుకు రాసాగాయి. వాళ్ళందరూ ఎక్కడ? ఎక్కడ తోటి విద్యార్థినులు? ఎవరూ ఎవరికీ కనీసం ఉత్తరాలు కూడా వ్రాసుకోవటం లేదు. మనం ఒక పంజరం నిర్మించుకుంటాం. దానినే ఇల్లు అనుకుంటాం, దానిలోనుండి బయటకు రావటానికి ఇష్టపడం.

యస్. ఆర్. వి కుటుంబరావు, రాజగోపాలరావు పుణ్యమా అని తన చదువు పూర్తయ్యింది. ఈ దేశంలో చదువు రావటం పెద్ద అదృష్టం. మంచి చదువుకు ప్రతిఫలంగా వినియోగించలేని శీలం ఎందుకు? ఏమీ లేని పేదమ్మాయి దగ్గర శీలం కంటే ముఖ్యమైనది ఏముంటుంది? పశ్చాత్తాపం లేదు. బాధలేదు.

'నిన్ను నువ్వు శపించుకోవటానికి బీచ్‌కు రాలేదు.' అన్నపూర్ణ మనస్సు మూలిగింది.

కుటుంబరావు ధనవంతుడయిన కారణంగా ఉదారుడు కావచ్చు. రాజ గోపాలరావు వంటి రెక్కాడితేనే డొక్కాడని మధ్యతరగతి రైతు కూడా తన చదువుకు సహాయం చేసాడు. కేవలం తనను ప్రోత్సహించటానికే రాజగోపాల రావు ధన సహాయం చేసాడు అప్పట్లో తనపట్ల ఆయనకు వేరే ఉద్దేశ్యమే లేదు. కాని జమిందారు కుటుంబరావు వుద్దేశ్యమే వేరు. ఆయన సహాయం చేసాడు. దానికి తగ్గ మూల్యం వెంటనే వసూలు చేసుకున్నాడు. తాను అంతకంటే ఏం చేయగలదు? దేని నుంచి దూరంగా తాను పారిపోవాలనుకుంటుందో, అటువైపే పదే పదే లాగబడుతున్నది.

అన్నపూర్ణ తన జాతి మొత్తంలో ఒకే గ్రాడ్యుయేట్. ఆమె చదువు ఆలస్యంగా ప్రారంభించింది. ఎక్కడా తప్పకుండా వచ్చింది. ఎన్నో బహు

మతులు పొందింది. చదువు పూర్తయిన తర్వాత ఖాళీగా కూర్చోవటం దేశద్రోహ మని భావించి, కనీసం తన గ్రామానికయినా సేవ చేద్దామని రాజకీయాలలో దిగింది. కాని తానేమి పొందింది? ఏదైనా పొందినా దానికి రెట్టింపు కోల్పోయింది. పొంగి వచ్చే ఆలోచనలను కట్టిపెట్టి అన్నపూర్ణ తమ కాలేజీ వైపు చూడ సాగింది.

గాలికి ఎగురుతున్న చీర సవరించుకుని బీచ్ రోడ్డు వైపు నడవ సాగింది. ఏదైనా శిఖరాగ్రం పైకి చేరుకున్నప్పుడు, ముందు అధిష్టించ వలసిన శిఖరాలు లేనప్పుడు, ఒక్కసారి వెనుకకు తిరిగి చూసుకుంటే ఎవరికైనా ఆనందం కలుగు తుంది. శిఖరాల సమున్నతను చూచి భయపడి కొండలపై, గుట్టలపై ఆగిపోవటం విజ్ఞత అనిపించుకోదు. ఇంకా నేను అధిష్ఠించవలసిన శిఖరాలు చాలా ఉన్నాయి. నా లక్ష్యం, గమ్యం ఇంకా ఎంతో వుంది. అన్నపూర్ణ తనను తాను సంబాళించు కుంటూ ముందుకు నడవసాగింది.

ఇక్కడ 'లవర్స్ కార్నర్' వుండేది. ప్రస్తుతం లేదు. ఇప్పుడు నిజమైన ప్రేమికులు కూడా తక్కువై పోయారు. ప్రేమ ప్రస్తుతం కార్లలో సాగుతుంది. సిద్ధంగా వున్న పడక గదులలో ఫలిస్తూంది. అంతా కృత్రిమమే అయిపోయింది. స్మృతులు, వాస్తవ జీవితపు పరిస్థితులు మిర్చిమసాలా లాగా అన్నపూర్ణ మదికి తోచసాగాయి.

కుటుంబరావు కూడా చదువు నెపంతో మద్రాసులోనే వుండేవాడు. చండ శాసనుడైన తండ్రిగారి బారినుండి తప్పుకోవటానికే ఆయన మద్రాసులో మకాం పెట్టాడన్నది వాస్తవం.

'ఆయన నన్ను ప్రేమించారో లేదో నాకు తెలవదు కాని, తరచు నాపట్ల యిష్టాన్ని ప్రకటించటానికి ఇక్కడకు తీసుకువస్తూ వుండేవారు. ఇతరులకు దూరంగా వుండాలని ఆయన ఉద్దేశ్యం.

'నేనెప్పుడు ఎట్లా వుండే దానిని! వయస్సు నాపై దాడి చేసినట్లుంది. అంతేనా లేక రాజకీయ జీవితపు వత్తిళ్ళు నా సౌందర్యాన్ని హరించాయా? ఏమో తెలియదు. పరిస్థితులు మారాయి. పరిసరాలూ మారాయి. కాని నా మనస్సు మాత్రం మొత్తం మీద పెద్దగా మారలేదు.'

ఆమె రోడ్డుమీదకు వచ్చి తన కోసం వేచివున్న టాక్సీలో ఎక్కింది. టాక్సీ ఎక్కగానే ఆమె తన ఆలోచనలను నియంత్రణకు తెచ్చుకున్నది. 'ఇప్పుడు నేనేం చెయ్యాలి? ఎక్కడకు వెళ్ళాలి? ఇవ్వాళ ఆదివారం. కొట్లన్నీ మూసివేసి వున్నాయి!'

ఆమె హోటల్‌లోని తన గదివద్దకు వచ్చేసరికి జమిందారు కుటుంబరావు వరండాలో పచార్లు చేస్తూ ఆమె కోసం వేచివున్నాడు.

"మీ రిక్కడకు వచ్చి చాలా సేపయ్యిందా?" అన్నపూర్ణ గౌరవంగా అడిగింది.

"లేదు. నువ్వెక్కడకు వెళ్ళావు?"

"నేను బీచ్‌కు వెళ్ళాను. పాత జ్ఞాపకాలు లాక్కువెళ్లాయి."

"ఆ జ్ఞాపకాలలో నేనూ వున్నానా? ఇప్పుడు అక్కడకు తీసుకువెళ్ళటం సంభవం కాదు. నేను తీసుకు వెళ్ళగలనా?" జమిందారు గొంతులో ఆర్ద్రత ధ్వనించింది. ఆ ఆర్ద్రతను ఉపశమింపచేసే స్త్రీత్వం అన్నపూర్ణలో ఇంకా మిగిలి వుంది.

గదిలో అడుగు పెట్టాగానే కుటుంబరావు ఆమెను కౌగిలిలోనికి తీసుకున్నాడు ఆమె ఎఱ్ఱని పెదవులను తమకంతో ముద్దాడసాగాడు. ఆమె కళ్ళపైన, ముక్కుమీద ముద్దులు కురిపించసాగాడు. అన్నపూర్ణ ఏవిధమైన అభ్యంతరం చెప్పలేదు. రాత్రంతా కుటుంబరావు అన్నపూర్ణ స్మృతులతోనే గడిపినట్లున్నాడు.

"మీరు నిన్న రాత్రి ఇక్కడే వుండిపోతారనుకున్నాను!"

"ఆ రైట్‌గాడు వదలలేదు. పైగా నేను వాడికి సహాయ పడుతున్నట్లు కనపడాలి కదా!

"అన్నపూర్ణా! ఒక్కసారి నిలబడు. మనసుతీరా నిన్ను చూడాలి. నీ కౌగిలిలో సేదదీరి ఎన్నినాళ్ళయ్యింది? నువ్వేం మారలేదు. నీ మనస్సు, శరీరం రెండూ మారలేదు. చల్లనివేపీ త్వరగా చెడిపోవు. నీ అందం పెరిగినట్లుంది." జమిందారు కుటుంబరావు గొంతులో ప్రేమమైకం తొంగి చూస్తున్నది.

"మారకపోతే నేను స్త్రీ నెట్లా అవుతాను?"

"లేదు లేదు. అప్పుడు నువ్వు మొగ్గవు, ఇప్పుడు వికసించిన కుసుమానివి."

"కుసుమించిన తర్వాత రాలిపోవటమేగా!"

"లేదు. నువ్వు ఎప్పుడూ కుసుమించే వుంటావు." జమిందారు తిరిగి ఆమెను ముద్దులతో ముంచసాగాడు. తదుపరి మంచం చివర కూర్చుని ఒకరి నొకరు చూసుకోసాగారు

"నువ్వు బ్రేక్ ఫాస్టు చేసావా? ముందు బ్రేక్ ఫాస్టు చెయ్యి!"

"మీరు కూడా తీసుకుంటే!"

"తీసుకుంటాను. ఆర్డరివ్వు. ఆ ఆకలి కూడా తీరాలి కదా!"

అన్నపూర్ణ ఫోనులో బ్రేక్ ఫాస్టు ఆర్డరిచ్చింది. సప్లయిర్ త్వరగానే పదార్థాలు తీసుకువచ్చాడు. టిఫిన్ చేస్తూ వుండగా మాటలు వేరే విషయం వైపు మళ్ళాయి జమిందారు అన్నపూర్ణ వైపు చూస్తూ చెప్పసాగాడు: "ఆనకట్ట మరమ్మతులు త్వరతోనే పూర్తవుతాయి. ఈ విషయం గురించి నీతో మాట్లాడాలో, మాట్లడగూడదో నాకు తెలియదు. అయినా విషయం వచ్చింది కనుక చెపుతున్నాను. నీరు ఎక్కువగా నదిలోకే వదిలితే, కాలువ త్రవ్విన తర్వాత అందులోనికి వదలవచ్చు. నేను కాలవ త్రవ్వకానికి కాంట్రాక్టు తీసుకుందామనుకుంటున్నాను. అది వస్తుందో రాదో!"

"మీకే రావచ్చునేమో! ఎవరు చెప్పగలరు?" అన్నపూర్ణ.

"నాకు వస్తే బాగుంటుంది. ఆ కాలవ ద్వారా నీరు ప్రవహిస్తే ఆ తాలూకా సస్యశ్యామలా మవుతుంది. కావలిసినంత ధాన్యం పండించవచ్చు. కాని ధాన్యం వ్యాపారపంట కాదు. పని తక్కువే, రేటూ తక్కువే. మన ప్రాంతంలో చెఱకు పండిస్తే లాభం బాగా వుంటుంది. నేను పంచదార కర్మాగారం కట్టిస్తాను. చాలా మందికి పని దొరుకుతుంది. మన వాళ్ళందరకూ మేలు చెయ్యాలని, లాభం చేకూర్చాలని నా ఉద్దేశ్యం. మీ ఆయన విషయంలో కూడా నేను నీ కిచ్చిన వాగ్దానం మర్చిపోలేదు."

"మీ దయ."

"నేను పంచదార ఫ్యాక్టరీ గురించి పని మొదలు పెట్టగానే నీ మిత్రుడు రాజగోపాలరావు సహకార చక్కెర ఫ్యాక్టరీ నెలకొల్పాలని నినాదాలు చేయిస్తాడు. అది రాకపోగా, మనం కట్టేది చెడిపోతుంది. అదీ రాదు, ఇదీ కాదు. ప్రజల బ్రతుకులు బాగుపడవు. ధాన్యం, కూరగాయలు పండించటానికే నీరంతా వృధా అయిపోతుంది. అర్థమయ్యిందా?"

"ఆ! ఆ!"

"రాజగోపాలరావును దారిమళ్ళించే శక్తి నీ కొక్కదానికే వుంది. అంతే కాదు, దారి చూపించ వలసిన బాధ్యత కూడా నీదే. ప్రజలను మన ఫ్యాక్టరీపట్ల సుముఖులను చెయ్యవలసింది నువ్వే. పైగా నువ్వు వారి ప్రతినిధివి. నేను మన ప్రజలకు చాలా చెయ్యాలనుకుంటున్నాను. మా పూర్వీకులు చెయ్యనివి, చేయలేక వదిలినవి అన్నీ పూర్తి చెయ్యదలచుకున్నాను." జమిందారు సిగిరెట్ వెలిగించాడు. ఈ మాటల వెనుక వున్న అంతరార్థం తెలుసుకోలేనంత అమాయకురాలు కాదు అన్నపూర్ణ. ఆమె మెదలకుండా టిఫిన్ ట్రే ప్రక్కనపెట్టింది.

జమిందారు ఆమె ప్రక్కకు జరిగాడు. ఆతని చేతులు ఆమె శరీరంపై తమ పని చేసుకుపోతున్నాయి! "చెప్పటం మరిచాను. మన గ్రామంలోని వరద బాధితుల కోసం క్లబ్బులో స్నేహితులవద్ద పదివేల రూపాయలు వసూలు చేసాను. నువ్వు రెండు చేతులనిండా డబ్బు తీసుకు వెళ్ళవచ్చు. రాత్రి మెయిల్‌తో నీకు టిక్కట్టు రిజర్వు చేయించాను!"

అన్నపూర్ణ సమాధానం చెప్పలేదు. ఆమె శరీరం జమిందారు చేతల కను గుణంగా మసలుకోసాగింది.

# 11

వరదవల్ల అన్నపూర్ణ ఉంటున్న గ్రామానికి చాలా నష్టం జరిగింది. దిగువున నదీపరీవాహక ప్రాంతంలోని మరికొన్ని గ్రామాలు కూడా ఈ వరద వల్ల నష్టపోయాయి పొలాలు నాశనం అయ్యాయి. పెద్దయెత్తున పంటలకు నష్టం జరిగింది. సహాయ కార్యక్రమాలు మొదలుపెట్టకముందే రాజుగోపాలరావు ఈ నష్టాన్ని అంచనా వేసేడు.

అసెంబ్లీలో ఈ విషయమై చర్చ జరిగింది. వరద బాధితులకు వీలైనంత త్వరగా అవసరమైన సహాయాన్ని అందించవలసిందిగా జిల్లా అధికారులకు ఆదేశాలు పంపబడ్డాయి మందులతో, అవసరమైన సాధన సంపత్తితో వైద్యులను వరద బాధిత ప్రాంతాలకు పంపుతున్నట్లు పత్రికలలో వార్తలు వెలువడ్డాయి. కాని రాజగోపాలరావుకు వాళ్ళు ఎక్కడా కనబడలేదు. పోలీసు జీపులు మాత్రం అక్కడక్కడ హడావుడిగా తిరుగుతూ కనిపించాయి.

ఈ వరద సంఘటనపై ముఖ్యమంత్రి ఒక దర్యాప్తు సంఘాన్ని నియమించారు. శ్రీమతి అన్నపూర్ణ ఆ సంఘానికి అధ్యక్షురాలుగా నియమించబడింది. ఆనకట్ట మరమ్మత్తు గురించి ఒక్క మాట కూడా చెప్పబడలేదు. ఇది 'విద్రోహ చర్య' అన్న విషయం మాత్రం చాలామంది వ్యక్తం చేసారు.

ఈ సంఘటనకు సంబంధించి నాలుగు, ఐదు రోజులు అలజడిగా చెప్పుకోవడం జరిగింది తరువాత ఎవరికి వారే ఈ సంఘటనను మరచిపోయారు. రాష్ట్రం మొత్తం మీద ప్రతిదినం అనేక సమస్యలు ఉత్పన్నమయ్యే కారణంగా ఈ విషయంపై ఎక్కువ చర్చ జరగడానికి అవకాశం లేకపోయింది: సమస్య 'సర్కారీ రెడ్ టేపిజం'లో చిక్కుకుపోయింది.

రాజగోపాలరావు పొరుగు గ్రామం వెళ్లి అక్కడ పరిస్థితులు చూసి తన సహచరులతోపాటు కాలి నడకన గ్రామానికి తిరిగి వస్తున్నాడు. మిగిలిన పత్రికల్లో ప్రచురింపబడని వరద నష్టాలను గురించి వివరిస్తూ రాజగోపాలరావు పత్రికలకు వార్తలు పంపాడు. ప్రభుత్వ అధికారులు వాటిని పట్టించుకోలేదు. పట్టించుకున్నవారు వాటిని 'అసత్యాలని' తోసివేసారు.

రాజగోపాలరావు బృందం కొండ దగ్గర దేవాలయంవైపు వెళుతూ వుండగా సోమయాజులు వారిని చూడటానికి బయటకు వచ్చాడు. సోమయాజులు రాజగోపాల రావుకు స్నేహితుడు కానప్పటికీ పైకి స్నేహం కనబరుస్తూ ఉంటాడు

గ్రామంలో పలుకుబడి ఉన్నవారితో, పదవులలో ఉన్నవారితో అతను విరోధం కొని తెచ్చుకోడు. అటువంటి వారినందరినీ సంతోష పెట్టడానికి ప్రయత్నిస్తుంటాడు.

"చాలా డబ్బు పోగుచేస్తున్నారట కదా! కొంచెం దేవాలయం మరమ్మత్తు లకుకూడా వినియోగిస్తే బాగుంటుంది." సోమయాజులు రాజగోపాలరావు నుద్దేశించి అన్నాడు.

"ప్రజలు ఆకలితో అల్లాడిపోతుంటే మీ దేవుళ్ళ పొట్టలను నింపవలసిన అవసరం ఏముంది? వాళ్ళెక్కడ ఉంటే అక్కడ బాగానే ఉంటుంది కదా! ఈ దేవుళ్ళు, వారిమీద పడి బ్రతికేవాళ్ళు ఈ దేశాన్ని సర్వనాశనం చేసారు. వరద మీ దేవుడి గుడి దగ్గరకు రాలేదు. అందుచేత నువ్వు డబ్బు అడుక్కోవలసిన పని లేదు." ఇటువంటి విషయాలు వివరించడంలో రాజగోపాలరావు నిర్మొహమాటంగా వ్యవహరిస్తాడు

"జమిందారు గారు కూడా గుడి బాగు చేయించుటకు డబ్బు ఇవ్వటంలేదు. ఇది గ్రామ దేవత గుడి కాబట్టి గ్రామ సౌభాగ్యం కోసం మనమే గుడిని బాగు చేయించుకోవాలి "

"గ్రామమే లేకుంటే దేవత ఎక్కడ ఉంటుంది? పంచాయతీ అధికారం మా చేతికి వస్తే ఈ గుడిలో స్కూలు పెట్టిస్తాం నీ మతాన్ని, నీకూ నీ దేవునికి మధ్యనే ఉంచుకో. అనవసరంగా గ్రామస్తులను ఇందులోనికి లాగవద్దు."

"శ్రీమతి అన్నపూర్ణ గుడి బాగు చేయిస్తాను అని వాగ్దానం చేసింది. ఆమె అయినా కొంత ధనం సేకరించదా?" సోమయాజులు రాజగోపాలరావుని ఉద్దేశించి అన్నాడు. అయితే అన్నపూర్ణ ఇటువంటి వాగ్దానాలు చేయదని రాజగోపాలరావుకు తెలుసు. సోమయాజులు పైకి ఒక విధంగా లోపల మరో విధంగా వ్యవహరించ గలడని అవసరమైతే అబద్ధాలు ఆడడానికి కూడ వెనుకాడడని రాజగోపాలరావుకు తెలుసు.

అన్నపూర్ణ విషయం సోమయాజులు ఎందుకు ప్రస్తావించాడో తెలుసు కనుక రాజగోపాలరావు ఆ మాటలకు చిరునవ్వు నవ్వాడు.

"ఒక్కసారి లోపలకు రండి, మీతో ఒక విషయం చెప్పాలి!" సోమ యాజులు రాజగోపాలరావును గుడిలోపలకు పిలిచాడు మర్యాదకోసం రాజగోపాల రావు గుడిలోపలకు వెళ్ళక తప్పలేదు.

ఏదో రహస్యం చెపుతున్న భంగిమలో సోమయాజులు రాజగోపాలరావును ప్రశ్నించాడు: "అన్నపూర్ణగారు ఇప్పుడు ఎక్కడ ఉన్నారో తెలుసా?"

"ఎక్కడ వుంటే ఏముంది?"

"ఆమె మద్రాసు వెళ్ళటం నేను చూసాను. జమిందారుగారు ఆమెను పిలిపించారు. నేను అటువంటి విషయాలు చెప్పకూడదు, క్షమించండి!"

ఈ విషయం చెప్పగానే రాజగోపాలరావు ఎగిరిపడతాడని సోమయాజుల వుద్దేశ్యం. కాని రాజగోపాలరావు చాలా తాపీగా అన్నాడు: "మంచిది. నీకు యిటువంటి విషయాలు చెప్పవలసిన పని లేదు నీ పని నీవు చూసుకో!"

రాజగోపాలరావు గొంతులో ధ్వనించిన మార్పునుబట్టి తాను వేసిన బాణం వ్యర్థం కాలేదని సోమయాజులు భావించాడు.

రాజగోపాలరావు అన్నపూర్ణ ఇంటి దగ్గరకు వచ్చేసరికి, జమిందారు పాత కారు రోడ్డు ప్రక్కన చెట్టు క్రింద ఆగివున్నది. ఆమెను కలసి వెళదామనుకున్న రాజగోపాలరావు, ఒక్క క్షణం ఆలోచించి అక్కడ ఆగకుండా తిన్నగా తన యింటికి వెళ్ళిపోయాడు. అతని భార్య యింటి వద్ద అతని కోసం ఎదురు చూస్తు వున్నది. భోజనాదులు పూర్తి చేసి నిద్రపోయాడు. రెండు రోజులుగా సరియైన భోజనం, నిద్రలేని కారణంగా అలిసిన శరీరం వెంటనే గాఢనిద్రలోకి వెళ్ళిపోయింది.

తెల్లవారు ఝామున ఐదు గంటలకు నిద్ర లేచిన రాజగోపాలరావు, మెల్లగా నడుచుకుంటూ చెరువు గట్టున వున్న పెద్ద మఱ్ఱి చెట్టు దగ్గరకు చేరాడు సాధారణంగా గ్రామంలోని ప్రజలు పనులు లేనపుడు ఆ చెట్టు దగ్గరకు చేరతారు. కొంత మంది పేక ఆడితే మరికొందరు కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. రేడియో వినటానికి కూడా అక్కడ ప్రజలు చేరసాగారు. చిన్న సభ జరుగుతున్నట్లుగా వాతావరణం ఏర్పడింది. ఇంతలో అన్నపూర్ణ అక్కడికి వచ్చి, అక్కడి సమూహాన్నుద్దేశించి చెప్పసాగింది- "జమిందారుగారు స్కూలుకు కొత్త భవనం నిర్మించటానికి వాగ్దానం చేసారు. త్వరలోనే పని కూడా మొదలుపెట్టబడుతుంది. మనం

దీనికోసం ఒక్క పైసా కూడా ఖర్చు చేయవలసిన పని లేదు. స్కూలు నడవ టానికి కూడా అవసరమైన ఏర్పాటు చేయటానికి ఆయన హామీ యిచ్చారు."

ఆమె ఈ మాటలు చెపుతూ వుండగానే చాలా మంది చప్పట్లు కొట్టారు.

"ఈ గ్రామాన్ని నడిపించడానికూడా ఏమైనా ఏర్పాట్లు చేసారా?" ఒక యువకుడు చెట్టు చాటునుండి అడిగాడు.

ఆ ప్రశ్నలోని వ్యంగ్యం అన్నపూర్ణను తాకింది. ఆమె వెంటనే అతని వైపుకు చూసింది. కాని అతనికి సమాధానం యిస్తే, మాట మాట పెరిగి అల్లరి అయ్యే ప్రమాదం వుంది. ఒకటి రెండు సార్లు ఆ విధంగా జరిగింది కూడా. అందుచేత తననుతాను సంబాళించుకుని అన్నపూర్ణ చెప్పసాగింది- "వరద బాధి తుల సహాయార్థం ఆయన ప్రస్తుతం కొంచెం డబ్బు యిచ్చారు మన గ్రామానికి పెద్ద నష్టం జరగలేదని నాకు తెలుసు, అయినా జరిగిన నష్టాన్ని భరించటానికి జమిందారు సిద్ధంగా వున్నారు అందుచేత నష్టపోయినవారు వివరాలు నాకు వ్రాసి యివ్వండి. మన గ్రామంలో మిగిలిన ధనాన్ని యితరుల సహాయానికి వినియోగించవచ్చు. సుఖంలో, దుఃఖంలో మన మందరం సహజీవులమే?"

జమిందారు ఎంత డబ్బు యిచ్చాడన్న సంగతి వాస్తవంగా అన్నపూర్ణ ఆ సభలో ప్రకటించవలసి వుంది. కాని ఎవ్వరూ అడగనూ లేదు, ఆమె చెప్పనూ లేదు.

ఉపదేశాత్మకంగా తన ప్రసంగాన్ని ముగించిన అన్నపూర్ణ జనం మధ్య నుండి దారి చేసుకుంటూ రాజగోపాలరావు దగ్గరకు వచ్చింది. రాజగోపాలరావుకు నమస్కారం చేయగా అతను ప్రతినమస్కారం చేసాడు. మామూలుగా అతను ఆ విధంగా చేయడు మనసులో ఏదైనా కష్టం వున్నప్పుడు, కోపం వున్నప్పుడు మాత్రమే ఆ విధంగా చేస్తూ వుంటాడు. ఆ సంగతి అన్నపూర్ణకు కూడా తెలుసు. తన పట్ల రాజగోపాలరావు కోపంగా వున్నాడని ఆమె గమనించింది.

ఆమె చిరునవ్వు నవ్వింది. తను జమిందారును కలవటానికి మద్రాసు వెళ్లి నందుకే అతనికి కోపం వచ్చిందని ఆమె అర్థం చేసుకుంది. 'ఫర్వాలేదులే. రాత్రికి ఆ కోపం పోగొట్టవచ్చు'నని మనస్సులోనే అనుకుని అన్నపూర్ణ తన ఇంటికి వెళ్ళి పోయింది.

# 12

యస్.ఆర్.వి. కుటుంబరావు మద్రాసులో అత్యంత ఆధునికమూ విలాసవంతమూ అయిన కాలనీలో ఒక పెద్ద ఇంటిలో అద్దెకు వుంటున్నాడు. మద్రాసులో ఆయన పూర్వీకులు కట్టించిన పెద్ద బంగళా వుండేది. అయితే ప్రస్తుతం వుంటున్న యింటి చుట్టూ తోట వున్నది. యింటిలో తమ పాత స్వంత ఇంటిలో లేని సకల ఆధునిక సౌకర్యాలు వున్నాయి. ఈ యింటికి అద్దె కూడా ఎక్కువే యిస్తున్నాడు. దానివలన ఆయనకు ఇన్‌కమ్ టాక్స్ కూడా కలసి వస్తున్నది.

ఆయన పిల్లలు చదువు కోసం మద్రాసులో కాపురం వుంటున్నానని చెపుతున్నా, అసలు కారణం వేరే వున్నది. ఆయన కొడుకులలో ఒకడు ఇంజనీరు. అతను రసాయనిక ఎరువుల కర్మాగారం నిర్మించే ఉద్దేశ్యంలో వున్నాడు. అతను శిక్షణ కొరకు ఇంగ్లాండు వెళ్ళినపుడు అక్కడ ఆంగ్ల వనితను ప్రేమించాడు. తదుపరి ఆమెను వివాహం కూడా చేసుకున్నాడు. కుటుంబరావుకు కుమారుని వ్యవహారం ఇష్టంలేదు. ఆ కారణంగానే ఇద్దరూ వేరు వేరుగా వుంటున్నారు.

ఆయన రెండవ కుమారుడు కాలేజిలో చదువుతున్నాడు. కుటుంబరావు వాడిని మెడిసిన్ చదివించుదామనుకుంటున్నాడు. కాని వాడికి ఆ కోర్సుపట్ల ఏ మాత్రం ఇంటరెస్ట్ లేదు. బహుశా అందుకేనేమో వాడు ప్రవేశ పరీక్షలో రెండు సార్లు తప్పాడు. వాడికి ఆటలమీద ఎక్కువ అభిరుచి పెద్దవాడి వయస్సు ఇరవై ఎనిమిది, ఇరవై తొమ్మిది సంవత్సరాలు కాగా, చిన్నవాడి వయస్సు ఇరవై సంవత్సరాలు.

జమిందారు కుటుంబరావుకు ముగ్గురు కుమార్తెలు. ముగ్గురికీ వివాహం కాలేదు. అందులో ఒక అమ్మాయి పోలియో కారణంగా నడవలేదు. మిగిలిన ఇద్దరూ ఎప్పుడూ ఇంటిలోనే తల్లివద్దే వుంటూ వుంటారు.

పైకి ఎట్లా వున్నా కుటుంబరావు కుటుంబంలో అంత సఖ్యత లేదు. ఎన్నో కలతలు, కలహాలు మొదలయ్యాయి. పెద్దకొడుకు ఆస్తిలో తన వాటా కోరుతూవుంటే, భార్య ఆడపిల్లల పెండ్లిండ్ల గురించి పోరుతూ వుంటుంది. వీటన్నిటి కారణంగానే కుటుంబరావు తరచు ఇంటికి దూరంగా వుంటూ వుంటాడు.

జమిందారు సమస్యల వలయంలో చిక్కుకుపోయాడు. చాలా ఆర్థిక సమస్యలు అయితే అన్నీ విచిత్రంగా వుంటాయి. కుటుంబరావు చాలా డబ్బు ఆడవాళ్ళకోసం అనవసరంగా ఖర్చుపెడుతూ వుంటాడనీ, అతను పెట్టిన పెట్టుబడులపై ఫలితాలు సక్రమంగా రావటంలేదని ఆయన భార్య అనుమానం. వారసత్వంగా వచ్చిన డబ్బు, నగలు అమ్మగా వచ్చిన డబ్బుతో కుటుంబరావు 'హైర్‌పర్చేజ్' వ్యాపారం ప్రారంభించాడు; ఇంజనీరింగు కాంట్రాక్టు ఫర్మ్ కూడా ఏర్పాటు చేశాడు. జమిందారీ మీద వచ్చేంత ఆదాయం వీటిద్వారా సంపాదించాలని ఆయన తాపత్రయం.

'హైర్‌పర్చేజ్' వ్యాపారం మొదట బాగానే సాగింది. కాని కాలక్రమేణా డబ్బు బయటకు ఇవ్వటమేగాని తిరిగి రావటం జరగలేదు. సెక్యూరిటీలను అమ్మవలసివచ్చింది. ఆ కారణంగా సేల్సుటాక్సు ఊహించనంతగా కట్టవలసివచ్చింది. అంతేకాకుండా రకరకాల టాక్సులు ఒకేసారి చెల్లించవలసి రావటంతో వ్యాపారమే మూసివేయవలసి వచ్చింది.

కాంట్రాక్టు పనులలో ఒకటి రెండింటి కారణంగా కొంచెం లాభం వచ్చినా, చాలా పనులలో నష్టం వచ్చింది. ఈ మధ్యన ఒక వంతెన నిర్మాణం పని కాంట్రాక్టు తీసుకోగా, మొదటిలోనే ఘోరమైన తప్పు జరిగిన కారణంగానే ఈ నష్టాలు వచ్చాయి ఆభిజాత్య వర్గానికి చెందిన భూస్వామి తేలికగా వ్యాపారవేత్త కాలేడు.

ఇన్ని నష్టాలు వచ్చినా భరించగలిగిన ఆస్తి ఉన్నప్పటికీ, ప్రస్తుతం అది క్రమక్రమంగా తరిగిపోసాగింది జమిందారీలో వచ్చిన విధంగా ఆదాయం నిశ్చితంగా రావటంలేదు.

పరిస్థితి ఈ విధంగా వున్నప్పటికీ, సమాజంలో మర్యాదకోసం, తన పలుకుబడి నిలబెట్టుకోవటం కోసం కుటుంబరావు ఆడంబరంగా వుండవలసి వస్తున్నది. అతను చేసిన అప్పులపై వడ్డీలు అసలుకంటే ఎక్కువగా పెరిగిపోతున్నాయి. అయితే అయిన వ్యవహారం చూసేవారు ఎవరూ కూడా ఆయన డబ్బుకోసం ఇబ్బంది పడుతున్నాడంటే నమ్మలేరు. పైగా జమిందారీ రోజులకంటే ఇప్పుడే ఎక్కువ మంచి స్థితిలో వున్నట్లు కనబడాలని కుటుంబరావు ప్రయత్నం చేస్తుంటాడు.

ఆయన చేసిన దానాల సంగతి పత్రికలలో వార్తగా చూసి, ఆయన పెద్ద కొడుకు మండిపడ్డాడు. డబ్బుకొరత కారణంగానే అతను తను నిర్మించుదామను కున్న కర్మాగారం ప్రారంభించలేకపోతున్నాడు. పైగా డబ్బు విషయంలో తండ్రి ఖచ్చితంగా ఏమీ చెప్పటం లేదు. అడిగినప్పుడల్లా వాయిదా వేస్తూ వస్తున్నాడు. ఆ కారణంగా తన తండ్రి చేస్తున్న దాన ధర్మాలు చూస్తుంటే అతనికి ఆగ్రహమే కాకుండా, ఆందోళన కూడ కలుగసాగింది.

కాని వరద బాధితుల సహాయార్థం చేసిన దానం గురించి ఏ విధంగా తండ్రితో తగాదా పడగలడు? పైగా అతనంత మూర్ఖుడు కాదు. కాని తండ్రి తన స్వంత ఖర్చుతో గ్రామంలో స్కూలు భవనం నిర్మించుతానన్న విషయం మాత్రం అతనికి మింగుడు పడటంలేదు. అసలు ఆ గ్రామంలో మన కేమిపని? జమిందారీ పటాటోపం చూపించటానికి కావలసినంత డబ్బు తమ దగ్గర లేదు కదా! ఈ ఆలోచనలతో తండ్రిపై అతనికి ఆగ్రహం పెరిగిపోయింది.

ఈలోగా శ్రీమతి అన్నపూర్ణ మద్రాసు వచ్చినట్లు, ఆమెను తనభర్త పెద్ద హోటల్‌లో వుంచినట్లు రైట్ భార్య ద్వారా కుటుంబరావు భార్యకు తెలిసిపోయింది. ఆమె దృష్టిలో అన్నపూర్ణ కులట, మోసగత్తె, పనివాడి కూతురు. పెద్ద పెద్ద కుటుంబాలను పాడుచేసిన ఆడ పనిమనుషులు ఎందరో వున్నారు. ఆమె దృష్టిలో అన్నపూర్ణ కూడా అటువంటిదే. అయితే ఈ విషయం గురించి ఆమె భర్తతో తగాదా పడతలచుకోలేదు. తగాదా వలన లాభం లేదని ఆమెకు తెలుసు. ఈ విషయం తెలిసిన తర్వాత భర్తతో సరిగా మాట్లాడటం కూడా మానివేసింది.

పెద్దకొడుకు తండ్రి యింటికి వచ్చాడు. ముందుగా తల్లిని కలిసాడు. తండ్రి పట్ల అతని మనస్సులో కించిత్ గౌరవం కూడా మిగలలేదు. ఆస్తిలో తన వాటా ఇచ్చివేయాలని పట్టుపడుతున్నాడు. ఆస్తంతా దానధర్మాల పేరిట అందరికీ కట్టబెట్టే విషయాన్ని వ్యతిరేకించటంలో అతనికి తల్లి మద్దతు కూడా వున్నది.

జమిందారు తన గదిలోనే వున్నాడు. వారిద్దరి మధ్య తండ్రి కొడుకుల కుండవలసిన ఆత్మీయతలేదు. పెద్ద పెద్ద కుటుంబాలలో ప్రతి ఒక్కరూ స్వతం త్రంగా వుండాలనే కోరుకుంటారు. పైగా దానిని గౌరవంగా భావిస్తారు. అయితే పైకి స్నేహంగా వున్నట్లు నటిస్తారు. అయితే వివాహం తర్వాత ఈ తండ్రి కొడుకుల మధ్య కనీసమైన మర్యాద కూడా అంతరించిపోయింది.

"కూర్చోండి. అంతా క్షేమమేనా?" జమిందారు కుర్చీవైపు చూపిస్తూ తన కొడుకుతో అన్నాడు.

"నన్నెంత కాలం పనీ పాటలేకుండా తిరగమంటారు? ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీ నిర్మాణానికి డబ్బు కావాలి. నేను ఆ విషయం మాట్లాడదామనే వచ్చాను."

"మంచిది. కాని ఆ ఫ్యాక్టరీ మద్రాసులోనే ఎందుకు కట్టాలి? మన గ్రామంలోనే కట్టవచ్చు కదా!"

"రైలు స్టేషన్‌కు పదమూడు మైళ్ళ దూరం. దారి, డొంకా లేవు. పని చేయటానికి సరైన మనుషులు దొరకరు. పైగా నాకంటూ ఏమీ లేని ఆ వూళ్ళో నేనేం చేస్తాను?"

"మనం అంత పెద్ద ఫ్యాక్టరీ ప్రారంభించగలమా?"

"మనం ప్రారంభించి తీరాలి. ఇది చాలా మంచి ప్రాజెక్టు. ప్రభుత్వం డబ్బు యిస్తుంది. పారిశ్రామికవేత్తలు కూడా డబ్బు పెడతారు. వ్యవసాయ ప్రధానమైన మన దేశంలో రసాయనిక ఎరువుల ఫ్యాక్టరీ బంగారు గుడ్లు పెట్టే బాతువంటిది."

"అలాగా!"

"అవును. మనం తప్పక ప్రారంభించాలి. ప్రారంభిక పనుల కోసం కొంత డబ్బు కావాలి. కనీసం ఒక లక్ష రూపాయలు కావాలి."

"ప్రస్తుతం అంత నగదు మన దగ్గర లేదు."

"బహుశా మీ దగ్గర వున్నదంతా ఇచ్చివేసా రనుకుంటాను."

"ఆ విషయాలలో మీరెందుకు అనవసర జోక్యం చేసుకుంటారు?"

"ఇందులో జోక్యం చేసుకోకుండా, ఎందులో జోక్యం చేసుకోమంటారు?"

కుమారుని ఆగ్రహం చూసి జమిందారు తననుతాను బలవంతంగా నియంత్రించుకోసాగాడు. కుమారుని దుడుకుతనం, అమర్యాద ఆయనకు చాలా బాధను కలిగిస్తున్నాయి. తన తండ్రి పెద్ద పిసినారి అయినా జమిందారు ఎప్పుడు తన తండ్రితో ఈ విధంగా వ్యవహరించలేదు.

"నాకు డబ్బు వెంటనే కావాలి."

"మీ దగ్గర లేదా? మీకు కూడా భరణం లభిస్తున్నది కదా?"

"కాని అది ఆస్తి కాదు కదా? నేను చెప్పేది మన కుటుంబ ఆస్తిని గురించి."

"నీకు చట్టాలు తెలుసనుకుంటాను. నేను మరణించిన తర్వాతే నీకు ఈ ఆస్తి లభిస్తుంది."

"భరణానికి హక్కుదారుగా గుర్తించిన చట్టమే, ఈ కుటుంబ ఆస్తిలోనూ నన్ను భాగస్వామిని చేస్తుంది." జమిందారు కుమారుడు తొణక్కుండా, తీవ్రంగా సమాధానమిచ్చాడు.

"హుఁ! అలాగా?" జమిందారు గొంతులో ఆశ్చర్యం, బాధ తొంగిచూసాయి.

"ఈ ఫ్యాక్టరీ మన కుటుంబం మొత్తం క్రింద ప్రారంభించుదామనుకున్నాను. కాని మీరు దానకర్ణులై స్కూలు భవనాలు నిర్మించుకుంటూ పోతుంటే నాకు వేరేమార్గం కనబడటం లేదు. అందుచేత ఒంటిరిగానే ప్రారంభిద్దామనుకుంటున్నాను.

జమిందారుకు నోటమాట రావటం లేదు. ఆయన ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీ నిర్మాణానికి వ్యతిరేకి కాదు. కాని దానిని గ్రామంలోనే నిర్మిద్దామనుకుంటున్నాడు. దానికి అనుబంధ పరిశ్రమల నిర్మాణం కూడా జరిగితే ఆ ప్రాంతంలో తన జమిందారీ స్థాయి నిలబడివుంటుందని ఆయన ఉద్దేశ్యం.

"మీరు నాపట్లకూడా కొంచెం ఉదారంగా ఉండాలి."

"వ్యాపారంలో ఇన్ని తెలివితేటలు కనపరచే వ్యక్తి, కన్నతండ్రితో సక్రమంగా వ్యవహరించితే బాగుంటుందేమో!...." జమిందారు కుటుంబరావు కొంచెం తీక్షణంగా అన్నాడు. కుమారుని వ్యవహారం ఆయనను తీవ్రంగా గాయపరిచింది. అయితే ఇటువంటి వ్యవహారం ద్వారా తన పనిని సాధించుకున్నానన్న ఆలోచన తన కుమారునికి కలిగించటం ఆయనకు ఇష్టంలేదు.

"ప్రస్తుతం తగినంత డబ్బులేదు. డబ్బు అందగానే మీకే యిస్తాను. అయితే మీరు ఇదేవిధంగా ప్రవర్తిస్తే, చట్టా లేవిధంగా వున్నా మీకు పైసా దక్కదు...." జమిందారు అంటూ వుండగానే ఆయన భార్య ఆ గదిలోనికి ప్రవేశించింది. ఆమె రావటం ఒకవిధంగా మంచిదే అయింది. లేకుంటే కుమారుని నోటి నుండి ఏ మాటలు వచ్చేవో! తల్లి సమక్షంలో కుమారుడు అంత తీవ్రంగా వ్యవహరించలేడు.

జమిందారు సిగార్ వెలిగించి పొగ వదలసాగాడు. చేతితో తలవెంట్రుకలు సరిచేసుకోసాగాడు. ఆయన తన హృదయంలోని బాధ వ్యక్తం కాకుండా బలవంతంగా నిగ్రహించుకుంటున్నట్టున్నాడు.

# 13

రాజగోపాలరావుకు అతని సోదరునికి కలిపి పదిహేను ఎకరాల భూమి వున్నది. వారే స్వయంగా వ్యవసాయం చేసుకుంటూ వుంటారు అవసరమైనప్పుడే కూలీలను నియమించుతారు వీరి పొలం నది ఒడ్డునే వున్నది. పదిహేను ఎకరాల పొలంలో ఆరు ఎకరాలకు యింతవరకు ఏ విధమయిన సేద్యపు నీటి వసతి లేదు. ప్రస్తుతం అక్కడ ఒక పెద్ద బావి త్రవ్వబడి మోటరు తగిలించబడింది. ఆయిదు ఎకరాలలో ధాన్యం పండిస్తూ వుంటారు. పొలం చుట్టూ తాడిచెట్లు వున్నాయి. వాటి మీద కూడా ప్రతి సంవత్సరం ఆదాయం వస్తూ వుంటుంది.

బావి దగ్గర దిబ్బమీద మూడు మామిడి చెట్లు, కొన్ని కొబ్బరి చెట్లు వున్నాయి. వీటివలన కూడా ఎంతో కొంత ఆదాయం వస్తూ వుంటుంది. నాలుగు పాడిగేదెలు వున్నాయి. రాజగోపాలరావు సోదరునికి పశువులను గురించి బాగా తెలిసినవాడుగా పేరు వుంది.

ఆ గ్రామస్థాయినిబట్టి చూస్తే, రాజగోపాలరావుది కొంచెం సంపన్న కుటుంబం క్రిందే లెఖ్ఖ. భగవంతుడికి మినహా ఎవరిపైనా ఆధారపడవలసిన పని లేదు. అతని తాత తండ్రులు ఆ భూమిని చెమటోడ్చి సాగు చేసారు. పొలం ఎటు పంటిదైనా అదే వారి జీవనాధారం. అందుచేత దానికోసం వారు ప్రాణాలను సైతం ధారపోయటానికి సిద్ధపడుతూ వుండేవారు.

వ్యవసాయంలో రాజగోపాలరావుకు అతని సోదరుడు సహకరించకపోతే అతనికి ప్రజాహిత కార్యక్రమాలలో తిరగడానికి తీరుబడి వుండదు. అతను గ్రామపు పనులమీద తరచు రోజుల తరబడి యిల్లు పట్టకుండా తిరుగుతూ వుంటాడు. ఇంటి పనులన్నీ కూడా అతని సోదరుడే చూసుకుంటూ వుంటాడు.

అతని కుటుంబం ఒకవిధంగా ఉమ్మడి కుటుంబం వంటిదే. రాజగోపాల రావుకు పిల్లలు లేరు. అతని సోదరునికి ఐదుగురు పిల్లలు. వాళ్ళు కూడా ఖాళీ వున్నప్పుడల్లా పొలంలో పనిచేస్తూ వుంటారు.

రాజగోపాలరావు క్రమబద్ధంగా చదువుకోలేదు. స్వయంగానే విజ్ఞానాన్ని సంపాదించుకున్నాడు. అతను చదవనూ వ్రాయనూ చేయగలడు. వార్తాపత్రిక

లయితే పూర్తిగా అక్షరం వదలకుండా చదువుతాడు. రేడియోలో వార్తల కోసమయితే చెవి కోసుకుంటాడు. అవే కాకుండా మంచి మంచి పుస్తకాలు చదువుతూ వుంటాడు రైతుల కుండవలసిన లోకజ్ఞానమూ, లౌకికం, సమయస్ఫూర్తి రాజగోపాలరావుకు మెండుగా వున్నాయి.

రాజగోపాలరావు చిన్నప్పుడు, అతని పినతండ్రి కుమారులిద్దరిని పోలీసులు 'సోషలిస్టు' లనే అనుమానంపై నగ్నంగా గ్రామపు స్త్రీలముందు పేరేడ్ చేయించారు. వాస్తవంగా ఇతర సోషలిస్టులవలె నల్ల ప్రేముగల కళ్ళజోళ్ళు ధరించటం మినహా సోషలిజం గురించి వారికేమీ తెలవదు. వారు నిరపరాధులు. రాజకీయాలలో పాల్గొనేటంత కనీసం ఆర్థిక ఆధారం కూడా వారికి లేదు. పక్క గ్రామంలో వచ్చీరాని జీతంపై బడిపంతులు ఉద్యోగం చేస్తూవుండేవారు.

ఈ సంఘటనే రాజగోపాలరావును రాజకీయాల వైపు మళ్ళించింది. అయితే పదవుల కోసం, అధికారం కోసం ప్రాకులాడే రాజకీయాల వైపు లేదు. రాజగోపాలరావు బాధితులకు, పీడితులకు నాయకుడయ్యాడు. జమిందారుచేత, ప్రభుత్వంచేత నష్టాలు, కష్టాలు పొందే వారి పక్షం వహిస్తూ ఉంటాడు. ఏ రకమైన అన్యాయాన్నిగాని అత్యాచారాన్నిగాని రాజగోపాలరావు సహించలేడు. పదవులు పొందాలనే కోరిక కంటే సేవ చేయాలనే తపన ఎక్కువగా ఉన్నవాడు.

అతను ఏ ప్రత్యేక వాదాన్నో భుజాన వేసుకొని ప్రచారం చేసేవాడుకాడు. గాంధీ వాదులలో గాంధేయ వాదిగా, సామ్యవాదులలో సామ్యవాదిగా ఉంటూ ఉంటాడు. అతను ఏ పార్టీలోనూ సభ్యుడు కానప్పటికీ అతనిని సామ్యవాదిగానే భావిస్తూ ఉంటారు.

మాతృభాష తెలుగులో రాజగోపాలరావు అద్భుతంగా మాట్లాడగలడు. గ్రామీణ ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తూ అప్పుడప్పుడు సంభాషణలోనూ, తగాదాల పరిష్కారాలలోనూ పాల్గొంటూ ఉంటాడు. స్వార్థపరుడు కాని కారణంగా గ్రామస్తులంతా అతన్ని గౌరవిస్తారు. యువకులకు రాజగోపాలరావుపట్ల ఎక్కువ ఆకర్షణ ఉంటూ ఉంటుంది.

కొన్ని మానవ సహజమైన బలహీనతలు ఉన్నప్పటికీ, రాజగోపాలరావుకి ఖచ్చితమైన ఆదర్శాలు గలవాడుగా పేరున్నది.

జమిందారు, అతని తాబేదారులు కలసి రాజగోపాలరావును రాజకీయ సంబంధమైన కొన్ని కేసులలో ఇరికించినప్పటికీ ఎప్పుడు శిక్షించబడలేదు. జమిందారంటే అతనికి యిష్టంలేదు.

రాజకీయ సంబంధమైన పనులు లేనప్పుడు, తీరికగా ఉన్నప్పుడు రాజగోపాలరావు తన సోదరుడితో కలిసి పొలం వెళ్ళి పనులలో పాలు పంచుకొంటూ

ఉంటాడు. పొలంలో వరద నీరు తీసిన తరువాత వారు పొలాలను తిరిగి బాగు చేసుకుంటున్నారు.

పొలంతో వేసిన కూరగాయల మొక్కలు వరద కారణంగా కొట్టుకొని పోయాయి వరి కూడా వరద కారణంగా వంగినప్పటికీ పెద్దగా పాడవలేదు వరద కారణంగా పాడైపోయిన కూరగాయల పాదులను వారు మరలా బాగు చేస్తున్నారు.

రాజగోపాలరావు తలకు గుడ్డ చుట్టి, పంచె పైకిగట్టి, చేతితో పార పట్టుకొని పని చేయసాగాడు. మధ్య మధ్యలో కారుతున్న చెమటను తుడుచుకుంటూ తన పనిలో ఏకాగ్రతతో మునిగిపోయాడు.

మధ్యాహ్నానికి అతను అలిసిపోయాడు. దిబ్బమీద నూతి దగ్గర కాళ్ళు, ముఖము కడుగుకొని మామిడి చెట్టునీడలో పచ్చగడ్డిపై పడుకున్నాడు.

అతను వంటరిగా ఆలోచించసాగాడు. అతని సోదరుడు కొత్త విత్తనాలు తేవడానికి పట్టణానికి వెళ్ళాడు. పనివాళ్ళు కూడా దగ్గరలో ఎవరు లేరు. రాజ గోపాలరావు దూరంగా కొండపైఉన్న గుడిని చూసాడు. సోమయాజులు మాటలు అతనికి గుర్తుకువచ్చాయి. వాడు వెధవ, స్వార్థపరుడు, మోసగాడు. వాడి మాటలు నమ్మకూడదు. వాడే జమిందారు మాటపై తనకు వ్యతిరేకంగా పోలీసులకు అబద్ధాలు చెప్పాడు. అన్నపూర్ణ గురించి చెప్పడానికి వాడెవడు? బహుశా వాడు అబద్ధం చెప్పి ఉండవచ్చు. అయినా తను ఎక్కడకు వెళ్ళిందో అన్నపూర్ణ నాకు ఎందుకు చెప్పలేదు? అసలు నన్నెందుకు కలవలేదు? నేను కోపంగా ఉంటే తను ఎలా కలుస్తుంది? అరే! ఇది ఏమిటి ఇంతపొద్దు ఎక్కినా భోజనం ఇంకా రాలేదు? అతను లేచి నిలబడి కాలిబాటవైపు చూడసాగాడు. భోజనం తీసుకొస్తున్న అతని భార్య కనిపించింది.

"నువ్వు కథలలోని దేవతలవంటి దానివి. అనుకోగానే ప్రత్యక్షమయ్యావు. చాలా ఆకలిగా ఉంది." భార్యచేతిలోని భోజనం అందుకుంటూ, భార్యని తన పక్కన కూర్చోపెట్టుకున్నాడు.

ఎప్పుడైనా రాజగోపాలరావు పొలంపనులు చేస్తూ ఉన్నప్పుడు భార్య భోజనము తీసుకొస్తూ ఉంటుంది. సోదరుడుంటే ఇద్దరు కలిసి భోజనం చేస్తారు. అతని భార్యకు ముప్పై, ముప్పైఐదు సంవత్సరాల వయస్సు ఉంటుంది. పెద్ద అందగత్తె కాదు. పల్లెటూరి మోటుమనిషి. చదువులేదు. అయినా తన బాధ్యతలు, కర్తవ్యం సక్రమంగా నిర్వర్తిస్తూ ఉంటుంది. ఆమెకు భర్తను గురించి పూర్తి అవగాహన ఉన్నది. తరుచూ అతను ఇంటివద్ద ఉండకపోయినా, ఏమి అనదు.

# 14

వేణుగోపాలరావు ఇంటిలోని పెద్ద గుమ్మందగ్గర కూర్చున్నాడు: శరీర మంతా చెమటతో తడిసిఉంది. మొఖం ఎఱ్ఱబడింది. ఎప్పుడైనా కోపంగాఉన్నప్పుడు అతను ఎవరితో మాట్లాడకుండా ఒంటరిగా కూర్చుంటాడు. రాజగోపాలరావు అన్న గార్ని చూడగానే కోపంతో ఉన్నాడని తెలుసుకున్నాడు. "ఏం జరిగింది?" రాజగోపాలరావు ప్రశ్నించాడు.

"మనం ఏమి చేసినప్పటికి ప్రతివాడూ మన పరిస్థితిని అసరాగా తీసుకొని లాభం పొందుదామని అనుకుంటాడు. అప్పుడప్పుడు ఈ దేశాన్ని నాశనం చేద్దామనిపిస్తుంది. ప్రజలు దొంగలు, మోసగాళ్ళు, లుచ్చాలు అయితే ప్రభుత్వం ఏమి చేస్తుంది?" వేణుగోపాలరావు తన అలవాటుకి భిన్నంగా మండిపడసాగాడు.

"అసలు జరిగింది ఏమిటి?" రాజగోపాలరావు మరల ప్రశ్నించాడు.

"ఈ సహకార సంస్థలు మన సహాయం కోసమే ఏర్పాటు చేయబడినా, వాటిలో పని చేసేవారు అవన్నీ వాళ్ళ బాబు సొమ్మనుకుంటున్నారు. మనకి మనం సహాయం చేసుకుంటే తిరుగుబాటు చేసామంటారు."

"అసలు ఏం జరిగిందో చెప్పు?"

"ఏం జరుగుతుంది, దేశం ఇట్లా ఏడుస్తుంటే!"

"అసలేం జరిగిందో నువు చెబితే కదా?"

"నేను విత్తనాల కోసం సహకార సంఘపు డిపోకు వెళ్ళేటప్పటికి విత్తనాలు లేవని బోర్డు తగిలించబడి ఉంది. పత్రికల నిండా విత్తనాలు సహకార సంఘాలకు పంపినట్లు ప్రభుత్వం ప్రకటన లిస్తున్నది. బహుశా ఉద్యోగస్తులు ఆ విత్తనాలను డిపోలకు రానివ్వకుండానే వ్యాపారస్తులకు అమ్మివేస్తుంటారు. ఆ వ్యాపారస్తుల దగ్గర నుండి బ్లాకులో ఎక్కువ ధరకు విత్తనాలు కొనడానికి రైతుల దగ్గర డబ్బెక్కడిది?"

"అవును, డబ్బు లెక్కడ ఉంటాయి? ఎప్పుడూ ఉండవు కదా!"

"ఆ సహకార సంఘంలో పనిచేసే ఉద్యోగస్తులే విత్తనాలన్నింటినీ కొని, బ్లాకులో ఎక్కువ ధరకు అమ్ముతున్నట్లు నేను విచారించగా తెలిసింది. ఇందులో

అధికారులకు కూడా భాగం ఉండి ఉంటుంది. వాళ్ళకు తెలియకుండా వీళ్ళు ఎలా చేయగలరు? వాళ్ళకు తెలిస్తే, వాళ్ళను ఈ విషయంలో హెచ్చరించవలసి ఉంది."

"అవునవును."

"విత్తనాలు కొనకపోయినా నాకు ఇష్టమేగాని, ఆ గాడిదల దగ్గరకు మాత్రం చస్తే వెళ్ళను."

"మనం ఈ విషయంలో ఏదో ఒకటి చేయాలి."

"ఏం చేస్తాం? ఏమి చెయ్యలేం. దేనికైనా సాక్షులు కావాలి కదా! మన వాళ్ళు వట్టి వెధవలు, పిరికివాళ్ళు సాక్ష్యం పేరు చెబితేనే భయంతో పారిపోతారు. వీళ్ళే మొత్తం విషయం దాచేస్తారు. ఈసారి విత్తనాలు వచ్చినప్పుడు ఆ విధంగా జరగనివ్వకూడదు. అయినా మనం ఫిర్యాదు చేద్దాం."

"మనం ఫిర్యాదు చేస్తే ఏమౌతుంది? ఎరువుల విషయంలో మనం ఇచ్చిన ఫిర్యాదు ఏమైంది? ఏమి జరగదు. ప్రజలలో నమ్మకం, చైతన్యం రానప్పుడు మనమెందుకు తల బాదుకోవాలి?"

"ఏమో, నాకు తెలియదు."

"ఫిర్యాదుల తరువాత కూడా పరిస్థితులేమీ మారలేదు. ఎరువులు ఎప్పుడు పంపిస్తునే ఉన్నారు. సహకార సంఘంలోనే ఉద్యోగస్తులు వాటిని నల్ల బజారుకు తరలిస్తునే ఉన్నారు. పెట్టుబడి లేని వ్యాపారం సాగుతునే ఉన్నది. ఇతర ప్రాంతాల నుంచి ఎరువులు కొని తెచ్చుకొడానికి మన దగ్గర బళ్ళు లేవు. సంఘం మనదే అయినా సంఘంలోని ఉద్యోగస్తులు మనవాళ్ళు కారు."

"ఎవరికి తోచినది వారు చేసే అవకాశం ఉన్నప్పుడు ఈ విధంగానే ఉంటుంది. ఇదే ఆటవిక న్యాయం. జమిందారీ వ్యవస్థలోని అలవాట్లు ఈ విధంగానే ఉంటాయి ప్రతివాడూ తన పొట్ట గురించే ఆలోచిస్తాడు. ఇతరులు చస్తున్నా పట్టించుకోడు."

"పేరుకు మాత్రం సహకార సంస్థ. కానీ లోపల లంచగొండితనం, అవినీతి మయం. ఈ సహకార సంఘమే అన్ని తగాదాలకు మూలం. అందరకూ సమాన అధికారాలు లేని సంఘం సహకార సంఘం ఎట్లా అవుతుంది?"

"ఈ దేశాన్ని ఎవడు బాగు చేస్తాడు? ఒకేసారి రెండు పడవల మీద కాలు పెట్టిన వాడి పరిస్థితిలా ఉంది. ఈ దేశం, ఈ వ్యవస్థ ఎప్పటికైనా సమూలంగా నాశనం కాక తప్పదు. పునాది సరిగా లేనప్పుడు నమ్మకం, నీతి బయట నుంచి

తెప్పించుకొనేవి కావు, ఎవరైనా ఇచ్చినా తీసుకొనేవి కావు. అత్యంత అవసరమైన ఇవే ఈ దేశంలో కనపడకుండా పోయాయి."

అన్నగారి మాటలు రాజగోపాలరావుకు ఆశ్చర్యాన్ని సంతోషాన్ని కలిగించాయి. అందరికి తాను బోధించే ధైర్యం, సాహసం తన నుంచి పోయినట్లున్నాయి. అన్నగారు తాను మాట్లాడే విధంగానే మాట్లాడటం రాజగోపాలరావుకు అబ్బురపాటును కలిగించింది.

"ఇంతకూ నువ్వు భోజనం చేసేవా?" అన్నగారిని ప్రశ్నించాడు.

"లేదు. నాన్నగారు భోజనం చేయలేదు." అని కొడుకు సమాధానం ఇచ్చాడు

"ముందు నువ్వు భోజనం చేయి. ఇవన్నీ ఒక్క రోజులో బాగుపడేవి కావు ఇవి భూగర్భ నిధుల వంటివి. ఈ దుర్గంధానికి కారణం ఈనాటిది కాదు. తరతరాల నుంచీ వస్తున్నది మనం కళ్ళు మూసుకొని నైతిక విలువలు మరచిపోయి భగవంతుని కోసం వెతుక్కుంటూ ఉన్నాం. ఈ పురాణ భూమిలో అన్ని నేరాలకు ప్రాయశ్చిత్తమే శిక్ష. దానం అన్ని లోపాలనూ కప్పివేస్తుంది. తగాదాలు పెట్టేవాళ్ళు, పదవికోసం ఏమైనా చేసేవాళ్ళు మన నెత్తిన స్వారీ చేస్తున్నారు. నువ్వు ముందు భోజనం చేయి"

రాజగోపాలరావు అన్నగారిని ఇంటిలోనికి పంపి పక్క గ్రామంనుండి తనను కలవటానికి వచ్చిన వారి దగ్గరకు వెళ్ళాడు. వారంతా రాజగోపాలరావు అన్నగారికి చెప్పిన విషయాలు కిటికీనుండి వింటూ ఉన్నారు. వారందరూ రాజగోపాలరావును చూడగానే నమస్కారాలు చేసారు.

"మా గ్రామంలో రకరకాల అంటువ్యాధులు పెరిగిపోతున్నాయి చచ్చిపోయిన పశువులను తీసుకెళ్ళేవారే లేరు. ప్రతి ఒక్కరూ తమ పరిస్థితికి తల్లడిల్లిపోతున్నారు." వారిలో ఒకరు రాజగోపాలరావుతో అన్నారు.

రాజగోపాలరావుకు వాళ్ళ గ్రామం గురించి తెలుసు. ఆ గ్రామం నదికి అవతలవైపున, నది సముద్రంలో కలిసే చోటుకి దగ్గరలో ఉంటుంది. వరద వచ్చినప్పుడల్లా ఆ గ్రామంలోనే పొలాలన్ని ఇసుకమేట వేస్తుంటాయి.

"మీరు అన్నపూర్ణగారిని కలిసారా? ఆమె శాసన సభ్యురాలు కదా! ఆమె తలచుకుంటే వెంటనే మీకు ప్రభుత్వ సహాయం లభించేటట్లు చేయగలదు." రాజగోపాలరావు సలహా చెప్పాడు.

"ఆమె మాకు తెలియదు."

"తెలియవలసిన అవసరం లేదు. ఆమె మన శాసన సభ్యురాలు. మన కష్టాలు ప్రభుత్వానికి తెలియచేయవలసిన బాధ్యత ఆమెకున్నది."

"మీరు దయతలచి మమ్మలను ఆమెవద్దకు తీసుకువెళ్ళండి. మీ మేలు ఎన్నటికీ మరువలేము. తీసుకువెళ్ళండి. మా ఓట్లు ఆమెకే వేసాము. కాని ఆమెతో పరిచయం లేదు."

"పదండి, వెళదాం." రాజగోపాలరావు పైకి ఆ మాట అనేసాడు. కానీ లోపల సంకోచిస్తూనే ఉన్నాడు. తప్పనిసరిగా వారితో బయలుదేరాడు.

అన్నపూర్ణ ఇంటిదగ్గర ఐదారుగురు మనుషులున్నారు. వాళ్ళు ఆ గ్రామస్థులు కారు. రాజగోపాలరావు వాళ్ళను చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా ఎప్పుడూ చూడలేదు. అన్నపూర్ణ ఏదో పనిలో ఉన్నదనుకున్న రాజగోపాలరావు ఎదురుగా చెట్టుక్రింద వున్న అరుగుమీద కూర్చున్నాడు.

కొంచెంసేపటి తర్వాత రాజగోపాలరావు బయట వేచివున్నాడని తెలుసుకున్న అన్నపూర్ణ అతనిని కలవటానికి బయటకు వచ్చింది. ఆవిడ ఏదో మర్యాదలు చేద్దామని ప్రయత్నిస్తూ వుందిగాని చేయలేకపోతున్నది. రాజగోపాలరావు కూడా అక్కడ ఎక్కువసేపు వుండాలనుకోవటం లేదు.

"వీరు చాలా దూరం నుంచి వచ్చారు. వీరి గ్రామంలో అంటువ్యాధులు బాగా ప్రబలిపోయాయి. వీరికి మందులు మొదలైన ఏర్పాట్లు చెయ్యాలి." రాజగోపాలరావు తను వచ్చిన పని సూటిగా చెప్పాడు.

"తప్పకుండా చేస్తాను. నేను యిప్పుడే ఆరోగ్యశాఖ వారికి ఫోను చేస్తాను. మీరు నిశ్చింతగా వుండండి." అన్నపూర్ణ రాజగోపాలరావుతో వచ్చిన వారితో అంది. వారు నమస్కారం చేసి వెళ్ళసాగారు. రాజగోపాలరావు వాళ్ళతో నాలుగడుగులు వేసి, తనకోసం వేచివున్న అన్నపూర్ణ దగ్గరకు తిరిగి వచ్చాడు

"ఇంకొంచెం సేపట్లో స్కూల్ ఆవరణలో సభ జరుగబోతున్నది. నిన్ను కలవటానికి మీ యింటికి వెళ్లాను. నువ్వు లేవు నువ్వు బయటకు వెళ్ళావని మీ ఆవిడ చెప్పింది. నువ్వు తప్పక రావాలి. నువ్వు తప్పక రావాలని నా కోరిక." అన్నపూర్ణ గొంతులో అభ్యర్థన.

"మీ ఆజ్ఞ నేను పాటించవలసిందే కదా!" రాజగోపాలరావు పెదవి కొరుక్కుంటు అన్నాడు.

# 15

సాధారణంగా ఆ గ్రామంలో జరిగే సభలు, సమావేశాలు చెరువు గట్టున వున్న మఱ్ఱి చెట్టు దగ్గరో, స్కూలు ఆవరణలోనో జరుగుతూ వుంటాయి. మఱ్ఱి చెట్టు దగ్గరకు అన్నపూర్ణ వచ్చేసరికి అక్కడ కొంత మంది జనం పోగై వున్నారు.

"ప్రస్తుతం మన వూరిలో వున్న స్కూలు మన అవసరాలకు చాలటం లేదు. దీనిని హైస్కూల్‌గా మార్పించుకోవలసి వుంది. జమిందారుగారి సహాయ సహకారాలతో స్కూలుకు పక్కగా బిల్డింగ్ కట్టించే ప్రయత్నంలో వున్నాం. కొత్త స్కూలు భవనానికి శంకుస్థాపన చేయవలసిందిగా ముఖ్యమంత్రిగారిని కోరడం జరిగింది. ఆయన దయతో అంగీకరించారు కూడా. మనలో ఏవైనా అభిప్రాయ భేదాలున్నా ...." రాజగోపాలరావు వైపు చూసింది. రాజగోపాలరావు తలవంచుకొని వింటూ ఉన్నాడు

"ఏమైనా అభిప్రాయ భేదాలు ఉన్నా వాటిని మరిచి ఆయనకు ఘనంగా స్వాగతం ఇద్దాం. కేవలం శంకుస్థాపనకే ఆయన రానన్నారు. వరద కారణంగా ఏర్పడిన కష్టాలు, నష్టాలు, ఆయన స్వయంగా పరిశీలించాలని అనుకుంటున్నారు. అందుచేత మనం మరింత గొప్పగా ఆయనకు స్వాగతం చెప్పవలసి ఉంది."

అన్నపూర్ణ సభ నాలుగు వైపులా చూస్తూ తన ప్రసంగాన్ని కొనసాగిస్తున్నది. "మనకు తగిన విద్యాపకాశాలు లేని కారణంగానే మనం వెనుకబడి ఉన్నాం. విద్య ద్వారా మనం మన వెనుకబడినతనాన్ని పోగొట్టుకోగలం. మూడు వంతులు నిరక్షరాస్యులుగా ఉన్న ఏ దేశమూ అభివృద్ధిని సాధించలేదు అంతేకాదు, తగిన విద్య ఉంటేనే పారిశ్రామిక రంగంలో కూడా ప్రగతిని సాధించగలం. వ్యవసాయాన్ని ఎల్లకాలం నమ్ముకొని బ్రతకలేం. పైగా మన దగ్గర ఉన్న పొలం మాత్రం ఎంత? పోని, ఈ పొలం ఎక్కువవుతుందనుకుందాం. అయినా, చదువు ఉంటే వ్యవసాయ రంగంలో వస్తున్న కొత్త కొత్త మార్పులను మనం తెలుసుకోవచ్చు. మనం అనుకున్నవన్నీ సక్రమంగా సాగితే, త్వరలోనే మనం ఒక పారిశ్రామిక శిక్షణాకేంద్రం కూడా ప్రారంభించుకోవచ్చు.

"మనం ఈ ఆధునిక, సాంకేతిక శిక్షణా కార్యాలను పొందాలంటే మీ అందరి సహకారం చాలా అవసరం

"ప్రస్తుతం మనం వరద వలన చాలా ఇబ్బందులను ఎదుర్కొంటున్నాం. అందుచేత మనం వీటికై విరాళాలు వసూలు చేయటం భావ్యంకాదు. పైగా వసూలు చేయటం నాకు ఇష్టంలేదు జమిందారుగారి పుణ్యమా అని మనకు ఆ అవసరం కలుగకపోవచ్చు. కాని ఏదైనా ఒక మంచి పనికి డబ్బు అవసరమైనప్పుడు వెనకంజ వేయటం మంచిది కాదని నా అభిప్రాయం. మీలో ఎవరైనాఏదైనా సలహా, సూచన ఇవ్వదలచుకుంటే ఇవ్వాలని ప్రార్థన."

అన్నపూర్ణ ఈ విధంగా తన ప్రసంగాన్ని ముగించింది.

రాజగోపాలరావు నాలుగు వైపులా చూసి అలవాటుగా తల పంకించాడు. "నేనిచ్చేది సలహాయో, సూచనో నేను చెప్పలేను, బహుశా ఉపదేశం లాంటిదేమో! ఏదైనా ఇది చాలా అవసరమైనదని భావిస్తున్నాను. స్కూలు భవనం కంటే, గోడల అలంకరణల కంటే, జమిందారు గారి బ్రహ్మాండమైన ఔదార్యం కంటే ముఖ్యమైంది మరొకటుంది మనం మన పిల్లలకు నేర్పిస్తున్న చదువుల్లో శీలం, నీతి నిజాయితీలు, వ్యక్తిత్వ వికాసం లోపించాయని నా అభిప్రాయం ప్రస్తుతం మన దేశానికి కావలసినవి ఇవే అని నా ఉద్దేశం ఈ స్కూళ్ళు మానెయ్యమని కాదు స్కూళ్ళను అభివృద్ధి పరచటమే కాదు, ఆ స్కూళ్ళలో బోధించే విషయాలను కూడా పరిష్కరించవలసి ఉంది. విద్యాభ్యాసం తరువాత కూడా ప్రజలు స్వార్థ పరులుగా, అవినీతిపరులుగా, నైతిక విలువలు మంటకలిపే వారుగా మారిపోతూ ఉంటే ఆ విద్యాభ్యాసం వలన ప్రయోజనం ఏమిటి? ఈ విద్యాభ్యాసం చేసిన మేధావులు ఏనాడూ మనకు సహాయ పడలేదు. మనం వారిని మార్చనూ లేము. మన దేశచరిత్రను ఒకసారి అవలోకిస్తే ఈ మేధావుల రంగు బైటపడుతుంది. మన దేశంమీద విదేశీయుల ఆక్రమణ జరిగినప్పుడల్లా సమాజంలో ఉన్నతులుగా భావించబడే ఈ మేధావులు తమ స్వార్థాన్నే ప్రదర్శించారు. సమాజంపట్ల, దేశం పట్ల తమ కర్తవ్యాన్ని వాళ్ళు ఎప్పుడూ పాటించలేదు. మౌలికమైన విషయాల పట్ల వారెప్పుడు ఆసక్తిని ప్రదర్శించలేదు. వారెల్లప్పుడూ ఉన్న వ్యవస్థనే బల పరుస్తూ వచ్చారు. వారంతా బ్రహ్మాండంగా చదువుకున్నవారే. అయితే ఏం లాభం? వారంతా తిరోగమనవాదులే. ప్రస్తుతం మన విద్యా వ్యవస్థ కూడా ఆ విధంగానే ఉన్నది. అటువంటి మేధావులనే తయారు చేస్తున్నది.

ఈ చదువుకున్న మేధావులు చేస్తున్నదేమిటి? వరద మనలను అన్ని విధాలా ముంచివేసింది మనకు ప్రాణావసరమైన మన పంటలను మింగివేసింది. మనం నాటిన విత్తనాలు వరద నదిలో కలసి సముద్రం పాలయ్యాయి. మన కాళ్ళమీద మనం తిరిగి నిలబడాలంటే కొత్త విత్తనాలు మనకెంతో అవసరం. మన విత్తనాలపై చల్లిన ఎరువులు కూడా నీటి పాలయ్యాయి. మనం విత్తనాలకు ఎరువులకు ఎప్పుడూ పట్టణానికి వెళ్ళినా ఒకే సమాధానం- 'స్టాకు' లేదు. ఒక ప్రక్క ప్రభుత్వమేమో అవసరమైన చోటికల్లా విత్తనాలు ఎరువులూ పంపుతున్నామని రోజూ ప్రకటనలు గుప్పిస్తూ ఉన్నది అయితే ఈ పంపిన విత్తనాలు, ఎరువులు ఏమైపోతున్నాయి? చదువుకున్న పెద్ద పెద్ద ప్రభుత్వోద్యోగులు వాటిని మాయం చేసి 'బ్లాక్ మార్కెట్'లో అమ్ముకుంటున్నారు.

అయితే తప్పంతా చదువుదేనని నేననటం లేదు. పాతుకుపోయిన మన ప్రస్తుత వ్యవస్థే దీనికి కారణం. ఈ సామాజిక వ్యవస్థ మారదు. కొత్త వ్యవస్థను రానివ్వదు. ఈ సామాజిక వ్యవస్థ చిరిగి పీలికలై పోయింది. మనకు ఈ పీలిక అంటేనే ప్రాణం. మనకు కొత్త దుస్తు లవసరం లేదు. ఈ పీలికలు బాగుచేయ డానికి వీలులేనివి. మనం వీటిని మార్చివేయాలి ఈ వ్యవస్థకు కొత్త దుస్తులు తొడగాలి. కొత్త వ్యవస్థనే నిర్మించాలి.

సరి అయిన చదువే ప్రస్తుతపు ఈ దౌర్భాగ్యపు వ్యవస్థను మార్చగలదు. వర్తమాన యాంత్రిక నాగరికతకు అవసరమైన వ్యవస్థను సరిఅయిన చదువే ఏర్పరచగలదు. మనను శక్తిహీనులుగా తీర్చి దిద్దుతున్న ఆ పాత వ్యవస్థను పరిరక్షించవలసిన పనిలేదు. మనం భవిష్యత్తుకి స్వాగతం పలకాలి. గడిచి పోయిందో, గడవబోయేదో, ఏదో ఒకటి తేల్చుకోవాలి. ప్రపంచంలోనే ప్రతి సమాజంలో రెండు వర్గాలు ఉన్నాయి. ఒకటి అతీత వాదం, రెండు భవిష్య వాదం. ప్రగతిశీల సమాజంలో నాయకత్వం భవిష్యవాదుల చేతులలోనే ఉంటుంది. కాని మన దేశంలో పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది.

ఈ విలువలు ఏ పొలాలలోనూ పండవని నాకు తెలుసు ప్రస్తుతం అవసరమైనది ఎక్కువ స్కూళ్ళు కాదు, మంచి స్కూళ్ళు. ఈ రెండింటిలో ఏది కావాలో నిర్ణయించుకోవలసి వస్తే నేను కోరేది మంచి స్కూళ్ళనే.

నిరక్షరాస్యతను గురించి శ్రీమతి అన్నపూర్ణగారు చెప్పిన మాటలతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. ఈ నిరక్షరాస్యత మన ప్రగతికి పెద్ద అవరోధంగా ఉంది. మనం దీనిని వీలైనంత త్వరగా రూపుమాపాలి. అయితే మంచి విత్తనాలు దొరికే వరకు పొలాలను బంజరులుగా ఉంచుదామని నా అభిప్రాయం కాదు."

రాజగోపాలరావు మాట్లాడటం ప్రారంభిస్తే ప్రవాహంలాగా సాగిపోతునే ఉంటుంది. ప్రసంగించేటప్పుడు భావావేశం చుట్టివేస్తుంది శబ్దాలు, ఆలోచనలు, విశ్వాసాలు పందెపు గుఱ్ఱాల్లా పరుగులు తీస్తుంటాయి. అప్పుడు ఆయన గంభీర మైన వక్తగా మారిపోతుంటాడు.

"మన నైతిక విలువలన్నీ లైంగిక సంబంధాలతోనే ముడిపెట్టబడి ఉంటాయి. కానీ నైతిక విలువలకు సంబంధించినంతవరకు లైంగిక సంబంధాలకు వాస్తవికంగా అంత ప్రాధాన్యంలేదు. శీలం అనే పదానికి మనం యిచ్చే నిర్వచనం కూడా దీనికి సంబంధించి ఉంటుంది. అది పూర్తిగా తప్పు. లైంగిక సంబంధమైన విలువలను జీవితపు స్వాభావిక ప్రక్రియలతో ముడిపెట్టటడం సముచితంకాదు. శీలం మన మనస్సును నియంత్రిస్తుంది. నైతికత అనేది మనం చేసేపనులు సమాజంపై చూపే ప్రభావంపై ఆధారపడి ఉంటుంది. మనం ఏదనుకున్నా ఆలో చించ వలసింది ఒక్కటే, మనం చేస్తున్నపని సమాజానికి హితమా-అహితమా?"

రాజగోపాలరావు ఈ విషయాలు చెబుతున్నప్పుడు శ్రోతలు అన్నపూర్ణను, రాజగోపాలరావును మార్చి మార్చి చూడసాగారు కొందరు వారిద్దరి సంబంధం గురించి విన్న విషయాలను గుర్తుచేసుకొని చెవులు కొరుక్కోసాగారు.

"అన్నపూర్ణగారు ఈ విషయాలు చెబుతారనుకున్నాను. అయినా నేను చెప్పవలసిన విషయాలే ఇవి విత్తనాలను గురించి చెప్పేటప్పుడు ఒక విషయం ఉన్నది. దిగజారిపోయిన మన ప్రస్తుత పరిస్థితిని చూసి మన జిల్లాలోని 'డెల్టా' ప్రాంతపు ఒక భూస్వామి మన పొలాలు కొనడానికి వచ్చాడు. అతను మన పొలా లకు ఎక్కువ ఖరీదు కట్టవచ్చు కాని ఒక్కసారి మనం పొలాలను అమ్మివేస్తే, మనం తినే నాలుగు మెతుకులు మనకు శాశ్వతంగా దూరమైపోతాయి. అన్నపూర్ణ గారు భూముల క్రయ విక్రయాలపై అదుపు చేసే విధంగా ప్రభుత్వంపై వత్తిడి ఎందుకు తీసుకురావటంలేదో నాకు అర్థం కావటం లేదు. మనం ఎన్నోతరాల నుండీ ఈ భూమి సాగుకోసం రక్తాన్ని స్వేదంగా మార్చాం. అంతేకాదు, ఈ ఆన కట్ట కోసం కూడా ఎన్నో కలలు కన్నాం. ఎంతో ఆందోళన జరిపాం చివరకు

సాధించుకోగలిగాం ప్రస్తుతం పాడైనా మరమ్మత్తు జరుగుతుంది. అయితే ఇప్పుడు పెద్ద పెద్ద భూస్వాములు ప్రలోభాలు చూపించి మన పొలం తీసుకోవటమే కాక ఆనకట్ట కారణంగా వచ్చే నీటిపారుదల సౌకర్యాన్ని అనుభవించబోతున్నారు. మనం ఏదో ఒకటి చేయాలి. ప్రభుత్వం చేయకపోతే మనకు మనమే చేసుకోవాలి. మనం ఈ పొలంపైనే ఆధారపడి బ్రతుకుతున్నాం. వరద లొచ్చినా, తుఫాను లొచ్చినా, మనం ఈ భూమిని వదులుకోకూడదు. ఇదే మన సర్వస్వం.

ముఖ్యమంత్రికి మనం తప్పకుండా స్వాగతం చెబుదాం. మనం మూర్ఖులం కాకూడదు. అయితే ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పడానికి అనవసరపు ఖర్చుతో డబ్బు వృధా చేయటం కూడా మంచిదికాదు. ఆయన కూడా మన ప్రాంతం వారే.... అందుచేత ఆయనకు స్వాగతం చెప్పడానికి చందాలు పోగుచేయవలసిన అవసరం లేదు. అంతగా డబ్బు ఎక్కువగా ఉంటే ప్రజాహిత కార్యక్రమాలలో ఖర్చు పెట్టుకోవచ్చు."

రాజగోపాలరావు తన ప్రసంగాన్ని అకస్మాత్తుగా ముగించాడు. సాధారణంగా పాటించే సభా మర్యాదల కనుగుణంగా శ్రోతలకు కాని, శ్రీమతి అన్నపూర్ణకు గాని కృతజ్ఞతలు తెలియచేయలేదు. అతను నాలుగువైపులా చూశాడు. రాజగోపాలరావు ప్రసంగం పూర్తికాగానే ప్రజలు వెళ్ళిపోసాగారు. రాజగోపాలరావు, అన్నపూర్ణ ఇద్దరూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ రోజు వారు మరలా కలుసుకోలేదు.

# 16

రాజగోపాలరావుకు శాసన సభ్యత్వం లేదా శాసన మండలి సభ్యత్వం మొదలగు రాజకీయ పరమైన పదవీకాంక్ష లేదని అన్నపూర్ణకు తెలుసు. అంతే కాదు, ఏ రకమైన పదవి పొందాలనే కోరిక అతనికి లేదని కూడా తెలుసు. కానీ రాజగోపాలరావు చేసిన ప్రసంగం విన్నతర్వాత తన శాసన సభ్యత్వం లాక్కుంటాడనే భయం పట్టుకుంది. వాస్తవంగా అన్నపూర్ణకు కూడా పదవీ వ్యామోహం లేనప్పటికీ, ఒకసారి పదవీసౌఖ్యం అనుభవించిన తర్వాత, దానిని వదిలిపెట్టడం కష్టంగా భావించసాగింది.

రాజగోపాలరావు ఎన్నికల వాతావరణాన్ని తయారుచేస్తున్నాడని అన్నపూర్ణకు భయం పట్టుకుంది. రాజగోపాలరావు తనకు సహాయం చేస్తాడనే నమ్మకం కూడా ఆమెకు పోయింది. స్వార్థపు నీడలు పడనంతవరకు కృతజ్ఞతా భావన చక్కగానే ఉంటుంది. అధికారం వలన ఏమి వచ్చినా రాకపోయినా స్వార్థం పెరిగి పోతూ వుంటుంది.

ప్రజలలో ఏ విధమైన ఆలోచనలు సాగుతున్నప్పటికీ, ప్రజలేవిధంగా చెవులు కొరుక్కుంటునప్పటికీ, "జమిందారు ఎంత ఇచ్చాడో ఏమిటో, లెఖ్ఖ ఎవరికి తెలుసు? అన్నపూర్ణ, జమిందారు కలిసి ఏదో కుట్రచేస్తున్నారు" అని రాజగోపాల రావు మర్రిచెట్టు దగ్గర అన్నట్లు సోమయాజులు, అన్నపూర్ణతో అన్నాడు.

అన్నపూర్ణ ఈ విషయాన్ని గురించి యధార్థం ఆలోచించే స్థితిలో లేదు. అది కాకుండా సోమయాజులును నమ్మకుండా వుండేందుకు ఆవిడకి ఏ కారణం కనిపించటం లేదు. పైగా రాజగోపాలరావు తర్వాత నాలుగైదు రోజులు కనిపించక పోవటంతో ఆ మాటలు అతను అని వుంటాడని ఆమె నమ్మకం. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు చూడకుండా వుండలేరు.

ప్రభుత్వాన్ని సమర్థించే వారికి, ప్రభుత్వపు పని తీరును గురించి పత్రిక లలో వస్తున్న వార్తలు అంత ప్రియంగా వుండటం లేదు. ఆనకట్ట విధ్వంసం గురించి అసెంబ్లీ సభ్యులు ముఖ్యమంత్రిపై తిరిగి ప్రశ్నల వర్షం కురిపించసాగారు.

"అసెంబ్లీ సభ్యుల అధ్యక్షతన దర్యాప్తు సంఘాన్ని నియమించటం అనుచితం. ముఖ్యమంత్రికి ఆ అధికారం లేదు. ఇది శాంతి భద్రతల సమస్య. ప్రభుత్వమో, పోలీసులో దర్యాప్తు జరపాలి. ముఖ్యమంత్రిగారు పక్షపాతంతో వ్యవహరించారు. ఇందులో ఏదో మోసం వుంది. పైగా ఎవరో కావాలని ఆనకట్ట ధ్వంసం చేసినట్టు వార్తలు వెలువడుతున్నాయి." సోషలిస్టు పార్టీ సభ్యుడు కోటేశ్వరరావు ముఖ్యమంత్రిని తన అనుమానాలతో నిలదీశాడు.

ముఖ్యమంత్రిగారు తొణక్కుండా సమాధాన మియ్యసాగారు—

"ఆనకట్ట నిర్మాణం మొదలు పెట్టినప్పటి నుండి ప్రముఖులతో కూడిన ఒక సంఘం పర్యవేక్షక సంఘంగా పనిచేస్తూ వుంది. ఈ విధమైన పనులు ప్రభుత్వం వారే చేపడుతూ వున్నప్పటికీ, ఈ ఆనకట్ట నిర్మాణం ప్రభుత్వ పర్యవేక్షణలో, కాంట్రాక్టరే నిర్మించసాగాడు. ఆనకట్ట చిన్నదయిన కారణంగానూ, రాకపోకల సౌకర్యం లేని కారణంగానూ, ఈ పని కంట్రాక్టర్‌కు అప్పచెప్పబడింది. అందుకే స్థానిక ప్రజలను కూడా అందులో భాగస్థులను చెయ్యాలనే వుద్దేశ్యంతో స్థానిక ప్రముఖులలో కూడిన ఒక సంఘం ఏర్పాటు చేయబడింది. శ్రీమతి అన్నపూర్ణగారు ఆ సంఘానికి అధ్యక్షురాలు. అందుచేతనే ఈ దర్యాప్తు సంఘానికి కూడా ఆమెను అధ్యక్షురాల్ని చేస్తాం ప్రభుత్వం, పోలీసు వారు కూడా ఈ విషయంలో తమ విధిని తాము నిర్వహిస్తారు. ఈ సంఘపు నిర్ణయాలను వారు తప్పని సరిగా శిరోధార్యంగా భావించాలనే నియమంలేదు. అవసరమైతే ఈ సంఘపు సహాయం తీసుకుంటుంది

ఈ సంఘం చుట్టు ప్రక్కల గ్రామాలలోని ప్రజల నుండి సాక్ష్యాలు సేకరిస్తుంది. ప్రజలు పోలీసులకంటే ఈ సంఘంతోనే ఎక్కువ మనస్ఫూర్తిగా వ్యవహరిస్తారు. ఈ సంఘం ప్రజల దగ్గర నుండి సేకరించిన సమాచారాన్ని ప్రభుత్వానికి అందజేస్తుంది. ప్రభుత్వం దీనిపై తగిన విచారణ జరిపి చర్య తీసుకుంటుంది.

అంతే కాకుండా ఈ సంఘం, ఈ ప్రాంతపు వరద బాధితులకు సహాయ కార్యక్రమాలు కూడా చేపడుతుంది. ప్రభుత్వ సంఘమే కాకుండా, ప్రభుత్వం తరపున పనిచేసే ఒక సంఘం వుండటం అవసరమనినా ఉద్దేశ్యం. ఈ సంఘానికి

మేము ఎవరిపైనా చర్యలు తీసుకునే అధికారం యివ్వలేదు పూర్వపు పర్యవేక్షక సంఘం లాగానే యిది కూడా వ్యవహరిస్తుంది. మనం అమలు చేసే ప్రజోపయోగ కార్యక్రమాల పట్ల, ప్రజలలో ఆసక్తి కల్గించటానికి ఇది ఒక్కటే మార్గం ఇది కేవలం సంఘం మాత్రమే, ఇది న్యాయస్థానం కాదు. అయ్యే అవకాశం కూడాలేదు. ఇది ప్రభుత్వేతర సార్వజనిక సంఘం. దీనికి ప్రత్యేక కార్యక్రమం మాత్రమే అప్పచెప్పబడింది. దీనిద్వారా మేము ఎవరినీ శిక్షింపతలచుకోలేదు. మా ఆలోచన లలో, మా పనులలో కిరాయి మనుష్యులు మాత్రమే దురుద్దేశ్యాలను వెదుకగలరు. ప్రజాక్షేమమే ప్రధానంగా కార్యక్రమాలను అమలుచేసే ప్రభుత్వాధినేతగా ఇది నా ధర్మంగానే భావిస్తున్నాను."

సోషలిస్టు శాసన సభ్యుడు కోటీశ్వరరావు లేచి మాట్లాడటం ప్రారం భించాడు.— "ప్రజాసంక్షేమమే ప్రధానమని చెప్పుకునే ముఖ్యమంత్రిగారు ఆనకట్ట విధ్వంసానికి కారకులయిన వారి మోసంలో చిక్కుకు పోతున్నారేమో అనే సందేహం నాకు కలుగుతున్నది. ప్రజల దృష్టిని ఆసలు నేరస్థులు ప్రభుత్వం, ప్రజల కళ్ళు గప్పి తప్పించుకుపోతారు."

ఈ లోగా అధికారపక్ష సభ్యులు కోటేశ్వరరావు ప్రసంగానికి అడ్డు తగు లుతూ అవహేళన చేయసాగారు. దానిపై ప్రతిపక్ష సభ్యులు కూడా బిగ్గరగా మాట్లాడసాగారు అసెంబ్లీలో ఎవరు ఏమి మాట్లాడుతున్నారో అర్థంకాని పరిస్థితి ఏర్పడింది. జరిగినదంతా రికార్డు చేయరాదని స్పీకర్ ఆదేశించారు.

ఈ సంఘపు ఏర్పాటు నిర్ణయంపై కోర్టులో సవాల్ చేస్తామని సోషలిస్టు సభ్యులు హెచ్చరించారు.

సోషలిస్టు పార్టీ సభ్యుడు కోటేశ్వరరావు, రాజగోపాలరావుకు మంచి మిత్రుడు. రాజగోపాలరావు ప్రోద్బలంపైనే కోటేశ్వరరావు ఈ విషయాల నన్నిటినీ అసెంబ్లీలో ప్రస్తావించాడని అన్నపూర్ణ అనుమానం. రాజగోపాలరావునే అడిగి ఆసలు విషయం తెలుసుకోవచ్చు. కాని ఆమెకు ఆ విషయంపై అంత ఉత్సాహం లేదు. బహుశా అప్పటికే ఆ ప్రాంతంలో రకరకాల అపవాదులు ప్రచారంలో వుండటం కారణం కావచ్చు. అవినీతిని గురించిన విషయాలు మెల్ల మెల్లగా ఆ ప్రాంతమంతా ప్రాకిపోయాయి. ముఖ్యమంత్రి రాక సందర్భంగా నల్లజెండాలతో ప్రదర్శన ఇవ్వాలనే ఆలోచనలు కూడా జరుగుతున్నాయి. ఈ విషయం అన్నపూర్ణ ఆందోళనకు కారణమయ్యింది.

రాజకీయాలలో ఎక్కువకాలం ఒకే స్థాయిలో వుండే శక్తి నిలకడగా వుండదు. పదవుల పందెంలో ముందుకు సాగుతూనే వుండాలి. రాజకీయాల కారణంగా తానెంతో కోల్పోయానని తరచు మాటలు చెపుతూ వున్నా, వాస్తవంగా అన్నపూర్ణకు ఇంకా పదవులు పొందాలనే తపన చాలా ఎక్కువగానే వుంది. అసెంబ్లీలో ఉన్నత విద్య పొందిన సభ్యురాలు తా నొక్కతే అయిన కారణంగా, మంత్రి పదవి లభించ వచ్చుననే ఆశ ఆమె కున్నది. అందుచేత ముఖ్యమంత్రిని మెప్పించే ప్రయత్నంలో ఆమె మునిగి వుండగా, ఈ గందరగోళం తలనొప్పిగా మారింది.

జమిందారు కొన్ని రోజులు గడపటానికి గ్రామానికి వచ్చారన్న సంగతి ఆమెకు కొంత ఊరట కలిగించింది. ఈ సమస్యను జమిందారు పరిష్కరించ గల రన్న నమ్మకం ఆమెకున్న ది.

# 17

స్కూలు కెదురుగా వున్న విశాలమైన ఆవరణలో ఒక పెద్ద షామియానా వేయబడింది. వేదిక ఏర్పాటు చేయబడింది. దాని చుట్టూ జమిందారుగారి యింటి నుండి తెచ్చిన ఖరీదైన పరదాలు కట్టబడ్డాయి. బంగారు రంగులో వున్న పెద్ద పెద్ద కుర్చీలు వేదికపై వేయబడ్డాయి.

ఆవరణంతా జండాలతో, తోరణాలతో అలంకరించబడింది. విద్యార్థులకు శలవు ప్రకటించబడింది. వాళ్ళకు రకరకాల పనులు అప్పచెప్పబడ్డాయి. స్కూలు కమిటీ వారు కూడా హడావుడిగా వున్నారు.

స్కూలు భవన శంకు స్థాపనకు సోమయాజులు ఐదున్నర గంటలకు ముహూర్తం నిర్ణయించాడు. చుట్టుపక్కల గ్రామాలలోని విశిష్ట వ్యక్తులకు, జిల్లాలోని అధికార, అనధికార ప్రముఖులకు ఆహ్వానాలు పంపబడ్డాయి.

సమయం మూడున్నర గంటలైనా అనుకున్నంతగా జనం రాలేదు. హడావుడి ఎంతగా చేసినా ప్రజలలో మాత్రం ఉత్సాహం కలగలేదు. అధికారులు, పోలీసు వారు మాత్రం పెద్ద సంఖ్యలో వచ్చారు. పనిచేసే కూలీలు అక్కడ ముందునుంచే వున్నారు.

నాలుగు గంటలకు ముఖ్యమంత్రిగారి కారు గ్రామంలోకి వచ్చింది. శ్రీమతి అన్నపూర్ణ జమిందారుతో కలసి ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పటానికి పదమూడు మైళ్ళ దూరంలో ఉన్న రైల్వేస్టేషన్‌కు వెళ్ళారు. శ్రీమతి అన్నపూర్ణ ముఖ్యమంత్రి గారి కారులోనే వచ్చింది. జమిందారు మాత్రం తన కారులోనే విడిగా వచ్చాడు.

ముఖ్యమంత్రి కారు స్కూలు ఆవరణలో ఆగగానే విద్యార్థులు చక్కగా స్వాగతం చెప్పారు. ఈ స్వాగత కార్యక్రమం వారికి రెండు రోజుల ముందే నేర్పబడింది. ముఖ్యమంత్రిగారికి పూలమాలలు వేయబడ్డాయి. పుష్పగుచ్ఛాలు సమర్పించబడ్డాయి. జయ జయ ధ్వానాలతో ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది.

శంకుస్థాపన కార్యక్రమం తరువాత ముఖ్యమంత్రి వేదికపైకి వచ్చారు. జమిందారు, అన్నపూర్ణ ముఖ్యమంత్రి కిరువైపులా కూర్చున్నారు. ముఖ్యమంత్రికి

అభినందన పత్రం సమర్పించబడింది. అందులో అందమైన, మధురమైన శబ్దాలతో ఆయన గొప్పదనం వివరించబడింది. ఆయనను దేవునితో సమానమని కూడా అందులో వ్రాయబడింది. ఇది కూడా మన సంస్కృతిలో భాగమే. పైగా సోమయాజుల సాహిత్య ప్రభావమది.

చాలా సేపు ప్రయాణం చేసి వచ్చిన బడలిక కారణంగా ముఖ్యమంత్రి అలసిపోయినట్లున్నారు. ఆయన ఆవులిస్తూ ప్రసంగించ సాగాడు— "చదువు ఏమి యిచ్చినా, ఇవ్వకపోయినా, అవసరాలకు అనుగుణంగా ప్రకృతిని అదుపు చేసే జ్ఞానాన్ని మాత్రం మనకిస్తుంది.

నిరక్షరాస్యులకు అక్షరాస్యత కల్పించే వరకు మన కర్తవ్యం పూర్తికాదు. గ్రామాలలోని బడులే నిరక్షరాస్యతను రూపుమాపటంలో ప్రధాన పాత్రవహిస్తాయి. చదువే గ్రామాలను సుఖభోగాలతో నింపివుంచుతుంది."

రాజగోపాలరావు, అతని స్నేహితులకోసం అన్నపూర్ణ సభలో చుట్టూ కలియ చూసింది. ముఖ్యమంత్రికి నల్లజెండాలను ప్రదర్శించే ఏర్పాట్లేమన్నా చేస్తున్నారేమోనని ఆమె భయం అయితే ముఖ్యమంత్రి కూడా చదువు విషయంలో రాజగోపాలరావు చెప్పిన విషయాలనే చెప్పటం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించ సాగింది. ఆమె ముఖ్యమంత్రి ప్రసంగం వైపు దృష్టి సారించింది.

"కొద్ది రోజుల క్రితం మీ ప్రాంతానికి వచ్చిన వరద మరలరాదు. ఆనకట్ట నిర్మాణానికి ముందు ఇక్కడ ప్రతి సంవత్సరం వరద వచ్చేది. ఏడాది పొడుగునా ఎండిపోయి వుండే నది వర్షాకాలంలో వుధృతంగా వచ్చి గ్రామాలను నష్టపరుస్తున్నది. అందుచేతనే ఈ ఆనకట్ట కట్టి, ఆ వరదను అదుపు చేద్దామనుకున్నాం. అయితే దురదృష్ట వశాత్తూ నిర్మాణం పూర్తవుతూనే ఆనకట్టకు నష్టం జరిగింది. ఆ కారణంగానే వరద వచ్చి మిమ్మల్ని నష్టపరచింది. కొలతలు, లెఖ్ఖలు, అంచనాలు పూర్తికాగానే ఆనకట్ట మరమ్మత్తు మొదలు పెట్టబడుతుంది." ముఖ్యమంత్రి చేసిన వాగ్దానానికి సభంతా చప్పట్లతో మ్రోగిపోయింది.

ఆ రాత్రికి అక్కడే వుండవలసిందిగా జమిందారు, అన్నపూర్ణ ముఖ్యమంత్రిని కోరారు. ఆయన వుండాలా వద్దా అనే విషయం ఇంకా నిర్ణయించుకోలేదు. ధనవంతులు, జమిందారుల మనిషి అని, వారి ఆతిథ్యాలే స్వీకరిస్తారని ఎవరైనా తరువాత బురద చల్లుతారని ఆయన భయం. పైగా అన్నపూర్ణ, జమి

దారు ఆయనను మరీ బలవంత పెట్టలేదు. ముఖ్యమంత్రి ఆ రాత్రి గ్రామంలోనే వుంటే, రాజగోపాలరావుగాని, అతని మిత్రులుగాని ఏమైనా అల్లరి చేస్తారేమో అని వారి భయం. ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా ఊరేగింపు తీసినా తీయవచ్చు.

అయితే ముఖ్యమంత్రి మాత్రం జమిందారు యింటిలో భోజనం చేయటానికి మాత్రం అంగీకరించారు. ముఖ్యమంత్రికి భోజన ప్రియుడనే పేరు వుంది. జమిందారుగారి యింటిలో రకరకాల రుచికరమైన మాంసాహార పదార్థాలతో విందు ఘనంగా ఏర్పాటు చేయబడింది. ముఖ్యమంత్రి, జమిందారు యిద్దరూ సంతృప్తి చెందారు.

స్టేషన్‌కు తిరుగు ప్రయాణంలో బుడలాయాసం కారణంగా ముఖ్యమంత్రి కారులోనే నిద్రలో తూగసాగాడు అయితే ప్రత్యేకంగా ముఖ్యమంత్రితో మాట్లాడుదా మనుకున్న జమిందారుకు ఇది నచ్చలేదు.

ముఖ్యమంత్రికి స్టేషన్‌లో వీడ్కోలిచ్చి అర్ధరాత్రి తరువాత అన్నపూర్ణ జమిందారు ప్రేయసీ ప్రియుల్లాగా ముచ్చటలు తీర్చుకుంటూ ఒకే కారులో ఆనందంగా గ్రామం చేరారు.

# 18

జమిందారు యస్ ఆర్. పి. కుటుంబరావు కుమారులు గ్రామం ఎప్పుడో నూటికి - కోటికి ఒక్కసారి వస్తుంటారు. తరచు గ్రామం రావటం, తమ జమిందారీ గౌరవానికి భిన్నమని వారి ఉద్దేశ్యం. గ్రామస్థులతో దూరంగా వుండటమే ప్రతిష్ఠ అని వారు భావిస్తూ వుంటారు. వారి దృష్టిలో గ్రామం వెనుకబడివుంది. వారు నాగరికులు.

వారికి ఆస్తిపాస్తులు ప్రత్యేకంగా వున్నట్లే నౌకర్లు కూడా ప్రత్యేకంగా వున్నారు. చాలామంది నౌకర్లను తొలగించి వేయగా, మిగిలినవారిలో రాజు అనేవాడు ఎప్పుడూ కోటలోనే వుంటూవుంటాడు. జమిందారు గ్రామంలో పొలం అమ్ముతున్న సంగతి తన యజమానికి నాడే తెలియచేసాడు. పైగా తండ్రి తన కోసమే పొలం అమ్ముతున్నాడని అతని అభిప్రాయం. వార్త అందగానే అతను గ్రామం వచ్చాడు.

అయితే అతని రాక జమిందారుకు ఇష్టంలేదు. ఆయన విచారంతో మునిగి పోయాడు. పొలం అమ్మి డబ్బు ఇస్తానని కొడుకుతో చెప్పినా, ఆ డబ్బును వేరే విధంగా ఖర్చుచేయాలని ఆయన వేరే ఉద్యేశ్యంలో వున్నాడు. అయితే ఆ డబ్బు యివ్వకపోతే ఆనకట్ట ధ్వంసమైనట్లే, జమిందారు కుటుంబం కూడా ధ్వంసమయ్యేట్లుంది.

జమిందారు కుమారుడు వ్యర్థ ప్రసంగాలతో కాలం వృధా చేయకుండా తిన్నగా తండ్రి గదిలోకి వెళ్ళాడు. ఆయన తెరిచివున్న కిటికీనుండి బయట పాతబడిపోయిన కోటప్రహరీ వైపు చూస్తున్నాడు. ఆయన మనస్సు ఉద్విగ్నంగా వుంది. ఆయన చేతితో మీసం మెలిపెడుతూ వున్నాడు. ఏదైనా సమస్యలో చిక్కుకున్నప్పుడు ఆయన ఆ విధంగానే చేస్తూవుంటాడు.

జమిందారుకు కుమారునితో అక్కడ ఘర్షణకు దిగటం యిష్టం లేదు. కొడుకు అక్కడకు రాకుండా వుంటే ఆయన తర్వాత ఏం ఎత్తు వేసేవాడో తెలియదు కాని ప్రస్తుతం ఆయన తన ఎత్తు మార్చుకోవాల్సి వచ్చింది.

"మీరు రావటం మంచిదే అయ్యింది. నేనే స్వయంగా డబ్బు మీకు పంపుదామనుకుంటున్నాను. మీరే వచ్చారు. మీకోసం పూర్వీకుల ఆస్తులు అమ్మా వచ్చింది" జమిందారు గొంతులో నిష్ఠూరం ధ్వనించింది.

జమిందారు కుమారుడు నిశ్శబ్దంగా వుండిపోయాడు. అతను ఎంతో కోపంగా వచ్చాడు. కాని తండ్రి ఎదుట ఏం మాట్లాడాలో తెలియటంలేదు. అతను తండ్రితో తగాదా పడదామని వచ్చాడు. అయితే తండ్రి ఉదాత్తంగా తనను నిరుత్త రుణ్ణి చేసాడు. నిరాయుధుడిలాగా అతను నిస్సహాయంగా వుండిపోయాడు.

"డబ్బు నీదే. నువ్వు తీసుకు వెళ్ళవచ్చు. అయితే ఇక్కడ పరిస్థితులంత సరిగ్గా లేవు. నేనే స్వయంగా ఇంత పెద్ద మొత్తం తీసుకొని వెళ్ళను."

"నేను కూడా తీసుకు వెళ్ళను." జమిందారు కుమారుని గొంతు కొద్దిగా వణికింది.

"డ్రాఫ్టు తీసుకు వెళ్ళు."

"అట్లాగే తీసుకు వెళతాను."భావోద్వేగంతో అతనికి గొంతు పూడిపోయింది.

కసి, వ్యంగ్యం నిండిన గొంతుతో జమిందారు "దీనికి ఎక్కువ సమయం పట్టదు. నేను చేయించుతాను. ఆ మాత్ర మన్నా నన్ను నమ్ముతావనుకుంటాను" అని అన్నాడు.

ఆయన కుమారుడు కిటికీలో నుండి బయటికి చూడసాగాడు. ఏం చెప్పాలో తెలియని ఆలోచనలో పడ్డాడు. త్వరపడి ఇక్కడకు రావటం పొరపాటేమో అనే ఆలోచన అతని మనస్సుని పట్టి పీడించసాగింది.

"నీ గది శుభ్రంగా వుంది గదా! మనం ఇక్కడ లేకుంటే పట్టించుకునే వెధవే వుండడు. పేరుకి మనుష్యులే. కుక్కల కున్న విశ్వాసం కూడా లేదు. నేను గదిని శుభ్రం చేయటానికి ఎవ్వరినైనా పంపుతాను."

"ఫర్వాలేదు. నేనిక్కడ ఎక్కువ సేపుండను. అప్పుడే తొమ్మిది గంటలై పోయింది. నేను పట్నానికి వెళ్ళేసరికి పది గంటలవుతుంది. అప్పటికి బ్యాంకులు తెరుస్తారు."

"అయితే నువ్వు డబ్బు స్వయంగా తీసుకు వెళ్లాలనుకుంటున్నావా? కావా లంటే తీసుకు వెళ్లు. గుమాస్తా గారిని గాని, పీరాస్వామిని గాని,లేకుంటే ఇంకెవరినైనా గాని...."

తండ్రి మాటలలో కొంత వ్యంగ్యం, కాఠిన్యం వున్నప్పటికి దాన్ని పట్టించు కునే స్థితిలో కుమారుడు లేడు. తండ్రిపట్ల అతని హృదయం కృతజ్ఞతతో నిండి పోయింది. కుమారుడు తండ్రిని సెలవిమ్మన్నాడు.

"మంచిది. నీ ఫ్యాక్టరీ అభివృద్ధికి రావాలని కోరుకుంటున్నాను. నువ్వెక్కడ లనుకుంటే అక్కడ ఫ్యాక్టరీ కట్టుకో. పెద్దవాడివైపోయావ్ కదా! ఏం

చెయ్యాలో నీకూ బాగానే తెలుసు. నా బాధ అల్లా ఒక్కటే, నీకు డబ్బు ముందుగా ఏర్పాటు చేయలేకపోయాను." జమిందారు కుమారుని వైపు దృష్టి సారిస్తూ అన్నాడు. ఆయన మాటలలో విచిత్రమైన మర్యాద, ఆత్మీయత చోటు చేసుకున్నాయి.

తండ్రి ఈ విధంగా ఎందుకు వ్యవహరిస్తున్నాడో కుమారునికి అర్థం కావటం లేదు. తండ్రి డబ్బు విషయంలో గడ్డి తినటానికైనా వెనుకాడడని, పిసినారి అని అతని ఉద్దేశ్యం. అటువంటివాడు యీ విధంగా వ్యవహరించడం అతని కాశ్చర్యాన్ని కలుగజేసింది. తండ్రి పూర్తిగా మారిపోయాడేమో అనే అనుమానం కూడా అతనికి కలుగసాగింది.

అతను బయట పోర్టికోలోకి వచ్చాడు. అతని వెనుక నౌకరు రాజు డబ్బు సంచులు తీసుకుని వస్తున్నాడు. వెంట గుమస్తా కూడా వున్నాడు. సోమయాజులు చేతులు జోడించివంగి నమస్కారం చేస్తూ, "భగవంతుడు మీకు మేలు చేయుగాక!" అని అన్నాడు.

సోమయాజులు మాటలకు అతనేమీ ఆశ్చర్యపోలేదు. ఆ మాటల అంతర్యం అతనికి తెలుసు.

"చిన్న దొరగారు ఫ్యాక్టరీ కడుతున్నారని తెలిసింది. భగవంతుడు మీకు తోడుగా వుంటాడు."

సోమయాజులు ఆశీర్వాద వచనాలు ఎందుకు కురిపిస్తున్నాడో అతనికి తెలుసు ఏవో గొంతెమ్మ కోరికలకు అవి నాంది అని కూడా అతనికి తెలుసు.

సోమయాజులు చేతులు నలుపుకుంటూ "అయ్యా! మీకు తెలవందేముంది? మా కుటుంబం మీ సేవలోనే, మీ దయాదాక్షిణ్యాల మీదే బ్రతుకుతుంది. మా అబ్బాయికి ఏదైనా చిన్న వుద్యోగం యిచ్చి పుణ్యం కట్టుకోండి. వాడితో మంత్రాలు చదివించడం నా కిష్టంలేదు. ఏదైనా గుమస్తాగిరి దయ చేయించండి. మీ సహాయం మరవము. మా తాతలు తండ్రులు మీ పూర్వీకుల ఉప్పుతిని బ్రతికారు. మా జీవితాలను కూగా ఇలాగే గడిచిపోనివ్వండి" అన్నాడు.

"అట్లాగే చూద్దాంలే" అంటూ అతను రాజు, వీరస్వామితో పాటు కారు ఎక్కి వెళ్ళిపోయాడు.

ఆ రోజు సాయంత్రము ఆ గ్రామంలోని ఒక ప్రముఖునికి కోటలో విందు ఏర్పాటు చేశాడు. ఆ ప్రముఖునికి యీ విందు ఎందుకో అర్థము కాలేదు జమిందారు కూడా అతనికి ఏమి చెప్పలేదు.

# 19

నాలుగైదు రోజుల తర్వాత ఒక రోజు సాయంత్రం జమిందారు, రాజగోపాలరావు దాదాపు ఒకే సమయంలో గ్రామం నుండి బయలుదేరారు. జమిందారు కారులో, రాజగోపాలరావు కాలి నడకన బయలుదేరారు.

రాజగోపాలరావు గ్రామం దాటి పట్టణం వైపు నడుస్తూ వుండగా జమిందారు కారు అతనిని దాటి వెళ్ళింది. కారులో జమిందారుతో సోమయాజులు కూడా వున్నాడు.

పట్టణంలోని కో-ఆపరేటివ్ స్టోర్సుకు కొత్త విత్తనాలు వచ్చాయని తెలిసి, వాటిని స్వయంగా కొని తీసుకువద్దామని రాజగోపాలరావు బయలుదేరాడు. అతని సోదరుడు ఆ స్టోర్సు మొహం చూడటం కూడా వృధా అని భావించాడు.

వర్షాకాలంలో పైన భాగం కొట్టుకుపోగా బయటపడిన రాళ్ళ కారణంగా రోడ్డు అధ్వాన్నంగా వుంది. కాలినడకన వెళ్ళేవాళ్ళు రోడ్డు ప్రక్కన కాలిబాట వెంట వెడుతూ వుంటారు. ఆ రోడ్డుమీద బస్సులుకూడా ఎక్కువ తిరగవు. అడపాదడపా ఒకటీ అరా వస్తూ వుంటాయి. వర్షాకాలం అయితే ఏమీ వుండవు. రాజగోపాలరావు ఆ దారి వెంటే ఉత్సాహంగా నడుస్తున్నాడు.

అప్పుడప్పుడు సైకిళ్ళు వెనక నుండి, ముందు నుండి వస్తున్నాయి. ఈ మధ్యన కొద్ది సంవత్సరాలుగా ఆ ప్రాంతంలో సైకిళ్ళ సంఖ్య పెరిగింది.

రాజగోపాలరావు పట్టణం సమీపించేసరికి, జమిందారు ఫోర్డు కారు ఎదురు వస్తూ వుంది. అందులో జమిందారు లేడు. సోమయాజులు మాత్రమున్నాడు. రాజగోపాలరావు ప్రక్కనుండి కారు వెళుతున్నప్పుడు సోమయాజులు చెయ్యి ఊపాడు. జమిందారు ఎక్కడకు వెళ్ళింది, ఎక్కడవుంది మొదలైన వివరాలు తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు. ఎక్కడకు పోతే నాకేమిటే! అని అనుకున్నాడు.

కో-ఆపరేటివ్ స్టోర్సులో రాజగోపాలరావును ఎవ్వరూ పలకరించలేదు. అక్కడ మనుష్యులు కూడా ఎక్కువ లేరు. అక్కడ పనిచేసే వాళ్ళు ఏదో పనిలో మునిగి వున్నారు. రాజగోపాలరావు వాళ్ళ దృష్టి నాకర్షించటానికి చాలా ప్రయత్నాలు చేసాడు. చివరకు ఒకతను అడిగాడు.

"ఏం కావాలి?"

"విత్తనాలు." రాజగోపాలరావు సమాధానమిచ్చాడు.

"కొంచెం ఆగండి...." అంటూ అతను పెద్ద పెద్ద బస్తాల చాటుకు వెళ్ళిపోయాడు. వాస్తవానికి వాళ్లంతా రాజగోపాలరావు ఎవరో తెలిసినవాళ్ళే. అయితే ఇప్పుడు వారెందుకు ఈ విధంగా ప్రవర్తిస్తున్నారో రాజగోపాలరావుకు అర్థం కాలేదు.

గుమస్తా పనివాణ్ణి పిలిచి లోపలనుండి విత్తనాలు తెప్పించాడు. అయితే అతని చూపులు, చేష్టలు తన స్వంత సొమ్మేదో ఇస్తున్నట్లు వున్నాయి అతను విత్తనాలు తూచి రాజగోపాలరావు సంచిలో పోసాడు. రాజగోపాలరావు బిల్లు ప్రకారం డబ్బు చెల్లించాడు. సంచి తీసుకుని స్టోర్సులోనుండి బయటకు వచ్చాడు.

అతను స్టోర్సునుండి బయటికి వస్తుండగా వెనకనుండి బిగ్గరగా నవ్వులు వినిపించాయి. వాళ్ళు తనను అవహేళన చేస్తున్నారన్న అనుమానం రాజగోపాలరావుకు వచ్చింది.

రాజగోపాలరావుకు ఇంకా కొన్ని చిన్న చిన్న వస్తువులు కొనవలసిన పని వున్నది అంతేకాకుండా ఒకరిద్దరు మిత్రులను కూడా కలవవలసివున్నది.

పనులన్నీ చూసుకుని గ్రామానికి బయలుదేరేసరికి చీకటి పడసాగింది. వీథులన్నీ నిర్మానుష్యంగా అయిపోయాయి ఆఖరు బస్సు కూడా వెళ్ళిపోయింది. అయితే రాజగోపాలరావుకు ఆ దారి కళ్ళు మూసుకుని సైతం వెళ్ళిపోగలంత పరిచయముంది. ఆ రోడ్డులో ప్రతి అడుగు అతనికి తెలుసు పైగా ఆ దారిలో ఎన్ని సార్లు నడిచాడో లెక్కలేదు. ఎండలో, వానలో, బురదలో, ధూళిలో, వెన్నెలలో ఎన్నోసార్లు నడిచాడు.

ఒక మైలు నడిచేసరికి చీకటి దట్టంగా ముసురుకోసాగింది. ఆకాశంలో నల్లటి మేఘాలు వ్యాపించి నక్షత్రాలను కప్పివేసాయి చల్లటి గాలి వేగంగా వీచసాగింది. రాజగోపాలరావు చేతుల్లో బరువులు వున్నకారణంగా మెల్లగా నడవసాగాడు.

మధ్యలో చిన్న చిన్న రాళ్ళు కాళ్ళకు తగులుతున్నాయి అతను కొండ దగ్గరకు వచ్చేసరికి బాగా అలసిపోయాడు. కొంత ప్రక్కన రోడ్డుపై వున్న చిన్న వంతెన దగ్గర రాజగోపాలరావు ఆగాడు. అక్కడ కొంచెంసేపు విశ్రాంతి తీసుకునే ఉద్దేశ్యంతో చేతుల్లో బరువులు క్రిందదించి, చమటతో నిండిన మొహాన్ని

తుడుచుకున్నాడు. అతనికి బాగా దాహం వేస్తున్నది దగ్గరలో వున్న హరిజన వాడకు వెళ్ళే సమయంలో తన ఇంటికే వెళ్ళవచ్చునని, అక్కడే కొంచెంసేపు విశ్రాంతికోసం ఆగాడు.

రోడ్డుమీద ఎవరూ కనపడలేదు. చీకటిపడినా, అంతగా పొద్దుకుంకలేదు. అందుచేత ఎవ్వరూ కనబడక పోవటం రాజగోపాలరావుకు ఆశ్చర్యం కలిగించింది. అయితే అప్పుడప్పుడు వర్షం కురిసిన కారణంగా అందరూ త్వరగా యిళ్ళకు వెళ్ళి పోయి వుంటారని భావించాడు

రాజగోపాలరావు లేచి సంచులు చేతుల్లోకి తీసుకుని నడక సాగించాడు. గుడి దగ్గరకు చేరుకున్నాడు అకస్మాత్తుగా ముగ్గురు మనుష్యులు ముఖాలపై ముసుగులు వేసుకున్నవారు, చేతుల్లో కర్రలతో రోడ్డుకు అడ్డంగా వచ్చి, రాజ గోపాలరావుపైబడి కొట్టసాగారు. అతను సహాయంకోసం కేకలు వేయసాగాడు. ఆగంతుకులలో ఒకరు 'తలపై కొట్టకండి' అని అరిచారు రాజగోపాలరావు ఆ గొంతు గుర్తుపట్టాడు. అది వీరాస్వామిది. రాజగోపాలరావుకు క్రమంగా స్పృహ తప్పసాగింది. వాళ్ళు రాజగోపాలరావును కాళ్ళతో తన్ని రోడ్డుకు అడ్డంగా ఈడ్చి వేసి, గుడివైపు పారిపోయారు.

రాజగోపాలరావు కేకలువిన్న హరిజన వాడలోని వారు లాంతర్లు తీసుకుని పరుగెత్తుకు రాసాగారు. రోడ్డుమీద గాయాలలో, స్పృహతప్పి పడివున్న రాజ గోపాలరావును వాళ్ళు చూసారు అతను రక్తంతో తడిసిపోయి, మూలగసాగాడు. సంచుల్లోని సరుకులు ప్రక్కన చెల్లాచెదరుగా పడివున్నాయి. వాళ్ళు దూరంగా ఎవరో గ్రామాలవైపు పరుగెత్తి వెళ్ళటం చూసారు. కొందరు పరుగెత్తి అతనిని వెంబడించి పట్టుకున్నారు. అతను గణేష్. గణేష్ అంటే అప్పటికే వారికి చాలా కోపం వున్నది వాళ్ళమ్మాయి నొకరిని గణేష్ చెడగొట్టి, ఉంపుడుగత్తెగా వుంచు కున్నాడు.

ఇంతలో కొందరు గ్రామస్థులు పరుగెత్తుకుంటూ అక్కడకు వచ్చారు. వాళ్ళు రాజగోపాలరావును ఎత్తుకుని అతని ఇంటికి తీసుకువెళ్ళారు. ఆస్పత్రి దగ్గరలో లేదు. వాళ్ళకు తెలిసిన వైద్యం చెయ్యసాగారు. గణేష్ను ఎదురుగా చెట్టుకు కట్టివేసారు.

సోమయాజులు గాభరాగా, రొప్పుతూ రాజగోపాలరావు ఇంటికి వచ్చాడు. అతను చెప్పినమీదట వేణుగోపాలరావు, రాజగోపాలరావును జమిందారుగారి కారులో పట్టణంలోని ఆస్పత్రికి తీసుకువెళ్ళారు.

# 20

ఆరోజు రాత్రి అన్నపూర్ణ కొంచెం ఆలస్యంగా ఇంటికి వచ్చింది సభలో మాట్లాడటానికి అమె ప్రక్కగ్రామం వెళ్ళింది. కొందరు దుండగులు, తన భర్త నాయకత్వంలో రాజగోపాలరావును పట్టుకు కొట్టారని ఆమెకు ఇంటికి రాగానే చెప్పారు. ఆమె భర్తను చెట్టుకు కట్టివేసినట్లుగా కూడా ఆమెకు తెలిసింది.

అన్నపూర్ణ గాభరాపడింది. వెంటనే రాజగోపాలరావును చూడాలనుకుంది. భర్త పరిస్థితి కూడా ఆమెకు ఆందోళనకరంగానే వుంది. అయితే అక్కడకు వెళితే కోపంలో వున్న రాజగోపాలరావు సహచరులు తన నేం చేస్తారో అనే భయం ఆమెను పట్టుకుంది. కొంచెం ఆలోచించి రెండు చోట్లకు వెళ్ళటం మంచిది కాదని ఆగిపోయింది.

సోమయాజులు ఆమెకు మొత్తం సంగతంతా చెప్పాడు. ఆమెకు ఏం చెయ్యాలో తోచటం లేదు. ఆందోళన పెరగసాగింది. తన యింటి వరండాలో అటూ ఇటూ తిరగసాగింది.

అసూయతో గణేష్ ఈ విధంగా చేసాడని గ్రామంలో చెప్పుకొనసాగారు. రాజగోపాలరావుకు అతని భార్యతో సంబంధం వున్న సంగతి అతనికి తెలుసునని, ఇటువంటి విషయాలలో పిరికివాళ్ళు కూడా వీరులుగా మారిపోతారని కొందరనుకోసాగారు. కొందరికి ఈ విషయం మొత్తం ఆనందం కలిగించింది.

నిజంగా గణేష్ ఇది చేస్తే, ఆయన కూడా రక్తమాంసాలున్న మనిషేనని నిరూపించుకున్నాడని సంతోషించవచ్చునని అన్నపూర్ణ మనసులో అనుకుంది అయితే తన భర్త తనను ఈ విధంగా అల్లరి చేసినందుకు ఆమెకు బాధగా కూడా వుంది.

ఈ పరిస్థితులలో జమిందారు సలహా తీసుకోవటం మంచిదని ఆమె భావించింది. అయితే ఆయన వెళ్ళిపోయాడని, ఎక్కడ వున్నాడో ఎవరికీ తెలియదనీ తెలిసి హతాశురాలయ్యింది.

ఇంతలో రాజగోపాలరావు ఇంటి వద్ద నుండి ఒక మనిషి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'వాళ్ళు గణేష్‌ను కొడుతున్నారు. అతను నిరపరాధి అయితే కొడుతుంటే చెప్పేవాడే కదా! అతను ఎన్ని కొడుతున్నా ఏం మాట్లాడడం లేదు. అందుచేత నిశ్చయంగా అతనే రాజగోపాలరావును కొట్టాడని వాళ్ళనుకుంటున్నారు.' అతను అన్నపూర్ణతో చెప్పాడు

ఆగ్రహంతో వున్న ఆ గుంపుకు సర్ది చెప్పటం తనవల్ల కాదని అన్నపూర్ణకు తెలుసు. అట్లా అని మెదలకుండా వుండటం కూడా ఆమెకు సాధ్యపడటం లేదు. భర్తను కొడుతుంటే భార్య ఎటువంటిదైనా సహించలేదు. ఆమె నలుగురు మనుష్యులను పంపింది. గణేష్‌ను కొట్టవద్దని, అతను పారిపోతాడని భావిస్తే ఏదైనా గదిలో పెట్టి తాళం వేయమని కబురు పంపింది.

అన్నపూర్ణ పంపిన మనుష్యులు చాలా సేపు చెప్పిన మీదట, అన్నపూర్ణ రాజగోపాలరావును కలవటానికి జమిందారు కారులో ఆస్పత్రికి వెళ్ళిందని తెలిసిన తర్వాత, రాజగోపాలరావు మనుష్యులు గణేష్‌ను ఒక గదిలో వుంచుట కంగీకరించారు.

ఆమె పట్టణంలో డాక్టరు ఇంటికి వెళ్ళేసరికే, అక్కడ పోలీసులు వున్నారు. రాజగోపాలరావు పరిస్థితి ఆమెకు చెప్పబడినంత తీవ్రంగా లేదు.

అతనికి ఒక చెయ్యి విరిగింది. దానికి కట్టు కట్టబడింది. మొహం మీద అక్కడక్కడ చిన్న చిన్న గాయాలయ్యాయి. ఒక కాలు కూడా విరిగింది. దానికి కూడా కట్టు కట్టబడింది. మత్తు మందు కారణంగా అతను నిద్రపోతున్నాడు.

రాజగోపాలరావుకు మెలుకువ వచ్చిన తర్వాత విషయం తెలుసుకోవటానికి పోలీసులు అక్కడే కాపలా వున్నారు. అన్నపూర్ణ కూడా ఒక మిత్రుని ఇంటిలో రాత్రి వుండిపోయింది.

తెల్లవారిన తర్వాత ఆమె రాజగోపాలరావు వద్దకు వెళ్ళింది. అతను కళ్ళు తెరిచి వున్నాడు. అతను ఆమెను చూసి చిరునవ్వు నవ్వాడు. అన్నపూర్ణ భయంతో సంకోచంతో అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళింది.

"పెద్ద ప్రమాదమేమీ లేదు. రెండు చిన్న ఫ్రాక్చర్లయ్యాయి. త్వరలోనే తగ్గిపోతాయి." రాజగోపాలరావు అన్నపూర్ణతో మెల్లిగా అన్నాడు. అన్నపూర్ణ కన్నీటిని పైట చెంగుతో తుడుచుకోసాగింది.

"మీ కెవరి మీదైనా అనుమానం వున్నదా?" అప్పుడే వచ్చిన పోలీసు ఇన్‌స్పెక్టర్ రాజగోపాలరావుతో అన్నాడు.

"గణేశ్ మీద అనుమానమున్నదా?" ప్రశ్న వెంట ప్రశ్న వేసాడు ఇన్‌స్పెక్టర్. కొద్ది రోజుల క్రితం రాజగోపాలరావును నిర్బంధించిన ఇనస్పెక్టరే ఇతను.

"లేదు. ఏ మాత్రం అనుమానం లేదు." రాజగోపాలరావు స్పష్టంగా, దృఢంగా చెప్పాడు.

"కాని వాళ్ళు ఆయనను కొడుతున్నారు. గదిలో బంధించి పెట్టారు." అన్నపూర్ణ ఏడుస్తూ చెప్పింది.

"ఆయనను వెంటనే విడిపించండి. అతనికి ఈ సంఘటనకి ఏ మాత్రం సంబంధం లేదు." రాజగోపాలరావు ఇనస్పెక్టర్‌తో చెప్పాడు.

అన్నపూర్ణ తేలికగా ఊపిరి పీల్చుకున్నది. స్వతహాగా తన భర్తకు అంత ధైర్యం లేదని ఆమెకు తెలుసు. బహుశా అతను హరిజనవాడలోని తన ఉంపుడుగత్తె దగ్గర నుండి తిరిగి వస్తూ, అలజడి గమనించి పరుగెత్తుతూ వుంటే పట్టుకుని వుండవచ్చునని ఆమె అనుకోసాగింది.

"అయితే ఇది ఎవరు చేసారని మీ ఉద్దేశ్యం?" ఇనస్పెక్టరు రాజగోపాలరావును ప్రశ్నించాడు.

"ఎవరో ఒకరు చేస్తేనే కదా ఇంత జరిగింది నా అంతట నేను కొట్టుకో లేను కదా! కాని గణేష్‌కు మాత్రం ఇందులో ఏ మాత్రం పాత్రలేదు- ఒక్క నిముషం ఆగండి!" అంటూ రాజగోపాలరావు అన్నపూర్ణ వైపు తిరిగి- "మీరు వెళ్ళండి, మా అన్నయ్యను కూడా తీసుకు వెళ్ళండి. గణేష్‌ను కొట్టకుండా చూడండి. ఒకవేళ ఇప్పటికే అతనికేమయినా దెబ్బలు తగిలితే వెంటనే ఇక్కడకు తీసుకురండి!" అన్నాడు.

అన్నపూర్ణ వెంటనే కారులో వెళ్ళిపోయింది.

"మీరు చెప్పకుండా వుంటే మేము చాలా మంది గ్రామస్థులను అనవసరంగా నిర్బంధించ వలసి వుంటుంది. అది మీకూ మంచిది కాదు, నాకూ మంచిది కాదు!" ఇనస్పెక్టర్ రాజగోపాలరావుతో అన్నాడు.

"మిగతా వారి సంగతి నాకు తెలియదు కాని, వీరాస్వామి మాత్రం 'తల మీద కొట్టవద్దు' అనటం నాకు వినిపించింది."

"అయితే అతనే చేసి వుంటాడా? అతను జమిందారుగారి స్వంత నౌఖరు. ఇంకా ఎవరి మీదైనా మీకు అనుమానమున్నదా?"

"చీకటి దట్టంగా వున్న కారణంగా నేను ఎవరిని చూడలేకపోయాను. పైగా వాళ్ళు ముఖాలను కప్పుకుని వున్నారు. వీరాస్వామిని కూడా అతని మాట ననుబట్టి గుర్తుపట్టాను. నాకు చిన్నప్పటినుంచి తెలుసు కనుక అతని గొంతును నేను గుర్తించ గలిగాను."

"ముగ్గురు కంటె ఎక్కువ లేరని మీరు ఖచ్చితంగా చెప్పగలరా?"

"అవును."

"మీకు ఇక్కడ సౌకర్యంగా వుందా? మీకేదయినా ఇబ్బంది వుంటే చెప్పండి; మిమ్మలను ప్రభుత్వ అస్పత్రికి తీసుకెళతాము."

"లేదు. ఇక్కడ సౌకర్యంగానే వున్నది."

"ప్రభుత్వ డాక్టరు వచ్చి మిమ్మలను పరీక్ష చేస్తారు. ఈ డాక్టర్ సాక్ష్యంతో పాటు, ప్రభుత్వ డాక్టర్ సాక్ష్యం కూడా అవసరమవుతుంది!"

తరువాత ఇనస్పెక్టర్ పోలీసులను తీసుకొని జీపులో వెళ్ళిపోయాడు.

వీరాస్వామి తన యింటిబయట మంచం మీద గురకలు పెడుతూ నిదుర పోతున్నాడు. మంచం క్రింద చౌకరకం ఖాళీ మద్యం సీసా పడివుంది.

పోలీసులు వీరాస్వామి యింటికి వెళ్ళి అతనిని నిర్బంధించి పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్ళారు. పోలీసులు ఇంత త్వరగా కదులుతారని కాని, తనను నిర్బంధిస్తారని కాని వీరాస్వామి అనుకోలేదు. ఇంతకు ముందు తానిటువంటి పనులు కొన్ని చేసినా, ఎప్పుడూ ఇంత త్వరగా చర్య తీసుకోబడలేదు.

గణేష్‌ను బాగానే కొట్టారుగాని, పెద్దగా గాయాలు తగలలేదు. నోరు, ముక్కు నుంచి కొంచెం రక్తం స్రవించసాగింది.

అన్నపూర్ణ కొంచెం సేపు అతనికి సేవలు చేసి, రాజగోపాలరావు దగ్గరకు వెళ్ళింది. గ్రామ రాజకీయాలలో హింస కూడా చోటు చేసుకున్నందుకు ఆమె ఆందోళన చెందసాగింది.

# 21

వీరాస్వామి చెప్పబడినంత, కనిపించేంత దుర్మార్గుడు కాదు. అతను పక్కా గూండా కూడా కాదు. రాజగోపాలరావుపై జరిగిన దాడికి వీరాస్వామిని ఎవరో ప్రోత్సాహించారని పోలీసులు త్వరగానే తెలుసుకోగలిగారు. అతను యజమాని కోసం ప్రాణాలైనా అర్పించే నౌకరని కూడా వారికి తెలుసు.

ఎంతసేపు పోలీసులు ప్రశ్నలతో వేధించినా ఎవరి ప్రోద్బలంతో రాజ గోపాలరావుని కొట్టాడో చెప్పలేదు. సరైన 'అతిథ్య' మిస్తేగాని వాడు నోరు తెరవడని భావించిన పోలీసులు వాడిని చీకటి కొట్లో పడవేశారు వాడు భయపడి పోయాడు. వాడెప్పుడూ జైలుకి వెళ్లలేదు. అంతేకాదు, ఆకలితో వుండవలసిన దుస్థితి కూడా వాడికి ఎప్పుడూ ఏర్పడలేదు.

''రాజగోపాలరావుని నువ్వే కొట్టావ్ కదూ!'' అని పోలీస్ ఇనస్పెక్టర్ ప్రశ్నించాడు. ముందు వీరాస్వామి నోరు విప్పలేదు. ఐతే పోలీసులు కొద్దిగా 'ఆతిథ్యం' ప్రారంభించిన తర్వాత నోరు విప్పాడు తాను కొట్టానని, ఐతే కొట్టింది ఎవరినో తెలియదని ఒప్పుకున్నాడు.

''అయితే నువ్వు ఎవరో ఒకరిని కొట్టానన్న మాట మరి''.... ఇనస్పెక్టర్ అన్నాడు.

వీరాస్వామి తల వూపాడు. వాడు అప్పుడు అంతకన్నా ఎక్కువ చెప్ప లేకపోతున్నాడు. క్షమించమని బతిమిలాడుతూ ఇనస్పెక్టర్ కాళ్ళు పట్టుకో సాగాడు.

''తొందరేం లేదు. మాకన్నీ తెలుస్తాయి. నువ్వు అతనిని ఎందుకు కొట్టావో మర్యాదగా చెప్పు.''

వీరాస్వామి కథఅల్లసాగాడు- ''వరద వచ్చిన దగ్గర నుండి గ్రామంలో ఎక్కడా ధాన్యం లేదు. కోటలో మాత్రమే ధాన్యం వున్నది. చుట్టు ప్రక్కల గ్రామాల నుండి చాలా మంది ధాన్యం దొంగిలించటానికి వస్తున్నారు. కోటలో చాలా ధాన్యం బస్తాలు పోయాయి. కోటలో నుంచి ఎవరో ధాన్యం ఎత్తుకెళుతున్నా రని నేనే అనుకున్నాను. దొంగ అనుకుని కర్రతో కొట్టాను. దేవుడి తోడుగా నే నాయన తల మీద కొట్టలేదు.''

''బావుంది. చెప్పు.''

"నేను చెప్పేదంతా నిజమే దొరా! మా అయ్యగారి మీద ఒట్టు. నేను నిజమే చెబుతున్నాను."

"అయితే నీకు తోడుగా ఇద్దరు మనుష్యులను ఎందుకు తీసుకువెళ్ళావ్?"

"నేను తీసుకు వెళ్ళలేదయ్యా!"

"అయితే నీవు ఒంటరిగానే వెళ్ళావా?"

"అవును దొరా!"

"అయితే, నీవు ఆ మనిషిని కోటలో నుండే వెంబడించావా?"

"అవునయ్యా!"

"నువ్వు ఆ మనిషి కొట్టిన చోటు కోటకు కిలోమీటరు దూరంలో వున్నట్లుంది."

"అవునయ్యా!"

"నీవేమన్నా కుంటివాడివా? చేతులలో సంచులు మోసుకు వస్తున్న వ్యక్తిని పట్టుకోవటానికి మైలుదూరం వెంటబడవలసి వచ్చిందా?"

"బాబుగారూ! నా కడుపులో నెప్పిగా వుందండీ!"

"ఇంకా చాలా నొప్పులొస్తాయ్ నీకు. ఒళ్ళు దగ్గరుంచుకుని చేసిందంతా చెప్పు, తేలికగా పోతావ్. లేకపోతే చర్మం ఒలిచేస్తా! అర్థమైందా?"

వీరాస్వామి అక్కడ అటు ఇటూ తిరగసాగాడు. కాపలావున్న పోలీసు వాళ్ళను సిగరెట్ ఇమ్మని బతిమిలాడసాగాడు. ఎవ్వరూ సిగరెట్ ఇవ్వకపోయే సరికి వాడికి పిచ్చెక్కినట్టుంది.

జమిందారుగారు వచ్చి ఆ నరకంలో నుంచి తనను బయట పడవేయాలని వాడు దేవుడికి మ్రొక్కసాగాడు. వాడు తనకు తెలిసిన దేవతలకూ, దేవుళ్ళకూ అది చేస్తానని, యిది చేస్తానని మనసులో ముడుపులు కట్టసాగాడు. అయితే ఎవ్వరూ సిగరెట్ ఇవ్వకపోయేసరికి, తలుపులు తీయకపోయేసరికి వాడు దేవుళ్ళనందరినీ తిట్టసాగాడు. వాడి పరిస్థితి దయనీయంగా వుంది.

గ్రామం నుంచి ఏ ఒక్కరూ వాడికోసం రాకపోయేసరికి వెర్రి ఎక్క సాగింది. గ్రామంలో తనకు తెలిసిన వాళ్ళనందరినీ పేరు పేరునా తిట్టసాగాడు.

తాను సరిగ్గా అబద్ధం చెప్పలేకపోయానన్న సంగతి వాడు తెలుసుకోలేదు. కానీ పోలీసులు 'ఆతిథ్యం' సంగతి చెప్పేసరికి కొట్టానని ఒప్పుకున్నాడు.

పోలీసు ఇనస్పెక్టర్ తిరిగి ప్రశ్నించసాగాడు:

"అతను కోటలో నుండి ధాన్యం దొంగిలించినందుకు కొట్టానని చెప్పావ్. నేను దానికి ఒప్పుకున్నా. అయితే కొట్టిన తర్వాత ఎందుకు పారిపోయావ్? ఆ ధాన్యం ఎందుకు తీసుకువెళ్లలేదు? కథలు చెప్పటం మాని, ఎందుకు కొట్టావో, ఎవరు కొట్టమన్నారో తిన్నగా చెప్పు."

వీరాస్వామి చేతులు జోడించి నమస్కారం పెట్టాడేగాని నోరు విప్పలేదు.

"సోమయాజులు కొట్టమన్నాడా?"

వీరాస్వామి తల వూపాడు.

"మిగిలిన యిద్దరూ ఎవరు?"

"రాజుగాడు, సీలయ్య."

వీరాస్వామి గొణిగాడు.

"ఈ ఏడుపు ముందే ఏడవొచ్చు గదా!"

"దొరగారూ! మీరే నాకు సహాయం చెయ్యాలి. మీరే నన్ను కాపాడగలరు. పెళ్ళాం బిడ్డలు కలవాడిని. అందరికీ నేనే ఆధారం. పేదవాడిని. మీరు చెప్పినట్లు నిజం ఒప్పుకున్నాను. మీరే నాకు దిక్కు."

వీరాస్వామి ఇనస్పెక్టర్ కాళ్ళమీద పడ్డాడు. ఇనస్పెక్టర్ విదిలించుకుని బయటకు వెళ్ళిపోయాడు.

"దొరా! దొరా! ఒక్క బీడి ఇప్పించండి దొరా! సిగరెట్ పీక అయినా సరే, లేకుంటే పొగాకు కాడ అయినా సరే దయచేయండి."

ఇనస్పెక్టర్ ముందుకు వెళ్ళి చేతులు చాచి అడుగసాగాడు. ఇనస్పెక్టర్ నవ్వుతూ రెండు సిగరెట్‌లు వాడి మీదకు విసిరాడు.

వాడు సిగిరెట్ వెలిగించి, పొగ పీల్చి, కొంచెంసేపు బిగ్గరగా యేడ్చాడు. మరికొంతసేపటికి కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

వాడు కళ్లు తెరచేసరికి పోలీసులు సోమయాజుల్ని కూడా ఆ గదిలోకి నెట్టారు. అప్పుడే చీకటి పడింది. ఆ గది మూలదీపం సన్నగా వెలగ సాగింది. వారిరువురూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. లోపల లోపల ఒకరిమీద మరొకరికి కోపం మండిపోతున్నట్లుంది.

# 22

సోమయాజులు రాత్రంతా పద్మాసనం వేసుకుని ప్రార్థన చేస్తూ వున్నాడు. తాను చెరసాల చీకటి గదుల్లోంచి ఆధ్యాత్మిక కాంతి కిరణాలను దర్శించే యోగి పుంగవుడ ననుకుంటున్నట్లున్నాడు. రాత్రంతా రకరకాల దేవతలను, దేవుళ్ళను మనస్సులోనే ప్రార్థించసాగాడు.

మరుసటి రోజు ఉదయం జమిందారు పోలీసుస్టేషన్‌కు వచ్చేసరికి, అతను ధ్యానమగ్నుడై వున్నట్లు ఒక మూల కూర్చుని వున్నాడు. జమిందారు అతనిని, పీరాస్వామిని బెయిల్ పై విడిపించటానికి వచ్చాడు. పూర్వకాలంలో జమిందారు తన మనుష్యులను ఈ విధంగా విడిపించటం ఉదారత్వంగా భావించబడుతూ వుండేది. అయితే ఇప్పుడు జమిందారు తనను రక్షించుకోవటానికే వీరిని విడిపించ డానికి వచ్చాడనుకుంటున్నారు.

సోమయాజులు టక్కరి అయినా, హింసకు పాల్పడగలడని ఎవరూ విశ్వ సించలేకపోతున్నారు. అందులోనూ గ్రామ ప్రముఖుడైన రాజగోపాలరావు వంటి వారిని కొట్టించేంత ధైర్యం చేస్తాడని భావించలేకపోతున్నారు.

పీరాస్వామి విషయం వేరు. వాడు యజమానికి బానిసవంటివాడు. యజమాని కోసం ఏదైనా చేయడానికి వెనుకాడడు. యజమాని అజ్ఞాపాలనే తన కర్తవ్యమను కుంటాడు. తన విశ్వాసపాత్రత పట్ల వాడికి గర్వమున్నది.

రాజగోపాల రావంటే జమిందారుకు పడదని ఆ తాలూకాలో అందరికీ తెలుసు. ఆయనకే గనక వీలయితే రాజగోపాలరావును ఈ పాటికి చంపించి వుండే వాడని కూడా వారికి తెలుసు. జమిందారీలు కాలగర్భంలో కలిసిపోతున్నా రాజగోపాలరావు, అతని మిత్రుల వంటివారిని సహించే స్థితిలో జమిందారు లేడు.

జమిందారు మొట్టమొదట రాజగోపాలరావును ఏదో ఒక నేరం మీద జైలుకు పంపుదామనుకున్నాడు. ఏదో ఒక ప్రయత్నం ద్వారా అతనిని బాధించటమే ధ్యేయంగా పెట్టుకున్నాడు. అయితే జమిందారు చేసిన ప్రయత్నాలన్నీ రాజగోపాల రావుకే లాభించసాగాయి. ప్రజలలో రాజగోపాలరావు పలుకుబడి రోజు రోజుకి పెరగసాగింది. ప్రస్తుతం గ్రామంలో అతను జమిందారు కంటె కూడా పలుకుబడి గలవాడు. ఇది జమిందారుకు మరీ కంటగింపయ్యింది.

ఈ పరిస్థితులలో జమిందారు తన పూర్వీకుల మార్గాన్నే ఎన్నుకున్నాడు. కొట్టించటం, చంపించటం ఆయనకు తెలిసిన మార్గమే. ఇటువంటి పనులు జమిందారు ఇంతకు ముందు చాలా చేసాడు. అయినా ఎవ్వరూ వ్రేలెత్తి చూపలేక పోయారు. చట్టం కూడా అతనినేం చెయ్యలేకపోయింది.

జమిందారు పోలీసు ఇనస్పెక్టర్‌కు, మేజస్ట్రేటుకు, చివరకు పోలీసు కానిస్టేబుళ్ళకు కూడా ఈ కేసులో బాగా లంచాలు ఇచ్చాడని జనం చెప్పుకో సాగారు. ఆలస్యం చేస్తే సోమయాజులు అసలు రహస్యమంతా చెప్పివేస్తాడేమోనని ఆయన భయపడ్డాడు. పోలీసుల ప్రశ్నలకు సోమయాజులు తట్టుకోలేడనీ, అందులోనూ అతని నోటిలో ఏ మాట దాగదని జమిందారు భయం.

సోమయాజులు, వీరాస్వామి బెయిల్ మీద విడుదల చేయబడ్డారు. జమిందారు వాళ్ళిద్దరినీ తన కారులోనే తీసుకువెళ్ళాడు. తను అనవసరంగా చిక్కుల్లో పడుతున్నానేమో అనిపించసాగింది జమిందారుకు. వీరాస్వామి ఇంత తెలివి తక్కువతనంగా దొరికిపోతాడని ఆయన ఊహించలేదు. వీరాస్వామి కళ్ళల్లో నీళ్ళు లేకపోయినా కళ్ళు తుడుచుకోసాగాడు. జమిందారు కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు.

"నేను మీరు చెప్పినట్లే చేసాను. మీరు చెప్పమన్నదే వీరాస్వామికి చెప్పాను." సోమయాజులు గబగబా అన్నాడు.

"చెప్పినట్లు చేయలేదని ఇప్పుడెవరన్నారు?" జమిందారు గొంతులో ఆందోళనతో నిండిన విసుగు ధ్వనించింది.

"నేను వీరాస్వామిని మాట్లాడకుండా వుండమని చెప్పాను. దెబ్బలు కూడా మాట్లాడకుండా కొట్టమనే చెప్పాను. కాని వీడు మాట్లాడాడు. రాజగోపాలరావు వీడి గొంతు గుర్తుపట్టాడు."

"అవును, నాకు తెలుసు. అయితే నువ్వు వాడికంటే తెలివి గలవాడినని మాత్రం చెప్పకు. ఇద్దరూ తెలివి తక్కువ గాడిదలే." జమిందారు కోపం పట్టలేక వారిద్దరినీ తిట్టసాగాడు.

"నేను నీకు చిన్న పని అప్పచెప్పాను. ఇది కూడా ఏడవలేకపోయావు. పైగా మొత్తం ఖరాబు చేసావు. మీకంటే కుక్కలు మెరుగు."

"నేనేం చెయ్యలేదండీ! అంతా ఈ వీరాస్వామిగాడివల్లనే వచ్చింది."

"వాడు పరమబండ వెధవ. పశువులకున్న తెలివి కూడా లేదు. ఎక్కువ గాయాలు లేకుండా కొట్టమంటే కాళ్ళు చేతులూ విరగ కొట్టాడు." జమిందారు తన సహజ ధోరణిలో తిట్టసాగాడు.

"క్షమించండి దొరా! ఈ సారి మీరు చెప్పినట్టే చేస్తాను." వీరాస్వామి చేతులు జోడిస్తూ అన్నాడు.

"ఇంకొక సారా! వెధవా? నోర్మూయ్! నువ్వేం మొరుగుతున్నావో తెలుస్తున్నదా?" జమిందారు మండిపడ్డాడు.

వీరిద్దరినీ విడిపించి, ఇదంతా తానే చేయించినట్లు అనుమానిస్తున్న ప్రజల ఆలోచనలకు మరింత బలం చేకూర్చలేదు కదా! అని విచారించసాగాడు. విడిపించకపోతే మరిన్ని చిక్కుల్లో పడేవాడినని మరో ఆలోచన. మొత్తం మీద జమిందారు పని ముందు నుయ్యి, వెనుక గొయ్యిగా మారింది.

"నీ వెంట వచ్చిన మిగిలిన ఇద్దరూ ఏమయ్యారు?"

"వాళ్ళిద్దరూ పారిపోయారు. వారింతవరకు దొరకలేదు." సోమయాజులు సమాధాన మిచ్చాడు.

"వాళ్ళు మీలాంటి వెధవలే అయ్యుంటారు. ఎంతకాలం తప్పించుకుంటారు? త్వరలోనే దొరికిపోతారు. మీరు వారికి జామీను ఏర్పాటు చెయ్యాలి. తెలిసిందా? ఈ సారి పొరపాటు చేసారో- జాగ్రత్త!"

వాళ్ళు కోట చేరేసరికి వారిని చూడటానికి వారి స్నేహితులెవ్వరూ రాలేదు. అన్నపూర్ణ కూడా రాలేదు. వార్త వినగానే హైదరాబాద్ నుంచి తిన్నగా వచ్చిన కారణంగా అన్నపూర్ణ తప్పక వచ్చి తనను కలుస్తుందని ఆయన ఉద్దేశ్యం. ఆయన అన్నపూర్ణతో కొన్ని విషయాలు చెప్పాలని కూడా అనుకుంటున్నాడు. ఆమె రాజగోపాలరావుకు సేవ చెయ్యటానికి వెళ్ళిందని తెలిసి ఆయన ఒళ్ళు మండిపోయింది. ఆయన మనస్సు చిత్రమైన పరిస్థితిలో చిక్కుకుపోయింది.

ప్రజలకు తనంటే ఇష్టం లేదని జమిందారుకు తెలుసు. గ్రామమంతా ఆయనకు విరోధంగా కనబడసాగింది. దెబ్బలు తిన్నది రాజగోపాలరావే అయినా, ఆ దెబ్బలన్నీ తనకే తగిలినట్లు జమిందారు అనుకోసాగాడు. గ్రామస్థుల దృష్టిలో ఆయన అపరాధిగా మిగిలిపోయాడు.

పరిస్థితులీ విధంగా తనకు వ్యతిరేకంగా తయారవుతాయని జమిందారు కుటుంబరావు ఊహించలేక పోయాడు. ఏం చెయ్యాలో ఆయనకు తోచటంలేదు. రైట్ సలహా కూడా ఈ విషయంలో తీసుకోలేదు. ఆయన ప్రస్తుతం ఎవరినీ నమ్మే స్థితిలో లేడు. ప్రపంచంలోని వారంతా విశ్వాసహీనులుగా, కృతఘ్నులుగా, శత్రువులుగా కనిపించసాగారు.

# 23

హింసాత్మక సంఘటనలవల్ల రాజకీయాలలో దుష్పరిణామాలే కలుగుతా యన్న విషయం గ్రహించేంత తెలివితేటలు అన్నపూర్ణకున్నాయి. తన నాయ కత్వానికే ముప్పు వస్తుందని ఆమె భయపడసాగింది.

రావుగోపాలరావుపై దాడి జరగకుండా వుంటే గ్రామంలో ఆమెకు కొంచెం సానుభూతి వుండేది అయితే అయింది ఇప్పుడు మొత్తం గ్రామమంతా రాజ గోపాలరావువైపే వున్నది. తటస్థంగా వున్నవారు కూడా రాజగోపాలరావు వైపు వెళ్ళిపోయారు. అంతదాకా ఎందుకు? స్వయంగా అన్నపూర్ణ అతని పక్షంగానే భావించుకోసాగింది.

గ్రామంలో ముఠా తగాదా లీవిధంగా సాగితే పెద్ద నష్టం జరుగుతుందని అన్నపూర్ణ భావించింది. తను తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమాలేవీ జరగవు. ప్రజల దృష్టి తనపైనుండి పోతుంది. ఇటువంటి పరిస్థితులలో జమిందారు కూడా తప్పించుకుని నగరానికి వెళ్ళిపోతాడు.

రాజగోపాలరావుతో విభేదించినా, మనస్పర్థలువున్నా, ఆమె అతనితో సంబంధం చెడగొట్టుకోలేదు ఇంతకుముందు కొంచెం దూరమైనా, ఈ సంఘటనతో ఆమె పూర్తిగా అతనివైపు మొగ్గింది. జమిందారు తనకెంత సహాయం చేసినా, ఆయన చేయించిన ఈ పని ఆమెకు తీవ్రమైన అయిష్టాన్ని కలగచేసింది. జమిందారుతో సంబంధం కలిగివున్నందుకు ఆమె ఎంతో పశ్చాత్తాపపడసాగింది.

జమిందారు ఆయన డబ్బులతో, పలుకుబడితో తనకు సహాయపడవచ్చు కాని, ఈ పరిస్థితులలో ప్రజల మద్దతు పొందటం మాత్రం సాధ్యం కాదని అన్నపూర్ణ భావించింది. జమిందారు గ్రామాన్నంతా బంగారం మయం చేసినా ప్రజల అభిమానం పొందలేడని ఆమె కర్థమయ్యింది. ఆయన రాజకీయ జీవితానికి గ్రహణం పట్టిందని ఆమె తెలుసుకుంది. ఆయన వెంటవుంటే తనకు లాభంకంటే నష్టమే ఎక్కువ అని అన్నపూర్ణ తెలుసుకుంది.

రాజగోపాలరావుపై దాడి సంఘటన అన్నపూర్ణ మనస్సులో భయాన్ని కూడా రేకెత్తించింది. దీనివెనుక జమిందారు హస్తమున్నదని, తనకంటే రాజ

గోపాలరావుకు పలుకుబడి పెరిగిపోతున్న కారణంగానే జమిందారు ఈ ఘోరానికి పూనుకున్నాడని, ఈ రంగంలో ఆయనకు ప్రలోభం పెరిగిపోతే ఏదో ఒక రోజున తనను కూడా అంతం చేసేందుకు జమిందారు వెనుకాడడని ఆమె భావించింది. జమిందారు దొరబాబులను నమ్మటమెలా అన్న ఆలోచన ఆమె మనస్సులో మెదిలింది జమిందారు పట్ల ఆమె మనస్సులో వైముఖ్యం పెరిగిపో సాగింది. అయితే ఇన్ని సంవత్సరాల సన్నిహిత సంబంధం వదులుకోవటమెలా అన్న ఆలోచన కూడా ఆమె మనస్సులో తొలిచివేయసాగింది.

రాజగోపాలరావు, జమిందారు సంబంధాలెలా వున్నా, గ్రామంలో శాంతి నెలకొల్పటంలోనే తనకు, గ్రామానికి మంచి జరుగుతుందని ఆమె భావించింది. ఇప్పుడే ఏదో ఒకటి చెయ్యకపోతే రేపు కేసు విచారణ మొదలైతే గ్రామం రెండుగా చీలిపోయి, ఏమి చెయ్యటానికి వీలులేని పరిస్థితి ఏర్పడుతుందని ఆమె అనుకుంది.

రాజగోపాలరావుతో సంబంధం పటిష్టం చేసుకోవటానికి ఇదే మంచి అవకాశంగా భావించింది. పైగా రాజగోపాలరావు తనకెన్నో ఉపకారాలు చేశాడు. రాజగోపాలరావే గనక తనకు సహాయం చేయకుండా వుండివుంటే తన భర్త కూడా ఈపాటికి ఆస్పత్రిలో మూలుగుతూ వుండివుండేవాడు. గణేష్‌ను ఇరికించ టానికే ఆ సమయంలో జమిందారు రాజగోపాలరావుపై దాడి జరిపించాడని ఆమె అనకోసాగింది.

'నేనెంత చేసినా.... జమిందారు స్థాయికి చేరుకోలేను. పైగా ఆ ప్రయ త్నంలో తన స్థాయి వారిని కోల్పోయే ప్రమాదమున్నది. జమిందారు పక్షాన వుండటం తెలివి తక్కువతనమౌతుంది. అయినా తానెంత వరకు జమిందారు చేతిలో కీలు బొమ్మగా వుంటుంది? తనకు తన అస్తిత్వం కావాలిగా!' అన్నపూర్ణ మనస్సు పరి పరి విధాల ఆలోచించ సాగింది.

ఆలోచన ఈ విధంగా సాగుతూ వుండగా, ఆమె రాజగోపాలరావు ప్రక్కన మెదలకుండా కూర్చోలేకపోయింది.

"పోలీసులు సోమయాజులును, వీరాస్వామిని అరెస్టు చేసారు జమిందారు వారిని బెయిల్‌పై విడిపించాడు." అన్నపూర్ణ రాజగోపాలరావుతో చెప్పింది.

"నాకు తెలుసు. ఆయన తన నౌకర్ల పట్ల కర్తవ్యాన్ని నెరవేర్చాడు "

"నీ తగాదా జమిందారుతో కాని, అతని కిరాయి మనుష్యులతో కాదుకదా! వారికి పడే శిక్ష జమిందారుకేం నష్టం కలిగించదుకదా!" అన్నపూర్ణ తూచి, తూచి జాగ్రత్తగా మాట్లాడసాగింది

"ప్రజలు నిన్నుకూడా కిరాయి మనిషివే అంటారు. జాగ్రత్తగా వుండు!"

"అవును జాగ్రత్తగానే వుండాలి కాని...." అన్నపూర్ణ కేం మాట్లాడాలో తెలియక, చిరునవ్వు నవ్వింది.

''నువ్వు చెప్పదలచుకున్నదేమిటో చెప్పు.''

''జమిందారుకు కొంత అవమానం జరిగినా, దాని ప్రభావం ఏమి ఉండదు. ఆయన చర్మం మంద పడిపోయింది. ఆయన ఇకముందు చెయ్యబోయే పనులు ఇంకా మూర్ఖంగానూ, దారుణంగానూ వుంటాయి."

''నువ్వు ఎటువంటి వ్యక్తితో స్నేహం చేశావో ఇప్పటికైనా తెలిసిందా?''

అన్నపూర్ణ తన మనస్సులో మాట చెప్పాలనుకుంది. కాని ఆలోచించి మానుకుంది.

''ఒకవేళ కోర్టులో తీర్పు మీకే అనుకూలంగా వచ్చినా మీకు వచ్చే లాభ మేమిటి?'' అన్నపూర్ణ అడిగింది.

''ఆ సంగతి నాకు తెలుసు.''

"నేను నీ స్థానంలోవుంటే సోమయాజుల్నీ, వీరాస్వామినీ ఇద్దరినీ క్షమించి వదలివేయించివుండేదాన్ని. నీపట్ల కృతజ్ఞతతో వారు జమిందారుకు వ్యతిరేకమయ్యే వారు. ఈ విధంగా ఎంతో కాలంగా తనకు మద్దతునిస్తున్న రెండు బలమైన కులాలవారి సహకారం జమిందారు కోల్పోయి వుండేవాడు."

"వాళ్ళ మద్దతు నాకెందుకు? నేను నాకుగా ఏమీ ఆశించటం లేదు నేను వ్యక్తిగత విషయాలకు ప్రాధాన్యత నివ్వనని నీకు తెలుసు కదా! బహుశా అది నా బలహీనతే కావచ్చు. కాని నేను నా స్వభావాన్ని మార్చుకోలేను కదా!"

"ఈ కేసుల గొడవ వలన ఆనకట్ట పని వెనకబడిపోతుందని నా భయం. ప్రజల దృష్టంతా ఈ వ్యవహారాల మీదే నిలిచిపోయి, అభివృద్ధి కార్యక్రమాలకు ఆటంకం ఏర్పడుతుంది. గ్రామమంతా ఐకమత్యంతో వుంటేనే మనమేదయినా సాధించుకోగలం. ఈ విషయాలు నేను మీకు చెప్పాలా?"

"అయితే నన్నేం.... సరే పోనియ్యి." రాజగోపాలరావు ఏదో ఆలోచించ సాగాడు. కాని తన ఆలోచన బయటపెట్టడం ఇష్టంలేక మానివేసాడు.

"మీకేదయినా ప్రమాదం జరిగివుంటే వాళ్ళకు కఠినమైన శిక్ష పడేటట్లు చేసేవాళ్ళం. అదృష్టవశాత్తూ మీరు బ్రతికి బయటపడ్డారు. అందుచేత నేను చెప్పేది...." తరువాత మాట్లాడడానికి ఆమె సంకోచించింది.

"నాకు దెబ్బలు గట్టిగా తగిలాయా, లేదా అన్నది ప్రశ్నకాదు. నేను బ్రతికి బయటపడ్డానా అన్నది కూడా అసలు సమస్య కాదు. నా కింతకంటే ఎక్కువ ప్రమాదం జరిగినా నేను వాళ్ళను క్షమించాలనే అనుకుంటాను. వాళ్ళు వారి యజమాని ప్రోద్బలంతోనే ఈ పని చేసారని నాకు తెలుసు. వాళ్ళీ విధంగానే చేస్తూ వస్తున్నారు. వాళ్ళు ఒక్క క్షణంలో మారిపోరని నాకు తెలుసు. శిక్ష పడినంతమాత్రాన కూడా వాళ్ళు మారరని నాకు తెలుసు."

"అవును."

"సోమయాజులు ఇచ్చిన తప్పుడు సమాచారం ఆధారంగా ఆనకట్ట విష యంలో పోలీసులు నన్ను వేధించారు. నే నప్పుడు సోమయాజుల్నిగాని, పోలీసు లనుగాని మార్చలేకపోయాను. అయితే ప్రస్తుతం సమాజంలో వస్తున్న తీవ్రమైన మార్పుల కనుగుణంగా, ఇంతవరకు వ్యతిరేకిస్తున్నవారిని వారు సమర్థించవచ్చు."

"కావచ్చు."

"జమిందారు సంగతి వదిలెయ్యి. అతనేమిటో నాకు పూర్తిగా తెలుసు. అతని స్థితిలో నేనున్నా ఇంత గందరగోళం చేస్తాను. ఇంత అధికారం చెలా యిస్తాను. ఆయన మహాపరాధాలు చేస్తున్నాడని కూడా నేనారోపించటం లేదు. నేను వారితో పోటీ పడుతున్నది, వ్యతిరేకిస్తున్నది సిద్ధాంతపరమైన లక్ష్యం కోసమే. వాళ్ళు ప్రస్తుతం అధిష్టించి వున్న సామాజిక శిఖరాల నుండి క్రిందకు దిగి రావాలి మనతో అడుగు కలిపి నడవాలి."

"అవునవును."

"ఆ జమిందార్ల ననుసరించే అవకాశవాదుల సంగతి చూడాలి. ఏ గాలి వీస్తే అటు వెళ్ళే ఈ అవకాశవాదులు ఎక్కడకు చేరుతారు? వీళ్ళ గమ్యం ఏమిటి? వీరనుసరిస్తున్న గాలి వీరిని కొండలకేసి కొట్టవచ్చు. అగాధాల్లో పడవేయవచ్చు. ఆ గాలికి తెలియదు కదా- తా నెటువెళుతున్నదీ, ఎందుకు వెళుతున్నదీ!"

అన్నపూర్ణ సిగ్గు పడసాగింది. బాణం తన వైపే ఎక్కు పెట్టబడి వున్న దని ఆమె అనుకున్నది. పైగా ఆమె కూడా ఇంచుమించు ఇదే విధంగా ఆలోచిస్తూ వుంది. జమీందారుతో తనకున్న సంబంధాల పట్ల కూడా బాధగా వుంది.

"నువ్వు ఎక్కువ మాట్లాడ కూడదు. మరలా జ్వరం వచ్చే ప్రమాదము న్నది." అన్నపూర్ణ విషయం మార్చటానికి ప్రయత్నం చేసింది.

"అవునవును. నే నెక్కువ మాట్లాడ కూడదు కదా?"

రాజగోపాలరావు చిరునవ్వు నవ్వాడు

"అయితే వారు విడిచి పెట్టబడితే నీకు బాధ కలగదు కదా!"

సమాధానంగా రాజగోపాలరావు చిరునవ్వు నవ్వాడు. అయితే ఆ చిరు నవ్వులోని వ్యంగ్యం అన్నపూర్ణను మరి మాట్లాడనివ్వకుండా చేసింది.

"చట్టం దాని పని అది చేస్తుంది. ప్రస్తుతం నేనేమి చెప్పలేను. నేను పోలీసు ఇనస్పెక్టర్‌ను కలుస్తాను,.... ఆయనే నన్ను కలవడానికి వస్తాడు. తరు వాత ఏం చెయ్యాలో ఆలోచిద్దాం."

"అవును, అదే మంచిది." అన్నపూర్ణ చెప్పింది.

రాజగోపాలరావు తన ఆలోచనలనే బలపరుస్తున్నట్లు ఆమెకు నమ్మకం కలుగసాగింది. ఏది ఏమైనా పెరుగుతున్న శత్రుత్వాన్ని పూర్తిగా పోగొట్టాలనే ఆమె ఉద్దేశ్యం.

రాజగోపాలరావుతో రాజీ జమీందారుకు ఇష్టం ఉండకపోవచ్చు దురభిమాని అయిన జమీందారు రాజగోపాలరావులోని క్షమాగుణాన్ని హర్షించలేకపోవచ్చు జమీందారు ఇతరులను క్షమించగలడు గానీ ఇతరుల క్షమను స్వీకరించలేడు. చట్టాలు ఏ విధంగా ఉన్నా, డబ్బు కురిపించి తన కనుకూలంగా మార్చుకోవచ్చు అనుకుంటా డాయన.

# 24

ఒక ప్రముఖ జమిందారీ కుటుంబపు పెద్దగా ఎస్.ఆర్ వి. కుటుంబరావుకు కొన్ని ఆచారాలు, అనువంశీకపు బాధ్యలు తప్పనిసరిగా పాటించవలసి ఉంటుంది. ఆయన పూర్వీకులు దేవాలయం కట్టించారు. పండితులను పోషించారు. మత ప్రచారానికి సహాయపడుతూ ఉండేవారు. గ్రామంలో ఉత్సవాలు పండుగలు జరుగు తున్నప్పుడు వాటికోసం డబ్బు కూడా ఖర్చు పెడుతుండేవారు. కానీ గత కొద్ది సంవత్సరాలుగా కుటుంబరావు ఈ విధమైన పనులేవీ చేయటం లేదు.

ప్రతి రోజు ఏదో ఒక వ్రతమో, ఉత్సవమో, శుభమో, అశుభమో ఉండే హిందూ పంచాంగానికి ప్రస్తుత సమాజంలో పెద్ద విలువ లేకుండా పోయింది. జమిందారు ఈ మధ్యన ఏదైనా ఉత్సవమో, కర్మకాండో చేసినా, చేయించినా, తన అంతరాత్మ కోసం చేయలేదు ప్రజల వత్తిడికి అప్పుడప్పుడు ఆయన లొంగ వలసి వస్తుంటుంది అప్పుడే తప్పనిసరిగా ఇటువంటి పనులు చేస్తుంటాడు.

విజయదశమి తెలుగు వారికి ప్రముఖమైన పండుగలలో ఒకటి. పిల్లలకు అక్షరాభ్యాసం, నూతన కార్యక్రమాల ప్రారంభం మొదలైన శుభకార్యాలు చేపడుతూ ఉంటారు. కుటుంబరావు పూర్వీకులు ఈ పండుగ బ్రహ్మాండంగా జరిపిస్తూ ఉండేవారు నాటకాలు, హరికథలు వంటి సాంస్కృతిక కార్యక్రమాలు రోజుల తరబడి జరుగుతూ ఉండేవి దేవతలకు జంతు బలులు ఇస్తుండేవారు. పేదలకు అన్నదానాలు, ఊరేగింపులు ఉత్సాహంగా జరుగుతూ ఉండేవి.

గత నాలుగైదు సంవత్సరాలుగా జమిందారు ఈ ఉత్సవంలో పాల్గొనటం లేదు. అయితే తమ కుటుంబపు దేవాలయంలో పండుగ సందర్భంగా పూజలు నిర్వహించడానికి డబ్బు మాత్రం పంపిస్తూ ఉండేవాడు. జమిందారు పాల్గొనక పోయినా, డబ్బు ఇవ్వకపోయినా, గ్రామస్తులు పండగ మాత్రం జరుపుకుంటూనే ఉన్నారు. అయితే పూర్వపు అతిశయం లోపించింది.

జమీందారు గ్రామంలోనే ఉన్నాడు. ఆయనకు గ్రామం వదలి వెళ్ళే ఉద్దేశ్యం ఉన్నట్టు కనపడలేదు. ఈ సారి పండుగ సందర్భంగా జరిగే ఉత్సవా

లను వినియోగించుకొని తిరిగి పొందుదామని అనుకోసాగాడు. అప్పటివరకూ బాగుచేయటం మాట అటు ఉంచి, కనీసం శుభ్రం కూడా చేయబడని ఆయన మహల్ అంతా హడావుడిగా శుభ్రం చేయబడి అలంకరించబడింది. మహల్‌లోని పెద్ద పెద్ద స్థంభాలకు అరటి పిలకలు కట్టబడ్డాయి ద్వారాలకు మామిడి తోరణాలు అలంకరించబడ్డాయి రాత్రిపూట కోటంతా వెలుగులతో నింపబడింది. పూర్వం మాదిరిగానే పేదలకు అన్నదానం చేయబడింది. గ్రామంలోని కొందరి ప్రముఖు లను కోటలోనికి ఆహ్వానించాడు.

అయితే ఆయన గుర్రంపై స్వారీ చేస్తూ ఊరేగింపులో పాల్గొనలేదు. ఇక్కడ గుర్రమూ లేదు పాత సాంప్రదాయాన్ని కొనసాగిద్దాం అనే ఉద్దేశ్యం కూడా లేదు. సోమయాజులు జమిందారును ఆయన పాత ఫోర్డు కారులోనే ఊరే గింపులో పాల్గొనమని చెప్పాడు. అయితే ఆయన అందుకు అంగీకరించలేదు.

ఆ రోజు అందరికంటే సోమయాజులకు ఎక్కువ ఆనందంగా ఉంది. చాలా సంవత్సరాలుగా లభించని కానుకలు ఈ సంవత్సరం లభించాయి, అంతే కాకుండా ఆచారం ప్రకారం ఉత్సవం జరపమని కూడా ఆదేశం లభించేంది.

గ్రామంలో ఉత్సవ సందర్భంగా శాంతి భద్రతలు పరిరక్షించేందుకు జమిందారు పోలీసులను రప్పించాడు అయితే ఈ విధంగా ఇంతకు ముందెప్పుడూ ఉత్సవాలకు పోలీసులు రప్పించబడలేదు. ఈ విషయం గ్రామస్తులకు కొంచెం బాధ కలిగించింది.

తన పూర్వీకులు ఇంతకు ముందు చెయ్యని మరో పనికూడా ఈరోజు జమిందారు చేసాడు. ఆయన తనకు సంబంధించిన వారి ఇళ్ళకు వెళ్ళి వారిని కలిసాడు. ఎన్నికల సందర్భంగా తన పరిస్థితి మెరుగు పరుచుకోటానికే జమిందారీ విధంగా చేస్తున్నాడని అన్నపూర్ణ భావించింది జమిందారు సంగతి ఆమెకు బాగా తెలుసు. వేటాడబడే జంతువు అరవకముందే, ఆక్రమించుకొనే చిరుతలాగ, జమిందారు వేగంగా వ్యవహరించగలడని అన్నపూర్ణకు తెలుసు

దేవాలయం గురించి మాట్లాడటానికి రావలసిందిగా ఆయన అన్నపూర్ణను పిలిపించాడు. ఆమె సలహాపై ఈ చర్చల్లో పాల్గొనేందుకు రావలసిందిగా రాజ గోపాలరావుకు సోమయాజుల చేత కబురు పంపాడు. పాఠశాల బాగు చేయిస్తున్నట్లే, దేవాలయానికి కూడా జమిందారు మరమ్మత్తులు చేయిస్తాడని

పుకారులు గ్రామంలో వ్యాపించాయి. గ్రామస్తులు కూడా ఈ శుభ కార్యంలో ఆర్థికంగా సహాయపడాలని జమిందారు ఉద్దేశ్యం.

రాజగోపాలరావు ఇంటిలోనే విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆయన గాయాలు ఇంకా పూర్తిగా మానలేదు. ఆయన పండగలు అవీ చేయడు; కానీ ఆయన భార్య మాత్రం పండుగ సందర్భంగా తమ సంబంధీకులు చాలా మందిని తమ ఇంటికి ఆహ్వానించింది.

అయితే రాజగోపాలరావు ఇంటిలో జరిగే ఉత్సవంలో పురాణ కథల ఆధారం కంటే, రాజగోపాలరావు త్వరగా కోలుకున్న సంతోషమే ముఖ్య కారణం అయ్యింది ఉత్సవం ఒక వంక మాత్రమే.

సోమయాజులు సంకోచిస్తూ, గాభరాపడుతూ, అటు ఇటు చూసుకుంటూ గుమ్మం దాటి రాజగోపాలరావు ఇంటిలోనికి వచ్చాడు. రాజగోపాలరావుకు కుల మతాల పట్ల ఉన్న అభిప్రాయాలు నచ్చని కారణంగా సోమయాజులు ఆయనింటికి ఎక్కువగా వెళ్ళడు రాజగోపాలరావు కూడా సోమయాజులకున్న కులాతిశయం కారణంగా అతను తన ఇంటికి రావటం అంత ఇష్టం ఉండదు

"ఏమిటి విశేషం! ఎందుకు వచ్చావు? నీ లాంటి మహానుభావులు ఏ పని లేకుండా ఎందుకు వస్తారు?" రాజగోపాలరావు సోదరుడు వేణుగోపాలరావు వ్యంగ్యంగా అన్నాడు.

"ఆయనను ఇప్పుడు కూడా విశ్రాంతి తీసుకోనివ్వరా?" రాజగోపాలరావు భార్య కిటికీలో నుంచి చూస్తూ అన్నది.

"ముందు ఆయనను లోపలకు రానివ్వండి." రాజగోపాలరావు ప్రశాంతంగా అన్నాడు.

"నమస్కారమండీ!" సోమయాజులు తరచూ జమిందారు దగ్గర ప్రదర్శించే వినయాన్నే ప్రస్తుతం రాజగోపాలరావు దగ్గర ప్రదర్శించాడు.

"ఏమండీ మంత్రిగారూ! ఏమిటి విశేషం? మీ రాజాగారు ఇక్కడే ఉండి చాలా ఉదారంగా ధాన ధర్మాలు చేస్తున్నారని తెలిసింది." రాజగోపాలరావు బాణం ఎక్కు పెట్టాడు.

"నేను భగవంతునికి మాత్రమే సేవకుణ్ణి. భగవంతుని దృష్టిలో అందరూ సమానులే- జమిందారైనా, సామాన్యులైనా ఒక్కటే!"

"ఏమో, నాకు తెలవదు. జమిందారుగారి మనసు తెలిసినట్లే బహుశా భగవంతుని మనసు కూడా తెలుసుకున్నారేమో అని అనుకుంటున్నాను."

సోమయాజులు సమాధానం ఇవ్వకుండా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"చెప్పండి, ఏం చెయ్యమంటారో? మీరు మా అతిథులు. అతిథులను గౌరవించవలసిన ఈ బాధ్యత నామీద ఉన్నది. మీరు గౌరవించినా గౌరవించకపోయినా మిమ్ములను గౌరవించడం నా ధర్మం."

"నీతో వైమనస్యంగా ఉండాలని జమిందారుగారు ఆలోచించటం లేదు. గ్రామంలో ఇన్ని పార్టీలు ఉండటం ఆయనకు ఇష్టం లేదు. ఆయన గ్రామంలో ఉండాలని నిర్ణయించుకున్నారు. గ్రామం కోసం చేతైనంత సేవ చేయాలని అనుకుంటున్నారు."

"ఈ గ్రామంలో మేమెంతో ఆయనా అంతే. నువ్వు ఏమి చెప్పాలని ప్రయత్నిస్తున్నావో నాకర్థం కావటంలేదు. అయితే ఇప్పటివరకూ ఆయన మా శత్రువా? ఆ విషయం ఆయన మనసుకే తెలవాలి. ఇంకా ఆయన ఏమి చెయ్యాలనుకుంటున్నారు?"

"మీరాయనను అపార్థం చేసుకోవద్దు."

"ఆయన తన పూర్వీకుల, అదే మన పూర్వీకుల గుడిని పునర్నిర్మిస్తాడని అనుకుంటున్నారు."

"అవును. దేవాలయం ఊరులో వారందరిదీ. ఎవరికి చేతనైన సహాయం వారు చేయాలి."

"అది వారి పూర్వీకుల గుడి. వాటితో మా కేమి సంబంధం? మీరు మీ దేవతలు మీ దేవుళ్ళూ అందరూ మీ వారే. వారితో మాకేమి సంబంధం లేదు."

"ఈ విధంగా సర్వేశ్వరుణ్ణి తృణీకరించడం భావ్యంకాదు."

"నేను భగవంతునికి వ్యతిరేకం కాదు. అయితే భగవంతుని పేరుతో జరిగే దోపిడీకి మాత్రమే వ్యతిరేకిని. దేవాలయాలను మంచి పనులకు వినియోగిస్తే నేనే వాటిని కట్టిస్తాను. పూర్వం దేవాలయంలో పాఠశాలల, సాంస్కృతిక కార్యక్ర

మాలు జరుగుతుండేవి మీరు వాటిలో భక్తి పేరుతో వ్యాపారపు దుకాణాలు తెరిచారు. ప్రజల గుడ్డి నమ్మకాల ఆధారం మీద మీరు బలపడసాగారు."

"ఇప్పుడు పాఠశాలలు వేరుగా ఉన్నాయి కదా! మన జమిందారు పాఠశాలలు కూడా...."

"అయితే ఇంక దేవాలయాల అవసర మేమున్నది?"

"దేవాలయాల అవసరం ఉన్నవారు కూడా చాలా మంది ఉన్నారు కదా!"

"లేరని నేనటం లేదే. వారి అవసరాలు ఎక్కడైనా తీర్చుకోవచ్చు కదా! ఉన్నారో లేరో తెలియని ఆ దేవతల పేరు మీద బ్రతికే పురోహితులకు వీరు ఎందుకు బలి అవ్వాలి?"

"కానీ మేము యుగయుగాలనుండీ........" సోమయాజులు సంకోచంలో పడ్డాడు. తమ భగవంతుని అస్తిత్వం గురించి ఎలా వివరించాలో అతనికి అర్థం కావటం లేదు.

"నడుస్తుంది కదా అని ఏ సంప్రదాయాన్నీ కొనసాగించవలసిన పనిలేదు. మారుతున్న ప్రపంచంతో పాటు మనం కూడా మారాలి. లేకపోతే ప్రపంచాన్నే మార్చాలి. సరే, పోనీయి. మీ జమిందారు ఏమి కావాలంటున్నారు?"

"మీరూ మీ మిత్రులు సాయంత్రం దేవాలయంలో జరిగే సమావేశానికి రావాలని ఆయన అభిమతం."

"పరిస్థితి బాగోలేదు కదా! బాగున్నా వచ్చేవాడిని కాదు. ఇతరులు ఎవరైనా వెళ్ళినా ఆపేస్థితిలో లేను."

"ఆ సమావేశాన్ని బహిష్కరించవద్దని మీ మిత్రులకు చెప్పండి."

"అది నా పని కాదు. నేను వారికి ఉపదేశకుణ్ణి కాదు. పురోహితుణ్ణి కాదు. వారు గుడికివెళ్ళే అంత తెలివితక్కువవారు అయితే నాకేమిటి అభ్యంతరం?"

"జమిందారుగారు స్వయంగా వచ్చి మిమ్ములను పరామర్శిద్దాం అనుకున్నారు. కానీ వారి ఆరోగ్యం కూడా బాగాలేదు. అందుచేత ఎప్పుడైనా వారిని కలిస్తే బాగుంటుందని చెప్పమన్నారు."

రాజగోపాలరావు ఆ మాటలను విశ్వసించనివాడిలా నవ్వాడు.

"మీకు ప్రస్తుతం ఎట్లా ఉన్నది?"

"నాకేం ఫర్వాలేదు త్వరలోనే కోలుకుంటాను. కొంతమందికి దెబ్బ తీయటమే తెలుసు. ఎవరైనా తిరిగి వారిని దెబ్బతీయడానికి ప్రయత్నిస్తే చేతు లెత్తేస్తారు. అయితే దెబ్బతిన్నవాడు తిరిగి దెబ్బతీస్తాడని వారికి తెలియదు."

"అది పోనీయ్! ఆ విషయాలు ఇటువంటివారి కెందుకు చెప్పడం?" వేణు గోపాలరావు అన్నాడు. అతను సోమయాజులు పట్ల తనకున్న అసహ్యాన్ని సభ్యత కోసం కూడా దాచుకోలేకపోతున్నాడు.

సోమయాజులు వచ్చినంత నిశ్శబ్దంగానే అక్కడనుండి జారుకున్నాడు. స్వాభిమానం కొంచెంకూడా లేని అతనిని ఎవరూ అవమానపరచలేరు. అతను ఎవరినీ ముఖంమీద ఏమి అనడు.

సోమయాజులు గ్రామమంతా ఇంటింటికీ ఏదో వస్తువుల మ్మే వాడిలా గా తిరిగాడు. అతను రాజగోపాలరావు మిత్రులను కొందరిని కలిసాడు. రాజగోపాల రావుపై దాడి జరిగినప్పటినుండీ ప్రతి ఒక్కరు జమిందారుకు వ్యతిరేకంగానే ఉన్నారు. జమిందారు వారి మద్దతు పొందాలని ఎంత ప్రయత్నం చేస్తున్నా వీలు కలగడం లేదు. ఈ సంగతి అన్నపూర్ణకు కూడా తెలును. ఆమె కూడా వాస్త వానికి జమిందారు పట్ల వ్యతిరేకతతోనే ఉన్నది. అదే దేవాలయం గురించిన విషయం కాకుంటే బహుశా గ్రామమంతా ఆందోళన జరిగి ఉండేది.

# 25

సోమయాజులు జరీ అంచు పట్టు పంచె, పైపంచె ధరించి, నుదుట విభూతి, కనుబొమ్మల మధ్య సింధూర తిలకం దిద్దుకుని, కూలిన దేవాలయపు ముఖద్వారం వద్ద నిలబడి జమిందారు రాక కోసం ఎదురు చూడసాగాడు.

దేవాలయపు ఆవరణలో కొందరు ప్రజలప్పటికే చేరారు. వారిలో ఎక్కువ మంది స్త్రీలే. వాళ్లంతా ఖరీదయిన, రంగురంగుల దుస్తులు ధరించి వున్నారు. వారంతా ఒక షామియానా క్రింద కూర్చున్నారు. గ్రామపు మంగలి నాదస్వరం ప్రోగిస్తున్నాడు.

గ్రామమంతా ఉత్సవపు వాతావరణంతో నిండిపోయింది. గుడిలో పెద్ద ఎత్తున వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేసి ఉండకపోతే ఆమాత్రపు జనం కూడా వచ్చి వుండేవారు కాదు. అయితే రాజగోపాలరావు మిత్రులెవ్వరూ అక్కడకు రాలేదు. అన్నపూర్ణ కూడా రాలేదు.

అక్కడ ఎక్కువ మంది ప్రజలు లేరు. ఉన్నవారిలో ఉత్సాహమూ లేదు. సోమయాజులు ఇంటింటికీ తిరిగినా ఫలితమేమీ లేకపోయింది. గ్రామస్థులలో గుడ్డి నమ్మకాలు పోతూ వున్నాయి, దానికి తోడు మతపరమైన కార్యక్రమాల మహత్తు కూడా తగ్గిపోతున్నది. ఒకరకపు రాజకీయ చైతన్యం గ్రామ ప్రజలలో ధార్మిక భావాల స్థానాన్ని ఆక్రమించింది. దీనికి కారణం రాజగోపాలరావు, అతని మిత్రులే.

జమిందారు దేవాలయం దగ్గరకు వచ్చేసరికి షామియానాలో కూర్చున్న వారంతా ఆయనకు స్వాగతం చెప్పడానికి లేచి నుంచున్నారు. ఆయన వెంట ఆయన బంధువులు, ఆయన కులస్తులు కొందరు వచ్చారు. చిట్లించి వున్న ఆయన ముఖం చూస్తుంటే, అక్కడకు వచ్చిన జన సంఖ్య ఆయనకు సంతృప్తి కలిగించ లేదని తెలుస్తున్నది. ఆయన కలుద్దామనుకున్న వాళ్ళు కూడా అక్కడకు రాలేదు.

జమిందారు దేవాలయంలో అడుగు పెట్టగానే, సోమయాజులు హారతి ఇచ్చి, ఆచారం ప్రకారం స్వాగతం యిచ్చాడు. తిన్నగా ఆయనను గర్భగుడి లోనికి తీసుకువెళ్లాడు. గర్భగుడిలోనికి బ్రాహ్మణులు తప్ప ఇతర కులాల వారు వెళ్ళరు. జమిందారు బ్రాహ్మణుడు కాదు. కాని జమిందారు పూర్వీకులు, పురోహితులకు చేసిన ఉపకారాల ఫలితంగా గర్భగుడి ప్రవేశం, పూర్ణకుంభ స్వాగతం జమిందారు కుటుంబీకులకు లభించసాగాయి.

పూజ పూర్తయిన తర్వాత జమిందారు షామియానా క్రింద వున్న వేదిక పైన వేసిన పెద్ద కుర్చీ వైపు వచ్చాడు. అందరూ మరోసారి నుంచుని ఆయనకు అభివందనం చేసారు. ఇటువంటి సమావేశాలు జమిందారుకు ఇష్టమే. అయితే ఆయన పెద్ద వక్త కాదు. సిగ్గరి. ఆయన వెనక వుండి తన అభిప్రాయాలు ఇతరులచేత పలికిస్తాడు. వెనుక నుండి ఆట ఆడిస్తుంటాడు.

"నేను పెద్దగా ప్రసంగం చెయ్యాలనుకోవటంలేదు. మీరు కొద్ది సేపటిలో హరికథ వింటారు. క్రిందటి సంవత్సరం హరికథ ఏర్పాటు చేయలేకపోయి నందుకు విచారిస్తున్నాను. భవిష్యత్తులో క్రమం తప్పకుండా ఈ ఏర్పాటు జరప గలనని ఆశిస్తాను."

ఆయన ఇంకేదో చెప్పబోతుండగానే శ్రోతలు చప్పట్లతో తను ఆనందాన్ని ప్రకటించారు. హరికథ విషయం ముందుగా గ్రామస్థులకు తెలియదు. ఏదో ఒక వినోద కార్యక్రమం ఏర్పాటు చేసారు. అయితే వినోద కార్యక్రమం ఏర్పాటు చేసినా జనం రాకపోవటం జమిందారుకు నిరాశను కలిగించింది.

ఆయన ఈ సందర్భంగా ఒక బ్రహ్మాండమైన ప్రకటన చేయదల్చుకున్నాడు. ఆయన ప్రసంగించసాగాడు:

"స్కూలు కట్టిస్తున్నట్లుగానే నేను ఈ దేవాలయాన్ని పునర్నిర్మించాలను కుంటున్నాను. దేవాలయం మనందరిదీ. మీరుకూడా విరాళా లివ్వవచ్చు. ఇందులో నా బాధ్యత ఎక్కువని, ఆ బాధ్యత నేను తప్పక స్వీకరిస్తానని మీకు మనవి చేస్తున్నాను."

తిరిగి చప్పట్లు చాలా సేపు మ్రోగాయి.

"ఇది ప్రజాస్వామ్య యుగం. భగవంతుని ముందు అందరూ సమానులే. కులభేదాలు వుండకూడదు. హరిజనులు కూడా హిందువులే. వారు కూడా మనం పూజించే దేవతలనే పూజిస్తున్నారు. అయినా చాలాచోట్ల వారిని దేవాలయాలలోనికి రానివ్వటం లేదు. అది రాజ్యాంగ విరుద్ధం. నేను ఈ దేవాలయానికి అనువంశిక ధర్మకర్తను. నేను హరిజనులకు ఈ దేవాలయంలో ప్రవేశం కల్పిస్తున్నాను. వారికి నేను స్వాగతం చెపుతున్నాను."

ప్రజలు హర్షధ్వానాలు చేశారు. కాని సోమయాజులు, అతని అనుచరులు ఒక స్తంభం చాటుకు తప్పుకుని తమ బాధను దాచుకునే ప్రయత్నం చెయ్యసాగారు.

ఈ ప్రకటనకు ఏర్పాట్లు కూడా ప్లాను ప్రకారమే జరిగాయి. జమిందారుగారి నౌకర్లు, తాబేదార్లు కొందరు హరిజనవాడకు అక్కడి బడుగువర్గాల వారిని భగవంతుడి దర్శనానికి ఆహ్వానించటానికి వెళ్ళారు. హరిజనవాడలో వీళ్ళను ఎవ్వరూ పట్టించుకోలేదు ఒక వృద్ధుడు, ఎప్పుడో కోటలో పనిచేసిన వాడు మాత్రం వీళ్ళనుచూసి లేచి నుంచొని నమస్కరించాడు.

భగవంతుడి దర్శనం కోసం అక్కడి హరిజనులు అర్రులు చాచిలేరు. వారిలో చాలామంది అప్పటికే క్రైస్తవ మతం స్వీకరించారు. కొండపైపున వారికొక చిన్న చర్చికూడా వున్నది. మిగిలిన వారిలో ఎక్కువమంది సామ్యవాదులు. వాళ్ళు రాజగోపాలరావు అనుయాయులు. భగవంతుడే స్వయంగా అక్కడకు వచ్చినా చూడటానికి వాళ్ళు సిద్ధంగా లేరు.

జమిందారు మనుష్యులు కొందరు దిక్కులేనివారిని, అర్ధనగ్నంగా వున్న వారిని ఊరేగింపుగా దేవాలయం వద్దకు తీసుకువచ్చారు. జమిందారుగారు ప్రధాన ద్వారంవద్ద వీరికి స్వయంగా స్వాగతం చెప్పటానికి నుంచున్నారు. అక్కడికి వచ్చిన హరిజనులకు జమిందారుగారి ఉదారత ఆశ్చర్యాన్ని కలిగించింది. జమిందారుగారు ఇదంతా ఎందుకు చేస్తున్నారో చాలామంది గ్రామస్థులకు అంతు పట్టలేదు. అంతుపట్టని వారిలో సోమయాజులు కూడా ఒకడు.

హరిజనులు ఈ గుడిలో ప్రవేశించి దీనిని కలుషితం చేసేదానికంటే, ఇది శిథిలమై పోతేనే మేలని సోమయాజులు భావించసాగాడు. హరిజనులు గుడిలో ప్రవేశించగానే కొందరు బ్రాహ్మణులు తమ శాలువాలూ, పై పంచెలు దులుపుకుని

దొడ్డిగుమ్మం ద్వారా జారుకున్నారు. దేవాలయపు పవిత్రత నాశనమైపోయిందని వారి ఉద్దేశ్యం. షామియానాలో వున్న గుంపులో కూడా కొంచెం కలకలం చెల రేగింది. హరికథా కార్యక్రమం లేకుంటే బహుశా వారిలో కూడా కొందరు వెళ్ళి పోయి వుండేవారేమో!

పెద్ద గడ్డం, విభూతి ధరించిన ఒక సన్నని వృద్ధుడు వేదిక పైకి వచ్చి హరికథ ప్రారంభించాడు. కథాంశం సీత అగ్ని పరీక్షకు సంబంధించినది. ఈ కథ చాలా సార్లు ఆ గ్రామంలో చెప్పబడినా జనం మరల వింటానికి ఆసక్తి చూపుతూనే వుంటారు. స్త్రీలు, హరిజనులు, రోజంతా పొలాల్లో కష్టించే కూలీలు, సారామత్తులో గుడిసెలలో పడి వుండేవారు ఈ కథ మొదటిసారి వింటున్నారు. వారికి సంగీతం మాత్రం శ్రావ్యంగా వుంది. కథ వారికి అర్థం కావటంలేదు.

ఆ హరిజనులు హిందువులే. అయితే తమ ధర్మ గ్రంధాలను గురించి. వారికేమి తెలియదు. ఈ ధర్మగ్రంధాలను గురించి, పౌరాణిక సాహిత్యం గురించి వారికేమి తెలియదు. ఈ ధర్మగ్రంధాల ద్వారా తమ జీవితం సాగించే ఒక కులం వారే, ఆ హరిజనులను వీటికి దూరంగా వుంచారు.

జమిందారు తను చేసిన పనిలో లాభనష్టాలను జేరీజు వేసుకోసాగాడు. ఆ కథ చాలాసార్లు వినివున్న కారణంగా దానిపై ఆయన దృష్టిలేదు. పైగా ఆయన పాశ్చాత్యదృష్టి కోణానికి ఇది పూర్తి విరుద్ధం.

తాను హరిజనులను దగ్గరకు తీస్తే బ్రాహ్మణులు తనకు దూరం అవుతా రేమోననే అనుమానం ఆయనకు కలిగింది. కాని డబ్బులతో కొందరిని, తాను కట్టించే స్కూలులో రెండు మూడు ఉద్యోగాలివ్వటం ద్వారా కొందరిని బుజ్జగించవచ్చు నని ఆయన అనుకున్నాడు. పైగా వాళ్లు తనను కాదని ఎవరిని సమర్థిస్తారు? రాజగోపాలరావునా! అతనికే గనుక వీలయి వుంటే వారిని గ్రామంనుండి బయటకు పంపి వుండేవాడు. అతనంటే వారికి పూర్తి విరోధభావమున్నది.

హరిజనుల మద్దతు వుంటే ఆ గ్రామంలో ఏదైనా చెయ్యవచ్చునని జమిం దారుకు తెలుసు. వీళ్ళ మద్దతుతోనే రాజగోపాలరావు ఇంత బలవంతుడుగా వున్నాడు. వాళ్ళనే గనుక తన వైపు తిప్పుకుంటే గ్రామంలో రాజగోపాలరావును పలకరించే వాడే వుండడు. ఈ విధంగా జమీందారు తన పథకాన్ని తానే సమర్థించుకుని సంతృప్తితో మీసాలు దువ్వుకోసాగాడు.

కథ పూర్తయ్యేవరకు ఆయన అక్కడ వుండలేక తన భవనానికి వెళ్ళిపోయాడు. సోమయాజులు ఆయనను అనుసరించబోగా ఆయన చేతి సైగతో అతనిని వారించాడు.

తన మహల్‌కు వెళుతూనే ఆయన అన్నపూర్ణకోసం కబురు పంపాడు. ఆమె గ్రామంలోనే వున్నదని ఆయనకు తెలుసు. కాని ఆమె దేవాలయం దగ్గరకు ఎందుకు రాలేదో ఆయనకు అర్థం కావటంలేదు. ఆయనకు ఆ విషయంలో కొంచెం విచారంగా కూడా వుంది. రాజగోపాలరావు ప్రభావం తగ్గించాలంటే అన్నపూర్ణ సహకారం ఆయనకు ఎంతైనా అవసరం. ఆమె నా కారణంగానే గదా, ఇంత ఉన్నతిని పొందినది, ఆమెను నమ్మవచ్చునని జమిందారు అనుకోసాగాడు.

కాని అన్నపూర్ణ రాలేదు. తనకు ఆరోగ్యం బాగా లేదని, భర్త గణేష్‌తో జమిందారుకు కబురు పంపింది. జమిందారు గణేష్‌ను గుడిలో హరిజనుల మధ్య చూసాడు. అతను జమిందారుకు అక్కడ నమస్కారం చెయ్యగా, ఆయన అతనిని గుర్తించి చిరునవ్వు నవ్వాడు. జమిందారు తనను గుర్తించినందుకు గణేష్ పొంగిపోయాడు. ఇప్పుడు జమిందారు గణేష్‌ను ఆశ్చర్యంగా అడిగాడు:

"ఆమె కేమయ్యింది?"

"పెద్ద విషయమేమీ కాదండి!" గణేష్ సిగ్గుతో చేతులు నలుపుకోసాగాడు. తేలికగా ఎవరైన అర్థం చేసుకోగల విషయం ఎలా వివరించి చెప్పాలో అతనికి అర్థం కావటం లేదు.

"ఏం జరిగిందో చెప్పవయ్యా!"

"ఏం లేదండీ! స్త్రీలు ఆ పరిస్థితులలో దేవాలయంలోకి రావటం అపవిత్రంగా భావిస్తారు."

"ఓహో! అదా? సరే! సరే! అర్థమయ్యిందిలే." ఇంత చిన్న విషయం ఊహించలేనందుకు జమిందారు తనలో తాను నవ్వుకున్నాడు.అన్నపూర్ణ రానందుకు రకరకాలుగా ఊహించుకున్నాడు. ఆయన గణేష్‌ను వెళ్ళమని సైగ చేసాడు.

జమిందారు తన ఇంటికి వచ్చే ప్రత్యేక అతిథులకిచ్చే విస్కీతో ఆ రాత్రి గడిపాడు

# 26

అన్నపూర్ణ జమిందారుకు దూరంగా వున్నప్పుడల్లా రాజగోపాలరావుకు దగ్గరవుతూ వుంటుంది కావాల్సిన సహాయం, నైతిక సమర్థన. ఆమెకు రాజగోపాల రావు నుండి లభిస్తూ వుంటాయి. వాళ్ళిద్దరి సంబంధం వ్యక్తిగతమైన కారణంగా, వాళ్ళిద్దరి రాజకీయ మార్గాలు వేరయినా వాళ్ళిద్దరి సంబంధానికి నష్టం జరగలేదు. ఆమె రాజగోపాలరావుతో సమాన స్థాయికు చెందినది. రాజగోపాలరావు, జమిందారు లాగా ఆమె నెప్పుడూ తక్కువగా చూడడు. జమిందారు కలిగించినట్లుగా ఆమెలో ఆత్మన్యూనతా భావం కలిగించడు. రాజగోపాలరావు అభిజాత్య వంశానికి చెందక పోయినా, జమిందారు కంటె అధిక గౌరవం పొందుతూ వుంటాడు.

రాజగోపాలరావు ఇంటి వద్దనే వున్నాడు. కాలికి పట్టీవున్నా అతను కర్ర లేకుండానే నడవగల్గుతున్నాడు. గెడ్డం పెరిగిపోయింది. మనిషి సగమైపోయాడు. విచిత్రమైన నిస్సహాయత, వ్యాకులత రాజగోపాలరావును చుట్టుకుంది.

"రండి, రండి మీ కోసం ఎదురు చూస్తున్నాను. మీరు ఎప్పుడు వచ్చారు?" అన్నపూర్ణను చూడగానే వినయం అభినయిస్తూ అన్నాడు రాజగోపాలరావు.

"నిన్న వచ్చాను. మిమ్ములను చూడడానికి నిన్నే వద్దామనుకున్నాను. నా ఆరోగ్యం సరిగా లేని కారణంగా రాలేదు."

"ఇప్పుడు ఆరోగ్యం బాగుంది కదా!"

"మంచం మీద పడివుండటం అలవాటు లేదు కదా! కొంచెం ఇబ్బందిగా వుంది. ఎవరో కట్టిపడవేసినట్లుంది. పొలాల పచ్చదనం చూసి చాలా రోజు లయ్యింది. పచ్చని పొలాల పైనుంచి వీచే చల్లని పిల్లతెమ్మరలు, కలిగించే ఆహ్లాదం నువ్వు ఎప్పుడైనా అనుభవించావా?"

"నువ్వు ఈ మధ్యన కవివైపోతున్నావు. ఇదే పరిస్థితి కొనసాగితే నువ్వు రాజకీయాలు కూడా వదలి వేసేటట్లు వున్నావు అది తప్పు కూడా కాదు" అన్నపూర్ణ నవ్వుతూ అంటుండగానే రాజగోపాలరావు భార్య కాఫీ కప్పుతో అక్కడకు వచ్చింది.

"ఎవరైనా చాలా రోజులు పడకవేస్తే చాలా సమస్యలు వాటంతట అవే పరిష్కారమవుతాయని నాకనిపిస్తుంది. ఆలోచనలో చాలా మౌలికమైన మార్పులు కూడా వస్తాయి. మనం కూడా మొక్కలు, చెట్లవలె క్రమ వికాసం చెందాలని, నేను కోరుకుంటాను. అయితే ఆకస్మికంగా, రాత్రికి రాత్రే పెరిగిపోతున్నాం. నేను మనుష్యుల స్వాభావిక వికాసం గురించి మాట్లాడటం లేదు. అకస్మాత్తుగా పెద్దవాళ్ళైపోయినవారు ప్రదర్శించే గర్వం ఇతరులను బాధిస్తుంది. తామేదో గొప్పవాళ్ళమై పోయామన్న విషయం ప్రదర్శించుకోవాలనుకుంటారు. నువ్వు అటు వంటిదానివని నేనటం లేదు."

చిరునవ్వుతో కలిపి రాజగోపాలరావు వేసిన వాగ్బాణాలు అన్నపూర్ణ అర్థం చేసుకుంది. "మీరు విప్లవాన్ని విశ్వసిస్తారని నేననుకుంటున్నాను. అయితే మీరు ఆశించే విప్లవం ఫలించటం లేదని కూడా నా అభిప్రాయం." అన్నపూర్ణ స్థిరంగా సమాధాన మిచ్చింది. "విషయం సామాజిక స్థాయికి సంబంధించినది. నేను చెప్పేది వ్యక్తుల ఆకస్మిక అభివృద్ధి గురించి. లెనిన్ బ్రహ్మాండమైన విప్లవానికి నాయకత్వం వహిస్తూ కూడా తనలోని దయాగుణాన్ని, సౌమ్యతను, ఆర్ద్రతను వదలిపెట్ట లేదు. సామాన్యుడుగా ఉన్నప్పుడు ఏ విధంగా ప్రవర్తించేవాడో, నాయకుడుగా కూడా అదే విధంగా వ్యవహరించే వాడు."

"ప్రతి ఒక్కరూ లెనిన్‌లాగ ఉంటే, మనం లెనిన్ గొప్పతనం గురించి చెప్పుకోలేము గదా!"

"అవును, నువ్వు చెప్పేది కూడా సరిగానే ఉన్నట్లుంది. నేరం చేసిన ప్రతి వాడు సమర్థించుకోటానికే ప్రయత్నం చేస్తాడు." రాజగోపాలరావు మాటలకు అన్నపూర్ణ నవ్వింది. అతను కూడా ఆమె నవ్వుతో శృతి కలిపాడు. "సరే, ఆ విషయాలు వదిలివేయ్, ఇప్పుడు నీ ఆరోగ్యం కుదుటపడింది గదా! నువ్వు కోర్టుకు వెళ్ళి వాయిదా పడుతున్న ఆ వీరాస్వామి కేసు సంగతి చూడవచ్చు కదా!"

"కేసు నడుస్తూవుంటే నష్టమేముంది? జీవితమంటే విలాసవంతులైన జమిందారులకు ఊడిగం చేయటంకాదు. జమిందారుల కోసం పేదవారిని పీడించటం అంతకన్నా కాదు. ఆ విధంగా చేసేవారికి ఏదో ఒక రోజున తామేం చేస్తున్నామో తరచి చూసుకోవల్సిన అవసరం వస్తుంది. ధనవంతుల కంటే వారి మెరమెచ్చుల కోసం తాపత్రయపడే ఈ తాబేదార్లే ఎక్కువ ప్రమాదకారులు. వారిని అంతం

చేయటం అంత తేలిక కాదు. నేను కొంచెం కఠినంగా మాట్లాడుతున్నానని నువ్వనుకోవచ్చు. కాని నేనేం చేయలేను."

"నువ్వు సహజంగానే మాట్లాడుతున్నావు."

"ఈరోజు కాకపోయినా, రేపయినా, వాళ్ళు చేసిన దానికి తగిన ఫలితం అనుభవించక తప్పదు." రాజగోపాలరావు కోపంతో ఊగిపోయాడు.

"నీకేం చెప్పాలో తెలియటంలేదు."

"బహుశా నేనింత కఠినంగా ఉండనవసరం లేదేమో! జమిందారు కుట్రను భగ్నంచేయటం, అతని నిజస్వరూపాన్ని ప్రజలకు తెలియచేయటం ముఖ్యం. వీరాస్వామిని శిక్షించటం అంత ముఖ్యం కాదు. వాడు పేద బానిస. యజమాని ఆజ్ఞ పాలించాడు."

"ఇదంతా జమిందారే చేయించాడని నీకెట్లా తెలుసు?"

"నువ్వు జమిందారు తరపున మాట్లాడడం లేదుకదా? వాళ్ళ జమీలు పోయినా, వాటి మూలకంగా నరనరాల్లో జీర్ణించుకున్న మిథ్యాడంబరం పోలేదు. జారిపోయిన వాళ్ళ ప్రభావాన్ని తిరిగి పొందడానికి ఏమి చేసినా, అది తక్కువే నని వాళ్ళు భావిస్తుంటారు ప్రతి ఒక్కరూ వారి ప్రభావాన్ని తగ్గిస్తూ వుంటారని వాళ్ళ అభిప్రాయం. నువ్వు కూడా జాగ్రత్తగా వుంటే మంచిది."

"హు."

"మేమంతా నువ్వు మన నియోజక వర్గపు ప్రతినిధి వనుకుంటాము. నువ్వు ఆయన ఒక్కడి ప్రతినిధివి మాత్రమేనని జమిందారు అనుకుంటూ వుంటాడు. నువ్వు ఆయన చేతిలోని కీలుబొమ్మవని, ఆయన ఆడించినట్లు నువ్వు ఆడాలని ఆయన ఉద్దేశ్యం నీకు బాధకలిగితే క్షమించు."

అన్నపూర్ణ నవ్వలేక నవ్వింది.

"నేను ఆయనకు అడ్డంగా వున్నానని ఆయన భావిస్తున్నాడు. నన్ను లేకుండా చేస్తే ఆయన ఇష్టారాజ్యానికి ఎదురుండదని ఆయన అభిప్రాయం. అర్థ మయ్యిందా!"

"అవునేమో!"

"దేవాలయం పునర్నిర్మించటం వంటి 'అతి పవిత్ర' కార్యక్రమం చేపట్టటం, స్కూలు భవనం కట్టిస్తానని వాగ్దానం చేయటం ఆయన ఉదారత కాదు. తన అధికారాన్ని నిలబెట్టుకోవటానికి చేసే చిల్లర ప్రయత్నాలు మాత్రమే. ఆయన తన కుటిల ఆలోచనలకు, దుర్మార్గాలకు ఉదారత అనే శాలువ కప్పుతున్నాడు. బహుశా నువ్వు ఇదంతా అర్థం చేసుకున్నావనుకుంటాను."

"అవును."

"ఆయన నన్ను కొట్టించాడు. బహుశా ఈ రహస్యం తెలిస్తే ప్రజలు ఆయనకు వ్యతిరేక మౌతారని ఆయన భావిస్తూ వుండవచ్చు. నేను తలచుకుంటే బహుశా ప్రజలు సిద్ధం కావచ్చు. అయితే నాకు ఈ మధ్య తరగతి వాళ్ళపైన నమ్మకం లేదు. వాళ్ళు గాలి ఎటు వీస్తే అటు కొట్టుకుపోతూ వుంటారు. గ్రామం లోని వర్గ వ్యవస్థలో వారు పావులు మాత్రమే. ఆ వ్యవస్థకు ముఖ్యుడు జమిందారే నన్న సంగతి నీకు తెలుసు కదా!"

"ఈ సంఘటన వెనుక పెద్ద కుట్ర వున్నదని నువ్వెప్పుడూ అనలేదు."

"కుట్ర అనేది చాలా పెద్ద శబ్దం. వారు చేసిన ఈ పని వెనుక ముఠా తత్వం వుందని మాత్రం తప్పక చెప్పగలను. పోలీసులకు కూడా దీనిని 'కుట్ర' అనవద్దని చెపుతాను. నేనేదో మాట్లాడేస్తున్నట్లున్నాను."

"అవునవును." అన్నపూర్ణ చిరునవ్వు నవ్వింది.

"వీళ్ళ వ్యవహారంలో నాకు పెద్ద మతలబు కనబడుతున్నది. వాళ్ళు రహస్యమేదో దాయాలని ప్రయత్నిస్తున్నారు. వాళ్ళు చేసిన నేరాలను ఉదారత ముసుగులో కప్పాలని చూస్తున్నారు. నేను చెప్పినట్లు జబ్బు పడినవారు అసమం జసంగా మాట్లాడతారనుకుంటాను. బూడిద క్రింద మండే అగ్నికణాలుంటాయి."

"ఆవేశంలో అవి మాటలుగా వెలువడుతుంటాయనుకుంటాను."

"సరేలే మీ మిత్రుడు ఈ రోజు నిన్ను చూడటానికి వచ్చాడనుకుంటాను."

"అవును, వచ్చారు."

"నీ దగ్గర నుండి ఆ విషయంలో నిజాలు బయటకు రావని తెలుసు. అందుచేత నేనేమీ ప్రశ్నలు వేయదలచుకోలేదు. జమీందారుగారు ఎవరినైనా వారి యింటివద్దే చూడటానికి రావటం ఈ గ్రామంలో ఇదే ప్రథమ మనుకుంటాను. నువ్వు చాల అదృష్టవంతురాలివి."

"ఊహు."

"ఉక్కు మనుష్యుల్లాగా కనిపించే జమిందారు వంటి వ్యక్తులు వారికి అవసరమైతే వెన్నలాగ మెత్తగా వ్యవహరిస్తారు. కాళ్ళు పట్టుకుంటే పనవుతుందనుకుంటే, ఎవరి కాళ్ళయినా పట్టుకోవటానికి వాళ్ళు వెనుకాడరు. స్వార్థం లేకుండా వాళ్ళేమీ చెయ్యరు. కేవలం మర్యాదలు పాటించటానికి వాళ్ళు ఎవరి ఇంటికీ రారు."

"నీకు వాళ్ళ సంగతి బాగా తెలుసు.... నేను కూడా ఇపుడిపుడే తెలుసుకుంటున్నాను."

"వాళ్ళు నీమీద రకరకాల వత్తిళ్ళు తీసుకురావచ్చు. వారిపట్ల నీకున్న కృతజ్ఞతతో నువ్వు వాళ్ళపక్షం వహించవచ్చు. అయితే నిన్ను ఎన్నుకున్న ప్రజలకు నువ్వు నమ్మకద్రోహం చెయ్యకూడదు నువ్వు ధనానికో, పదవీ సంరక్షణకోసమో లొంగిపోయి, నిన్నెన్నుకున్న ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా వ్యవహరిస్తే మిగతావాళ్ళ సంగతి ఎట్లావున్నా నేను మాత్రం నిన్ను వదిలి పెట్టను."

"అది నాకు తెలుసుగాని, నువ్వు నిద్రపో. అనవసరపు విషయాలకోసం ఎందుకింత ఆగ్రహం చెందుతావు? ప్రజలకు నమ్మకద్రోహం చెయ్యకూడదని నాకు తెలుసు. పదవీవ్యామోహం చాలా తీవ్రమైనదని కూడా నాకు తెలుసు. నేను కొన్ని తప్పులు చేశాను.... ఇహముందు జాగ్రత్తగా వుంటాను."

"నీ మాటలు నాకు చాలా సంతోషాన్ని కల్పిస్తున్నాయి. ఆనకట్ట సంగతి ఏం చేసావో చెప్పు. నేను పత్రికలలో చదువలేదు; రేడియోలో వినలేదు. ఎవ్వరూ చెప్పలేదు. ఏం జరిగిందో చెప్పు."

"ప్రభుత్వం ఒక కమిటీ వేసింది. అదికాకుండా పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు."

"అదెప్పుడో పాత సంగతి కదా? అసెంబ్లీలో దీనిపై చర్చ కూడా జరిగింది కదా? ముఖ్యమంత్రిగారు హామీకూడా యిచ్చారు. నాకు ఆ హామీలన్నీ నీటి మూటలుగానే కనబడుతున్నాయి."

"ప్రస్తుతం ఆ కమిటీ పని చేస్తున్నది. విషయమంతా సేకరించిన తర్వాత సాక్ష్యాలు తీసుకోబడతాయి నాకు కూడా ఈ కమిటీతో సంబంధం వున్నది."

"తెలుసు, తెలుసు. నువ్వా కమిటీకి అధ్యక్షురాలివి కదా?"

"ప్రభుత్వం సంగతి నీకు తెలియనిదేమున్నది? నత్తనడక నడుస్తుంటుంది."

"జాగ్రత్తగా వ్యవహరించు. ప్రభుత్వపు లక్ష్యాన్ని, అసమర్థతను కప్పి పుచ్చుకోవటానికి ఉపయోగించే మాటలవలన ప్రయోజనం లేదు. ఇది ఎవరు చేసారో, ఎవరు చేయించారో, ఇంత ఆలస్యం ఎందుకు జరుగుతున్నదో నాకు తెలియదు. ఒక్క విషయం మాత్రం చెప్పగలను. నువ్వు ఆ కమిటీలో వున్నంతవరకు మాకు అన్యాయం జరుగుతుందనే భయం లేదు."

"నీ మాటలు వింటుంటే మేము తెలుసుకోవాలని ప్రయత్నిస్తూ కూడా, తెలుసుకోలేకపోతున్న విషయాలు నీకు ముందుగానే తెలుసనిపిస్తుంది."

"అవును, నాకు తెలుసు. అయితే ఎవరూ కనీసం ఆలోచించని అనుమానాలను బలవంతంగా నీపై రుద్దలేను. నేను కొంచెం బాగయ్యే వరకు .... మౌనంగా వుండటమే మంచిది."

"నీ యిష్టం. అయితే మేము హడావుడిగా విచారణ పూర్తిచేస్తే నీ సాక్ష్యం మాకు లభించేది కాదు " అన్నపూర్ణ నర్మగర్భంగా నవ్వింది.

"ఆ విషయం సరే, ఆనకట్ట మరమ్మత్తు సంగతి ఏం చేస్తున్నావు?"

"ఆనకట్ట నిర్మించిన కంపెనీ వారికే మరమ్మత్తు పని అప్పచెప్పబడుతున్నది."

"అంటే జమిందారు కంపెనీకి మరల కాంట్రాక్టు ఇవ్వబడిందన్నమాట! కాలవ త్రవ్వే పని మాత్రం జమిందారుకు అప్పగించి వుండరు. ఇప్పుడర్థమయింది, జమిందారు మీ యింటికి ఎందుకు వచ్చాడో!"

"సరిసరి! రాజకీయాలు సుడిగుండంలాగా తిరుగుతూ వుంటాయి కాని, తిన్నగా వుండవు బహుశా నేను రాజకీయాలకు తగనేమో! అయినా ఏమీ పర్వా లేదు నువ్వు నీ సంగతి జాగ్రత్తగా చూసుకో. నీ కళ్ళు తెరుచుకున్నా, తెరుచుకోకపోయినా ఒక్కటి మాత్రం చెప్పగలను-కళ్ళ ముందు వున్న చీకటి మాత్రం తొలగిపోతున్నది. నువ్వు త్వరగా కోలుకో. మేమందరం అదే కోరుకుంటున్నాం."

"నువ్వేదో తొందరలో వున్నట్లున్నావు. అప్పుడప్పుడు వస్తూవుండు. జమిందారు ఏ కుట్రలు పన్నినా మేమందరం నీతోనే వుంటాం మేముండగా ఆయన నిన్నేం చెయ్యలేడు. నిన్ను గుమ్మందాకా సాగనంపాలని వుంది. కాని బాగా లేదు."

"పర్వాలేదు.... నువ్వు విశ్రాంతి తీసుకో."

# 27

అన్నపూర్ణ ఎక్కువగా గ్రామంలో వుండదు. ఒకవేళ వున్నా చాలా హడావుడిగా, ఎప్పుడూ ఏదో ఒకచోటికి వెళ్ళివస్తూ వుంటుంది. ప్రజల్ని కలుసుకోవటం, ఉపన్యాసాలివ్వటం, సిఫారసులు, దర్యాప్తులు.... సామాజిక జీవితంలో పెద్ద ఆకర్షణ వున్నా, ఆమె అప్పుడప్పుడు తీవ్రంగా అలసిపోతుంటుంది. పూర్వం మానసికంగానే అలసిపోతుండేది. ప్రస్తుతం శారీరకంగా కూడా అలసిపోతున్నది.

రాజగోపాలరావు ఇంటివద్ద నుండి బయలుదేరినతర్వాత ఆమె తమ ప్రక్క గ్రామం రామాపురం వెళ్ళింది. అక్కడ రాజగోపాలరావు సహచరుడు ఏసుదాసును, రాజగోపాలరావును కొట్టినట్లే ఇంటికి వెళుతున్న దారిలో అడ్డగించి కొట్టారు. ఇటువంటి సంఘటనల వెనుక రాజకీయ కారణాలు వుండవనుకోవటం పొరపాటవుతుంది

జమిందారు గ్రామంలో మకాం వేసినప్పటినుండే ఇటువంటి సంఘటనలు జరుగుతున్నాయని అన్నపూర్ణ భావించసాగింది. జమిందారు మద్రాసు వెళ్ళిపోయిన తర్వాత మెదలకుండా వున్న భూస్వాములు, ఇప్పుడు జమిందారు మరల ఇక్కడకు రాగానే తమ తమ అధికారాలు చెలాయించసాగారు.

ఏసుదాసు ఒకప్పుడు ఆనకట్ట నిర్మాణపు పనిలో కూలీల ముఠాకు మేస్త్రీ అని అన్నపూర్ణకు విషయసేకరణలో తెలిసింది. అతనొకసారి తనను కలిసిన సంగతి కూడా అన్నపూర్ణకు గుర్తుకు వచ్చింది. ఆ గ్రామంలో అతను పెద్దగా భావించబడతాడు ఇప్పుడు అతనికిగాని, అతని మనుష్యులకుగాని ఏ విధమైన పని లేదు. అతనిని ఎవరు, ఎందుకు కొట్టారో అర్థం కావటంలేదు.

ఏసుదాసు ఎక్కువగా చుట్టు ప్రక్కల గ్రామాలలో తిరుగుతూ వుంటాడని, రాజగోపాలరావు సలహామీద హైదరాబాద్ వెళ్ళి ఉన్నత పోలీసు అధికారులను కలుసుకోవాలనుకున్నాడని, కాని వాళ్ళు అతనిని కలవటానికి అనుమతి ఇవ్వలేదని అన్నపూర్ణకు తెలిసింది.

అతనికి దెబ్బలు బాగానే తగిలి, అదృష్టవశాత్తు ప్రాణాపాయం లేదని తెలిసింది. ఏసుదాసును కొట్టిన సంగతి తెలిసి అతని సహచరుడు రామయ్య ఇల్లు

వాకిలి వదిలి వచ్చి అతనికి సేవ చేయసాగాడు అతను కూడా ఏసుదాసుతోపాటు ఆనకట్ట పనిలో పాల్గొన్నాడు. అతనుకూడా ఏసుదాసువెంట పూర్వం అన్నపూర్ణను కలిసాడు.

అన్నపూర్ణకు మనస్సులో జమిందారుపట్ల గౌరవం వున్నప్పటికీ, ఆయన తెరవెనుక నుండి రాజకీయం నడుపుతున్నాడన్న విషయం స్పష్టం కాసాగింది. ఈ సంఘటనలో కూడా జమిందారు హస్తమున్నదా?

ఆమె రామాపురంలో వుండగానే, కొందరు రైతులు వచ్చి, తమ తండ్రుల తాతల కాలంనుండి సేద్యం చేసుకుంటున్న పొలాల నుండి జమిందారు తమను వైదొలగమంటున్నాడని, తాము పన్నులు, కౌలు ప్రతి సంవత్సరం ఖచ్చితంగా చెల్లిస్తున్నామని, జమిందారును కలిసి విషయం విన్నవించుకుందా మంటే, ఆయన తమను చూడటానికే అంగీకరించలేదని ఆమెకు ఫిర్యాదు చేసారు.

వాళ్ళంతా చిన్నరైతులు. జమిందారు పొలంలో వ్యవసాయంచేసుకుంటూ బ్రతుకుతున్నారు. కూలీల లాగా పనికోసం ఇంటింటికీ తిరగలేని వాళ్ళు. పొలం జమిందారుదే. అయితే ఎన్నో ఏండ్లుగా కౌలుచేస్తున్న వాళ్ళను అర్థంతరంగా బయటకు పంపితే వాళ్ళేమైపోతారు?

ఆమె తన గ్రామం తిరిగి వచ్చేసరికి చీకటి పడింది. ఇళ్ళపైకప్పుల నుంచి పొగ బయటకు వస్తున్నది. గ్రామమంతా నిశ్శబ్దంగా వుంది. కాని అన్నపూర్ణ మనస్సు ఉడికిపోతున్నది.

ఆమె తిన్నగా జమిందారు గారి భవనానికి వెళ్ళింది. కోట ద్వారంగుండా నడుస్తున్నప్పుడు ఎందుకో తెలియదుగాని ఆమె మనస్సు తేలికపడసాగింది. జమిందారు సమక్షంలోకి వెళ్ళేసరికి ఆమె శాంతంగా వుంది. ఆమె వెళ్ళేసరికి జమిందారు విశ్రాంతిగా కూర్చుని రేడియో వింటున్నాడు.

జమిందారు రేడియో కట్టివేస్తూ పెద్ద కుర్చీ చూపించి "కూర్చోండి" అన్నాడు.

"నన్ను చూడటానికి ఈ రోజు మీరు వచ్చినందుకు చాలా సంతోషంగా వుంది." జమిందారు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"నేను రామాపురం వెళ్ళివచ్చాను."

"అలాగా!" జమిందారు మొహం ఒక్కసారి ముడుచుకుపోయింది. ఆయన గంభీరంగా మారిపోయాడు. మాట మారుస్తూ "విశాఖపట్నంలో తుఫాను కలిగించిన నష్టం సంగతి నీకు తెలిసిందా? మనం ఆ తుఫాను బాధితులకోసం ఏదో ఒకటి చేయవలసివుంటుంది. మనం డబ్బు, బట్టలు పంపవచ్చు."

"చాలా మంచిదండీ!" రామాపురం రైతులసంగతి ఏదో ఒకటి ఖచ్చితంగా తేల్చుకోవాలని వచ్చింది. జమిందారు కాని ఈ మాటలు మాట్లాడితే ఎదురు చెప్ప లేకపోయింది.

"ఈ దేశమంతా ఒక శరీరం వంటిది. ఈ శరీరంలో ఏ భాగానికి నష్టం జరిగినా మొత్తం శరీరమంతా సహకరించవలసి వుంటుంది." జమిందారు సూక్తులు చెప్పసాగాడు.

"తప్పకుండా సహాయం చెయ్యాలండి, మన ప్రాంతంలో కూడా అటు వంటి నిర్భాగ్యులు చాలా మంది వున్నారు. మనం వారి సంగతి కూడా పట్టించు కోవాలి." అన్నపూర్ణ తన ఆగ్రహాన్ని ఆపుకోలేకపోయింది. అట్లా అని తన మనస్సులో మాట పూర్తిగా వ్యక్తంచేయలేకపోయింది.

"నువ్వేదో విషయం గురించి ఆందోళన చెందుతున్నట్లున్నావు. ప్రజా ప్రతినిధులకు విశ్రాంతి ఎక్కడ వుంటుంది? ప్రజలను గురించి తరువాత మాట్లాడు కోవచ్చు. ఈ వాతావరణం ఎంత ఆహ్లాదంగా వుందో చూసావా? ఇక్కడ ఎంత నిశ్శబ్దం, ఎంత ప్రశాంతత చోటు చేసుకుందో చూసావా? నది మీద ఆనకట్ట, సరే! మన ప్రజలకు నీటిపారుదల సౌకర్యం వున్నంతవరకు ఏ ఇబ్బంది లేదు. నీరు ఎంత ఎక్కువ లభిస్తే అంత ఎక్కువ ఆదాయం వస్తుంది. రైతుల జీవన ప్రమాణాలు పెరుగుతాయి. నా నిద్ర సంగతి వదిలేయ్. అప్పుడప్పుడు మద్రాసు గుర్తుకు వస్తుంది. అంతే!"

"బహుశా అది అలవాటు కారణంగా అయ్యుంటుంది. ఈ రోజుల్లో మీ వంటి భాగ్యవంతులకు 'ఎయిర్‌కండీషన్' అలవాటు బాగా అయి వుంటుంది. ఈ నదుల కలకల ధ్వనులు ఎబ్బెట్టుగా వుంటాయి." అన్నపూర్ణ ఈ మాటలు అంటూ వుండగానే, జమిందారు ఆమె నడుము పట్టుకుని దగ్గరకు పిలిచాడు.

"ఇప్పుడు కాదు. నేను చాలా అలసిపోయి వున్నాను. స్నానం చెయ్య లేదు." అన్నపూర్ణ సిగ్గుపడసాగింది. ఆమెకు ప్రస్తుత పరిస్థితి చాలా అసహ్యంగా

వున్నది. అంతకంటే ఎక్కువ మాట్లాడలేకపోయింది. జమిందారు అవకాశవాదం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించసాగింది.

"కొద్దిపాటి మా కౌగిలే నీకు అలసట కలిగిస్తుందా! నువ్వు తరచు వస్తూ వుంటే నాకు బాగుంటుంది. నేను ఒంటరిగా వుంటున్నాను. ఒంటరితనంలో విశ్రాంతిని కోరటం సహజమే కదా?"

"ప్రస్తుత ప్రపంచంలో ప్రతి వస్తువూ ఖరీదుకు దొరుకుతున్నది. విశ్రాంతి ఒకటే ఖరీదుకు దొరకదనుకుంటాను" అన్నపూర్ణ గొంతులో వ్యంగ్యం తొంగి చూసింది.

"ఏమైనా త్రాగుతావా?"

"లేదు, నేనేమి త్రాగను."

"అప్పుడప్పుడు త్రాగుతావు కదా?"

"గ్రామంలో ఎప్పుడూ త్రాగను. పైగా ఆయన నాకోసం ఎదురుచూస్తూ వుంటాడు. నాపై ఆయనకు అధికారం వున్నది కదా?" ఈ మాటలలోనే ఇంటికి వెళ్ళటానికి అనుమతి కూడా ధ్వనించింది. ఆ పరిస్థితులలో జమిందారుతో రామాపురం సంగతి మాట్లాడటం అనవసరమనే స్థితికి ఆమె వచ్చింది.

"గణేష్ ఎట్లా వున్నాడు?"

"బాగానే వున్నాడు."

"నేను నా మాట నిలబెట్టుకుంటాను. నేనొక పంచదార ఫ్యాక్టరీ మొదలు పెడతానని, అందులో గణేష్‌ను ఆఫీసర్‌ను చేస్తానని చెప్పాను కదా! టీచర్ ఉద్యోగమంటే ఎంత హీనమో! నువ్వే చూస్తున్నావు కదా?"

"నాకు కూడా ఏదైనా పని చూడండి. టీచర్ ఉద్యోగమైనా ఫర్వాలేదు. ఈ రాజకీయ పదవులకంటే అదే మేలు. కనీసం సమాజంలో గౌరవం వుంటుంది. నేను నా కష్టాలు చెప్పి మీ సమయం వ్యర్థపరచటం లేదనుకుంటాను."

"నేను ఈ షుగర్ ఫ్యాక్టరీ గురించి చాలా కాలంగా ఆలోచిస్తున్నాను. అయితే ప్రభుత్వమే ఖచ్చితమైన 'విధాన నిర్ణయం' చెయ్యటం లేదు. ఆ ప్రభుత్వంలో నీలాంటి పెద్దలే కూర్చున్నారు."

"ప్రస్తుతం పరిస్థితి కొంచెం మెరుగయ్యిందనుకుంటాను."

"అది మెరుగో, తరుగో నాకు తెలియదు. ప్రైవేటు కర్మాగారాలకు వాళ్ళు అనుమతి ఇవ్వటం లేదు. వాళ్ళు ప్రస్తుతం మరో రంగాన్ని పైకి తేవాలను కుంటున్నారు. అది సహకార రంగం. సహకార రంగంలో చక్కెర కర్మగారాలకు వెంటనే అనుమతి ఇస్తున్నారు."

"అవునండి."

"ఆ కర్మాగారం సహకార రంగంలో వుంచేనే బాగుంటుంది. అమలులో వున్న వ్యవస్థకు నేను విరోధిని కాను. సామంతీయ వ్యవస్థ పాతిపెట్టబడిందని నాకు తెలుసు కొద్దికాలం తర్వాత పెట్టుబడిదారీ వ్యవస్థ కూడా అంతమైపోతుంది. సహకార రంగం మొదటి వరుసలో వుంటుంది. నేను ఆ సహకార రంగంలో ముందుండ తలచుకున్నాను. అరే, చెప్పటం మరిచాను. ఈ రోజు మా యింట్లో భోజనం చేసివెళ్ళు"

"లేదు. క్షమించండి. ఈ రోజు వీలుకాదు."

"మా భోజనం మిమ్మలనేమీ చెడగొట్టదు. ఇదంతా సహకారమే. నేను పెద్ద సహకారిని. ఈ గ్రామంలో అందరి సహకారం, కాదు కాదు - నేను ఈ తాలూకాలో అందరి సహకారం కోరుతున్నాను."

"అవును. కర్మాగారం కూడా చాలా పెద్దదవుతుంది."

"ప్రాథమికంగా అవసరమైన ఖర్చులన్నీ నేనే భరిస్తాను. పైగా ఈ తాలూకాలో నేనే పెద్ద రైతును కదా?" జమిందారు చిరునవ్వు నవ్వుతూ చెప్ప సాగాడు. "అయితే ప్రజలకు వారి మేలుకోసమైనా మనతో కలిసి రావాలని చెప్పాలి."

"అవును."

"కాని, నీ మిత్రులు కొందరికి ఇంత స్పష్టంగా వున్న విషయం కూడా అర్థం కాదు. నేను చేసే ప్రతి పనిలోనూ వారికి స్వార్థంతప్ప మరేమీ కనిపించదు. మాకింతకాలం ఇంత తిండి పెడుతున్న ఈ గ్రామం ఋణం నేను ఈ విధంగా తీర్చుకోవాలనుకుంటున్నాను. నువ్వెందుకు నవ్వుతున్నావు?"

"ఈ గ్రామం మీకు తిండి పెట్టడం అన్న విషయమే నాకు అర్థం కావటం లేదు."

"నువ్వు రాజగోపాలరావుతో మాట్లాడిచూడు. నేనుకూడా అతనిని కలిసే ప్రయత్నం చేస్తున్నాను. అతని పరిస్థితి ఎలా వుంది? ఇంకా లేచి తిరగటం లేదనుకుంటాను. అతని సహకారం మనకు చాలా అవసరం."

"అతనేదైనా మాట చెప్పితే వేలమంది శిరోధార్యంగా భావిస్తారు."

"అంత పలుకుబడి వుందా?"

"గ్రామంలో ఎక్కువమంది అతని పక్షమే."

"ఏం చేస్తాం? రోజులిట్లా మారిపోయాయి. నీకు చెప్పానుగా, మా అబ్బాయి ఫెర్టిలైజర్ కర్మాగారం కడుతున్నాడు. ఇక్కడ కడితే బాగుండేది. ఆయన ట్రాన్స్‌పోర్టు ప్రోబ్లమ్ వున్నదని చెపుతున్నాడు. ఈ ఆనకట్ట పూర్తయితే ఇక్కడ బంగారం పండుతుంది. ఈ తాలూకా స్వరూపమే మారిపోతుంది."

అన్నపూర్ణ నోటికి చీరచెంగు అడ్డం పెట్టుకుని బలవంతాన నవ్వు ఆపుకోసాగింది. ఒంటరిగా వున్నప్పుడు ఏదో చిలిపి చేష్టలు చెయ్యకుండా జమిందారు ఇంతసేపు వివిధ విషయాలపై చర్చించటం ఆమె ఎప్పుడూ చూడలేదు. జమిందారు ప్రదర్శిస్తున్న ఈ గంభీరత ఆమెకు కృత్రిమంగా కనిపించసాగింది.

"ప్రజలు సహకరిస్తే మనం ఇంకా ఎన్నైనా పనులు చేపట్టవచ్చు. స్కూలు కట్టిస్తున్నాం. హరిజనులకు దేవాలయంలో ప్రవేశం కల్పించాం. ఇంకా ఫ్యాక్టరీలు కట్టించవచ్చు. నేను అందుకు అవసరమైన వాతావరణం కల్పించడానికే వచ్చాను. అంతేకాని కొంతమంది ప్రచారం చేస్తున్నట్లు రాజకీయాలు చెయ్యడానికి కాదు."

"మీరేమి చేసినా ఎవరికీ ఇబ్బంది కలుగదు. నేనెంత, నా పదవి ఎంత?"

"నువ్విట్లాగా అంటావని నాకు తెలుసు." జమిందారు ఆమె చెయ్యిపట్టుకుని నడుం చుట్టూ చెయ్యివేసాడు.

అన్నపూర్ణ రామాపురం రైతుల సంగతి ప్రస్తావిద్దామనుకుంది. కాని ప్రస్తావించలేకపోయింది. జమిందారు ఆమెను సమ్మోహింపజేశాడు. జమిందారు చెప్పిన విషయాలు ఆమె చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి. అన్నపూర్ణ ఏ రోజు కూడా తన మనస్సులోని మాట జమిందారుతో స్పష్టం చెయ్యలేదు. అదే ఆమె బలహీనత... బలహీనతకన్నా జమిందారు ప్రభావం అని చెప్పవచ్చు. ఆ ప్రభావం నుండే ఆమె బయటపడలేకపోతున్నది.

"నువ్వు మాతోపాటు హైదరాబాద్ రావాలని మా కోరిక. మనం రాజధానికి చాలా దూరంలో వున్నాం. ఏ పనీ అవ్వటం లేదు. మనం అక్కడ కూర్చుంటే ఏ పనయినా క్షణాల్లో చేసుకోవచ్చు. ముఖ్యమంత్రిని, మంత్రులను కలుద్దాం. నువ్వు మా శాసన సభ్యురాలివి. పైగా నీ ప్రణాళిక కూడా సహకార రంగానికి సంబంధించినదే. నువ్వు మాతో ముఖ్యమంత్రి దగ్గరకు రావటం నీ కర్తవ్యంగా భావించాలి."

"కానీ-"

"కానీ లేదు అర్ధణా లేదు. నువ్వు ఉండటానికి నేనక్కడ వేరే ఏర్పాట్లు చేస్తాను. నీకు చెడ్డ పేరు రానివ్వను...." జమిందారు బిగ్గరగా నవ్వాడు.

"చాలా పొద్దు పోయినట్లుంది. నా కారులో మీ యింటిదాకా పంపనా?"

"వద్దండీ. నేను వెళ్ళిపోతాను"

# 28

కోర్టులో కేసులు, దావాలు నడపడంలో జమీందారు కుటుంబరావు అందె వేసిన చెయ్యి. ఆయన పూర్వీకులు ఏ యుద్ధాల్లోనయినా పాల్గొన్నారో లేదో ఎవరికీ తెలియదు కానీ, వకీళ్ళ సహాయంతో కోర్టుల్లో పోరాటం చేస్తూ వచ్చారు. కుటుంబ రావు తండ్రి పెద్ద లిటిగెంటుగా ప్రసిద్ధి చెందాడు. ఆయనకు ముగ్గురు ప్లీడర్లుండే వారు. వారు కోర్టుల్లో వేరు వేరు కేసుల్లో వాదిస్తూ వుండేవారు. చిన్న చిన్న విషయాలకు కూడా ఆయన కోర్టుకు వెళుతూ వుండేవాడు. ఆయన కోర్టుల ద్వారా చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. అయితే అంతకు రెట్టింపు కూడా సంపాదించాడు.

జమీందారుకు శిస్తు కట్టకుండా వుండటానికి ఎవరికీ వీలులేదు. ఎవరైనా శిస్తు కట్టడం ఆలస్యం చేస్తే వెంటనే వారి మీద కోర్టులో కేసువేసి, వారు ఆస్తి పాస్తులు జప్తు చేయించడం ఆయన కలవాటు. ప్రస్తుతం జమీందారు దగ్గర వున్న చాలా ఆస్తి ఈ విధంగా సంపాదించినదే. కోర్టు విషయాలలో జమీందారు కుటుంబ రావుకు కూడా చాలా అనుభవం వున్నది. ఏ చట్టాన్ని తన కనుకూలంగా ఏ విధంగా అన్వయించుకోవాలో, ఏ చట్టం నుంచి ఏ విధంగా బయటపడాలో ఆయనకు పూర్తిగా తెలుసు. చట్టాల నుంచి తప్పించుకునే విషయంలో ఆయన చాలా నేర్పరి. చట్టం తన పని తాను చేసుకుపోతుంది. అయితే జమీందారు వంటి వ్యక్తులు చట్టాలను తమకు అనుకూలంగా తిప్పుకోగలరు. చట్టం గాడిద వంటిదని, దానికి ఏ తోలయినా కప్పి వుపయోగించుకోవచ్చని జమీందారు అభిప్రాయం.

జమీందారు దావాలు ఎక్కువకాలం నడపటం ద్వారా ప్రత్యర్థులను దెబ్బ తీస్తుంటాడు ఆయన ప్రత్యర్థులలో చాలా మంది పేదవారే అయిన కారణంగా సమయం, డబ్బు విషయంలో ఆయనతో ఎక్కువ కాలం పోటీ పడలేని స్థితిలో వుంటారు. ఆయన చిన్న చిన్న కోర్టుల నుంచి పెద్ద పెద్ద కోర్టులవరకు వెళుతూ వుంటాడు. పెద్ద న్యాయస్థానాలలో ఆయన ఎప్పుడూ గెలుస్తూనే వుంటాడు. గెలవకపోయినా వీలయినంత ఎక్కువ కాలం ఆలస్యం చేయిస్తూ వుంటాడు. దానివలన ఆయనకు వ్యతిరేకంగా గెలిచినవారికి కూడా ఉపయోగం వుండదు.

ఆయన సామాన్యంగా ఏ కేసూ మధ్యలో వదలి పెట్టడు. తనకు లాభం వస్తుందనుకుంటేనే వదలిపెడతాడు గ్రామంలోని తన పొలం విషయంలో ఆయన ఆ విధంగానే చేసాడు. ఈయన దగ్గర పొలం తీసుకున్నవాడు ఈయనను పరోక్షంగా దుర్భాషలాడ సాగాడు. అది జమిందారుకు యిష్టంలేదు. దానివలన గ్రామంలో ఆయన పలుకుబడి తగ్గిపోతుందని జమిందారు భయపడ్డాడు.

చాలా వరకు ఏ కోర్టులోనయినా కేసు గెలిపించుకోవటానికే ప్రయత్నం చేస్తుంటాడు డబ్బు విషయంలో ఆయన వెనుకాడడు. అది ఆయన ఆత్మగౌరవానికి సంబంధించిన విషయం.

ప్రస్తుత ముఖ్యమంత్రిగారు కూడా ఒకప్పుడు ఈయన వకీలే. జమిందారుకు సంబంధించిన చాలా కేసులు ఆయన వాదించాడు. మొట్టమొదట, జమిందారు కేసులు యివ్వకుండా వుంటే ఆయన వకీలుగా నిలదొక్కుకుని వుండేవాడు కాదు. అందుచేతనే ముఖ్యమంత్రి జమిందారు పట్ల ఒక విధమైన అభిమానం కనపరుస్తూ వుంటాడు.

ముఖ్యమంత్రితో తనకున్న పరిచయాన్ని ఏ విధంగా సొమ్ము చేసుకోవాలా అని జమిందారు ఆలోచించసాగాడు. ఆ తాలూకాలోనివారందకీ ముఖ్యమంత్రికి, జమిందారుకు వున్న సంబంధం తెలుసు. ఈ కారణంగా కొందరు ప్రభుత్వోద్యోగులు జమిందారు కోరకుండానే ఆయనకు సహాయ పడటానికి ఉత్సాహపడుతూ వుంటారు.

జమీలు పోయినా ఆయన కేసులు నడుస్తూనే వున్నాయి.

వీరాస్వామి మీద క్రిమినల్ కేసు నడపాలనీ, జమిందారు అసలు రంగు బయటపెట్టాలనీ, పూర్వపు అధికారాలూ, దుర్మార్గాలు ఇక చెల్లవనీ జమిందారుకు తెలియచెప్పాలనుకున్నాడు రాజగోపాలరావు.

కొత్తగా వచ్చిన కుర్ర ఇనస్పెక్టర్‌కు ఈ కేసులో జమిందారు లంచం యివ్వటానికి ప్రయత్నం చేసాడు. అయితే ఇనస్పెక్టర్ అందుకంగీకరించలేదు. ఆయన రోజుల్లో పోలీసు ఆఫీసర్లు లంచాలు తీసుకుని పెద్ద పెద్ద హత్య కేసులే రూపుమాపేస్తూండేవారు. ఈ ఇనస్పెక్టర్ కొత్త తరానికి చెందినవాడు. కొన్ని ఆదర్శాలు కలవాడు. అందుచేత జమిందారు ప్రలోభాలకు లొంగ లేదు.

ఇనస్పెక్టర్ వీరాస్వామి మీద కోర్టులో కేసు ఫైలు చేసాడు వీరస్వామి ముందుగానే నేరం అంగీకరించిన కారణంగా, అది రికార్డు చేయబడిన కారణం గానూ జమిందారు వీరాస్వామిని రక్షించలేకపోయాడు. అయితే ఉన్నతస్థాయిలో ప్రయత్నం చేసి ఏదో విధంగా సోమయాజుల్ని రక్షించగలిగాడు.

రాజగోపాలరావు ఊహించినంత ఫలితం ఈ కేసు వల్ల లభించలేదు. ఫిర్యాదు చేసింది అతనే అయినా కేసంతా పోలీసులే నడుపుతున్నారు. వీరాస్వామి స్వయంగా నేరం అంగీకరించినందున జమిందారుపై నేరారోపణ చేయడానికి వీలు లేకపోయింది.

వీరాస్వామితోపాటు రాజగోపాలరావుపై దాడిచేసిన ఇద్దరు హరిజనులకు చాలినంత డబ్బు యివ్వబడింది. వకీళ్ళు వారికి సాక్ష్యాలు ఏ విధంగా యివ్వాలో పాఠాలు నేర్పారు.

తన పేరు బయటకు రాకుండా, తాను చేయించినట్లుగా ఎక్కడా ప్రస్తా వించబడకుండా జమిందారు జాగ్రత్త పడ్డాడు. పైగా సంఘటన జరిగిన రోజున తాను హైదరాబాద్‌లో వున్నట్లు సాక్ష్యం కూడా వున్నది.

వీరాస్వామికి కోర్టులో చెప్పవలసిన విషయమంతా పూర్తిగా తర్ఫీదు ఇవ్వ బడింది. ఏ ప్రశ్న వేస్తే ఏ సమాధానం చెప్పాలో వివరంగా చెప్పబడింది.

మొత్తం నేరం అతని మీద పెట్టుకోమని చెప్పారు. అయితే ఎందుకు కొట్టాడో చెప్పాలికదా?

ప్లీడర్లు కొత్త కథ అల్లారు. పోలీసు స్టేషన్లో చెప్పిన విషయం సరికాదని చెప్పమని చెప్పారు. ఎందుకు కొట్టిందీ కారణం అడిగితే, రాజగోపాలరావు చెడు ప్రవర్తన కలవాడని, తన కుమార్తెను చెరచడానికి ప్రయత్నం చేసాడని, తనతో తగాదా పడ్డాడని, అందుచేత బదులు తీర్చుకోవటానికి కొట్టామని చెప్పమన్నారు. అయితే కొంచెం ఆలోచించిన తర్వాత దానివలన లాభంకంటే ఎక్కువ నష్టాలే కనిపించాయి.

ఈ విధంగా కొత్తకథ అల్లితే రాజగోపాలరావు తన ప్రవర్తన విషయంలో ఎటువంటి సాక్ష్యాన్నాయినా తీసుకురాగలడనీ, పైగా జమిందారు ప్రవర్తనను బయ టకు లాగుతాడని భయపడ్డారు.

ఈలోగా జమిందారు హైదరాబాద్ స్థాయిలో ప్రయత్నం చేసి ఆ కుర్ర ఇనస్పెక్టర్‌ను అక్కడనుండి బదిలీ చేయించాడు. ఈ విధంగా జమిందారు ఆదిలోనే అడ్డంకిని తొలగించాడు.

వీరాస్వామిని కోర్టులో ప్రవేశ పెట్టగానే తన నేరం అంగీకరించాడు. పోలీసు స్టేషన్లో చెప్పిందే మరల రెండుమూడు చిన్న చిన్న విషయాలు జోడించి చెప్పాడు రాజగోపాలరావు దగ్గరకు తాను వెళ్ళినపుడు; అతను రాళ్ళతో తనను కొట్టాడని, అప్పుడు తాను అరవగా మిగిలిన ఇద్దరూ పరిగెత్తుకు వచ్చారని చెప్పాడు.

తాను ఆ గ్రామస్థుడనేనని, తనకు తగినంత పొలం వుందని, ధాన్యం జమిందారు ఇంటి నుండి దొంగిలించ వలసిన అవసరం తనకు లేదని, తన చేతి సంచుల్లో వున్న ధాన్యం పట్టణంలోని కో ఆపరేటివ్ స్టోర్స్‌లో కొని తీసుకు వస్తున్నానని రాజగోపాలరావు తన సాక్ష్యంలో పేర్కొన్నాడు. ఎవ్వరూ అతని సాక్ష్యాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

వీరాస్వామిని కూడా పెద్దగా ప్రశ్నలు వేయలేదు. రాజగోపాలరావును ఎవరి ప్రోద్బలంపై కొట్టాడన్న విషయాన్ని సైతం తెలుసుకోవటానికి కోర్టులో ఎవరూ ప్రయత్నించ లేదు. వీరాస్వామిని ప్రశ్నించడానికి రాజగోపాలరావుకు కూడా అనుమతి ఇవ్వబడలేదు.

జడ్జికి సంబంధించినంత వరకు దీనిని డైరెక్టు కేసుగా భావించాడు. ఒకరు కొట్టారని ఆరోపించారు. నేరస్తులు నేరం అంగీకరించారు. మిగిలిన విషయాలు అనవసరమని ఆయన భావించాడు.

ఈ కారణంగానే సోమయాజుల ప్రసక్తి కూడా రాలేదు. జమిందారుకు భయపడి వీరస్వామి ప్లీడరు చెప్పినట్లే కోర్టులో పాఠం అప్పచెప్పాడు.

అన్నపూర్ణ ఈ విషయంలో పెద్ద ఆసక్తి చూపలేదు. కోర్టులో ఏమి జరుగుతుందో ఆమెకు తెలుసు. కోర్టులో జమిందారుకు సహకరించటం ఆమెకు ఇష్టం లేదు.

వీరాస్వామికి, అతని అనుచరులకు ఆరు నెలలు జైలు శిక్ష విధించబడింది. మిగిలిన ఇద్దరికీ జైలు పుట్టింటి వంటిదే. అయితే వీరాస్వామికి ఇది ఊహించరాని విషయం. అందుచేత అక్కడే బిగ్గరగా ఏడిచాడు. జమిందారు అండవుండగా

జైలు కెళ్ళవలసి వుంటుందని అతను కలలో కూడా ఊహించలేదు. వాడెప్పుడు జైలు గురించే ఆలోచించలేదు. వాడి దృష్టిలో జమిందారు సర్వశక్తి సంపన్నుడు. అటువంటి సర్వ శక్తి సంపన్నుడు కూడా తనను కాపాడలేకపోవటం వాడికి ఆశ్చర్యం కలిగించింది.

అయితే జమిందారు వాడికి ధైర్యం చెప్పాడు. వాడి కుటుంబ పోషణ అంతా తాను చూసుకుంటానని, జీతం కూడా పూర్తిగా యిస్తానని, బాధ పడవల సిన పనిలేదని చెప్పాడు. వీరాస్వామి ఇదంతా జమిందారుగారి ఉదారతేనని భావించ సాగాడు.

ఈ విధంగా ఒక సంఘటన అనుకోని విధంగా సమాప్తం చెందింది. అయితే దీనివలన గ్రామంలో జమిందారుకు తగిన రీతిన చెడ్డ పేరు వచ్చింది. గ్రామంలో జమిందారు పరాయివాడుగా భావించబడుతూ వున్నాడు. జమిందారు ఆలోచనలు మంచివి కావనేది కూడా గ్రామంలో వ్యాప్తి చెందింది.

జమిందారు పూర్వీకులు కూడా ఇటువంటి పనులు చేసినా, రాజగోపాలరావు వంటి గ్రామ ప్రముఖుడు, అందులోనూ గ్రామంలో అందరి ఆదరాభిమానాలు పొందినవాడిని, గ్రామపు యజమానిగా భావించబడే వ్యక్తిని కొట్టించటం, అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. కోర్టులు ఎవ్వరికి శిక్ష విధించినా గ్రామంలో జమిందారు పట్ల వైముఖ్యం కావలసినంత పెరిగింది. అది జమిందారుకు సహించలేనిదిగా వుంది.

ప్రజలు తమ భావాలను స్పష్టంగా బయటకు వ్యక్తంచేసే స్థితిలో లేని కారణంగా జమిందారును బాహాటంగా విమర్శించలేకపోతున్నారు. రాజగోపాల రావు ఈ సంఘటనను అవమానంగా భావించినా చేదు మాత్ర మింగినట్లే జీర్ణం చేసుకున్నాడు. జమిందారు మాత్రం తన దురహంకారం కారణంగా వాస్తవ విషయాలను గమనించలేకపోతున్నాడు.

# 29

జమిందారు కుటుంబరావు రైలు దిగి తన కోసం స్టేషనుకు వచ్చిన కారులో బయలుదేరాడు. తెల్లవారఝామున నిర్జనంగా వున్న హైదరాబాద్ నగర వీధుల గుండా కారు ప్రయాణం చేయసాగింది జమిందారు హైదరాబాద్‌లో వున్న తన బంధువుల ఇంటికి వెళ్ళాడు. వాళ్ళు కూడా జమిందారులే.

అది ఎత్తైన ప్రహరీ గోడల మధ్య వున్న పాత భవనం. యజమానుల గత వైభవ చిహ్నంగా కనిపించే ఆ మహల్ చాలా పెద్దది. జమిందారు మొదటి అంతస్థులో తనకు కేటాయించిన గదిలోకి వెళ్ళాడు. ఆయన ఎప్పుడు వచ్చినా ఆ గదిలోనే వుంటాడు. ఆ గదినుండి ఆవరణలోని పూల మొక్కలు అందంగా కనబడతాయి. ఆయన బంధువులు ఎవరూ ఇంకా నిద్ర లేచినట్లే లేరు. నౌకర్లు కుటుంబరావుకు కావలసిన ఏర్పాట్లు చూడసాగారు.

పాత బస్తీలో వున్న ఈ భవనానికి దగ్గరలోనే ఒక మసీదు వున్నది. బయటకు పాడుబడినట్లుగా కనిపించే ఈ భవనంలో అడుగడుగునా జమిందారీ దర్పం కనిపిస్తూ వుంటుంది.

ఈ భవనానికి యజమానులైన కుటుంబరావు బంధువులు కూడా జమిందారులే జమీలు పోయినా అంతకంటె ఎక్కువ సంపత్తినే కూడబెట్టారు. వారి లోభత్వమే వారి ధనార్జనకు ప్రధాన మార్గం. ధనమొక్కటే సమాజంలో తమను గౌరవనీయులుగా నిలబెట్టగలదని తెలిసిన వీరు ఆ ధనాన్ని జాగ్రత్తగా కూటబెట్టుకుంటూ, కూడబెట్టిన దానిని కాపాడుకుంటూ వస్తున్నారు. అయితే కుటుంబరావు చేసే అనవసరపు ఖర్చు, ప్రదర్శించే ఆడంబరం వీరికి హేళనగా వుంటుంది.

కుటుంబరావు తన గదిలో అందమైన పక్కమీద విశ్రాంతి తీసుకోసాగాడు.

అదే రోజు, తరువాత రైలుకు అన్నపూర్ణ హైదరాబాద్ వచ్చింది. ఆమె స్టేషన్ నుండి ఆటోలో యం.యల్.ఎ. క్వార్టర్సుకు వచ్చింది. రిసెప్షను వద్దకు వెళ్ళి రిజిస్టర్‌లో సంతకం చేసి హాస్టల్ గది తాళంచెవి తీసుకుని అప్పటికే అక్కడకు వచ్చిన జమిందారు పంపిన కారులో వెళ్ళి కూర్చుంది.

అన్నపూర్ణను తీసుకుని కారు యం.యల్.ఏ. క్వార్టర్సుకు దగ్గరలోనే ఎత్తైన కొండమీద వున్న ఖరీదైన హోటల్‌కు వెళ్ళింది. అది ఒకప్పుడు నైజాం నవాబుగారి భవనం. ఆయన కుమారులలో ఒకరు అందులో వుంటూవుండేవారు. ఆ హోటల్‌లో జమిందారు తనకోసం ఒక గది రిజర్వు చేయించి వుంచాడు. ఆయన హైదరాబాదు ఎప్పుడు వచ్చినా మకాం తన బంధువుల యింటిలోనే పెట్టినా మిగిలిన కార్యక్రమాల కోసం ఈ హోటల్‌లో ఒక గది రిజర్వు చేయించి వుంచుకుంటాడు.

జమిందారు స్వభావం చాలా చంచలమైనదే అయినప్పటికి, ఆయన ఆలోచించకుండా ఏ పనీ చేయడు. లాభ నష్టాలు బేరీజు వేసిన తర్వాతనే ఏ పనయినా మొదలుపెడతాడు.

నగర వీధుల్లో సందడి మొదలయిన తర్వాత ఉదయం పది గంటలకు జమిందారు కారులో బయలుదేరాడు. బయటకు బయలుదేరేముందు ఆయన బంధువులతో మాట్లాడాడు ఈయన నగరానికి ఎందుకు వచ్చాడో వారు ప్రశ్నించలేదు. ఆ విధంగా తెలుసుకోవటం ఆ కుటుంబాలలో అనాగరికతకు చిహ్నం. అయితే ఆకస్మాత్తుగా కుటుంబరావు అక్కడకు రావటం మాత్రం ఆయన బంధువులకు ఆశ్చర్యం కలిగించింది. అయితే వారెవరూ ఆ ఆశ్చర్యాన్ని బయటకు కనిపించనీయలేదు.

నైజాం నవాబు ఒకప్పుడు నగలు ఖరీదు చేసే దుకాణానికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు ఖాతా వుంది. ఆయన అక్కడ ఖరీదైన రాళ్ళనెక్లసు కొన్నాడు. అక్కడనుండి ఆయన హోటల్‌కు వచ్చాడు. విలాసవంతమైన హోటలు గదిలో అన్నపూర్ణ ఒంటరిగా కిటికీలోనుండి నగరపు అందాలను చూడసాగింది.

జమిందారు తలుపు తీసుకుని గదిలోకి అడుగుపెడుతూనే ఆత్రంగా అన్నపూర్ణను తన కౌగిలిలో బంధించి ఆమె ముఖాన్ని తన ముద్దులతో ముంచెత్తసాగాడు. అన్నపూర్ణ కిదంతా చాలా ఇబ్బందిగా వుంది. ఆవేశంతో కూడిన జమిందారు ప్రవర్తన ఆమెకు ఇష్టంలేదు. జమిందారు మాట ప్రకారం అన్నపూర్ణ హోటలుకు వచ్చింది. కాని వచ్చినప్పటినుండి తనను తాను నిందించుకోసాగింది.

"చాలా ఆత్రంగా వున్నట్టున్నారే!" అన్నపూర్ణ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అంది.

"నీకోసం నేనెంత పరితపించిపోతున్నానో నీకు తెలియదు. అసలు నేను గ్రామానికి వచ్చింది ఎందుకో తెలుసా! కాని మా ఆవిడకు.... ఆ విషయం ఎందుకుగాని నన్నర్థం చేసుకున్నా వనుకుంటా" జమిందారు ఉన్నట్టుండి ఆలో చనలో మునిగిపోయాడు.

జమిందారు తనకోసమే గ్రామానికి వచ్చి వుంటున్నాడన్న అనుమానం జమిందారు భార్యకు వున్నదని, అందుచేతనే జమిందారుపై కోపంగా వున్నదని అన్నపూర్ణకు తెలుసు

"మీ సంగతి నాకు తెలవదా?" అన్నపూర్ణ గొంతుల్లో సానుభూతి ధ్వనించింది.

"ఉదయాన్నే వచ్చి నీ ప్రశాంతతను చెడగొట్టడం లేదుకదా? ప్రయాణం సుఖంగా వుందా? "అన్నపూర్ణ ముఖంలోని అయిష్టతను గమనించిన జమిందారు మాట మార్చాడు.

"ప్రయాణం బాగానే సాగింది కానీ నేను మీతో వచ్చినట్లు మా ఆయనకు, రాజగోపాలరావుకు తెలిసిపోయినట్టుంది."

"ఏం ఫర్వాలేదు. అసెంబ్లీ సమావేశాలకు నువ్వు హైద్రాబాద్ వస్తూనే వుంటావు కదా? పైగా నువ్విక్కడ ఎక్కువ రోజులు వుండబోవటము లేదు."

"అవును."

"సాయంత్ర మయ్యేసరికి మన వ్యవహారాలతో విసిగిపోయి, ఏకాంతంలో కూడా ప్రశాంతంగా ఆనందంగా గడపలేకపోతున్నాము" అంటూ అన్నపూర్ణను తమకంతో దగ్గరికి తీసుకున్నాడు.

మూసిన తలుపుల మధ్య స్త్రీ పురుషుల మధ్య సహజంగా జరిగేవే అక్కడ జరిగింది.

అన్నపూర్ణ మనస్సంతా సిగ్గుతో కుంచించుకుపోయింది. అయితే కోరికల వేడిలో, రోజూ దేనికైతే తాను లొంగకూడదని అన్నపూర్ణ అనుకుంటూ వుంటుందో దానికే లొంగిపోయింది. ఇదే ఆమె బలహీనత.

"నీకు ఏదైనా బహుమతి ఇచ్చి చాలా రోజులైంది కదూ?"

"బహుమతా! నాకు మీరు వేరే బహుమతులివ్వటం దేనికి?"

"ఇదిగో, యిటురా" అంటూ ముఖమల్ పెట్టెలోని నెక్లెస్ తీసి అన్న పూర్ణ మెడలో వేశాడు జమిందారు.

"కొంచెం వెనక్కు నడువు. అద్భుతం! నీ కారణంగా నెక్లెస్‌కే అందం వచ్చినట్లుంది."

అన్నపూర్ణ నిశ్శబ్దంగా నిలుచుండిపోయింది. ఆమెలో లోపల మండి పోసాగింది. తన కోపాన్ని చిరునవ్వుతో దాచుకుంది. నే నేమీ బజారు మనిషిని కాను, శరీరాన్ని యిచ్చి నగలు తీసుకోవటానికి! అసలు నన్నే మనుకుంటున్నారు? అని కోపంతో అడగాలనుకుంది. అయితే ఆ మాటలు పెదవి దాటి రాలేదు.

"యీ నెక్లెస్ నీకు సరిగ్గా సరిపోయింది కదూ!" అని "ఇటురా చూద్దాం" అన్నాడు.

అన్నపూర్ణ వద్దనుకుంటూనే అతని దగ్గరకు వెళ్ళింది.

"ఆచారంతో అందాలెందుకు కప్పివేస్తావ్?" అంటూ జమిందారు ఆమె పైట తొలగి చాడు.

అన్నపూర్ణ నిసహాయంగా తన కోపాన్ని అణచుకోసాగింది. ఆమెకు తనపైనే అసహ్యం వేయసాగింది. జమిందారు పనులకు ఆమె మనస్సు క్షోభించింది.

జమిందారు తనకు ఆర్థిక సహాయం చేసిన మాట యదార్థమే. అయితే అతని నిజస్వరూపాన్ని ఆమె ఇపుడే తెలుసుకోసాగింది. జమిందారు తనను నౌకరు కుమార్తెగానే చూస్తున్నాడు గాని ప్రజా ప్రతినిధిగా చూడటంలేదు. ప్రజలకు విరుద్ధంగా వ్యవహరించే వ్యక్తితో తాను సంబంధం పెట్టుకోవటం సమంజసం కాదని అన్నపూర్ణ భావించసాగింది పైగా తాను ఒకరి భార్య యీ విధంగా వ్యవహారం ఎంత కాలం సాగించగలదు? తానేమీ వెలయాలు కాదు. యితని సహాయంతో తనకు పనిలేదు. ఇతని చేతిలో తాను కీలుబొమ్మ కారాదు. అన్న పూర్ణ మనస్సులో రకరకాల ఆలోచనలు కలుగసాగాయి.

ఆమె మనస్సులోనే ఒక దృఢ నిశ్చయానికి వచ్చింది. ఇటువంటి నిశ్చయానికి ఆమె చాలాసార్లు వచ్చినా ఈసారి ఆ నిశ్చయానికి కార్యరూపం ఇవ్వటానికి ఆమె గట్టిగా నిర్ణయించుకున్నది.

'ఏది ఏమైనా యీ స్వార్థపరుడికి ఒక గుణపాఠం చెప్పాలి. అతనికి ధనము వుంటే వుండవచ్చు. కృతజ్ఞత పేరుతో తనిప్పటికే చాలా కోల్పోయింది. ఇంకా కోల్పోవటం ఆత్మ ద్రోహమే అవుతుంది.' ఆమెలో ఆలోచనలు తీవ్ర రూపాన్ని ధరించసాగాయి.

'యీ నెక్లెసు నాకెందు కిచ్చాడు? యింతకు ముందెప్పుడూ తన కింత ఖరీదైన బహుమతు లివ్వలేదు. తప్పకుండా తనతో ఏదో చాలా పెద్ద పనే వుండి వుంటుంది. ఏ స్వార్థం లేకుండా యింత ఖరీదైన బహుమతి యిచ్చే వుదారుడు మాత్రం కాదు.' కోపంతో ఆమె మనస్సు మండిపోగా ఆపుకోలేని విధంగా కన్నీళ్లు దొర్లాయి. దాచుకుందామన్నా దాగని భావాలు ఆమె మొఖంలో తొంగిచూశాయి.

"యీ నెక్లెసు నీకు నచ్చలేదా? కావాలంటే ఇంతకంటే మంచిది నువ్వే స్వయంగా సెలక్టు చేసుకోవచ్చు." జమిందారు ఆమె కోపాన్ని వేరుగా అర్థం చేసుకున్నాడు.

"నేనిక దీనిని తీసివేయవచ్చా? నాకు చాలా పనుంది." అంటూ అన్నపూర్ణ నెక్లెసు తీసి టీపాయ్ మీద నిర్లక్ష్యంగా పడవేసింది. "దీనిని జాగ్రత్తగా దాచుకో!"

"దీనిని ఎవరు తీసుకు వెళతారు? గది తాళం నీ దగ్గరే వున్నది కదా!"

కానీ జమిందారు ఆ నెక్లెసు తీసి బాక్సులో పెట్టి, తనంతటతానే అన్నపూర్ణ సూట్‌కేసులో బట్టల అడుగున పెట్టాడు.

అన్నపూర్ణకు జమిందారుమీద విపరీతమైన కోపంగా వున్నా, ప్రస్తుతం అతనితో తగాదా పడటానికి ఆమె సిద్ధంగా లేదు. తనను తాను సంబాళించుకుని, మామూలుగా ఒక బానిసలాగా అతని ముందు కూర్చున్నది. బజారు మనుష్యులు, శరీరాన్ని అమ్ముకునేవాళ్ళు కూడా, అప్పుడప్పుడు తిరుగుబాటు చేస్తారు. కావాలని వాళ్ళు కూడా వళ్ళమ్ముకోరుకదా! తాను వారికంటే దిగజారిపోయిందా? అన్నపూర్ణ మనస్సులో ఆలోచనలు సుడులు తిరగసాగాయి.

"నువ్వు నా వెంట వస్తావా? సిద్ధంగా వున్నావు కదా?"

"వస్తాను."

"మనం ఈ రోజు ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్ళాలి. షుగర్ ఫ్యాక్టరీకి సంబంధించిన పేపర్స్ ఆయన టేబుల్ మీద వున్నాయని మన మనుష్యులు చెప్పారు."

"ప్రాజెక్టు రిపోర్టు మొదలగు విషయాలు సక్రమంగా వుంటే పేపర్సు అవే ఎగురుకుంటూ వస్తాయి. ఎవ్వరూ అడ్డుకోరు. పైగా ఎక్కువ పంచదార మిల్లులు కట్టాలని ప్రభుత్వం కూడా ఆలోచిస్తున్నది. ప్రజలను పారిశ్రామీకరణ వైపు ఆకర్షించడానికి సహకార రంగం కంటే ముఖ్యమైన దేముంటుంది?"

"అవును, అది నిజమే. అయితే ఎట్లాగు ఇంత దాకా వచ్చాం కదా! ఒక్క సారి ఆయనను చూస్తే నష్టమేముంది?"

అన్నపూర్ణ మౌనం వహించింది. ఆమె అప్పటికే బాగ్, కాగితాలు సర్దు కుంది. జమిందారు లేచి గది బయటకు నడిచాడు. అన్నపూర్ణ గది తాళం వేసి ఆయనను అనుసరించింది

"ఆయన అనకట్ట మరమ్మత్తు కోసం ఆర్డరు ఇచ్చాడు. అందుకోసం కృతజ్ఞతలు చెప్పటానికయినా మనం ఆయనను కలవాలి."

''అపాయింట్‌మెంటు తీసుకుంటే బాగుంటుంది." అన్నపూర్ణ సూచించింది.

ఆయన ముఖ్యమంత్రిగారి ఆఫీసుకు ఫోను చేసాడు. ముఖ్యమంత్రి ఆ రోజంతా బిజీగా వుంటారని పి. ఎ చెప్పాడు జమిందారు అన్నపూర్ణను, ఆమె కోసం ఇంటర్వ్యూ ఫిక్స్ చేయించుకోమని చెప్పాడు శాసన సభ్యులకు సహజంగా ప్రిఫరెన్స్ వుంటుంది.

"నాకు అపాయింట్‌మెంటు వుంటే, నాతో మీరెలా వస్తారు? మీరు ప్రత్యే కంగా ఆయనతో అపాయింట్‌మెంట్ తీసుకుంటే మంచిది. నేనెటూ అసెంబ్లీలో కలుస్తాను కదా?"

అన్నపూర్ణ మాటలు వింటుంటే ఆమె తప్పించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నదేమో నన్న అనుమానం జమిందారుకు కలుగసాగింది.

వాళ్ళు కారులో కూర్చున్నారు. జమిందారు స్వయంగా డ్రైవ్ చెయ్య సాగాడు ఆమె ఆయన ప్రక్కనే కూర్చున్నది. సాధారణంగా ఆవిధంగా కూర్చోదు.

''ముఖ్యమంత్రి గారికి ఏమంటే ఇష్టమో చెప్పగలవా?" జమిందారు అన్న పూర్ణను ప్రశ్నించాడు.

''బహుశా మంచి భోజనం అనుకుంటాను.''

"భోజనం దేముందిలే, రోజూ తినేదేగా! పైగా భోజనం ఎంతకాలం గుర్తుం టుంది? ఇంకా ఏమంటే ఆయన కిష్టం?''

"నాకు ప్రత్యేకంగా తెలియదు, కాని మంచి రసికుడంటారు."

అన్నపూర్ణ వైపు మత్తుగా చూస్తూ "హైదరాబాద్‌లో ఆయనకు అటు వంటివి కొదవ ఏముందిలే? అవికాకుండా ఏదైనా బహుమతులు అవీ!" అన్నాడు జమిందారు.

"ఆయనకు అధికారం అంటేనే బాగా మోజు. దానిని పెంచుకోవాలనీ, వీలయినంత ఎక్కువ కాలం దానిని నిలబెట్టుకోవాలనీ ప్రయత్నం చేస్తూ వుంటాడు."

"అది నేనివ్వలేను కదా! కృతజ్ఞతకు చిహ్నంగా ఏదైనా బహుమతి ఇవ్వ గలం" అంటూ మనస్సులో ఆలోచించసాగాడు. "నన్ను కలవటానికి వీలులేనంత బిజీగా వున్నాడా? నన్ను కలవటం ఆయనకు ఇష్టంలేదా? ఎందుకని?"

అప్పటికి కారు జమిందారు ఉదయం నెక్లెసు కొన్న నగల దుకాణం దగ్గర ఆగింది. జమిందారు కారుదిగి ఆ దుకాణంలోకి అన్నపూర్ణతో పాటు నడిచాడు.

"ముఖ్యమంత్రిగారికి బహుమతులిష్టం ఉండవా?"

"ఆయన కిష్టం వుండదు. ఎవ్వరిదగ్గర ఎటువంటి బహుమతులు తీసు కోడు. పైగా ఈ నగరపు నగలు ఆయనకు ఏ మాత్రం ఇష్టం వుండవు." అన్న పూర్ణ సమాధాన మిచ్చింది.

"ఆయన తీసుకోకపోవచ్చు. ఆయన భార్యకు కూడా ఈ నగలంటే ఇష్టం వుండదా? నువ్వు ఆమెను కలసి ఈ బహుమతి ఇస్తే బాగుంటుందని నా అభి ప్రాయం. అధికారం మాట ఎలావున్నా, ఆయనకు భార్యంటే ఇష్టమే కదా? పైగా ఆయనపై భార్య ప్రభావం చాలా ఎక్కువని నాకు తెలిసింది."

అన్నపూర్ణ తలవూపింది.

"బహుశా నీకు ఆమె బాగా తెలుసనుకుంటాను."

"అంత బాగా తెలియదు. ఏదో కొద్దిపాటి పరిచయం." అన్నపూర్ణ అబద్ధం చెప్పింది. ఈ బహుమతుల విషయంలో మధ్యవర్తిగా వ్యవహరించడం ఆమె కిష్టం లేదు.

"ముఖ్యమంత్రిగారి భార్య హోదాకు తగిన నగ సెలెక్టు చెయ్యి" అంటూ అన్నపూర్ణ చెయ్యి పట్టుకుని ఖరీదైన నగలున్న అద్దాల బీరువా వైపు తీసుకు వెళ్ళాడు జమిందారు.

"ఆమెకు నగలంటే పెద్ద యిష్టం వుండదనుకుంటాను." అన్నపూర్ణ మెల్లగా అంది.

"నగలెక్కువగా వున్నవాళ్ళు వాటిని ఎక్కువగా ధరించరు. ఎవరికీ చూపించరు. అయినా నగల సంగతి నీకు తెలవని దేమున్నది?"

ఇటువంటి చెయ్యగూడని పనులు చేయటం ఇష్టంలేదని అన్నపూర్ణ స్పష్టం చేయదలచుకున్నది-" మీరు ముఖ్యమంత్రిగారికి ఆయన భార్య ద్వారా లంచం యిద్దామనుకుంటున్నారా?"

"ఇది లంచంకాదు. కేవలం బహుమతి మాత్రమే. ఏదైనా స్వలాభం పొందేవాడు లంచం యిస్తాడు. నాకేమీ స్వార్థంలేదని నీకు తెలుసు కదా!"

అన్నపూర్ణ నోటికి జమిందారీ విధంగా తాళం వేసాడు. కాని ఈ బహుమతి విషయంలో తాను చిక్కుకోకూడదని అన్నపూర్ణ మనస్సులో నిర్ణయించుకుంది. కేవలం షుగర్ ఫ్యాక్టరీ గురించే అయితే జమిందారుకు ఈ విధంగా డబ్బు వెదజల్ల వలసిన పనిలేదు ఇందులో ఏదో రహస్యం వుంది. జమిందారును ఈ విషయంలో ఎలా తిరస్కరించాలా అని ఆమె ఆలోచించసాగింది. జమిందారుతో తనకు, తన కుటుంబానికి వున్న సంబంధం కారణంగా, జమిందారుకు ఏ విషయంలోనైనా ఎదురు చెప్పటం ఆమెకంత తేలిక కాదు.

ఆమె మంచి అందమైన నెక్లెసు ఎన్నిక చేసింది. జమిందారు దాని ధర కూడా అడగలేదు. షాపు యజమానితో బిల్లు పంపమని మాత్రం చెప్పి కారు దగ్గరకు నడిచాడు.

"పదముఖ్యమంత్రి దగ్గరకు వెళదాం."

"మనలను కలవటానికి టైమ్ లేదని ఆయన పి.ఏ. చెప్పాడు కదా!"

"అతను చెప్పటం, నేను వినటం రెండు అయ్యాయి కదా! ముఖ్యమంత్రి అసెంబ్లీకో, సెక్రటేరియట్‌కో వెళ్ళి వుంటారు. కాని ఆయన భార్య యింటివద్దే వుంటుంది కదా!"

"ఆమె దగ్గరకు నేను వస్తానని ముందుగా తెలియచెయ్యలేదు."

"చెప్పకపోతే ఇప్పుడు చెప్పవచ్చు. నువ్వేమిటి వెనుకా ముందు ఆలోచి స్తున్నావు? రాజకీయాలలో ఇవన్నీ మామూలే. ఈ నాయకులంతా పవిత్రులనా నీ ఉద్దేశ్యం?"

"కాని నేను...." అన్నపూర్ణ సందిగ్ధంలో పడింది. కాదు అనటానికి సాహసం చాలటం లేదు. ఔనంటానికి మనస్సంగీకరించటం లేదు.

"ఇటువంటి చిన్న విషయాని కెందుకంత ఆలోచిస్తున్నావు?"

అన్నపూర్ణ కొంచెం సర్దుకుని ధైర్యం కూడగట్టుకుని చెప్పసాగింది- "క్షమించండి. నేను ఈ పని చెయ్యలేను. నా కిటువంటివి అలవాటు లేవు. పైగా ముఖ్యమంత్రిగారి చుట్టూ మీ మనుష్యులు చాలా మంది వున్నారు. వారి ద్వారా పంపండి."

అన్నపూర్ణ తన మాటలకు తానే ఆశ్చర్యపోయింది. ఆమెలో కొత్త ధైర్యం, విశ్వాసం చోటు చేసుకున్నాయి. జమిందారు ఆమె మాటలకు నిరుత్తరు డయ్యాడు. కుటిల రాజకీయాలు నడపటంలో చతురత కలిగివున్న జమిందారు తన ఆశ్చర్యాన్ని వ్యక్తం కానివ్వలేదు. అన్నపూర్ణవైపు చూసి చిరునవ్వు నవ్వాడు.

"పర్వాలేదు. నీ అంతరాత్మకు విరుద్ధంగా వుండే ఏ పనీ చెయ్యమని నేను నిన్ను కోరను. రాజకీయాలలో సహజంగా ఈ అంతరాత్మ పీక నొక్కివేయ బడుతుంది. అయితే నీ అంతరాత్మ ఇంకా సజీవంగానే, నీ దగ్గరే వున్నందుకు నాకు చాలా ఆనందంగా వున్నది." జమిందారు తన ఆగ్రహాన్ని వ్యంగ్యంగా మార్చాడు

"నన్ను క్షమించండి." అన్నపూర్ణ ఇంతకంటె ఎక్కువ మాట్లాడలేక పోయింది. తన నిశ్చయానికి కట్టుబడి వుండాలని ఆమె నిర్ణయించుకుంది. ఈ నిర్ణయం ఇంతకుముందే ఎందుకు తీసుకోలేదా అని ఆమె బాధపడింది. దేనికయినా సమయం రావాలి కదా' అని తననుతాను సమర్థించుకుంది.

"నిన్ను యం.యల్.ఏ. క్వార్టర్సు దగ్గర దింపమంటావా?" అన్నపూర్ణను ఈ సమయంలో ఇంకా బాధించటం మంచిది కాదనుకున్నాడు జమిందారు.

కారు క్వార్టర్సు దగ్గరకు చేరుకోగానే, అన్నపూర్ణ కారు దిగి తన గదికి వేగంగా వెళ్ళిపోయింది. జమిందారు ప్రక్కనే వున్న పెద్ద హోటల్‌కు వెళ్ళి పోయాడు.

# 30

కొంచెం ఆలస్యంగా అన్నపూర్ణ అసెంబ్లీకి చేరుకునేసరికి అక్కడ కార్యక్రమాలు చాలా జోరుగా సాగుతున్నాయి. కాని అన్నపూర్ణ మనస్సు అక్కడలేదు. ఆమె మధ్య మధ్యలో అటు యిటు చూస్తూ ముఖ్యమంత్రి ప్రసంగంపై దృష్టి నిలపటానికి ప్రయత్నం చేస్తున్నది. ఆమెకు అశాంతిగా వుంది. కొంచెం సేపు బయటకు, మరల లోపలకు తిరుగసాగింది. తన నెవరో వెంబడిస్తున్నట్లు ఆమె కనిపించసాగింది. జమిందారు కుబుసం విడిచి తన నిజస్వరూపంతో ప్రత్యక్షమైనట్లు ఆమెకు తోచింది.

ఇంతలో తనప్రక్క నియోజక వర్గానికి చెందిన సోషలిస్టు శాసన సభ్యుడు కోటేశ్వరరావు ఆమెను ప్రక్కకు తీసుకువెళ్ళి "మీ నియోజకవర్గానికి షుగర్ ఫ్యాక్టరీ శాంక్షన్ అయినట్లుంది" అన్నాడు.

"అలాగా!" అన్నపూర్ణ లోపల ఉలికిపడినా పైకి అన్యమనస్కంగా అన్నది.

"ఆర్డర్ కూడా డిస్పాచ్ చేసినట్లు శక్రటేరియట్‌లో చెప్పారు. పేపర్సు చాలా రోజులు అటూ ఇటూ తిప్పినట్లున్నారు." అన్నపూర్ణ దృష్టిని తన మాటలతో మరల్చడానికి కోటేశ్వరరావు ప్రయత్నించాడు.

"అయితే అది పెండింగ్‌లో పడినట్లేనా?" వెంటనే తాను మాట్లాడిందేమిటో అర్థమయ్యింది. "నా ఉద్దేశ్యం అది కాదు" అంటూ సర్దుకుంది.

ఆమె తడబాటును కోటేశ్వరరావు గ్రహించాడు. జమిందారు చాలా రోజుల నుండీ షుగర్ ఫ్యాక్టరీ గురించి చెపుతున్న విషయం ఇంతవరకు వచ్చిందని ఆమెకిప్పుడే తెలిసింది. జమిందారు తనకు పూర్తి వివరాలు ఎందుకు చెప్పలేదో ఆమెకర్థంకాలేదు. ప్రజలకు సంబంధించిన విషయాన్ని ఎందుకింత రహస్యంగా ఉంచారో ఆమెకు బోధపడలేదు. తనవంటి బలహీనులు, జానిసలు ప్రజాప్రతినిధులుగా వుండే వీరి ఆటలీవిధంగానే సాగుతా యనుకున్నదామె.

"షుగర్ ఫ్యాక్టరీకి అనుమతి వచ్చింది. కాని చూడండి, వాళ్ళు అక్కడ షుగర్ ఫ్యాక్టరి కట్టరు. కట్టినా నడపరు." నాకు ఈ సామంత భూస్వాముల నాడి బాగా తెలుసు, కోటేశ్వరరావు రాజగోపాలరావుకు మిత్రుడు. అందుచేత జమిందారు పట్ల అతనికి స్నేహభావం లేదు.

"ఔను మీరు చెప్పింది నిజం." ఆమె నోటి నుండి అప్రయత్నంగా మాటలు వెలువడ్డాయి.

"ఫ్యాక్టరీ ప్రారంభించేంతవరకు నేను జమిందారును నిద్ర పోనివ్వను. పలుకుబడితో, లంచాలతో అతను షుగర్ ఫ్యాక్టరీకి అనుమతి సంపాదించు కున్నాడు. మనకు ఫ్యాక్టరీ ప్రారంభించేందుకు అవకాశం లేకుండా చేసాడు. మా దగ్గర కూడా డబ్బు, అధికారం వుండివుంటే.... నిజంగా దీనిని గురించి మీకేమి తెలియదా?"

"కొద్దిగా తెలుసు. పూర్తి వివరాలు తెలియవు. నేనేమి అతని ఏజెంటును కాదు. అతని కాగితాలేవీ నాద్వారా వెళ్ళవు." ఆమె తన ఇబ్బందిని చిరునవ్వుతో దాచుకునే ప్రయత్నం చేసింది.

"ఇప్పుడిప్పుడే జమిందారు అసలు రంగు బయటపడుతున్నది. అతనిని గురించి మీకు పూర్తిగా తెలియదు. కావాలనుకుంటే తెలుస్తుందనుకోండి. ఫర్వా లేదు లెండి, త్వరలోనే తెలుసుకుంటారు."

"అదేమిటి?"

"భర్త అవినీతిని గురించి ప్రపంచానికంతా తెలిసిన తర్వాతే భార్యకు తెలుస్తుందంటారు. నేనా సామెతను త్రిప్పి చెపుతున్నాను." కోటేశ్వరరావు నవ్వుతూ అన్నాడు. అన్నపూర్ణ అతని మాటలలోని వ్యంగ్యాన్ని అర్థం చేసుకున్నది. కాని ఏమీ అనలేదు.

"ఆనకట్ట విచారణ పూర్తయ్యిందా?" కోటేశ్వరరావు ప్రశ్నించాడు.

"లేదు. అయితే-" ఏదో గుర్తుకు వచ్చినదానిలా అన్నపూర్ణ హడా వుడిగా అసెంబ్లీ హాలులోనికి వెళ్ళింది. ఆమె మనసంతా చేదు మ్రింగి నట్లయ్యింది. జమిందారు గురించి ఆమె ఇంతకుముందు చాలా విషయాలు విన్నా, వాటిని నమ్మలేకపోయింది. కాని ఇప్పుడు నమ్మా లనిపిస్తున్నది. అసలు జమిందారును గురించి ఆలోచించటమే తప్పన్నట్లు, ఆమె ముఖ్యమంత్రి ప్రసంగం పైనే దృష్టి నిలవటానికి ప్రయత్నం చేస్తున్నది.

# 31

తన సహాయాన్ని చాలా పొందిన ముఖ్యమంత్రి ప్రస్తుతం తనను కలవటానికి కూడా అవకాశం ఇవ్వటం లేదు. జమిందారు లోపల లోపలే మండిపో సాగాడు. ఏమీ చెయ్యలేని స్థితి.

ముఖ్యమంత్రి జమిందారుపై ఎందుకు ఆగ్రహించారో కూడా, జమిందారు ఏజెంట్లు అంచనా వేయలేకపోయారు అన్నపూర్ణ కూడా ఆయనను మరల కలవ లేదు. కలవాలనికూడా ఆమెకు లేదు. జమిందారు ఆమె భావాలను పసిగట్టలేక పోతున్నాడు. జమిందారు రెండు మూడుసార్లు ఫోనుద్వారా ప్రయత్నం చేసినా ఆమె దొరకలేదు. జమిందారు తనకోసం అడిగితే గదిలో లేనని చెప్పమని ఆమె టెలిఫోను ఆపరేటర్‌కు చెప్పింది. జమిందారు స్వయంగా ఆమెకోసం అక్కడికే రాగలడన్న భయం ఆమెను గదిలోకూడా నిలవనివ్వటం లేదు. అన్నపూర్ణ తనపై ఎంతగా ఆధారపడివుందో కూడా ఆమెకు తెలవనివ్వకుండా చేసాడు జమిందారు.

ముందుగా నిర్ణయించుకున్నట్లే జమిందారు తన బంధువుల భవనంలో ఆ రోజు సాయంకాలం పార్టీ ఏర్పాటు చేసాడు. అతిధులొక్కొక్కరే రాసాగారు. వారికి ఖరీదైన విదేశీ మద్యం అందచేయబడుతున్నది. ఆ రాత్రంతా అక్కడ జరిగే తంతుకు అది ఆరంభం మాత్రమే.

ఆ సమయంలోనే అన్నపూర్ణ హోటల్‌కు వెళ్ళి గది ఖాళీ చేసింది. జమిందారు ఖర్చుపై ఆమెకు ఆ పెద్ద హోటల్‌లో వుండటానికి మనస్కరించలేదు. జమిందారు, అతని సహచరులకు భిన్నంగా వుండే మార్గాన్ని ఆమె ఎన్నుకున్నది. తన నిర్ణయాన్ని వారికి తెలియచేయవలసిన అవసరం కూడా లేదని ఆమె భావించింది.

జమిందారు విందులో పాల్గొన్న అతిధులలో పెద్ద పెద్ద పోలీసు ఆఫీసర్లు, ఒకరిద్దరు ప్రభుత్వ సహాయ కార్యదర్శులు, జమిందారుకు- ఆయన కుటుంబానికి చెందిన పరిచయస్తులు, చుట్టాలు మొత్తం కలిసి పాతికమందిదాకా వున్నారు.

జమిందారు బంధువులు కూడా విందులు ఇస్తారు కానీ ఏ కారణం లేకుండా వూరికినే పార్టీలు ఎప్పుడూ ఏర్పాటు చేయరు.

ఖరీదైన విదేశీ మద్యం సీసాలు ఖాళీ అవుతూ, వారిలో ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని పెంచసాగింది గది మధ్యలో వంపుసొంపులు కనిపించే విధంగా దుస్తులు ధరించిన ఇద్దరు అందమైన యువతులు మనోహరంగా నృత్యం చేస్తున్నారు సంగీతం మంద్రంగా సాగుతూ శ్రోతలకు కైపు పెంచుతున్నది. చుట్టూ అతిధులు, మధ్యలో నృత్యం. అదొక ప్రత్యేక వినోదం.

అతిధుల ప్రశంసలు పొందటానికి నర్తకీమణులు వయ్యారాలు పోతూ, మధ్య మధ్యలో వారికి దొరికినట్లు నటిస్తూ మెరుపుతీగల్లా గెంతసాగారు. కొందరిని తాకుతూ, మరికొందరిని మురిపిస్తూ, ఇంకా కొందరికి గాలిలోనే ముద్దులు విసురుతూ, మొత్తం వాతావరణాన్ని నిషాలో ముంచేస్తున్నారు. అతిధులు కూడా ఆ సుందరాంగుల స్పర్శాసుఖంకోసం ఆశగా ఎదురుచూస్తూ వున్నారు. ఈ విధంగా ఆ వినోద కార్యక్రమం అర్ధరాత్రి వరకూ సాగుతూ వుంది.

జమిందారు ఎక్కువగా మద్యం తీసుకోలేదు. సుందరాంగులతోనూ తన సమయం వ్యర్థం చేసుకోలేదు. ఆయన పోలీసు ఆఫీసర్లతో మంతనాలు చేయ సాగాడు. వాళ్ళు తమ యూనిఫారంలో లేరు. పైగా నైజాం నవాబు కాలంనాటి జమీందారులతో కలసి పార్టీలో పాల్గొనటం వారికెంతో ఆనందంగా వున్నది.

ఈ విందులో పాల్గొనవలసిందిగా, జమిందారు ఇద్దరు ముగ్గురు మంత్రులను కూడా ఆహ్వానించాడు. ఆనకట్ట ప్రబద్దలయినప్పుడు వారిలో ఒకరు ఆయన ఇంటికి కూడా వచ్చారు. ఆ మంత్రులు రానందుకు జమిందారు చాలా నిరాశ చెందాడు. ఆ మంత్రులు వస్తే స్వాగతం చెప్పటానికి ఆయన మనుష్యులు ద్వారం దగ్గర ఇంకా ఎదురుచూస్తూనే వున్నారు.

ఉదయం జమిందారు కలసి విందుకు ఆహ్వానించినప్పుడు వాళ్ళు తప్పక వస్తామని మాటకూడా యిచ్చారు. వారు రాలేదంటే ఏదో పెద్ద కారణమే వుండి వుంటుంది. త్రాగిన వాళ్ళను స్వర్గపు అంచులకు తీసుకెళ్ళగల బ్రహ్మాండమైన మద్యం తన చేతిలో వున్నా జమిందారు దాన్ని ఆనందిచలేకపోతున్నాడు. అందరూ ఎంతో ఉల్లాసంగా వున్నారు. జమిందారు ఆ ఉల్లాసంలో పాలు పంచుకోలేక పోతున్నాడు.

హాలులోని ముఖమల్ పరదాల వెనుక ఇద్దరు పోలీసు ఆఫీసర్లు గుసగుస లాడుకోవటం జమిందారు గమనించాడు. వాళ్ళు మద్యం సేవించటంలేదు. సంగీతాన్ని ఆనందిస్తున్నారు. అయితే వారు గంభీరంగా వున్నారు.

మద్యం సేవించకుండా, పార్టీకి దూరంగా, ప్రత్యేకంగా వున్నారంటే వారేదో ముఖ్య విషయం చర్చిస్తున్నారన్న అనుమానం కలిగింది. వారేం చర్చిస్తున్నారో తెలుసుకోవాలన్న కుతూహలాన్ని ఆపుకోలేకపోయాడు జమిందారు.

జమిందారు, ప్రసాద్ దగ్గరకు వెళ్ళాడు. ఈ రోజే జమిందారు అతనిని మొదటి సారిగా కలిశాడు మాటల సందర్భంగా విందుకు ఆహ్వానించాడు. అంత మాత్రాన విందుకు అతను వస్తాడని జమిందారు ఊహించలేదు పార్టీ మంచి జోరుగా సాగుతున్నప్పుడు అతను వచ్చాడు. ప్రసాద్ ప్రభుత్వంలో చాలా ఉన్నతమైన పదవిలో వున్నాడు. ముఖ్యమంత్రికి ఆయన మాటంటే గురి. ఏ పదవిలో వుంటే ఆ పదవికి వన్నె తెస్తాడని ప్రతీతి. వాస్తవంగా అతని కిటువంటి విందులు వినోదాలల్లో పాల్గొనటం అలవాటు లేదు.

ప్రసాద్‌ను అక్కడ పార్టీలో చూసి పోలీసు ఆఫీసర్లు గాభరా చెందారు. వాళ్ళు అతనికి దూరం దూరంగా వుండసాగారు.

"మీకేం కావాలి?" జమిందారు తెచ్చిపెట్టుకున్న అభిమానంతో ప్రసాద్ నడిగాడు.

"నేను కూడా త్రాగితే బాగుంటుందేమో!" ప్రసాద్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. అయితే ఆ నవ్వులోని కృత్రిమత్వాన్ని జమిందారు కనిపెట్టాడు.

"ఇంతవరకు మీరు లైమ్ జ్యూస్ తాగుతున్నారా? విస్కీ తాగరా? మీకు సంగీతమంటే ఇష్టమేననుకుంటాను."

"ఔను. నేను త్రాగను. ఇటువంటి పార్టీలలో కూడా నేనెప్పుడూ పాల్గొనలేదు."

"మీరీ నగరానికి ఈ మధ్యనే వచ్చారా?"

"ఔను."

"ఇటువంటి పార్టీలు ఇచ్చట తరచుగా జరుగుతాయి!"

"ఇటువంటి పార్టీలలో ప్రభుత్వం అధికారులు కూడా పాల్గొంటూ వుంటారా?"

"వస్తారు. సాయంత్రం ఆఫీసు టైమ్ తర్వాత వాళ్ళు ఆఫీసర్లు కాదుకదా?"

ప్రసాద్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు—

"వారు ఇరవై నాలుగు గంటలూ ప్రభుత్వ సేవకులే. బహుశా ప్రభుత్వాధికారులుగా వారికున్న అధికారాలు, కర్తవ్యాలు, బాధ్యతలు మొత్తం ఈ పార్టీలో మునిగితేలుతున్నప్పుడు వదిలేస్తారేమో?"

జమిందారు ఆ వ్యంగ్యానికి సమాధాన మివ్వలేకపోయాడు. అసలు ప్రసాద్ అక్కడకు రాకుంటేనే బాగుండే దనిపిస్తుందాయనకు. ముఖ్యమంత్రికి సన్నిహితుడు కదా! అని పిలిచాడు. ఇంత మొండి ఘటమని తెలియదు.

"ఇటువంటి ఆనంద సమయంలో నేనిలా అనగూడదనుకుంటాను. ప్రభుత్వాధికారులకు కూడా వినోదం అవసరమే కదా! క్షమించండి, నేనిక వెళతాను. తెల్లవారు ఝామున ముఖ్యమంత్రిగారిని కలవవలసి వుంది." ప్రసాద్ లేచి మెల్ల మెల్లగా ద్వారం వైపు వెళ్లాడు. అక్కడ పోలీసు ఆఫీసర్లు సంకోచిస్తూ నిలబడి వున్నారు. వాళ్ళు ప్రసాద్‌కు కొంచెం వెనుకగా నడవసాగారు.

"ఇటువంటి పార్టీలలో పాల్గొనటం కూడా అవినీతే అవుతుంది కదా? మీ అభిప్రాయమేమిటి?" అప్రియమైన ఆ ప్రశ్నను ప్రసాద్ చిరునవ్వు నవ్వుతూ వేశాడు

"అబ్బే, ఇది ఇక్కడి ఆచారమండీ!" ఒక పోలీసు ఆఫీసరు జవాబిచ్చాడు. అతను సేవించిన మద్యం అప్పటికే పని చేయసాగింది.

అందుకే అతను ధైర్యంగా సమాధాన మివ్వగలిగాడు.

"అవునండీ! ఇది ఇక్కడ మర్యాద." రెండో పోలీసు ఆఫీసర్ వంత కలిపాడు.

"ఆచారం! మర్యాద! అయితే ఇక్కడ అవినీతి కూడా ఆచారమే నన్న మాట?" ప్రసాద్ నొసలెగరవేస్తూ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

జమిందారు తిరిగి భవనంలోకి వెళ్లాడు. మిగిలినవాళ్ళు నృత్యాన్ని ఆనందిస్తున్నారు. అయితే పోలీసు ఆఫీసర్లలో ఏదో తెలియని అశాంతి చోటు చేసుకున్నది. వాళ్ళు ఆ తరువాత మద్యాన్ని ఆనందించకలేకపోతున్నారు.

అసలు పార్టీకి ప్రసాద్ వచ్చినపుడే వాళ్ళ ఆనందం ఎగిరిపోయింది. అందరికంటే ముందు వెళ్ళిపోవటం, వెళ్ళేముందు వ్యంగ్యంగా మాట్లాడటం వాళ్లకు

ఒంటికి కారం పూసినట్లయ్యింది. అయితే వాళ్ళు పార్టీ వదిలివెళ్ళే స్థితిలో లేరు. అరుదుగా దొరికే విదేశీ మద్యం, మత్తెక్కించే నృత్యాలు వాళ్ళను కట్టివేశాయి.

ప్రసాద్ అంటే వాళ్ళకు మొదటినుంచి చాలా భయం. ప్రసాద్‌ను చూడగానే ఎందుకొచ్చామా అని అనుకున్నారు.

"రావుగారూ! త్రాగటంలో మజా తెలియనివారిని పార్టీకి పిలవకూడదు. నీళ్ళుత్రాగేవాళ్ళు ఇక్కడకెందుకు రావాలి?" ప్రసాద్‌ను పార్టీకి పిలిచినందుకు వాళ్ళంతా జమిందారును వ్యంగ్యంగా అడిగారు.

"కొందరలాగే వుంటారు. అధికారాన్ని, ఉద్యోగాన్ని ఆఫీసునుండి సరాసరి పడకగదికి తీసుకు వెళతారు. ప్రసాద్ అటువంటివాడే. జమిందారుగారేం చేస్తారు?" వారిలో ఒకరన్నారు.

"పోనీయండి, ఏది జరగాలో అదే జరుగుతుంది. జరిగేదాన్ని ఎవరూ ఆపలేరు. హాయిగా ఖుషీ చేయండి· ఆనందించండి. రేపటిని గురించి ఎందుకాలోచన?" ఆఫీసర్ అన్నాడు. ఆయన సేవించిన మద్యం మాట్లాడసాగింది.

వాళ్ళు నాట్యగత్తెల చుట్టూ చేరి కైపెక్కిన చూపులతో, ద్వంద్వార్థాల మాటలతో శృంగారాన్ని ఒలకబోస్తున్నారు. నాట్యగత్తెలకు ఉషారెక్కువయ్యింది. వాళ్ళు నవ్వుతూ, నవ్విస్తూ, తుళ్ళుతూ, సరసాలాడుతూ వాతావరణాన్ని వేడెక్కిస్తున్నారు.

అయితే ప్రసాద్ అక్కడికి రావటం, అక్కడి వాతావరణంలో మార్పును తెచ్చిందని స్పష్టంగా చెప్పవచ్చు. ఎవరికి వారు మెల్లగా తమ వాహనాల వద్దకు చేరుకోసాగారు. జమిందారు కుటుంబరావు ప్రతి ఒక్కరిని వారి వారి కార్ల వద్దకు తీసుకువెళ్ళి సాగనంపసాగాడు.

ప్రేమికుల రహస్యం తెలుసుకుని చలించిన అప్సరల మాదిరిగా తారకలు తళుక్కుమంటున్నాయి. ప్రాంతఃకాలపు స్వచ్ఛవాయువులు తేలసాగాయి నలువైపులా నిశ్శబ్దం అలముకున్నది.

జమిందారు కుటుంబరావుకు నిద్రపట్టటం లేదు. మధువు కూడా ఆయనకు మత్తును కలిగించలేక పోయింది. నర్తకీమణులు ఆయన సేవలోనే ఉండిపోయారు. వాళ్ళు కూడా ఆయనను కదిలించలేకపోయారు. మొదటినుండీ పార్టీ వాతావరణం

చెడిపోయింది. ఆయన తననే దోషిగా నిందించుకున్నాడు. తనను పెనవేసుకుంటున్న ఆ నాట్యకత్తెలను దూరంగా తీసుకువెళ్ళమని నౌకర్లను కళ్ళతోనే ఆదేశించాడు. నౌకర్లు వాళ్ళను భవనంలో ఒక మూలకు తీసుకు వెళ్లారు.

జమిందారు తన పడక గదికి చేరుకునేసరికి ఫోను గదినుండి, నౌకరు కబురు తీసుకువచ్చాడు. ఆ ఫోను వున్న గది, ఆయన గదికి మూడు గదుల అవతల వున్నది. ఆ ఫోను రైట్ వద్ద నుండి వచ్చింది.

"నేను, రావుని మాట్లాడుతున్నాను." జమిందారు రైట్‌కు సమాధానమిచ్చాడు.

"హలో! నేను రైట్‌ను. ఆనకట్ట దగ్గరనుండి మాట్లాడుతున్నాను. రిజర్వు పోలీసులు ఆనకట్ట ప్రాంతాన్ని చుట్టుముట్టారు. ఒకడు నా దగ్గర వున్నాడు. మమ్మల్ని ఏం చేయమంటారు?"

"ఏం ఫర్వాలేదు. మీరెంత తొందరగా హైదరాబాద్ రాగలరో అంత త్వరగా వచ్చేయండి."

జమిందారు ఫోన్ పెట్టేసి తన గదికి వెళ్ళిపోయాడు. మిగిలిన రాత్రంతా ఆయన అటూ ఇటూ దొర్లుతూనే వున్నాడు. ఆయనను చుట్టుకున్న భయం ఆయనను నిద్రకూడా పోనివ్వలేదు.

# 32

బోసిగావున్న కొండల నుంచి సూర్యుడు నెత్తిపైకి వస్తున్నాడు. అయినా నగరంలో హడావుడి ఇంకా మొదలు కాలేదు. ప్రభుత్వోద్యోగులు మాత్రం ఆఫీసులకు వెళుతున్నారు. రోజూ ఆ సమయంలో నిద్రపోవలసిన జమిందారు కుటుంబరావు కారుపై తిరుగుతున్నాడు. ఆయన అన్నపూర్ణ కోసం హోటల్‌కు వెళ్ళాడు. ఆమె అక్కడ లేదు. జమిందారు ఎదురుచూడని విధంగా ఆశ్చర్య పోయాడు.

బహుశా యం.ఎల్.ఏ. క్వార్టర్సులో వున్నదేమోనని అక్కడకు వెళ్ళాడు. అక్కడనుండి కూడా వెళ్ళిపోయిందని చెప్పారు.

"ఎక్కడకు వెళ్ళిందో తెలుసా?" జమిందారు అసహనంగా రిసెప్షనిస్టు నడిగాడు.

"తెలియదండీ, మాకు చెప్పలేదు." రిసెప్షనిస్టు వినయాన్ని జోడించాడు.

జమిందారు కారు దగ్గరకు వెళ్ళాడు. మనస్సు పరిపరి విధాల ఆలోచించ సాగింది. 'ఈమె ఎక్కడకు వెళ్ళింది? కనీసం నాకు సమాచారం తెలియకుండా చేసింది. నేనంటే ఏమనుకుంటున్నది? ఈమె కూడా నా శత్రువులతో చేతులు కలిపిందా? వీళ్ళంతా నావెంట ఎందుకు పడుతున్నారు?'

మరల హోటల్‌కు వెళ్ళాడు. 'బ్రెక్‌ఫాస్టు'కు ఆర్డరు ఇచ్చాడు. దానికి ముందు ఒక పెగ్గు విస్కీ గడగడా త్రాగాడు. బేరర్‌ను పిలిచి ఆ రోజు దిన పత్రిక తెమ్మన్నాడు పత్రిక అటు ఇటూ తిప్పాడు. ఏ వార్తా ఆయన దృష్టి నాకర్షించటం లేదు. ప్రపంచం ఏమౌతోందో తెలుసుకోవాలనే కుతూహలం లేదు. రెండవ పేజీలో ఒక వార్త ఆయన దృష్టిని ఆకట్టుకుంది. ముఖ్యమంత్రి నగరంలో కార్యక్రమాలన్నీ రద్దు చేసుకుని, జిల్లాలలో పర్యటకు వెళ్ళారని ఆ వార్త సారాంశం

టిఫిన్ తింటూ ఆయన ఆ వార్తను గురించి ఆలోచించసాగాడు రకరకాల సందేహాలు తలెత్తసాగాయి.

'ఆయనెందుకు నగరం వదలి వెళ్ళారు? ఎక్కడకు వెళ్ళారు? బహుశా మా జిల్లా వెళ్ళలేదు కదా? గ్రామంలో ఆనకట్ట చూడటానికి వెళ్లంటే....' జమిందారు ఆలోచనలన్నీ ఎటు చూసినా ఆనకట్టవైపే సాగుతున్నాయి.

'ఆనకట్ట వద్దకు పోలీసు లెందుకు పంపబడ్డారు? ఇది ఆ ప్రసాద్‌గాడి పనేనా? అసలేం జరిగింది? ఏమయినా జరిగివుంటే రైట్ చెప్పివుండేవాడే కదా?'

మామూలుగా జమిందారుకు ఆ హోటల్‌లో "బ్రెక్‌ఫాస్టు" చేయటం ఎంతో ఇష్టం. అయితే ఈ రోజు ఆయనకేమీ రుచించటం లేదు. ఒక క్షణం కళ్ళముందు ఏమీ కనిపించటం లేదు నలువైపులా పొగ మంచు కమ్ముకున్నట్లనిపించ సాగింది. కొంచెంసేపు పూలు, మరికొంచెంసేపటికి ముళ్ళు కనిపించసాగాయి.

మొత్తం మీద పరిస్థితి విచిత్రంగా వుంది. ఇదంతా జమిందారుకు చిత్రంగా వుంది.

ఆయన సిగరెట్ వెలిగించాడు. ఇంకా రైట్ ఎందుకు రాలేదు? బహుశా డైరక్టుగా భవనానికి వెళ్ళాడేమో! నిజమే! తానిక్కడ వున్నట్లు రైట్ కెలా తెలుస్తుంది?

గబ గబా లేచి టెలిఫోను దగ్గరకు వెళ్ళి తన నివాసానికి ఫోను చేసాడు. అక్కడివారు, రైట్ వచ్చి తనకోసం ఎదురుచూస్తున్నట్లు చెప్పారు. వెంటనే బిల్ చెల్లించి కారులో భవనానికి వెళ్ళాడు. రైట్ డ్రాయింగ్ రూమ్‌లో ఈయనకోసమే ఎదురు చూస్తున్నాడు.

"టిఫిన్ తీసుకున్నారా?" జమిందారు మర్యాదగా అడిగాడు.

"దారిలోనే తీసుకున్నాను. ఇప్పుడే వచ్చాను. ఎక్కువ సేపు కాలేదు!"

"అయితే ఏమీ తీసుకోరా? కాఫీ కూడా ?"

"కాఫీనా! ఇంకేమైనా అయితే బావుంటుందేమో! ఇక్కడ పానీయాలేవి లభించవా ?"

"ఎందుకు లభించవు? నా గదిలోకి వెళదాం రండి." ఇద్దరూ లేచి గది లోనికి వెళ్ళారు. వీరి మాటలు ఎవరూ వినటం వీరికి ఇష్టం లేదు. పెద్ద పెద్ద భవనాలలో గోడలకు చెవులే కాదు, కళ్ళు కూడా ఉంటాయి. వాటి వెనుక కుతూహలమే కాకుండా కుటిలత్వం కూడా ఉంటుంధి.

ఇద్దరు గదిలోకి వెళ్ళగానే జమీందారు తలుపు మూసివేసాడు. మామూలుగా ఆ పని నౌకర్లు చేస్తూ వుంటారు.

"ఇప్పుడు చెప్పండి, అసలు ఏం జరిగిందో?"

"ఈ విధంగా ఎందుకు జరుగుతుందో నాకర్థం కావటం లేదు. నాకు చాలా ఆందోళనగా ఉంది. పని అంతా పూర్తి అవుతున్నది. ఆనకట్ట మరమ్మత్తులు వేగంగా సాగుతున్నాయి. ఈ పరిస్థితుల్లో, ఇంత పెద్ద సంఖ్యలో పోలీసులు అక్కడికి ఎందుకు వచ్చారో అర్థం కావటం లేదు."

"అవును, నాకూ అదే అర్థం కావటం లేదు."

"ప్రచారం జరిగినంతగా మన అదృష్టం కొద్దీ అక్కడ నష్టం జరగలేదు. కూలిపోయిందంతా తిరిగి నిర్మించేసాం పగుళ్ళు కూడా కలిపి వేస్తున్నాం. పక్కన మట్టితో పోసిన కట్టలకు కూడా పెట్టిన ఖర్చు సరిపోయింది. మనం, ఆ కట్టలకు పెద్దగా నష్టం జరిగిందని మన రిపోర్టులో వ్రాసాం."

"అలాగా!" జమిందారు అన్యమనస్కంగా అన్నాడు. ఆయనను ప్రస్తుతం ఆనకట్టకంటే పెద్ద సమస్యలు బాధిస్తున్నాయి.

"స్కూలు, దేవాలయం పనులలో ఉన్న కూలీల నందరినీ ఆనకట్ట పనిలో నియమించాం."

"అలా ఎందుకు చేసారు? కొత్త కూలీలను నియమించితే పోయేది. దాని వల్ల రాజకీయంగా చాలా నష్టం జరుగుతుంది."

"అవును. ఆ సంగతి నాకు తెలవదు. నేను మీ సలహా తీసుకుని ఉంటే బాగుండి ఉండేది."

"ఈ విషయంలో గ్రామస్తు లేమంటున్నారు?"

"చెప్పాలంటే, వారికిది అంత ఇష్టంగా వున్నట్టు లేదు."

"కాదు వివరంగా చెప్పండి. ఏమీ సంకోచించవద్దు, నాకు యథార్థాలు కావాలి."

"కూలీలు అక్కడ ఉన్న కారణంగా లాభం పొందుతున్నాం. కొందరు గ్రామస్థులు గొడవ చేసారు. కొంచెం గందరగోళం కూడా జరిగింది. ఒక సభ కూడా జరిపినట్లు వున్నారు."

"సభ దేమున్నది! ప్రతి చిన్న విషయానికి సభ జరుగుతూనే వుంటుంది. ఇంతకూ ఆ సభ ఎవరు ఏర్పాటు చేసారో తెలుసా?"

"రాజగోపాలరావు ఏర్పాటు చేసాడు. ఆనకట్ట వరకూ గ్రామంనుండి ఒక పెద్ద ఊరేగింపు కూడా జరిపారు."

"బహుశా ఆ కారణంగానే అక్కడకు ఎక్కువమంది పోలీసులు వచ్చి ఉండవచ్చు."

"అంతేనేమొ!"

"రాజగోపాలరావు నడవగలుగుతున్నాడా?"

"లేదు, కుంటుతూనే ఉన్నాడు. అతని సహచరులు అతనిని భుజాలమీద మోసుకు తీసుకుని వచ్చారు. వాళ్ళు నినాదాలు కూడా చేసారు."

"ఇంకా ఎవరెవరొచ్చారు?"

"ఎవరో రామాపురం రైతులట- వారిని మీరు భూములనుండి వెళ్ళగొట్టారట."

"అవును!"

"అక్కడ ఒక శాసన సభ్యుడు కూడా వున్నట్టు నాకు తెలిసింది. అతని పేరు నాకు తెలియలేదు. అయితే మీ అన్నపూర్ణ మాత్రంకాదు."

"అలాగా."

"వారు తమ ప్రసంగాలలో ఏమి చెప్పారో నాకర్థం కాలేదు. కాని వారి హావభావాలు చూస్తుంటే వారి ప్రసంగాలు చాలా తీవ్రంగా వున్నట్లు తోచింది."

"ఇప్పుడు మీ కార్యక్రమం ఏమిటి?"

"నేను ఆనకట్ట దగ్గరకు తిరిగి వెళ్ళిపోతాను. అక్కడ చాలాపని వుంది."

"ముఖ్యమంత్రి అక్కడకు వచ్చారా?"

"లేదు. నేను అక్కడ వున్నంతవరకు రాలేదు. నేను బయలుదేరిన తరువాత వచ్చారేమో తెలవదు."

"అక్కడ మా యమ్.ఎల్.ఏ. అన్నపూర్ణ వున్నారా?"

"ఆమె నాకు అక్కడ కనపడలేదు. బహుశా ఇక్కడే ఎక్కడైనా ఉన్నదేమో!"

జమీందారు ఒక నిట్టూర్పు విడుస్తూ లేచి సిగరెట్ వెలిగించి అటూ ఇటూ నడవసాగాడు. ఆయన ముఖకవళికలు ఏదో తీవ్రమైన నిర్ణయాన్ని తీసుకోబోతున్నట్లు తెలుపుతున్నాయి. అయితే అనుభవం ఉన్న కారణంగా తేలిగ్గా బయటపడటం లేదు వరండాలో నుండి, గదిలోకి తిరిగి వస్తూ రైట్‌తో అన్నాడు:

"పరిస్థితులు అంతగా అనుకూలించటం లేదు. ఏం చేస్తాం? రాజకీయాలలో అప్పుడప్పుడు ఎదురు గాలి వీచటం మామూలే కదా! మీకు బ్రిటిష్ పాస్‌పోర్టు ఉంది కదా? మద్రాలో ఉన్న మీ కుటుంబం సంగతి నేను చూసుకుంటాను. వారి బాధ్యత నాది."

"మీరు చెప్పేదేమిటో నా కర్థం కావటం లేదు."

"స్పష్టంగా చెప్పాలంటే, మీరెంత తొందరగా ఈ దేశం వదలి వెళ్ళితే అంత మంచిదని నా అభిప్రాయం. వీలైనంత త్వరగా వెళ్ళిపోండి. మీరు తూర్పు ఆఫ్రికా వెళ్లవచ్చుకదా! ఈ చిల్లర రాజకీయ నాయకుల బాధ వదిలించుకోవాలంటే అది ఒక్కటే మార్గంగా కన్పిస్తున్నది."

"నాకేం చేయాలో తోచటం లేదు." జమిందారు మాటలకు రైట్ ఆశ్చర్యపోయాడు. ఈ దేశ పరిస్థితులు తనకంటే జమిందారుకే ఎక్కువ తెలిసిన కారణంగా అతనేమి చెప్పలేని స్థితిలో ఉన్నాడు. భారతదేశంలో ఖైదీగా గడపడం కంటే తూర్పు ఆఫ్రికాలో కొంత కాలం ఉండటమే మేలు అని భావించాడు. అతను ఏదో చెప్పాలనుకున్నా స్పష్టంగా చెప్పలేకపోతున్నాడు.

అతని మనసులో రకరకాలు భయాలు కలుగుతున్నాయి.

"మీరు ఖర్చును గురించి ఆలోచించవద్దు. ఎంతైనా నేను భరిస్తాను. సర్వీసులో ఉన్నంతకాలం మీకెంత ఆదాయం వస్తుందో అంత చెల్లిస్తాను. మీ కుటుంబ సంరక్షణ భారమంతా నేనే చూసుకుంటాను. తరువాత మీరు వారిని ఎక్కడికి పంపమంటే, అక్కడకు నా ఖర్చుతో పంపుతాను." జమిందారు రైట్‌ను ఆలోచించనీయకుండా చేశాడు.

"కానీ-" రైట్ ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాడు. అతనికి నాలుగు వైపులా అంధకారమే కనిపిస్తున్నది.

"ప్రస్తుతం ఇక్కడ ఒక విధమైన రాజకీయ తుఫాను చెలరేగుతున్నది. అవి మమ్మలను ముంచివేయవచ్చు. మీరు అదృష్టవంతులు. కనీసం సురక్షిత

ప్రాంతానికి చేరుకుంటున్నారు. మాకు దీన్ని ఎదుర్కొనక తప్పదు. ఎదుర్కొంటాం."

"మీరు చెప్పినట్లే చేస్తాను. మీరు నా కుటుంబ సంరక్షణకు ఇచ్చిన మాట నిలబెట్టుకుంటారని నా నమ్మకం."

"నా ప్రాణం కంటే ముఖ్యంగా భావిస్తాను."

"మీ రాజకీయాలు నాకు అర్థం కావు. కానీ అందులో కుళ్ళు, మురికి ఉందని మాత్రం స్పష్టంగా చెప్పగలను." రైట్ తన ఆలోచనలను ఆపుకోలేకపోయాడు.

"మీరు కొండ మీద ఉన్న హోటల్‌కు వెళ్ళండి. అక్కడ నా పేరు చెప్పండి. మీకు గది ఇస్తారు. ఈలోగా నేను మీ ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చూస్తాను. సాయంత్రానికి ఈ నగరం వదలి వెళ్లటం మంచిది. వీలైతే ఇంకా ముందుగా వెళితే మంచిది."

"ముందు అసలు నన్ను నిర్ణయించుకోనివ్వండి.

నేను మీ మంచి కోరే చెబుతున్నాను. ఒక గంటలో బొంబాయికి విమానం ఉన్నది. ఇక్కడనుండి ఎంత త్వరగా బయటపడితే అంతమంచిది."

"అలాగే! మీరు చెప్పినట్లే వెళతాను."

"అయితే తిన్నగా ఎయిర్‌పోర్టుకు వెళ్ళండి. స్నానం వగైరా అక్కడే పూర్తి చేసుకోవచ్చు."

"మద్రాసుకు ఒకసారి ఫోన్ చేస్తాను. కనీసం నా భార్యకైనా విషయం చెప్పాలి కదా!"

"నిజమే. కానీ మద్రాసు ఫోన్ వచ్చేలోగా విమానం వెళ్ళిపోతుంది. మీరు బొంబాయి నుండి ఫోను చెయ్యండి. మీరు గాభరా పడవలసిన పనిలేదు. నేను వారికి కబురు అందే ఏర్పాటు చేస్తాను. మీలాంటి మంచిమనిషి మాకు దొరకడం కష్టం.. మిమ్ములను ఎప్పుడూ గుర్తుంచుకుంటాం."

"నేను మీకు చాలా ఋణపడి ఉన్నాను. ఎప్పుడు ఈ గందరగోళం సర్దుకుంటే అప్పుడు మరలా మీ సేవ చేయటానికి వస్తాను. గుడ్ బై! గుడ్ లక్!"

రైట్ అక్కడనుండి తిన్నగా విమానాశ్రయానికి వెళ్ళిపోయాడు.

రైట్‌కు వీడ్కోలు చెప్పి జమీందారు తన గదికి వెళ్ళాడు. చేతులు వెనుకకు కట్టుకొని సిగిరెట్‌పై సిగిరెట్ కాలుస్తూ అటూ ఇటూ తిరగసాగాడు.

మధ్యమధ్యలో తల ఊపుతూ ఏదో ఆలోచించసాగాడు. సాధారణంగా కుటుంబ రావు ఎంత నష్టం కలిగినా చలించడు. పెద్దవాళ్ళ సలహా తీసుకొనటం కూడా అతనికి ఇష్టం ఉండదు. చాలా విషయాలలో ఆయన ఉక్కులాంటి మనిషి.

ఇంతలో ఆయన దృష్టి గదిలో ఒక మూల వణికిపోతూ ఉన్న తన మనిషిపై పడింది. వాడు తాను చూడకుండా లోపలకు ఎలా వచ్చాడు? ఆయనకు ఏమీ అర్థం కాలేదు.

"నీవెప్పుడొచ్చావు?" ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"మీరు రైట్ దొరగారితో మాట్లాడుతున్నప్పుడే వచ్చాను. మధ్యలో జోక్యం చేసుకుంటే బాగుండదని ఊరుకున్నాను."

"ఊహు!"

తన రైట్‌తో మాట్లాడుతున్నప్పుడు వీడు అక్కడ ఉండటం జమిందారుకు ఇష్టంలేదు. ఈ ఏజంట్లు అందరూ మోసగాళ్ళే. రహస్యాలు ఎంత త్వరగా కూడ బెడతారో, అంత త్వరగానూ ప్రచారం చేస్తారు.

"ఇంతకూ ఏమి సమాచారం తెచ్చావో చెప్పు."

"ఈ రోజు పోలీసు కార్యాలయం తెరవగానే అక్కడకు వెళ్ళాను."

జమిందారు దానికంత ప్రాధాన్యం ఇవ్వలేదు.

"ముఖ్యమంత్రిగారు ఆనకట్టను గురించి పోలీసు వారిచ్చిన నివేదికపై రిమార్కులు వ్రాసి తిరిగి దర్యాప్తుకు ఐ. జీ. గారికి పంపారు. ఐ. జీ. గారు చాలా బాధ పడుతున్నారు. ఆ ప్రసాద్ ఆయనను పైనుండి వేధిస్తున్నట్లున్నాడు. మీరొకసారి ఆయనకు ఫోన్ చేస్తే బాగుంటుందేమో!''

''అలాగా. చాలా పెద్ద చిక్కు వచ్చిందే!"

"ముఖ్యమంత్రిగారు ఎవరికి చెప్పకుండా ఆనకట్ట ప్రాంతానికి వెళ్ళారని అనుకుంటున్నారు.''

అంతవరకు ధైర్యంగా ఉన్న జమిందారు ఈ ఆఖరు మాటలతో కొంచం గాభరా పడ్డాడు. తన శత్రువుల పైనే కాకుండా స్నేహితుల మీద కూడా ఆయనకు సందేహం కలుగసాగింది. అన్నపూర్ణ ఎదురుగా ఉంటే ఆమె పీక పిసికి వేయాలన్నంత కోపంగా ఉంది. ఆయనకు మెదడంతా మొద్దుబారినట్ల

య్యింది. ఆయన కొంతమంది ప్రభుత్వ అధికారులపై వత్తిడి తేగలడు. కాని మొత్తం ప్రభుత్వాన్ని కదిలించలేడు. ఎవరైనా కొద్దిమంది ఆఫీసర్లను డబ్బుతో కొనగలడు గానీ, మొత్తం ప్రభుత్వాన్ని ఎవరు కొనగలరు? ఆ విషయం జమిందారుకు ఇప్పుడిప్పుడే అనుభవంలోకి రాసాగింది.

ఆ ఏజంటును వెళ్ళిపొమ్మని, ఆయన గదిలో పచారులు చేయసాగాడు. ఆయన మనస్సులో రకరకాల ఆలోచనలు మెదలసాగాయి.

'నేను కూడా రైట్‌లాగా దేశం వదిలిపెట్టి పోవాలా? అయితే అది పిరికితనం అనిపించుకుంటుందే! గ్రామానికి వెళ్ళితే? అది మూర్ఖత్వం అవుతుందేమో! ముఖ్యమంత్రికి సాష్టాంగ పడితే? తాబేదారుకే లొంగిపోయినట్లు అవుతుందేమో! ఏం చెయ్యాలి?'

జమిందారు ఈ విధంగా అంతర్మథనంలో ఉండగా మద్రాసు నుండి ఫోన్ వచ్చింది. అక్కడనుండి ఆయన కార్యదర్శి మాట్లాడుతున్నాడు.

"ఆ! చెప్పు, నేనే మాట్లాడుతున్నాను."

"చినబాబుగారు గ్రామానికి వెళ్ళారు."

అటువైపునుండి పి. ఏ. చెప్పాడు.

"ఎందుకు వెళ్ళారు"

"బహుశా కొంచెం పొలం అమ్మటానికి వెళ్ళినట్లున్నారు."

"ఊ! చెప్పు."

"ఎరువుల ఫ్యాక్టరీ కోసం పోగుచేసిన డబ్బు అంతా దానికోసమే ఖర్చు పెట్టినట్లున్నారు. అయినా ఇంకా స్ట్రిక్చర్ కూడా పూర్తికాలేదు."

"మంచిది. నేను చూసుకుంటానులే" అంటూ ఫోను పెట్టేసాడు. జమిందారుకు మరో సమస్య తోడయ్యింది. ఇంకా ఎన్ని సమస్యలు రానున్నాయో? ఆయనకు తలమీద పెద్ద రాయి దొర్లినట్లు, తాను రక్తంలో పొర్లుతున్నట్లు అనిపించసాగింది అయినా తాను ధైర్యంగా ఉండాలని నిర్ణయించుకుని లేచి అటూ ఇటూ తిరగసాగాడు.

'నేను ఇప్పుడు గ్రామానికి వెళ్ళటం తెలివితక్కువ అవుతుంది. నా కళ్ళ ముందే, నేను బ్రతికుండగానే నా కుమారుడు పూర్వీకుల భూమిని అమ్ముతూ ఉంటే ఎంత అవమానంగా ఉంటుంది? భార్యకు ఏమి సమాధానం చెప్పాలి? ఇప్పుడు ఎక్కడకు వెళ్ళాలి? అయినా నాకేం పర్వాలేదు. నేను ఎక్కడా వ్రాతపూర్వకంగా ఇరుక్కోలేదు కదా! చట్టం చేతులు నాదాకా రాలేవు. నాకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పగల ఒకేవక వ్యక్తి తూర్పు ఆఫ్రికా వెళ్ళే దారిలో ఉన్నాడు. నేను ఎందుకు భయపడాలి? శాంతంగా ఉంటే అన్ని వాటంతట అవే సర్దుకుంటాయి.' ఈ విధంగా జమిందారు తనను తాను సమాధాన పరుచుకొని ఆ రోజు పేపరు చదవసాగాడు. అందులో ఏమి ప్రత్యేకమైన వార్తలేదు. ఉంటేమాత్రం తననేమి చేస్తాయని అను కున్నాడు.

లేచి బట్టలు మార్చుకొని కారులో బయలుదేరి ఒక ఉన్నత పోలీసు అధి కారిని కలవటానికి నగరంలోని పెద్ద హోటల్‌కు వెళ్ళాడు.

# 33

ముఖ్యమంత్రి రాష్ట్రంలో ఎక్కడ పర్యటించినా ఆయనతోపాటు స్థానిక నాయకులు, అధికారులు పాల్గొంటూ వుంటారు. ఆయనకు పెద్ద ఎత్తున బందోబస్తు, స్వాగత సత్కారాలు ఏర్పాటు చేయబడుతూ వుంటాయి. ఆయన కార్యక్రమ వివరాలు వార్తాపత్రికలలో ప్రకటిస్తారు. అయితే ఈసారి ఆయన డామ్ చూడటానికి వచ్చిన వార్త చాలా గోప్యంగా వుంచారు. వార్త తెలియకుండా వుండటానికి, ఆయన తన బంధువులను చూడటానికి వెళ్ళారని చెప్పారు.

అయితే ఇంత పెద్ద ప్రభుత్వానికి అధినేత అయిన ముఖ్యమంత్రికి సంబంధించిన విషయం ఎక్కువ కాలం రహస్యంగా వుంచటం సాధ్యం కాదుకదా? ముఖ్యమంత్రి ఆగమనం ప్రజలలో రకరకాల అనుమానాలు రేకెత్తించింది.

ఆయన రాక స్థానిక శాసన సభ్యురాలు అన్నపూర్ణకు కూడా తెలియచేయబడలేదు. శాసన సభ్యుడు కోటేశ్వరరావు మాత్రం ఆనకట్టవద్ద ముఖ్యమంత్రి కోసం నిరీక్షిస్తూ వున్నాడు. కోటేశ్వరరావు ఇచ్చిన సమాచారం ఆధారంగానే, ఆనకట్ట ప్రాంతాన్ని పరిశీలించడానికి ముఖ్యమంత్రి వస్తున్నారు. ప్రసాద్ కూడా అప్పటికే అక్కడకు వచ్చి వున్నాడు ముఖ్యమంత్రి అక్కడకు రావటంలో ప్రసాద్ కూడా ముఖ్య కారకుడే. ఆయన వెలిబుచ్చిన అనుమానాలను కూడా ముఖ్యమంత్రి పరిగణనలోకి తీసుకున్నారు. ప్రసాద్ కూడా అక్కడకు ఒంటరిగానే వచ్చాడు.

ముఖ్యమంత్రి తెల తెలవారుతూ వుండగానే ఆనకట్ట దగ్గరకు వచ్చారు. ఆనకట్ట కూలినచోట అంత పెద్ద రంధ్రము ఇప్పుడు లేదు. అది చాలావరకు పూడ్చివేయబడింది. గోడలకు వచ్చిన పగుళ్ళు కూడా సిమెంటుతో మరమ్మత్తు చేయబడ్డాయి. ఉదయపు నీరెండలో పూడ్చిన పగుళ్లలోని సిమెంటు చారికలు పచ్చగా కనుపించసాగాయి.

"ఆనకట్టకు పగుళ్ళు ఏర్పడ్డాయని ఈ చారికలు చూస్తే స్పష్టంగా తెలిసిపోతుంది. నీటికి రంగు వేయించితే బాగుంటుంది." ముఖ్యమంత్రి వెంటవచ్చిన వారిలో ఒకరు అన్నారు.

"ఆనకట్టకు రంగులు వేయరు." కోటేశ్వరరావు అన్నాడు.

"వాటిని కనిపించకుండా చేయలేరు. ఇవి చాలా అసహ్యంగా కనిపిస్తున్నాయి."

"ఆ దుర్మార్గులు చేసిన అకృత్యాన్ని ఈ చారికలు చెప్పకనే చెప్తున్నాయి."

"పూడిన గాయంలా ఇది కనిపించటం కూడా భావ్యం కాదు." ఆ మనిషే మరల అన్నాడు.

"మీరు చెప్పింది నిజమే. అయితే విచారణ పూర్తయిన తర్వాత దీనికి రంగులు వేస్తే బాగుంటుంది. ప్రపంచంలో ఇదే మొట్టమొదటి రంగుల ఆనకట్ట అవుతుంది." కోటేశ్వరరావు నవ్వుతూ అన్నాడు.

ముఖ్యమంత్రి కూడా ఆ సంభాషణలోని హాస్యాన్ని ఆనందిస్తున్నారు.

"పని చాలా వేగంగా జరుగుతున్నట్లుంది." ముఖ్యమంత్రి అన్నారు.

"మరమ్మత్తులు వేగంగానే జరగాలి కదా! ఆనకట్ట కట్టిన కాంట్రాక్టర్లకు బిల్లు మొత్తం చెల్లించారా?"

–కోటేశ్వరరావు ముఖ్యమంత్రిని ప్రశ్నించాడు.

"ఇచ్చేసారనుకుంటాను. పైగా పాత బిల్లులు ఇవ్వకపోతే మరమ్మత్తులు చేపట్టటం కష్టమన్నారు. ఇంజనీర్లు కూడా పని పూర్తయినట్లు సర్టిఫికేట్ యిచ్చారు. అట్టి పరిస్థితులలో డబ్బు యిచ్చి తీరాలి కదా!" ముఖ్యమంత్రి సమాధానమిచ్చారు.

"కాని బిల్లులు రికార్డు టైములో చెల్లించినట్లున్నారు. మా టి. ఎ. బిల్లులు పాసు కావాలన్నా నెలల తరబడి టైమ్ తీసుకుంటున్నది." కోటేశ్వరరావు అన్నాడు.

"అలాగా!" ముఖ్యమంత్రి ఆశ్చర్యం ప్రకటించారు.

"నష్టం పెద్దగా జరుగకపోయినా, ఆనకట్ట మరమ్మత్తులకు, ఆనకట్ట నిర్మాణానికి ఇచ్చినంత డబ్బు యిస్తున్నారని విన్నాను."

"దీనిని పరిశీలిస్తాం. మరమ్మత్తులు బిల్లులు చెల్లించేటప్పుడు విచారణ జరుపుతాం." ప్రసాద్ హామీ యిచ్చాడు.

"కాలవ లెంతవరకూ త్రవ్వారు?" ముఖ్యమంత్రి తెలుసుకోవాలని ప్రశ్నించారు.

"ఎక్కువ దూరం త్రవ్వలేదు. కంట్రాక్టరుకు అడుగడుగునా ఇబ్బందు లెదురవుతున్నాయి. అప్పుడప్పుడు కూలీల సమస్య, అప్పుడప్పుడు సిమెంటు మొదలగువాటి దొంగతనం, అన్నీ సక్రమంగా వుంటే వాతావరణం సహకరించటం లేదు."

"అలాగా!" ముఖ్యమంత్రి ఒక నిర్ణయానికి రావటానికి వివరాలు సేకరిస్తున్నారు. అయితే విచారణలో ఆయన తనకు తాను చిక్కుకు పోతున్నట్లున్నది. ఆనకట్ట ధ్వంసం చేయబడితే ప్రభుత్వాధినేతగా ఆయనకు కూడా ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సంబంధం వున్నట్లే. ఆనకట్ట ధ్వంసం చేయబడినమాట యధార్థమే. ఈ కుంభకోణం నుండి మర్యాదగా బయటపడటం మంచిదని ఆయన భావించాడు. ఆయన విచారణ త్వరగా ముగించాలనుకోలేదు. సమయం తీసుకున్న కొద్దీ విషయం తీవ్రత కోల్పోతుందని ముఖ్యమంత్రి ఆలోచించారు.

"ఆనకట్ట నిర్మించిన కంట్రాక్టరే కాలవల త్రవ్వకం పని చేజిక్కించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. మేము ఆ విషయం మా పార్టీలో చర్చించాం. ఒకవేళ అదే కంపెనీకి కాలవ త్రవ్వకం పని అప్పగిస్తే అడ్డుకోవటానికి కూడా నిర్ణయం చేసాం ఆనకట్ట కాంట్రాక్ట్ చేసిన కంపెనీ చాలా పెద్దది. పైగా వాళ్ళ దగ్గర చాలా డబ్బువుంది. ఆ కారణంగా వాళ్ళు, చిన్న చిన్న కాంట్రాక్టర్లు తమలో తాము పోట్లాడుకుంటే నష్టపోయేది ప్రజలే కదా! మీరు కొంచెం విశాల హృదయంతో ఆలోచించితే బాగుంటుంది." కోటేశ్వరరావు మాటలో వినయం ధ్వనించింది. వ్యక్తిగతంగా విజ్ఞప్తి చేసినట్లు మాట్లాడాడు. ముఖ్యమంత్రి కూడా అన్యమనస్కంగానే వున్నారు.

"ఆనకట్ట కాంట్రాక్టు చేసిన వీనస్ కన్‌స్ట్రక్షన్ వాళ్ళ దగ్గర చాలా డబ్బు వుంది." ముఖ్యమంత్రి వెంట వచ్చిన ఆయన అన్నారు.

"ఆ సంగతి నాకు తెలుసు. ఆ కాలవల కాంట్రాక్టరు ఎవరు?"

"రెడ్డి అండ్ రావ్ కంపెనీ."

"అవునవును, మరచిపోయాను. మీరీ విషయాన్ని బాగానే సేకరించారను కుంటాను. ఈ వీనస్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ ఎవరిది?" ముఖ్యమంత్రి విషయం

తనకు తెలిసినప్పటికి కోటేశ్వరరావును ప్రశ్నించారు ప్రజలలో ఆ విషయం గురించి ఎంత పరిజ్ఞానం వుందో ఆయన తెలుసుకోవాలనుకున్నారు.

"ఆ కంపెనీ ఇక్కడి జమిందారు శ్రీ యస్.ఆర్.వి కుటుంబరావుది. అయితే, దాని బోర్డు ఆఫ్ డైరక్టర్లలో ఆయన పేరు మీ కెక్కడా కనిపించదు. డబ్బంతా ఆయనదే పేర్లన్నీ బినామీవే."

"ఎవరో రైట్ అనే విదేశస్తుడు దీనిని స్థాపించాడన్నారు?"

"అవునండి. అతను కేవలం జీతం తీసుకొనే ఉద్యోగి మాత్రమే. ఇటువంటి మోసపు పనులు చేయించటానికే అతనికి డైరెక్టర్ హోదా ఇవ్వబడింది." ఆనకట్ట పగుళ్ళపంక చెయెత్తి చూపిస్తూ అన్నాడు కోటేశ్వరరావు.

"ఉహు!" ఈ విషయం తనకు ముందుగా తెలిస్తే ఎంత బాగుండేది అని ముఖ్యమంత్రి ఆలోచించసాగారు.

"శ్రీమతి అన్నపూర్ణకు కూడా ఇందులో వాటా వుందా?" ఆయన కోటేశ్వరరావును ప్రశ్నించారు.

"ఆమెకు అందులో భాగం లేకపోవచ్చు. కాని ఆమె చాలా మెత్తని స్వభావం కలది. అమాయకురాలు. ఆమె ఎచ్చట పుట్టిందో ఆమెకు తెలుసు. జమిందారును గురించి మీకూ, నాకు తెలిసినంతగా ఆమెకు తెలియదు. ఆయన ఆమెకు పితృతుల్యుడే కాదు, దైవంతో సమానం మీరామెను దర్యాప్తు సంఘానికి ఛైర్మన్‌గా నియమించారు. మేమప్పుడు వ్యతిరేకించాము. చివరకు జరిగిందేమిటి? నేను మీకు ఫిర్యాదు చేయటంలేదు. కాని ఆమె ఈ విషయంలో ఏమి చెయ్యలేదు. పైగా ఆమె ఆయనను రక్షించడానికే ప్రయత్నం చేస్తున్నది. ప్రభుత్వంలో ఆయన పనులన్నీ ఆమె చేసిపెడుతుంది.'' ఎంత మర్యాదగా చెపుతున్నా అందులోని కరుకుదనం అనుభవజ్ఞుడైన ముఖ్యమంత్రి తెలుసుకోలేకపోలేదు. ప్రసాద్‌కు ఇదంతా ఆశ్చర్యాన్ని కలిగించింది.

ముఖ్యమంత్రి మెట్లు ఎక్కి, ఆనకట్ట పైభాగానికి వెళ్ళి, నాలుగు వైపులా చూసారు. ఎండిపోయిన చిన్న నదిని ఆయన ప్రత్యేకంగా చూసారు. ఎక్కడా ఎక్కువ నీరు లేదు.జలాశయం నిండితే మునిగిపోయే కొండ ప్రస్తుతం అనాచ్ఛాదిత వక్షంలాగా కనబడసాగింది. నీలాకాశంలో తెల్లని మబ్బులు అక్కడక్కడా తారట్లాడుతున్నట్లున్నాయి. గాలిలో అదో రకపు దుర్గంధం తేలుతూ వస్తున్నది.

ప్రకృతి సౌందర్యాన్ని వీక్షించే ఉద్దేశ్యంతో ముఖ్యమంత్రి ఆనకట్ట పైభాగానికి వెళ్ళలేదు. ప్రకృతి సౌందర్యం ఆయనను ఆకర్షించదు. కేవలం కోటేశ్వరరావు నుండి తప్పించుకోవటానికి, సంభాషణ మార్చటానికే ఆయన ప్రయత్నం చేస్తున్నాడు. కోటేశ్వరరావు వుండివుండి విసిరే వ్యంగ్యోక్తులకు తిరిగి సమాధానమిచ్చే మూడ్‌లో ఆయన లేరు.

ముఖ్యమంత్రి సురక్షితమైన ఏకాంతంలో లేకుంటే, ఆయన చుట్టూ కనుపించని రక్షణవలయం వుండేది. ప్రభుత్వ లాంఛనాలు, నియమాలు, పోలీసు బందోబస్తు కఠినమైన వలయం లాంటిదే. అవి లేకపోతే ముఖ్యమంత్రి కూడా సామాన్యమైన పౌరునితో సమానమే.

ఆయన అక్కడ ఎక్కువసేపు ఉండలేకపోయారు. క్రింద వున్న జీప్ దగ్గరకు వచ్చేసారు. మొనదేలిన కొండశిఖరం నుండి క్రిందకు జారినట్లుంది ఆయన మానసిక స్థితి. అయితే మనస్సు తేలికయినట్లు అనిపించసాగింది. ప్రస్తుతం ఆయనలో ద్వైదీభావన లేదు. తాను తీసుకోబోయే నిర్ణయపు పరిణామాలెట్లా వుంటాయనే ఆలోచిస్తున్నాడు.

ఆనకట్ట చుట్టూ రిజర్వు పోలీసులు అక్కడక్కడా కాపలా వున్నారు. ముఖ్యమంత్రి ఈ పర్యటన ఆకస్మికంగా ఏర్పాటు చేసినదే. ఆయన క్రింద జీపు దగ్గరకు వచ్చేసరికి, ఇద్దరు ముగ్గురు పోలీసు ఆఫీసర్లు వేగంగా జీపుల్లోంచి దిగి ముఖ్యమంత్రికి సెల్యూట్ చేసి, తాము ఆలస్యంగా వచ్చినందుకు క్షమాపణలు చెప్పసాగారు.

"మీరు వచ్చారు కదా! ఫర్వాలేదు. ఇక్కడి విషయాలు నాకు ఎప్పటికప్పుడు తెలియచేస్తూ వుండండి."

జీపు ఎక్కేముందు ఆయన "కూలీలెక్కడ?" అని ప్రశ్నించారు.

ఒకవైపు ఆకులతో నిర్మించిన గుడిసెల వంక చూపిస్తూ ఒక పోలీసు ఇనస్పెక్టర్ చెప్పాడు- "వాళ్ళు ఆ గుడిసెలలో వున్నారు పనులలోకి వెళ్ళడానికి తయారవుతున్నారు."

చిన్న పిల్లలు బట్టలు లేకుండా మట్టిలో ఆడుకుంటున్నారు కుక్కలు అక్కడే తిరుగుతున్నాయి. చుట్టూ మట్టి కుండలు పడివున్నాయి. అక్కడ దరిద్ర దేవత తాండవిస్తున్నట్లున్నది

"మిస్టర్ రైట్ ఇక్కడే వుంటారా? ఆయనిప్పుడు ఎక్కడ వున్నారు?" ముఖ్యమంత్రి ప్రశ్నించారు.

"ఆయన ఆఫీసు ఇక్కడ ప్రత్యేకంగా లేదు. ఆయన జమిందారుగారి భవనంలోనే వుంటారు. ప్రతి రోజు వచ్చి పనులు చూసి వెళుతూ వుంటారు. ఆయనతో కలసి ఐదు, పది మంది దాకా వుంటారు."

"అంటే ఆయన ఇక్కడ లేనట్లేనా?"

"ప్రస్తుతం లేరండి!"

"అలాగా!" ముఖ్యమంత్రికి అనుమానం కలిగింది. ప్రజాస్వామ్యంలో చాలా ప్రయోజనాలున్నాయి. కాని ప్రభుత్వపు రహస్యాలు దాగవు.

ముఖ్యమంత్రి గ్రామంలోకి వెళ్ళి తిన్నగా అన్నపూర్ణ ఇంటికి వెళ్ళారు. ఆమె ఇంటిలో ఎవ్వరూ లేరు. రోజూ ఆమె యింటివద్ద గుమిగూడే ప్రజలు కూడా లేరు. విచారించగా ఆమె ఇంతక్రితమే హైదరాబాదునుండి వచ్చిందని, మరల ఎక్కడకు వెళ్ళిందో తెలియదని చెప్పారు వెంటనే మరల హైదరాబాద్ వెళ్ళిందని కొందరు భావించారు. ముఖ్యమంత్రికి ఆమెను గురించి పూర్తిగా తెలుసు ఆమె జమిందారు గుప్పెట్లో ఏవిధంగా చిక్కుకుందో కూడా ఆయనకు తెలుసు.

ఇంతలో ముఖ్యమంత్రిని కలవటానికి కొందరు గ్రామస్థులు రాసాగారు. రాజగోపాలరావు కుంటుకుంటూ, తన మిత్రుడు, శాసన సభ్యుడు కోటేశ్వరరావు భుజంపై చేయివేసి అక్కడకు వచ్చాడు. ఒక పోలీసు అధికారి, ఆనకట్ట వద్ద నుండి తన జీప్‌లో కోటేశ్వరరావును రాజగోపాలరావు ఇంటి దగ్గర దింపాడు. రాజగోపాలరావు కోటేశ్వరరావుతో కలసి ముఖ్యమంత్రిని కలవటానికి బయలు దేరేసరికి సగం గ్రామం అతనివెంట కదిలింది. కాని ముఖ్యమంత్రి ప్రస్తుతం ఎవరినీ కలిసే స్థితిలో లేరు. ఏ మాత్రం చిన్న విషయానికైనా గందరగోళం జరిగే పరిస్థితి వుందని ఆయన గమనించారు.

"ప్రస్తుతం సమయం లేదు. క్షమించండి. నేను మిమ్ములను మరలా కలుస్తాను. వెంటనే తిరిగి వెళ్లవలసిన అవసరం వుంది. చాలా ముఖ్యమైన పనులున్నాయి" అని రాజగోపాలరావుతో అంటూ, కోటేశ్వరరావుతో నవ్వుతూ, "మీరంతా విచారణ పూర్తవ్వడానికి సహకరించండి. ఇది త్వరగా పూర్తవ్వాలనే నేనూ కోరుకుంటున్నాను" అన్నారు ముఖ్యమంత్రి.

# 34

అన్నపూర్ణ తెల్లవారు ఝామున హైదరాబాద్ నుండి ఇంటికి చేరుకునే సరికి, ఆమెకు మరో ముఖ్య సమస్య ఎదురయ్యింది. సుదీర్ఘమైన రాజకీయ అనుభవంతో కూడా పరిష్కరించలేని సమస్య అది ఆమెను రకరకాల భయాలు పీడించసాగాయి. తన భర్త వ్యవహారం ఆమెను నిశ్చేష్టురాలను చేసింది. టేబుల్ మీద తన భర్త రాసిపెట్టి వెళ్లిన ఉత్తరం ఆమెను ఇంతగా గందరగోళ పరిచింది. ఇటువంటి సునితమైన సమస్యలో చిక్కుకున్న ఆమె హైదరాబాద్‌నుండి పనికట్టుకుని వచ్చిన విచారణ కార్యక్రమాన్ని ఎట్లా కొనసాగించగలుగుతుంది?

"నాకోసం వెదకవద్దు. మనం ప్రస్తుతం గడుపుతున్న విధముగా జీవితాన్ని ముందు ముందు గడపలేము. దేశంకోసం కాపురం నాశనం చేసుకోవలసిన పనిలేదు. నేను అనుభవించినది చాలు. ఇంకా భరించే శక్తి నాకు లేదు."

గణేష్ వ్రాసిపెట్టిన ఉత్తం ఆమె మరోసారి చదువుకున్నది. కోపంతో, పశ్చాత్తాపంతో ఆమె దహించుకు పోసాగింది. భర్తకు తనంటే అయిష్టత ఉందని తెలుసుగాని, ఇంత దూరం వస్తుందని ఆమె కలలో కూడా ఊహించలేదు తాను ఇంటిలో లేనప్పుడు తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించే వ్యక్తి ఈ విధంగా చేస్తాడని ఆమె ఊహించలేదు.

ఆమె ఏం చేస్తుంది? ఇటువంటి విషయాలలో ఇతరుల సహాయం కూడా ఆర్థించలేదు. ఆమె ఇతరులెవరికీ చెప్పుకోలేనంతగా గాభరా పడిపోయింది. జమిందారుతో తెగత్రెంపులు చేసుకుని నిజమైన హిందూ స్త్రీలాగా భర్తతో సుఖంగా జీవితం గడుపుదామని చేసుకున్న నిర్ణయాన్ని విధి ఇంత క్రూరంగా పరిహసిస్తుందని ఆమె ఊహించలేకపోయింది. బహుశా తాను వెళ్లి బ్రతిమాలి తీసుకురావాలని ఆయన అనుకుంటున్నాడేమో! కొంచెం లొంగి ప్రేమగా వ్యవహరిస్తే ఆయనే తిరిగి వస్తాడు. ఆమె మనస్సులో పరిపరి విధాల ఆలోచించ సాగింది. ఆమెకు ఇల్లంతా రాయి రాయిగా విడిపోయి తన నెత్తిన పడినట్లనిపించ సాగింది. ఆమె బాధంతా తీరిపోయేటట్లు దుఃఖించాలనుకుంది. ఆమెకు పిచ్చిగా అరవాలనిపిస్తోంది. కానీ ఏ ఒక్కటీ చేయలేకపోతున్నది.

శారీరక సుఖాలకు అలవాటు పడినవాడు, కామంతో కళ్ళు మూసుకు పోయినవాడు. ఒక్కసారి జీవితం పట్ల విరక్తి చెందడు. పైగా ఆయన అటువంటి స్వభావం కలవాడు కాదు. ఈ ప్రపంచాన్ని వదలివెళ్లేంత ధైర్యం ఆయనకు లేదు. ఆయనకు ఈ జీవితమన్నా, జీవితం ప్రసాదించిన సుఖాలన్నా విపరీతమైన మోజు. ఇంటిలో కూర్చుని ఆలోచిస్తూ కూర్చుంటే ఏం ఉపయోగం? అతనెక్కడ వున్నాడో ముందు తెలుసుకోవాలి.

ఎట్లా? ఎక్కడ వున్నాడో ఎట్లా తెలుస్తుంది? గ్రామ వీధుల్లో సామాన్య స్త్రీలాగా భర్తను వెదుకుకుంటూ తాను తిరగలేదు. ఆమె తన ఆలోచనలు మార్చుకున్నది. బహుశా గ్రామంలో వాళ్ళకు ఈ విషయం ముందే తెలిసి వుండవచ్చు. తాను వచ్చానని తెలిసి వాళ్ళంతా రావచ్చు.

ఏదో శక్తి నడిపిస్తున్నట్లు అన్నపూర్ణ కొండవైపు వెళ్ళసాగింది. ఆమె గణేష్‌తో సంబంధం వున్న హరిజన స్త్రీల ఇళ్ళవైపు వెళ్ళింది.

చిల్లర పనులు మానివేసి ఆయన ఒకవేళ కొత్త జీవితాన్ని ప్రారంభించా లనుకున్నాడేమో!

తన భర్తను గురించి అన్నపూర్ణ మంచిగా ఆలోచించసాగింది.

'ఇన్ని రోజుల తర్వాత అలవాట్లు మార్చుకుంటాడా? ఆయనకు నలభై, నలభై రెండు సంవత్సరాల వయస్సు వుండవచ్చు.ఆ వయస్సులో మనుష్యులలోని పశు భావన చచ్చి, మంచివాళ్ళుగా మారతారని అంటారు. కొందరేమో, ఈ వయస్సే ప్రమాదకరమైనదనీ, ఈ వయస్సులోనే మనుషులు కొత్త కొత్త రుచులు కోరుకుంటారని అంటూ వుంటారు. ఏమో, ఏం చెప్పగలం?'

ఆమె ఆలోచన మానివేసింది.

ఆమె గుడిలోనికి వెళ్ళింది. దేవాలయం మరమ్మత్తులు కొంతకాలం క్రితమే మొదలుపెట్టారు. గోడల ప్లాస్టింగ్ అంతా కొట్టివేసారు. దూలాల రంగు కూడా గీకివేసారు. చెత్తంతా కుప్పలుగా పోసి వుంది. అవన్నీ చూస్తుంటే అక్కడకు కొద్దిరోజులుగా ఎవరూ పనికిరావటం లేదని కనిపిస్తున్నది.

అక్కడ సోమయాజులు వుంటాడని, అతనికి అన్ని విషయాలు తెలుస్తాయని, గణేష్ సంగతి అతని నడిగి తెలుసుకోవచ్చని ఆమె భావించింది కాని అతనక్కడ లేడు. గుడిలో జమిందారు హరిజనుల ప్రవేశం చేయించిన నాటి నుండి అతను పూజాదికాలు తగ్గించాడు. అన్నపూర్ణ నిరాశచెంది బస్తీవైపుకు వెళుదామనుకుంది. కాని ఆమె ధైర్యమే ఆమెకు జవాబు నిచ్చింది. గణేష్ తన ప్రియురాలైన ఉపాధ్యాయినితో ఉడాయించి వుండవచ్చునని, బహుశా తనను మోసగించడానికి ఆ ఉత్తరంపెట్టి వెళ్లి వుండవచ్చునని ఆమె వూహించింది.

అక్కడకు వెళ్లి అడిగితే రెండు మూడురోజుల నుండి ఆ ఉపాధ్యాయిని స్కూలుకు రావటం లేదని తెలిసింది. అన్నపూర్ణ దీర్ఘంగా నిట్టూర్చింది. 'ఇద్దరూ కలిసి వెళ్లి వుంటారు. ప్రస్తుతానికి భర్త బ్రతికి వున్నాడని తెలుస్తున్నది. అదే చాలు. అయితే ఎక్కడకు వెళ్లి వుంటారు? వాళ్లను వెతకవలసిన బాధ్యత తనకు లేదా?'

ఆమె యింటికి వెళ్లి స్నానం చేసి, కొంతసేపు విశ్రాంతి తీసుకుంది. ఆమె రాజగోపాలరావు దగ్గరకు వెళదామనుకుంది. అయితే ఇప్పుడు అక్కడకు వెళితే సమస్య మరింత జటిలమవుతుందని తలచి ఆ ఆలోచన మానుకుంది. తను అతనితో కూడా దూరంగా వుండాలనుకుంటున్నది.

ఆమె కోటవైపుకు నడచింది. ఆమె అక్కడవున్న తన కులంవారి సహాయం తీసుకుందామనుకుంది.

కాని కోటలో ఎవరూ లేరు. వీరాస్వామి జైలులో వున్నాడు. నౌకర్లు కూడా ఎవరూ లేరు. ఆమె ఇంటికి తిరిగి వచ్చింది. అక్కడ కొందరు ఆమెకోసం వేచి వున్నారు. ఆమె వారిని కలవకుండా తిన్నగా యింటిలోనికి వెళ్లిపోయింది. తనకు తప్ప అందరికీ తన భర్తసంగతి తెలుసని ఆమె అనుకోసాగింది. అందరూ తనను హేళనగా చూస్తున్నట్లు ఆమె భావించింది.ఆ పరిస్థితి ఆమెకు చాలాఇబ్బందిగావుంది.

ఈ సంకట స్థితిలో ఆమెకు చాలా సంవత్సరాల క్రితం మద్రాసులో జ్యోతిష్కుడు చెప్పిన విషయాలు గుర్తుకు రాసాగాయి- "వివాహం ఆలస్యంగా జరుగుతుందని, సాంసారిక జీవితం అంత సుఖప్రదంగా వుండ"దని ఆ జ్యోతిష్కుడు చెప్పాడు. తన భర్త తనను ఇష్టపడడనీ ఇద్దరు కలవని మనుష్యులు వివాహబంధంలో ముడివేయ బడతారని ఆ జ్యోతిష్కుడు చెప్పినట్లు ఆమె కనిపించింది.

ఆమె ఇంటిలో వుండలేకపోయింది బయట రోడ్డుమీదకు వచ్చి, అప్పుడే వచ్చిన బస్సు ఎక్కి పట్టణానికి బయలుదేరింది. పట్టణంలో ఒక జ్యోతిష్కుడున్నాడు. తన కేదయినా కష్టం కలిగినప్పుడు ఆమె అతని దగ్గరకే వెళుతూ వుంటుంది.

బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడు ఆమె మనస్సులో ఆలోచనలు సుళ్ళు తిరగసాగాయి. నిజ జీవితంలోనూ, సామాజిక జీవితంలోనూ ఎదురు దెబ్బలే తగిలినందుకు ఆమెకు విచారంగా వుంది. తాను చేసిన పాపాలకు తాను ఫలితం అనుభవిస్తున్నదా? అన్న ఆలోచన ఆమెకు కలిగింది. ఆ ఆలోచన కలగగానే ఆమె కళ్ళు అనాయాసంగా వర్షించాయి. ఆమె చీర చెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంది. బస్సులో వాళ్లంతా తననే చూస్తున్నట్లు ఆమె కనిపించింది. ఇదొక వింత అనుభవం.

ఆమె ఆ దారి వెంట అనేక సార్లు వెళ్ళింది ఆ రోడ్డు మీద ప్రతి చెట్టు ఆమెకు తెలుసు ఎక్కడెక్కడ ఏమున్నదో కూడా ఆమెకు క్షుణ్ణంగా తెలుసు.

పట్టణానికి చేరటానికి ఎక్కువ సమయం పట్టలేదు. అన్నపూర్ణ బస్సులో దిగి జ్యోతిష్కుని ఇంటికి వెళ్ళింది. దేవాలయం ఎదుట చెరువు ఒడ్డున అతని నివాసమున్నది. దేవాలయంలోని ధ్వజస్తంభపు గంటలు గాలికి లయబద్ధంగా మోగసాగాయి జ్యోతిష్కుడు గొప్ప భక్తుడే కాకుండా ఆ గుడిలో పురోహితుడు కూడా.

ఆయన తన ఇంటి ఆవరణలో పద్మాసనం వేసుకుని ధ్యాన నిమగ్నుడై పలక మీద ఏవో లెక్కలు వేస్తున్నాడు. అన్నపూర్ణ ఆయనకు నమస్కారం చేసి ఎదురుగా కూర్చున్నది. జ్యోతిష్కుని వ్యక్తిత్వం చాలా ఆకర్షణీయంగా ప్రభావితం చేసేదిగా వుంటుంది. వెడల్పైన నుదుటిపై విభూతి రేఖలు, భుజంపై యజ్ఞోపవీతం, సనాతన బ్రాహ్మణ్య చిహ్నాలైన, మిగిలిన అలంకారాలు ఆయన గొప్పతనాన్ని చాటుతున్నాయి.

"మీరెందుకొచ్చారో నాకు తెలుసు." ధ్యాన నిమగ్నుడై నెమ్మదిగా కన్నులు తెరుస్తూ అన్నాడు

అన్నపూర్ణకు సిగ్గు, ఆశ్చర్యం రెండూ కలిగాయి. అంటే తన దురదృష్టపు కథ గ్రామంలోనే కాకుండా పట్టణం దాకా ప్రాకిందన్న మాట! ఆమె మౌనం దాల్చింది.

"మీరు మీ భర్త జాడ తెలుసుకోవటానికి వచ్చారు కదూ!" తన ఎదురుగా వున్న ముగ్గుల వైపు దృష్టి సారిస్తూ చెప్పటం ప్రారంభించాడు: "ఆయన క్షేమంగా వున్నాడు. త్వరలోనే తిరిగి వస్తాడు. పెంపుడు పశువులు సాయంత్రానికి ఇంటికి తిరిగి వచ్చినంత సహజంగా ఆయన ఇంటికి తిరిగి వస్తాడు. ఆయన ప్రస్తుతం వేరే స్త్రీతో వున్నాడు పడమర వైపుకు వెళ్లాడు. బహుశా హైదరాబాద్ వెళ్ళి వుంటాడు తీసుకు వెళ్ళిన సొమ్ము ఖర్చు అయిపోతున్నది. సొమ్ము ఖర్చు కాగానే తిరిగి వస్తాడు."

అన్నపూర్ణ ఆశ్చర్యంతో చూడసాగింది. ఈ విషయాలన్నీ ఈయన కెలా తెలుసు ?

"మీరు నిశ్చింతగా వుండండి. ఆయన తప్పకుండా త్వరలోనే తిరిగి వస్తాడు!"

జ్యోతిష్కుడు ఆమెను ఊరడించాడు. భర్త కోసం ఎదురు చూడడం మంచిదని, ఇంకా ప్రశ్నలు వేయటం వ్యర్థమని అన్నపూర్ణ భావించింది.

"నమస్కారమండీ! శలవు తీసుకుంటాను."అంటూ పందరూపాయలనోటు ఆయన ఎదురుగా వుంచి అక్కడినుండి గుడిలోనికి వచ్చింది. దేవాలయం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ పూర్తిచేసి భగవంతునికి సాష్టాంగపడి లేచింది. ఆమె మనస్సు తేలికగా, ప్రశాంతంగా వుంది. ఆమె బస్సుస్టాండుకు బయలుదేరింది.

'గణేష్‌కు నా జీవితంలో ఇంత ప్రాముఖ్యం వున్నదా? కనీసం ఇంటి పోషణకూడా పట్టించుకోడు కదా! నా సంగతి అసలే చూడడు. కనీసం మర్యాదకైనా మాట్లాడడు. ఇది ఒక విచిత్ర సంబంధం. ఇది ఎంత పవిత్రమైనది? ఆయన చెప్పకుండా ఇల్లు వదిలి వెళ్ళినతర్వాత దాని విలువ తెలుస్తున్నది.' ఆమె ఆలోచించసాగింది.

సంప్రదాయం, ఆచార వ్యవహారాలు, చుట్టూ వున్న వాతావరణం, సమాజం ఇవన్నీ ఆమెకు భారంగా తోచసాగాయి. ఆమె మనస్సులో ఏ మూలో వివాహ బంధపు పవిత్ర విలువలు మిగిలివున్నాయి.

ఈ విధమైన రకరకాల ఆలోచనలతో అన్నపూర్ణ బస్సుస్టాండుకు చేరుకుని గ్రామం వెళ్ళే బస్సులో కూర్చున్నది. ఆమెకు నాలుగువైపులా చూడటం ఇష్టం లేదు. కళ్లు మూసుకుని వెనుకకు వాలింది. మూసిన కళ్ళవెనుక రకరకాల

దృశ్యాలు తిరగసాగాయి గుడిలో దేవుని ప్రతిమ. ఆ వెనుక గణేష్‌చుట్టూ అనేక మంది స్త్రీలు. కృష్ణునిచుట్టూ గోపికల్లా అతనిచుట్టూ స్త్రీలు స్థంభం చాటునుంచి తాను అతనికోసం ఎదురు చూస్తున్నది. అతను వాళ్ళను వదిలి తప్పక వస్తాడని, తనను అతని బాహువులలోకి తీసుకుంటాడని ఆమె కలగనసాగింది. ఇంతలో జమీందారు ప్రత్యక్షం ... ఆమె మనస్సులో తెలియని వికారం, ఏదో చెప్పలేని తీయని బాధ.... ఆమెకు ఈ చిత్రాలు కొంత ఇష్టంగా, కొంత అయిష్టంగా కనిపించ సాగాయి. ఒక్క క్షణం కళ్లు తెరిచి మరల నిద్రపోవటానికి కళ్లు మూసింది.

బస్సు దిగి నిద్రలో నడుస్తున్నదానిలా రాజగోపాలరావు ఇంటికి నడిచింది. రాజగోపాలరావు యింటి ప్రహరీగోడ పట్టుకొని నడక అభ్యాసం చేస్తున్నట్లున్నాడు.

రాజగోపాలరావు ఆమెను చూసి చిరునవ్వునవ్వాడు. ఆ చిరునవ్వులో సహృదయత, సానుభూతి, స్నేహం కలగలసి వున్నాయి.

"ఎప్పుడో వచ్చావు కదా! ఇక్కడకు రావటానికి అంత ఆలస్యం చేసావే? ఎక్కడకు వెళ్ళావ్? నిన్ను గురించే నాకు బాధగా వుంది!" రాజగోపాలరావు మాటలలో ఆర్తి వున్నది అన్నపూర్ణ కూడా అతని మాటలలోని నిజాయితీకి కరిగిపోసాగింది.

"నువ్వు లేచి తిరుగకలుగుతున్నావు. నాకు చాలా సంతోషంగా వుంది." అన్నపూర్ణ గొంతులో ప్రేమ తొంగిచూసింది.

"వాళ్ళ కోరిక తీరలేదు. వాళ్ళు నన్ను జీవితం అంతా కుంటివాణ్ణి చేద్దామనుకున్నారు. ఇప్పటిదాకా నువ్వెక్కడకు వెళ్లావు?"

"నేను.... నేను-" అన్నపూర్ణ చెప్పటానికి సంకోచించింది. రాజగోపాలరావు భార్య ఎదురుగా ఆమె నిజాన్ని చెప్పలేదు.

"నువ్వు బాగున్నావా? ఈయన మామూలుగానే వున్నాడా? భోజనం చెయ్యకలుగుతున్నాడా?'' అన్నపూర్ణ రాజగోపాలరావు భార్యతో అన్నది.

"భగవంతుడి దయవల్ల అంతా మామూలుగానే వున్నది." అన్నపూర్ణ మాట మారుస్తున్నదని ఆమె అర్థం చేసుకున్నది.

"సరిసరి! ఈమెకేమన్నా కాఫీ యిస్తావా? లేకపోతే భోజనం ఏర్పాటు చెయ్యి, చాలా ఆకలిగా వున్నట్లుంది." రాజగోపాలరావు తన భార్యతో అన్నాడు.

అన్నపూర్ణ అవునని కాదని అనలేదు. ఆకలి ఆమె మొహంలో తాండ
విస్తున్నది.

"లోపలకు వస్తావా?" రాజగోపాలరావు అన్నపూర్ణను ప్రశ్నించాడు.

"నువ్వు డాక్టరు సలహా మీద నడుస్తున్నావు కదా! నెమ్మదిగా నడువు" రాజగోపాలరావు భార్య లోపలకు వెళ్లటం చూసి అన్నపూర్ణ అన్నది.

"ఎక్కడకు వెళ్ళావు? నీ బాధేమిటో నాకు తెలుసు. ఇదేమి కొత్తవిషయం కాదుకదా! నీకు జీవితమంతా ఈ సమస్య తప్పదు. ఏమిటో, ఒక్కసారిగా ఇంత భక్తురాలివై పోయావు! పాపిట సింధూరం, నుదుట తిలకం- ఇవన్నీ ఏమిటి? ప్రసాదం కూడా తీసుకువచ్చావా?" రాజగోపాలరావు నవ్వుతూ అన్నాడు. అయితే అన్నపూర్ణ దుఃఖాన్ని బలవంతంగా ఆపుకోసాగింది

"గణేష్ శుభ్రంగా, క్షేమంగా వున్నాడు. నాకు తెలుసు. అతనెక్కడికి వెళ్ళలేదు. అసలెక్కడకు వెళతాడు? అతనిని గురించి నువ్వేమీ బెంగ పడవలసిన పనిలేదు. ఈ విషయం తెలుసుకోవటానికి ఏ జ్యోతిష్కుని దగ్గరకూ వెళ్ళనవసరం లేదు."

"నీకెలా తెలుసు, నేను జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళానని?!"

"ఇది చాలా చిన్న విషయం. ఇది తెలుసుకోవటానికి నేనేమీ జ్యోతిష్య శాస్త్రం నేర్చుకోవలసిన పనిలేదు. నీ సంగతి నాకు తెలుసు కదా! నీ మనస్సు బాగుగా లేనప్పుడల్లా ఆ జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళటం, నీకు ప్రశాంతత కలగటం అన్నీ మామూలే కదా? నువ్వు పుట్టి పెరిగిన వాతావరణంలో నువ్వు ఇమడలేకపోతున్నావన్న సంగతి కూడా నాకు తెలుసు."

"నీకేనా, ఇతరులకు కూడా తెలుసా?"

"బహుశా తెలుసనుకుంటాను. మన గ్రామమంటే చిన్న ప్రపంచంలాంటిది. ఇటువంటి విషయాలు ఇక్కడ త్వరగా వ్యాపించుతాయి. ఎవరైనా పడిపోతే వారిని తొక్కుకుంటూ వెళదామనే ఆలోచన చేసేవారిక్కడ ఎక్కువగా ఉంటారు. పైకి ఎగురుతూ ఎవరైనా జారి పడితే ఇక్కడివారు సంతోషిస్తారు. నువ్వు అధి కారంలో వుంటే కాళ్ళు పట్టుకుంటారు. నీ అధికారం పోతే నిన్ను జుట్టు పట్టుకు ఈడ్చడానికికూడా వీళ్ళు వెనుకాడరు. నీ భర్త సంగతి వీళ్ళందరికీ నీకంటె బాగా

తెలుసు." అన్నపూర్ణను ఓదార్చుతూ, తన మనస్సులోని కోపంకూడా కొద్దిగా వదిలించుకుంటూ నెమ్మదిగా అన్నాడు రాజగోపాలరావు.

"అయితే అందరికీ తెలిసిపోయిందంటావా?" అన్నపూర్ణ తిరిగి ప్రశ్నించింది

"కష్టాల్ని భరించవచ్చు, నిందలను భరించటం కష్టం." తనలో తాను గొణుక్కుంటున్నట్లు అన్నది.

"అయితే ఏమయ్యింది? నువ్వు బాధపడవలసినంత నష్టమేమీ జరగలేదు. ముఖ్యమంత్రిగారు ఈ ఉదయం ఇక్కడ వున్నారన్న సంగతి నీకు తెలియదనుకుంటాను."

"ఇక్కడకు వచ్చారా?"

"అవును. నువ్వు ఇటు వస్తున్నప్పుడే ఆయన అటు వెళ్ళారు."

"నేను బస్సులో నిదురపోయాను. అందుకే ఆయన వాహనం చూడలేకపోయాను. ఆయన ఎందుకోసం వచ్చారో? నేను ఇక్కడవుండివుంటే బాగుండేది."

"ఆయన ముందు కార్యక్రమం లేనివిధంగా వచ్చారు. ఆయన ఈ విధంగా తరచువస్తే బాగుంటుంది. ఆయన ఒంటరిగా, ఆఫీసర్ల గుంపు వెంట లేకుండా, ఆనకట్ట వద్దకు వెళ్ళి దానిని పరిశీలించారు. రిజర్వు పోలీసులు మాత్రం అక్కడ వున్నారు."

"ఈ విషయం నీకెట్లా తెలిసింది?" అన్నపూర్ణ అడిగింది.

"నా మిత్రుడు కోటేశ్వరరావు ఆయన వెంట వచ్చాడు. అతను ముఖ్యమంత్రికేదో సమాచారం ఇచ్చాడు. ఇది ఆఫీసర్లకు తెలియకుండా విచారణ జరపాలని ముఖ్యమంత్రిగారు అనుకున్నట్లున్నారు."

"మంచిపనే జరిగిందికదా!"

"నువ్వూ నేనూ చేయవలసినపనే ఆయన స్వయంగా చేసారు. ఆనకట్ట వద్ద పనిచేసిన కూలీల సాక్ష్యం సేకరింపవలసిన సమయంలో మనం కాలుమీద కాలు వేసుకుని మెదలకుండా కూర్చున్నాం. చాలా చిన్న విషయం మనం చెయ్యలేకపోయాం. మర్చిపోయాను, ఆయన మీ యింటికి వెళ్లారు. నువ్వు లేవు!"

"నిజంగా?"

"ఈ పరిస్థితులలో నువ్వేవిషయం మీదా మనసు నిలుపలేవు. నేనిప్పుడు కొంచెం నడవగలుగుతున్నాను. ఆనకట్టవద్ద పనిచేసిన వివిధ గ్రామాలవారిని పోగు చేసి నేనొక సభ ఏర్పాటు చేస్తున్నాను. పొరుగు గ్రామాలలో ఈ విషయం తెలియ చేయవలసిందిగా మిత్రులను కొందరిని పంపాను."

"నువ్వు సభ ఏర్పాటు చేస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది." ఈ మాటలు అంటున్నప్పుడు ఆమె మనసెక్కడో వుంది. ఈలోగా రాజగోపాల రావు భార్య ఆమెకు వేడి కాఫీ తెచ్చి యిచ్చి, లోపలకు వెళ్ళిపోయింది.

"ఆనకట్ట సంగతి చాలా రోజులుగా నలుగుతున్నదే కదా! ఇంకా కొంచెం ఆలస్యం అయినా పోయిందేమీ లేదు. కాస్త ఇంక నా సంగతి ఆలోచించు. ఆయన ఎట్లా వెళ్ళిపోయారు?"

"గణేష్‌ను గురించా?"

"అవును."

"దేవాలయంలోనికి వస్తున్న ఆ హరిజనులు ఇప్పుడు తాము ఎవరికీ తక్కువ కాదన్నట్లు వ్యవహరిస్తున్నారు!"

"అంతేకాదులే. నీ ఉపన్యాసాలు వాళ్ళకు ఇప్పుడు అర్థం అయినట్లున్నాయి. ఏ కులం వారైనా అందరూ ఒక్కటేనని నువ్వు బోధిస్తూ వుండేవాడివి కదా?"

"కనీసం ఈ విషయంలోనైనా నన్ను గుర్తించావు. చాలా సంతోషం."

"ఆయితే ఏమయ్యింది?"

"ఏ మతం వారైనా, కులం వారైనా పెళ్ళికి ముందే ఆడపిల్ల చెడిపోవటం ఇష్టపడరు కదా! పైగా పెళ్ళి లేకుండా ఆడపిల్లను ఎంత కాలం ఇంటిలో పెట్టు కుంటారు అని ఆ పిల్లతండ్రి అల్లరి చేస్తున్నట్లున్నాడు."

"అలాగా!"

"నువ్వు గణేష్‌ను మెచ్చుకోవాలి. ఇంకా ఎవరైనా అయితే అంత మోజు వున్న పిల్లను చేసుకోవటానికి భార్యను తప్పనిసరిగా విడిచిపెట్టేసేవారు."

అన్నపూర్ణ నెమ్మదిగా రోదించసాగింది.

"అతనిక్కడే వుండి వుంటే ఆ పిల్ల తండ్రి వాళ్ళిద్దరినీ గుళ్ళోకి తీసుకు వెళ్ళి బలవంతాన విధి ప్రకారం పెళ్ళి జరిపించి వుండేవాడు.

"గణేష్ పారిపోయాడు. కాబట్టి నీ భర్తగా మిగిలిపోయాడు.

"ఆ పిల్ల బంధువులు గణేష్‌ను కొట్టకుండా వుండి వుంటే ఏం జరిగేదో!"

"ఆయనను కొట్టారా?"

"పెద్దగా లేదు. అయినా మీ హిందువులు హరిజనులు ముట్టుకుంటేనే సహించలేరు కదా! అందులో మీపై చేయి చేసుకుంటే మీకెంత అవమానం!"

"అవును."

"వాళ్ళు అతనిని కొట్టగానే ఆ పిల్ల మనస్సు మారిపోయినట్లుంది. గణేష్ తనవెంట రమ్మని అడగగానే వెంటబడి వెళ్ళిపోయింది."

"ఇక్కడకు వస్తే ఎటువంటి పరిస్థితులు ఎదుర్కోవాలో వాళ్ళకు తెలుసు అందుచేత బహుశా వాళ్ళిక్కడకు తిరిగి రారనుకుంటాను."

"అతను కష్టాలలో వున్నాడు. ఇక్కడ తననెవరూ ఏమీ చెయ్యరని, పూర్వంలాగానే వుండవచ్చునని, ఎవరైనా ధైర్యం చెపితే బహుశా తిరిగి రావచ్చు."

"ఇంత అయిన తర్వాత వీళ్ళు వారిని పూర్వం లాగా ఎలా వుండనిస్తారు?"

"మనం ఒప్పించడానికి ప్రయత్నించాలి."

"నువ్వు నాకు చాలాసార్లు సహాయం చేసావు. ఈ ఒక్కసారి సహాయం చేసి పుణ్యం కట్టుకో. ఇంత అల్లరి జరిగిన తరువాత నేను రాజకీయాలలో ఏ విధంగా వుండగలుగుతాను? నా కుటుంబము పట్ల నా కర్తవ్యం నిర్వహించాలి. నేను హిందూ స్త్రీలాగా వ్యవహరించితే ఆయనను తిరిగి తెచ్చుకోగలుగుతాను. ఆయన లేకుండా నేను జీవించే ఈ జీవితానికి అర్థం లేదు. ఆయన తప్పక తిరిగి రావాలి. నువ్వు ఆ హరిజనులకు సర్దిచెప్పు. నేను ఆ అమ్మాయిని వేరే ఎవరికైనా ఇచ్చి వివాహం జరిపించుతాను."

"చాలా పెద్ద పని పెట్టావే!"

"నేను నా గూట్లోనే వుంటాను. ఎంతకాలం ఎగురగలుగుతాను?" అన్న పూర్ణ దుఃఖం ఆపుకోలేకపోయింది.

"మరి ఈ విచారణ ఏమౌతుంది?"

"ఆ విచారణలతో, ఆ రాజకీయాలతో నాకిక సంబంధం లేదు."

"సర్లే, ఆ విషయం తరువాత ఆలోచిద్దాం."

"నాకు శిక్ష పడాలి. నాకు తెలిసిన సాక్ష్యాన్ని నమ్మక నేను దాచి వుంచాను. అందుకే భగవంతుడు నాకీ శిక్ష విధించాడేమో!"

"ఊహు."

"నా కింత ఉపకారం చేసిన జమిందారుకు వ్యతిరేకంగా ఎట్లా వ్యవహరించాలా అని ఆలోచించాను. ఇక్కడ ఆనకట్టను గురించి నాకు తెలిసిన విషయాలు దాచటం నేరం అవుతుంది. నా జీవితమంతా నన్ను రాజకీయాలనుండి బయటకు నెట్టివేస్తున్నది."

"నీకు తెలుసా?"

"నేను ఊహించగలను. నేను కొంచెం భావుకురాలను. అది నా స్వభావం. నువ్వు దీనిని నా బలహీనత అనవచ్చు. నేను అయోగ్యురాలను, అసమర్థురాలను. ఇంటికీ, బయటకి రెంటికి పనికిరాకుండా పోయాను. కనీసం సమాజం పట్ల నా విధిని నిర్వహించలేకపోయాను. నన్ను వదిలివెయ్యి. నాకు నీ దేశభక్తి వద్దు, నీ రాజకీయాలు వద్దు, ఈ ప్రజాసేవా వద్దు. నాకు నా భర్త కావాలి. తెచ్చియివ్వు." అన్నపూర్ణ దుఃఖంతో కూడిన ఆవేశంతో అంది.

"ఇదే నీ అంతిమ నిర్ణయమా?"

"గణేష్ తిరిగి రాకుంటే అంతే!"

"నీకు కష్టం వచ్చింది. నీకు మేమందరం సహాయం చెయ్యక తప్పదు." రాజగోపాలరావు అంతకంటే మాట్లాడలేకపోయాడు. అన్నపూర్ణ పరిస్థితి రాజగోపాలరావును కూడా కదిలించివేసింది. అతని కంఠంకూడా రుద్ధమయ్యింది. "మాకు రెండుమూడు రోజులు టైమివ్వు,అతనిని వెదుకుదాం.హైదరాబాద్ వెళదాం. అతనిని గురించి ఏమి భయపడవద్దు." అతనామెకు ధైర్యం చెప్పాడు.

"కాని...."

"అతను లేకుండా ఆ యింటిలో వుండలేకపోతే మా యింటికి వచ్చివుండు."

"లేదు. నేనివూరిలోనే వుండలేను. నేను హైదరాబాదు వెళ్ళిపోతాను.అక్కడే నీకోసం ఎదురు చూస్తుంటాను."అన్నపూర్ణకు రాజగోపాలరావు అండ గొప్ప విశ్వాసాన్ని కలిగించింది.

ఆమె బస్సుస్టాండుకు వెళ్ళింది. అక్కడినుండి హైదరాబాద్ వెళ్లడానికి రైల్వేస్టేషనుకు వెళ్ళింది.

# 35

మధ్యాహ్నం అయ్యేసరికి చెరువు గట్టువద్దకు ప్రజలు పెద్ద సంఖ్యలో గుమి గూడారు. వారిలో ఆ గ్రామంవారేకాక చుట్టుప్రక్కల గ్రామాలవారు కూడా వున్నారు. కొందరు బస్సులటాపులపైన, కొందరు ఎడ్లబండ్లపైన, కొందరు సైకిళ్ల పైన, మరికొందరు కాలినడకన అక్కడికి చేరుకున్నారు. ఆ గ్రామానికి ఇంతకు ముందు ఎప్పుడూ అంతమంది జనం రాలేదు కోటేశ్వరరావు అక్కడవుండి, ఆ జనాన్ని అదుపు చేయకపోతే వారిని నిశ్శబ్దంగా వుంచటం చాలా కష్టమై వుండేది. ఆయన తన నియోజక వర్గంనుండి వందలమంది పార్టీ కార్యకర్తలతో అక్కడకు వచ్చాడు.

చుట్టుప్రక్కల గ్రామాలనుండి హరిజనులు కూడా అక్కడకు వచ్చారు. వారు సవర్ణులతో కలసిమెలసి తిరగసాగారు. రాత్రికి రాత్రే అస్పృశ్యత ఎగిరి పోయిందా అన్నట్లు అక్కడ వారిసంఖ్య పెరిగిపోయింది. హరిజనస్త్రీలు కూడా అక్కడకు తగు సంఖ్యలో వచ్చారు.

జమిందారు కుటుంబీకులు మాత్రం అక్కడ ఎవ్వరూ లేరు. వాళ్లంతా తమ తమ ఇండ్లలో తలుపులు వేసుకు కూర్చున్నారు. ఏమూల నుండి చెప్పుల, రాళ్ల వర్షం పడుతుందో అని వాళ్లు భయపడసాగారు. ఇంత పెద్ద జన సమూహం వున్న ప్పుడు ఏదైనా జరగవచ్చు.

ఆ గ్రామంలోని బ్రాహ్మణులకు ఈ విధంగా వాళ్ళు అక్కడ సమావేశం కావటం ఇష్టంలేదు. వాళ్లు తమ ఇండ్ల కిటికీలనుండి వీధుల్లో తిరుగుతున్న జనసమూ హాన్ని చూడసాగారు. ఇటువంటి సమయాలలో వీధులలోనికి వచ్చి సమాచారం సేకరించే సోమయాజులు కూడా కోటలో దూరాడు హరిజనులు గ్రామమంతా తిరిగి గ్రామాన్ని అపవిత్రం చేస్తున్నారని వారిలో చాలామంది ఉద్దేశ్యం.

పరిస్థితి చాలా తీవ్రంగా తయారయ్యింది. ఎక్కడెక్కడివాళ్ళు కబురందు కుని గ్రామానికి వచ్చారు. రామాపురం గ్రామమంతా అక్కడే వున్నట్లుంది. వారి వెంట దారిలోని అనేక గ్రామాల ప్రజలు కలిసి పెద్ద ఊరేగింపుగా అక్కడకు వచ్చారు.

చాలామంది చేతుల్లో గొడ్డళ్ళు, కొడవళ్ళు, దాదాపు అందరిచేతుల్లో కర్రలు వున్నాయి. కొందరు ఏమీ లేకుండా వచ్చారు. వాళ్ళంతా చాలా ఉద్రేకంగా వున్నారు వాళ్ళ నాయకులు వారిని శాంతంగా వుంచారు.

హరిజన వాడనుండి వచ్చే ఊరేగింపు కోసం వారంతా ఎదురుచూస్తున్నారు. వారిలో కొందరు ఈలోగా పాటలు పాడుతున్నారు. కొందరు అక్కడే పొయ్యిలు రాజేసి వంట ఏర్పాట్లు చేసుకుంటున్నారు. సాయంత్రం వరకూ అక్కడే వుండాలన్న ఉద్దేశ్యంతో ఆకలికి మాడగూడదని వాళ్ళు వంట చేసుకుంటున్నారు.

రాజగోపాలరావు, సోదరుడు వేణుగోపాలరావు సహాయంతో కుంటుకుంటూ అక్కడకు వచ్చేసరికి జనం అతనిచుట్టూ మూగసాగారు. కొందరు అతనిని తమ భుజాలపై ఎక్కించుకుందామనుకున్నారు. కాని రాజగోపాలరావు వారిని వారించారు.

"నేను మీలో ఒకణ్ణి. నన్నిలాగే వుంచండి. పైకి ఎత్తవద్దు."

కోటేశ్వరరావు అతనిని చెట్టునీడకు తీసుకువెళ్ళి చెవిలో ఏదో చెప్పాడు. జనమంతా కోటేశ్వరరావు చేసిన ఏర్పాట్ల వల్లే వచ్చారని రాజగోపాలరావుకు తెలుసు.

రాజగోపాలరావుకు పరిస్థితి బాగుంటే అతను ఇంకా పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేసి వుండేవాడు అయినా తన సహచరులను అటూ యిటూ పరుగెత్తించి కోటేశ్వరరావుకు సహాయం చేయమన్నాడు పైగా ఇది అందరికీ సంబంధించిన సమస్య. తాలూకాలోని ప్రజలందరకూ కొద్దో, గొప్పో లాభం జరిగే విషయమిది.

రాజగోపాలరావుకు ఈ ప్రజా సమూహాన్ని చూచి అమితానందం కలిగింది. కళ్ళవెంబడి ఆనందబాష్పాలు వచ్చాయి. ప్రజలలో ఇంతకుముందు ఈ ఐక్యతలో నాలుగోవంతు వుంటే, జమిందారు ఇంత శక్తివంతుడై వుండేవాడు కాదు. ఇన్ని దురాగతాలు చేసివుండేవాడు కాదు. మనిషి తనంతట తాను లోపల కుళ్ళిపోకపోతే బయటనుండి ఎంత పెద్ద శక్తి అయినా అతనిని పడగొట్టటం అంత తేలికకాదు. తమ ప్రతిష్టకోసం ఏం చెయ్యడానికైనా వెనుకాడని సమాజపు ప్రతినిధి జమిందారు. ఆ సమాజం పోవాలి. ఒక కొత్త సమాజం రావాలి. అవే రాజగోపాలరావు ఆలోచనలు.

దేవాలయం వైపు నుండి ఊరేగింపు వస్తున్నట్లుగా దుమ్ము లేస్తున్నది. ప్రజలు డప్పులతో, రకరకాల వాయిద్యాలతో ఉత్సవం లాగా వస్తున్నారు. ఆ గ్రామపు హరిజనులు తమ ప్రత్యేక బ్యాండు వాయిద్యంతో ఊరేగింపుకు ముందు నడుస్తున్నారు. ఊరేగింపు మెల్లమెల్లగా చెరువు గట్టుకు చేరుకుంది.

ఊరేగింపును చూడగానే అప్పటి వరకు అక్కడ వున్న ప్రజలలో ఉత్సాహం వురకలు వేసింది. వాళ్ల నినాదాలతో ఆకాశం ప్రతిధ్వనించింది.

రాజగోపాలరావు, కోటేశ్వరరావు చెట్టు క్రిందే ఉండిపోయారు. వాళ్ల మొహాలలో ఒక విచిత్రమైన సంతోషం తొంగి చూస్తున్నది.

ఊరేగింపుకు ముందు భాగంలో హరిజన నాయకుడు ఏసుదాసు గుర్రంపై స్వారీ చేస్తూ వస్తున్నాడు. అతను తలకు పాగా, జమిందారు ధరించే దుస్తులు ధరించాడు. ఆ గుర్రంపై అతను రాజకుమారుడిలాగా వెలిగిపోతున్నాడు. కోటేశ్వరరావు, రాజగోపాలరావు ఆ దృశ్యం చూసి బలవంతాన నవ్వు ఆపుకున్నారు. జమిందారు ధరించే దుస్తులు వీళ్ళెక్కడినుండి తెచ్చారో వారికర్థం కాలేదు.

ఏసుదాసు పక్కనే రామయ్య రెండవ గుర్రంపై ఎక్కి పాశ్చాత్య దుస్తులు ధరించి వచ్చాడు. వాళ్లిద్దరూ సాయంత్రం అక్కడే వేయబోయే నాటకంలో పాత్ర ధారులు. వాళ్ళు ఆ వేషాలతోనే ఇక్కడికి వచ్చి, ఉద్రిక్తపూరితమైన వాతా వరణంలో హాస్యాన్ని నింపారు. ఊరేగింపుతోపాటు నడవ సాగారు, ఊరేగింపు కోట వైపు సాగుతున్నది. స్త్రీలుకూడా ఇళ్లలోనుండి బయటకు వచ్చి ఊరేగింపుతో పాటు నడవసాగారు. ఆ గ్రామ చరిత్రలో ఇటువంటి దృశ్యం ఇదే ప్రథమం.

ఈలోగా కోట ఆవరణలో స్కూలు నుండి తీసుకు వచ్చిన బల్లలతో వేదిక నిర్మించారు. జమిందారు భవనంలోనుండి కుర్చీలు తెచ్చి వేదికపై వేసారు. సభకు ఏర్పాట్లు పూర్తయ్యాయి. కోట లోపల ప్రజలు బహిరంగ సభ ఏర్పాటు చేసుకోవటం ఇదే ప్రథమం. ఆ దృశ్యం చాలా ఎలుకలు కలసి పిల్లి మెడలో గంటలు కడుతున్నట్లున్నది.

కోటలోని నౌకర్లు ఊరేగింపును అడ్డుకుంటారేమో అనే అనుమానం మొదట కలిగింది. అయితే వాళ్ళెవ్వరూ ఆ చుట్టుప్రక్కల లేకుండా వెళ్ళిపోయారు. కుక్కలాగా ఇరవై నాలుగు గంటలు కోటలో పడివుండే వీరాస్వామి జైలులో విశ్రాంతి తీసుకుంటున్నాడు.

కోపంలోవున్న ప్రజానీకం భవనంలోనికివెళ్ళి, అక్కడి సామగ్రికి నష్టం చేస్తారేమోనన్న అనుమానంతో అవసరమైతే వారిని వారించటానికి రాజగోపాల రావు భవనపు ద్వారంవద్ద నుంచున్నాడు.

ఊరేగింపు పూర్తిగా కోట ఆవరణలోనికి చేరుకున్నది. అందరూ విశాల మైన ఆ ఆవరణలో ఏర్పాటు చేయబడిన సభాప్రాంగణంలో క్రింద కూర్చున్నారు. ప్రజలు జమిందారును తిడుతూ, ఎగతాళి చేస్తూ రకరకాలుగా నినాదాలు చెయ్య సాగారు. రాజగోపాలరావు, కోటేశ్వరరావు వేదిక పైకివెళ్ళి వారిని నిశ్శబ్దంగా వుండ మని కోరకపోతే తప్పనిసరిగా వాళ్ళు ఏదో ఒక అల్లరి చేసివుండేవారే.

రాజగోపాలరావు ప్రసంగించసాగాడు-

"మనం కొన్ని నెలల క్రితం వరదనుండి తప్పించుకోవటానికి అర్ధరాత్రి ఈ కోటలోనికి వచ్చాం. అప్పుడు వరదనీరు కోటగోడలను ఒరుసుకుంటూ లోప లకు రాలేక వెళ్ళిపోయింది కాని ఈరోజు జనప్రవాహాన్ని ఈ కోట గోడలు అడ్డుకో లేకపోయాయి. అయితే వరద నీరు మన పొలాలను పాడుచేసి వెళ్ళినట్లు మనం ఈ కోటను పాడు చేయగూడదు. పాతబడి, కూలిపోవటానికి సిద్ధంగా వున్న ఈ కోటను మనం ప్రత్యేకంగా, అనవసరపు శ్రమకోర్చి కూల్చనవసరంలేదు."

శ్రోతలు చప్పట్లు కొట్టారు. అతని మాటలకో, అతనక్కడనుంచున్నందుకో వాళ్ళు ఉప్పొంగి పోవటంలేదు. అతను వీరయోధుడులా వాళ్ళకు దర్శనమిచ్చాడు. తమ గ్రామంలో, తమమధ్య, తమవంటి కుటుంబంలో పుట్టినవ్యక్తి ఒక్కసారిగా ఇంత గౌరవనీయుడవ్వటం వారికి ఆనందం కలిగిస్తున్నది. తరతరాల సామంతీయ వ్యవస్థలో వారికిది ఒక అభూతపూర్వ సంఘటనగా కనిపించసాగింది.

రాజగోపాలరావు తన ప్రసంగం కొనసాగిస్తున్నాడు- "వరద ఎందుకు వచ్చింది? నీటికోసం ఎదురు తెన్నులుచూస్తున్న మన పొలాలను వరద నీరు ఎందుకు ముంచివేసింది? ఆనకట్టను గురించి అద్భుతమైన కలలు కంటున్న మనకు ఎందుకీ వినాశనం దాపురించింది? మనశ్రేయస్సుకోసం నిర్మించబడిన ఆనకట్ట మన సౌభాగ్యాన్ని ఎందుకు పొట్టన పెట్టుకున్నది?

"సత్యమేవ జయతే" అన్నది మన ఆదర్శం. సత్యమే జయిస్తుంది. అయితే అప్పుడప్పుడు ఆ సత్యం ఏ విధంగా కప్పివేయబడుతుందో మీరు తెలుసు కుంటారు. ధనవంతులు కావాలనుకునేవారు, తమ సామంతీయ వైభవంతో వెలిగి

పోతున్నవారు, ప్రస్తుత సమ సమాజంలో ఇమడలేకపోతున్నవారు సత్యాన్ని ఏ విధంగా మరుగు పరుస్తున్నారో మీకు ఇప్పుడే తెలియచేస్తాను. వాళ్ళకు దేశం కంటే వాళ్ల స్వార్థమే, స్వప్రయోజనాలే ముఖ్యం.

వరదలొస్తే వారికేమి పట్టదు. వరదనీరు వాళ్ళ ఎత్తైన భవంతులలోనికి, కోటలలోనికి రాలేదు. వాళ్ళే అప్పుడప్పుడు దుర్మార్గపు వరదలు సృష్టిస్తూవుంటారు. ఆ వరదలలో మనం నాశనమైపోతే, వాళ్ళు సుస్థిరంగా వుండవచ్చునని వారి ఉద్దేశ్యం. ప్రజాస్వామ్యంలోని సామాన్య ప్రజలను వారు పీడకలగా భావిస్తుంటారు. అటువంటి ఒక వ్యక్తి కారణంగానే ఆ రోజు వరదవచ్చి మనలను ముంచివేసింది. ప్రభుత్వానికి ఈ విషయం తెలియకుండా ఎందుకు దాచబడింది? దోషులను రక్షించే ప్రయత్నం జరుగుతున్నదా? మనకి సత్యం తెలిసిపోతుంది. చివరకు సత్యమే జయిస్తుంది.

నే నిదంతా ఉపోద్ఘాతంగా మాత్రమే చెబుతున్నాను. ఈ ఆనకట్ట ఎందుకు కూల్చివేయబడిందో, ఎలా కూల్చివేయబడిందో, ఎవరి ప్రోద్బలంతో కూల్చివేయబడిందో మీ మధ్యలోనే వున్న మిత్రులతో చెప్పిస్తాను. ఇది ప్రజా కోర్టు అని ఎవరైనా అంటే నా కభ్యంతరం లేదు. ఇది నిజంగా ప్రజా న్యాయస్థానమే. ప్రజలకు సంబంధించిన విషయాన్ని ప్రజల మధ్య ప్రజలే విచారణ జరపాలి ఇది మన స్వంత వ్యవహారం కాదు. ఒక అపరాధిపై నేరారోపణ జరుగుతున్నది. మనకి అధికారం ఉన్నది. కోర్టులలో సాక్ష్యం చెప్పే అధికారం ఉన్నప్పుడు అదే విషయాన్ని కోర్టుల బయట కూడా చెప్పే అధికారం మనకున్నది. అపరాధులు నివసించే ఈ కోటలోనే, వారిని గురించి చెప్పే అధికారం మనకున్నది. కోర్టులలో వలే మనం వారికి శిక్ష విధించలేకపోవచ్చు, కాని వారిని తప్పకుండా నిందించగలం.

నాకు తెలుసు, మనకు సంబంధించిన వార్తలు పత్రికలు ప్రకటించవు. మన సభల సమాచారం ఆ పత్రికలు ప్రజలకు తెలియచెయ్యవు ఈ సభను గురించి ఏ పత్రికా ఒక పంక్తి రాయకపోవచ్చు. కాని మనం ఈ సమాచారాన్ని చిన్నలకు, పెద్దలకు, దేశభక్తులకు, దేశద్రోహులకు అందరకూ తెలియచెయ్యాలి. మనం ఒక వ్యక్తిని మాత్రమే నిందించటం లేదు. ఇటువంటి దుర్మార్గాలు చేసే ఆ వ్యక్తికి సంబంధించిన వర్గాన్నే నిందిస్తున్నాం. ఆ వర్గంలో వారే మరి కొందరు పూర్వం ఇటువంటి దుర్మార్గాలు చేసి వుండవచ్చు. వీరిలో వారే రాబోయే కాలంలో కూడా

దుర్మార్గాలు చేయవచ్చు. కాబట్టి ఈ వర్గపు దురాగతాన్ని బట్టబయలు చేయవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఇటువంటి వాళ్ళను గురించిన వార్తలు ప్రచురింప బడవు. ప్రచురింపబడకపోయినా మన ధర్మం మనం నెరవేరుద్దాం.

ఈ నా మిత్రులు ఐక్యమత్యంతో బలవంతమైన సర్పాన్ని చంపివేసిన చీమల కంటే పెద్దవాళ్ళు కాదు. వారికి మాట్లాడటం కూడా తెలియదు అయితే సత్యమే స్వయంగా గొంతు విప్పుతుంది. సత్యానికి మెరుగులు దిద్దవలసిన పనిలేదు. దర్యాప్తు సంఘానికి అధ్యక్షులుగా వున్న మన శాసన సభ్యురాలు ఇప్పుడు మన మధ్యవుంటే చాలా బావుండి వుండేది. పాపం, ఆమె ఇంతకంటే ఏమి ఆపదల్లో చిక్కుకున్నదో?"

రాజగోపాలరావు ఈ విధంగా అనగానే శ్రోతలు పెద్దపెట్టున ఎగతాళిగా నవ్వారు. అయితే రాజగోపాలరావు వెంటనే తన తప్పు తెలుసుకుని- "రామయ్య మాట్లాడతాడు" అని చెప్పి కూర్చున్నాడు.

రామయ్య చేతులు జోడించి నిలబడివున్నాడు. సన్నగా బలహీనంగావున్నా అతనికి గాభరా కారణంగా నోటివెంట మాటలు రావటం లేదు.

"సోదరులారా! నేనీ కళ్ళతోనే అంతా చూసాను. పాపిష్టివాణ్ణి. కళ్ళు అప్పుడే పోయివుంటే బాగుండేది."

రామయ్య ఈ విధంగా చెప్పగానే సభ యావత్తూ ఆశ, అనుమానపు చూపులతో నిశ్శబ్దమైపోయింది. రైట్ వేషంలో అతను విదూషకునిలా వున్నాడు.

"నాకు మాట్లాడటం తెలియదు. నా మాటలు తప్పుగా అర్థం చేసుకోవద్దు. అయినా చెప్పటానికి మాత్రం ఇంకా ఏమున్నది? ఆనకట్ట తయారై పోతున్నది. ఆరోజు జరుగవలసివున్నట్లే ప్రారంభోత్సవం ఇప్పుడు జరుగుతుంది." అతను ఏమి మాట్లాడాలో తెలియక చేతులు నలుపుకోసాగాడు.

"నువ్వు చూసిందంతా చెప్పు. అది చాలా అవసరం." రాజగోపాలరావు అతనిని ప్రోత్సహించాడు

"భగవంతుడే వారిని శిక్షిస్తాడు పాపం చేసినవారు భగవంతుని దృష్టినుండి తప్పించుకోలేరు." రామయ్య తన జీవితమంతా చెపుతూ వచ్చిన మాటలే గొణగ సాగాడు.

"భగవంతుడు ఏం చేస్తాడు? చూస్తే మాత్రం మనకెట్లా చెపుతాడు? నువ్వు చూసింది నువ్వు చెప్పు " కోటేశ్వరరావు నవ్వుతూ అన్నాడు. కోటేశ్వరరావు మాటలకు అందరూ నవ్వారు.

"అప్పటికి అర్ధరాత్రి అయ్యిందనుకుంటాను. నేను నా గుడిసెలో పడి మూలుగుతున్నాను. నాకు ఉబ్బసం వ్యాధి వున్నది నాలుగు వైపులా చీకటి ముసురుకున్నది. ఆనకట్ట పని పూర్తయిన సందర్భంగా పండగ చేసుకోవటానికి కూలీలనందరినీ రైట్ దొర కంపెనీ లారీలలో పట్టణానికి పంపివేసాడు. నాకు జబ్బు లేకుండావుంటే నేను కూడా వెళ్ళివుండేవాణ్ణి. వాళ్ళకు కరువుతీరా సారా తాగటానికి డబ్బులు యివ్వబడ్డాయి.

నేను కొండవాలులో వున్న నా గుడిసె బయటకు వచ్చాను. అక్కడ అంత వెలుగు లేదు. అయినా ఆనకట్ట ప్రాంతంలో అడుగడుగు నాకు తెలుసు. కళ్ళు మూసుకుని కూడా ఎక్కడ ఏముందో నేను చెప్పగలను. నేను చూస్తుండగానే ఆనకట్టదగ్గర జనరేటర్ ఆగిపోయింది అంతలో అక్కడకు రైట్ దొరగారు రావటం నేను చూసాను. ఆయన ఆ సాయంత్రం ఇంజనీర్లతో కలసి పట్టణానికి వెళ్ళాడు. ఆయన తిరిగి ఎప్పుడు వచ్చాడో నాకు తెలియదు. నేనాయనను ఎంత చీకటిలో వున్నా గుర్తుపట్టగలను. ఆయన నడక నాకు బాగా తెలుసు.

ఆయన ఆనకట్ట దగ్గరకు వెళ్ళాడు. అక్కడనుండి వచ్చి తన కారు తిప్పుకుని వెళ్ళిపోయాడు.

ఆయన కారు వెళ్ళగానే రైట్ దొర వెళ్ళివచ్చిన వైపే మరో వ్యక్తి వెళ్ళటం చూసాను. ఆ వ్యక్తి సోమయ్య. నేనక్కడకు వెళ్ళివుంటే బాగుండేదని ఇప్పుడనుకుంటున్నాను. కాని అతనక్కడకు ఏం చెయ్యటానికి వెళుతున్నాడో నేనప్పుడు ఊహించలేదు. అతను ఆనకట్ట క్రిందకు వెళ్ళి ఏదో వెలిగించాడు. కొంచెం సేపటి తర్వాత అక్కడ పెద్ద వెలుగు కనబడింది. తర్వాత మోత వినిపించింది. రాళ్ళ వర్షం కురిసినట్లయింది. ఒక రాయి నా భుజానికి తగిలింది. అదృష్టవశాత్తూ నేను బ్రతికిపోయాను."

"నీ భగవంతుడి పుణ్యమా అని, ఆ కథ వినిపించటానికి నువ్వు బ్రతికి బయటపడ్డావు!" కోటేశ్వరరావు గంభీరంగా అన్నాడు.

"ఆనకట్ట బ్రద్దలయ్యింది సోమయ్య శరీరం తునాతునకలయ్యింది. శరీరం చెల్లాచెదురయ్యి అటూ ఇటూ పడిపోయింది. నేను అతని చెయ్యి చూసాను. దాని మీద అతను తన పేరు పచ్చ పొడిపించుకున్నాడు తాను చేసిన ఘోర పాపానికి తెలియకుండా సోమయ్య బలైపోయాడు.

ఆనకట్ట దానంతట అది బ్రద్దలవ్వలేదు. కట్టడంలో లోపం వుండి అది బీటలు వారలేదు. అయితే వాళ్ళు ఎందుకు దానిని పడగొట్టించారో నాకు ఇప్పటి వరకు అర్థం కావటంలేదు." రామయ్య మాట్లాడటం ఆపి కూర్చుందామనుకున్నాడు. ఇంతలో కోటద్వారం వద్దకు లారీలో వచ్చిన పోలీసులు వేగంగా వేదిక వద్దకు రాసాగారు. ప్రజలు కూడా వారిని ఆశ్చర్యంగా చూడసాగారు.

"కూర్చోండి. మీరు కూర్చోండి. ఈ సభను ఎవ్వరూ ఆపలేరు. పోలీసులు సభ నేమి చేయలేరు. మనకు ఈ సభ జరుపుకోవటానికి ఎవరి అనుమతీ అవసరం లేదు రామయ్యా! ఏమి ఫర్వాలేదు. నువ్వు చూసిందంతా పూర్తిగా చెప్పు." రాజగోపాలరావు లేచి ప్రకటించాడు. ఆ మాటలు పోలీసులు కూడా విన్నారు.

రామయ్య కుర్చీ ప్రక్కన జారి పడ్డాడు. ఏసుదాసు కూడా భయంతో వణికిపోసాగాడు.

రాజగోపాలరావు ప్రకటన విన్న పోలీసులు ముందుకు రాకుండా ఆగిపొయ్యారు. అయితే వారు సభచుట్టూ వలయంగా నుంచున్నారు. ఇనస్పెక్టర్ తెలివిగలవాడు ఉద్రిక్తతలో వున్న గుంపును రెచ్చగొట్టటం మంచిది కాదని ఊరుకున్నట్లున్నాడు.

రాజగోపాలరావు రామయ్యను లేపి కుర్చీలో కూర్చుండబెట్టాడు.

"అయ్యా, నాది చాలా పెద్ద కుటుంబం. నన్ను జైలులో పెడితే మీరే నా కుటుంబం సంగతి చూడాలి." అతను రాజగోపాలరావు చెవులో అర్థిస్తూ చెప్పాడు.

"ఏమీ జరగదు. నువ్వేమీ భయపడకు. జమిందారు కుమారుడు ఇంతకు ముందువరకు కోటలోనే వున్నాడు. అతను పారిపోయి పోలీసులకు ఫిర్యాదు చేసి వుంటాడు. ఆ ఫిర్యాదు పైనే ఈ పోలీసులు వచ్చి వుంటారు." రాజగోపాలరావు అన్నాడు.

ప్రజలు చప్పట్లు కొడుతూ "జమిందార్ ముర్దాబాద్!" అంటూ నినాదాలు చెయ్యసాగారు.

"ఇది కోటలో భాగమే అయినా, ఇక్కడకు ఎవరి అనుమతి లేకుండా రావచ్చు. ఎదురుగా కూలిన గోడలు వున్న చోట పూర్వం జమిందారు ఆఫీసు వుండేది. అయితే ఇప్పుడు అదికూడా బహిరంగ ప్రదేశమే. దీని వెనుకవున్న భవంతి జమిందారు స్వంత ఆస్తి, దానితో మనకేమీ సంబంధంలేదు. మనం అక్కడ ఒక్క అడుగు కూడా వెయ్యలేదు కాబట్టి మనం ఎవరి ప్రాంగణం లోనూ అక్రమంగా అడుగు పెట్టలేదు. ఈ విషయం కష్టపడి ఇక్కడకు వచ్చిన పోలీసు మిత్రులకు చెపుతున్నాను."

తిరిగి ప్రజలు హర్షధ్వానాలు చేసాక, రాజగోపాలరావు ఎవరో తెలిసిన ఇనస్పెక్టర్ పోలీసులకు సైగ చేసి ఒక ప్రక్కకు వెళ్ళిపోయాడు. పోలీసులు నిశ్శబ్దంగా నిల్చుండిపోయారు.

"రామయ్య ఎవరికీ భయపడవలసిన పనిలేదని, తాను చూసిన విషయ మంతా పూర్తిగా చెప్పాలనీ కోరుతున్నాను. రామయ్యా! లేచి నిలబడి చెప్పు." రాజగోపాలరావు అన్నాడు.

రామయ్య సర్దుకుని తిరిగి చెప్పటం ప్రారంభించాడు-

"ఆనకట్ట కూల్చివేయబడిన సంగతి కళ్లారా చూసికూడా ఇప్పటివరకు చెప్పకపోవటం వలన నేను కూడా నేరం చేసినట్లే అవుతుంది

కాని, నేను ఈ విషయమంతా శాసన సభ్యురాలు శ్రీమతి అన్నపూర్ణకు చెపుదామంటే మొదట ఆమె వినిపించుకోలేదు విషయం విన్న తర్వాత 'నీకిది ఎలా తెలుసు?' అని అడిగారు నేను స్వయంగా చూసానని చెప్పాను. ఆమె నువ్వు కథలు అల్లుతున్నావని నాపై కోపగించుకున్నారు."

"మన యం యల్ ఏ ఎక్కడ?" చాలామంది ఒక్కసారిగా అరిచారు.

కోటేశ్వరరావు వారిని నిశ్శబ్దంగా వుండమని కోరాడు. సర్దటానికి ప్రయత్నం చేసాడు. అయినా కేకలు తగ్గలేదు.

"అన్నపూర్ణ గ్రామానికి తిరిగివచ్చిన తర్వాత, ఆమె మన ప్రశ్నలకు సమాధానమిస్తారు. మీరు అంతవరకు శాంతంగా వుండండి." కోటేశ్వరరావు విజ్ఞప్తి చేసాడు- "ఎం.యల్ ఏ అయినా, జమిందారైనా వదలిపెట్టటానికి వీలు లేదు."

ప్రజలు శాంతించారు.

రామయ్య తిరిగి చెప్పటం ప్రారంభించాడు-

"అన్నపూర్ణగారి దగ్గరకు వెళ్ళకముందు నేను ఏసుదాసు దగ్గరకు వెళ్ళి నాకు తెలిసిందంతా చెప్పాను. ఈ విషయం ముందే చెప్పవలసిందని అతను నన్ను మందలించాడు నాకు తెలుసు- ఏసుదాసు ఆ మాటలు అంతరాత్మ సాక్షిగా అన్నాడని. కాని నాకు అంతరాత్మ ఎక్కడ వుంది? నేను దానిని కోసి ఎప్పుడో నా కుటుంబానికి తినిపించాను.

నేను సిగ్గుపడుతున్నాను నేనిక్కడ నరకం అనుభవిస్తున్నాను. వచ్చే జన్మలో నయినా ఈ నరకం చూడకుండా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను."

రామయ్య తన మాటలు ముగించి కూర్చున్నాడు

"నేనిప్పుడు మన మిత్రుడు ఏసుదాసును తరువాత ఏమి జరిగిందో చెప్పమని కోరుతున్నాను!" రాజగోపాలరావు లేచి ప్రకటించాడు.

ఏసుదాసు లేచి నిలబడ్డాడు అతనిని రామయ్య వయస్సులో సగం వయస్సు వుంటుంది. అయితే అతని మొహం ముడుతలు పడిపోయింది. వయస్సు కారణంగా కాదు, ఆకలి కారణంగా అతని మొహం పీక్కుపోయింది అతను హరిజనులలో కొత్త తరానికి చెందినవాడు. అన్యాయాన్ని మౌనంగా సహించలేనివాడు. ఒకవేళ సహించవలసి వస్తే అతని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు ఇతరులకు వినిపించగల శక్తి గలవాడు. ప్రతిదానికి నిశ్శబ్దంగా తలవంచి కష్టాలు సహించిన తన పూర్వీకుల వంటివాడు కాదు ఏసుదాసు. అతను పూర్తి ఆత్మవిశ్వాసంతో మాట్లాడగలడు.

"నా స్థానంలో వున్న ఏ ఇతరులైనా చేసే పనే నేనూ చేసాను ఈ విషయం గురించి పెద్ద పెద్ద వాళ్ళకు నేనే వెళ్ళి ఎందుకు చెప్పానో నాకు అర్థం కాలేదు." అతను ఏది ముందు చెప్పాలో ఏది తర్వాత చెప్పాలో తెలియకపోయినా చెప్పసాగాడు.

"ఎవరిదగ్గర ఏ విధమైన సాక్ష్యం లేదు. ఇంత పెద్ద పెద్ద వాళ్ళు తమను పట్టియిచ్చే సాక్ష్యాలు ఎందుకు వదిలివెళతారు?

రామయ్య నా దగ్గర వచ్చాడు. అతను ఇంకా ఎక్కడకు వెళ్ళలేదు. ఎవరూ మనకు సహాయం చేయరు. మనకు మనమే సహాయం చేసుకోవాలి. మేమందరం ఇదే భావంతో వున్నాం.

మాటల సందర్భంగా అతను తన మనస్సులో నుండి బయటపెట్టకూడ దనుకున్న విషయాలు నాకు చెప్పివేసాడు ఇప్పుడు చెప్పిందంతా నాకు చెప్పాడు. అప్పుడే దర్యాప్తు సంఘం చేసినట్లు ప్రకటన వచ్చింది. మాకు తెలిసిందంతా ఆ సంఘంముందు చెపుదామనుకున్నాము.

నేను రహస్యం దాయాలనుకోవటంలేదు. చెపితే ఈ పని చేయించిన జమిం దారు, చేసిన అతని మనుష్యులు ఇబ్బందులలో పడతారు. చెప్పకుండా నేను ఉండ లేను.

నేను వెళ్ళి చెపితే ప్రభుత్వం నా మాటలు నమ్మి విచారణ జరిపిస్తుందన్న ధైర్యంకూడా నాకు కలగలేదు. వాళ్ళు నన్ను బాధిస్తారని, హింసిస్తారని నేనను కున్నాను. వాళ్ళు నన్ను కొట్టారుకూడా. నేను దెబ్బలు, మచ్చలు మీకు చూపిస్తే బాగుంటుందనుకుంటున్నాను తళుకు బట్టలక్రింద అన్నీ మచ్చలే."

ప్రజలు ఆ మాటలకు నవ్వారు.

"నేనీ కథ పొడిగించాలనుకోవటంలేదు మేము ఈ గ్రామానికి వచ్చి శాసనసభ్యు రాలు, దర్యాప్తు సంఘం అధ్యక్షురాలూ అయిన అన్నపూర్ణగారిని కలిసాం ఆమె గ్రామంలో లేదు. ఆమె నియోజకవర్గం ఈ గ్రామం వరకే పరిమితం కాదుకదా!"

కోటేశ్వరరావూ, రాజగోపాలరావు ఈ మాటలకు బలవంతాన నవ్వు ఆపుకున్నారు.

"రాజగోపాలరావు గారిని కలిస్తే బాగుంటుందనుకున్నాం ఆయననుకూడా ఆ దుర్మార్గులు కొట్టారు. ఆయన మంచంమీద వున్నారు. ఆ పరిస్థితులలో ఆయనను ఇబ్బంది పెట్టటం భావ్యం కాదని భావించాం. మేము తప్పదని శ్రీమతి అన్నపూర్ణ జాడ తెలుసుకుని, ఆమె దగ్గరకు వెళ్ళి జరిగినదంతా చెప్పాం కాని, ఆమె విశ్వ సించలేదు.

నేను ముఖ్యమంత్రి గారిని కలవటానికివెళ్ళి ఆయన ఇంటి గేటువద్ద గంటలు గంటలు పడిగాపులు పడ్డాను ఆయన బయటకు వెళ్ళేటప్పుడు చేతులు జోడించి నిలబడ్డాను. ఆయన నన్ను పట్టించుకోలేదు. పోలీసుల దగ్గరకు వెళ్ళలేదు. నా దగ్గర తగిన సాక్ష్యాధారాలులేవు. తాలూకాలో ప్రముఖవ్యక్తిమీద బురదజల్లుతున్నా నని వాళ్ళు నన్నే నిర్బంధించే ప్రమాదమున్నది.

నేను యం. యల్. ఏ క్వార్టర్సుకు వెళ్ళాను. అక్కడ నేను ఎవరినీ కలుసుకోలేకపోయాను. పైగా ఇక్కడ కూర్చున్న కోటేశ్వరరావుగారు మినహా నాకక్కడ ఎవ్వరూ తెలియదు ఈయనే నాకు అక్కడ వసతి, భోజనం ఏర్పాటు చేసారు. నాకు తెలిసినదంతా ఆయనకు చెప్పాను. తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు."

"తరువాత జరిగింది నేను చెపుతాను, ముందు నువ్వు చెప్పదలచుకున్నది చెప్పు." కోటేశ్వరరావు అన్నాడు.

"కోటేశ్వరరావుగారు నాకు రైలు ఛార్జీలు యిచ్చి గ్రామానికి పంపారు. నేను పట్టణం నుండి గ్రామానికి తిరిగివస్తుంటే ముగ్గురు ముసుగులు వేసుకున్న మనుష్యులు నాపై దాడి చేసి నన్ను కొట్టారు. మా గ్రామంవైపు నుండి ఎడ్ల బండి రాకుండా వుంటే వాళ్ళు నన్ను చంపేసి వుండేవారే. సాక్ష్యాలు లేకపోయినా వాళ్ళు జమిందారు మనుష్యులేనని నేను నిశ్చయంగా చెప్పగలను. ఎడ్ల బండిలో వచ్చిన మా గ్రామస్థులు నన్ను రక్షించారు. అయితే నేను హైదరాబాదులో ఏమి చేసివచ్చానో ఈ దుర్మార్గులకు అంత త్వరగా ఎలా తెలిసి పోయిందన్నదే నాకు అర్థం కావటంలేదు. నేను తర్వాత చాలా జాగ్రత్తగా వ్యవహరించసాగాను.

నన్ను కొట్టిన విషయం గురించి నా మిత్రులు రిపోర్టు ఇవ్వటానికి వెళ్ళారు. ఈ రోజు ఇక్కడ మన ఎదురుగా వున్న పోలీసుల దగ్గరకే వెళ్ళారు. వీళ్ళు నా సాక్ష్యం తీసుకున్నారు. కాని ఇంతవరకూ ఏమీ జరగలేదు."

శ్రోతలలో చాలా మంది వెనుకకు తిరిగి పోలీసులవంక చూసారు.

ఏసుదాసు కూర్చున్నాడు. సభలో చప్పట్లు ఆగకుండా మోగాయి. ఏసుదాసు లేచి నుంచొని రెండు చేతులూ జోడించి, నిలబడిపోయాడు. అతను సంతోషంతో గద్గదమైపోయాడు.

కోటేశ్వరరావు మాట్లాడటానికి లేవగానే సభయావత్తూ ఆనందంతో నినాదాలు చేయసాగారు.

కోలాహలం కొంచెం తగ్గిన తర్వాత కోటేశ్వరరావు సభలోని వారికి అభివందన చేస్తూ తన ప్రసంగం ప్రారంభించాడు:

"నేనీ రోజు చాలా సంతోషంగా వున్నాను. బహుశా నా జీవితంలో ఇంత కంటే ఆనందించే రోజు రాదనుకుంటాను. తమకు జరిగిన అత్యాచారాలకు విరు

ద్ధంగా ప్రజలలో ఇంత వ్యతిరేకత, ఇంత సాహసం నేనింతకు ముందు ఎప్పుడూ చూడలేదు. ఎవరైనా మన సంపత్తిని దోచుకొని, మన అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని ధనవంతులవుతున్నారంటే, అది వారి గొప్పతనం కాదు. మన ఉదార త్వమే దానికి కారణం. మనం పీడితులను, దళితులను ఒక్కరోజులో బాగుచేయ లేకపోవచ్చు. కాని ఇప్పుడు వారి ప్రగతికి అనుకూలమైన వాతావరణం ఏర్ప డింది. ఇదే మనకు స్వాతంత్ర్యం ప్రసాదించిన గొప్ప వరం. ఈ వాతావరణంలో విషవాయువులు వుండవచ్చు. అయితే మనం నంగిగా, బానిసలమాదిరిగా వంగివంగి నడవవలసిన పరిస్థితి లేదు. మనం పరిపూర్ణమైన మనుష్యుల్లా వ్యవహరించగలుగు తున్నాం. మన అదృష్టాన్ని మనమే లిఖించుకుంటున్నాం. సామంతీయ తత్వంతో నిండివున్న తిరోగమనవాదులైన నాయకులు మనలను నడిపించవలసిన పరిస్థితి ఇప్పుడు లేదు. మన కాళ్ళమీద మనం నిలబడగలం. మన మార్గాన మనం నడవ గలం."

కోటేశ్వరరావు మాటలకు చప్పట్లు మార్మోగాయి. ఆయన తన నుదుట పట్టిన చెమట తుడుచుకోసాగాడు. తరువాత తన ప్రసంగం కొనసాగించాడు-

"రాజకీయ బలం అధికారం వున్నవారిని పాడు చేస్తుందన్న విషయం ఇంతకు ముందెన్నడూ లేనంతగా ఇప్పుడు వాస్తవంగా తోస్తున్నది. ఎవరి దగ్గ రయితే బలం వుందో- రాజకీయ బలం, అధికార బలం, ఉద్యోగం వలన వచ్చిన బలం-వాళ్ళ జేబులు నింపటానికి ఉపయోగపడసాగింది. ధనవంతులు మరింత ధన వంతులుగా మారిపోతున్నారు. బలవంతులు ఇంకా బలవంతులుగా తయారవు తున్నారు. సమాజంలో, ప్రజలలో కొంచెం మార్పు వచ్చినా, సమానత్వ భావన ఇంకా పూర్తిగా అలవాటు పడలేదు. మనం ఈ అసమానతలను ఇంతవరకు సహనం అనే మాటతో సహిస్తూ వచ్చాం. అయితే పేదవారి కర్తవ్య దీక్ష, నిజాయితీ, సహనం, పూర్తిగా అపార్థం చేసుకోబడ్డాయి. ప్రజా జీవితంలో ఇంకా కుళ్ళు నిండే వుంది.

ఈ శక్తి సంపన్నులకు తమంతట తామే మారటానికి తగిన అవకాశం మనం కల్పించాం. కాని వారు మారకపోగా మనలను కబళించుకు పోతూవున్నారు. మనలను అన్ని విధాలా దోపిడి చేస్తూనే వున్నారు.

గాంధీజీ రాజకీయాలలో కొత్త స్ఫూర్తిని తెచ్చారు. ఆయన ఈ దేశానికి చాలా అందించారు. ఆయన ప్రయత్నాల కారణంగానే మనకు స్వాతంత్ర్యం

ఇంత తేలికగా లభించింది. కాని ఆయన తుప్పుపట్టిన మన సామాజిక వ్యవస్థను మార్చలేకపోయారు. ఈ బలవంతులను ఆయన 'ధర్మకర్తలు'గా వ్యవహరించమని విజ్ఞప్తి చేసారు. మురికి వస్తువులకు మంచి పేర్లు పెడితే ఫలితం వుండనట్లే వీళ్ళ వ్యవహారం కూడా సాగింది. వీళ్ళ స్వభావమేమీ మారలేదు.

ధర్మకర్తలన్నా, ఏమన్నా సామాజిక శక్తికి ఈ ధనవంతులే వెన్నెముకలుగా ఈ రోజుకూ వున్నారు. జమిందారు శ్రీ యస్ ఆర్ వి.కె కుటుంబరావు వంటి ధనవంతులు మారారా? వాళ్ళు మారతారా? వీళ్ళ పూర్వీకులు మారారా? మంచి మనస్సు గలవారు ఒక్కరిద్దరు దేశం మొత్తం మీద ఎక్కడైనా మారి వుండవచ్చు. అయితే మొత్తంమీద ఈ వర్గం మాత్రం మారలేదు. ఇప్పుడు మారే వాళ్ళయితే ఎప్పుడో మారివుండేవారు. ఇప్పుడు వాళ్ళను మార్చవలసిన సమయం వచ్చింది.

మౌనంగా సహించి వుండేది లేదు."

కోటేశ్వరరావు చెపుతున్న మాటలు శ్రోతలలో ఎక్కువ మందికి అర్థం కావటం లేదు. కాని ప్రతి ఒక్కరు ఆ మాటలు శ్రద్ధగా వినసాగారు. ఇంకా ముందు ఏమి చెపుతాడోనని ప్రతి ఒక్కరు ఎదురు చూస్తున్నారు. రాజగోపాలరావు ప్రతి మాటకు తల వూపుతూ మధ్య మధ్యలో చప్పట్లు కొట్టసాగాడు.

"మన సమాజంలోని ప్రతి స్థాయిలోనూ అవినీతి పేరుకుపోయింది. తమ యిష్టం వచ్చినట్లు వ్యవహరించగలమని, అవసరమనుకుంటే తమ ధనబలంతో ఈ ప్రభుత్వాన్నే కొనగలమని ఈ ధనవంతుల నమ్మకం. మన జమిందారు కూడా ఇదే విధంగా ఆలోచించి వుంటారు. కాని పాపం ఆయన దుర్మార్గాల ఫలితం ముందుగానే అనుభవించవలసి వస్తున్నది.

కొద్దిరోజుల క్రితం ముఖ్యమంత్రిగారు ఇక్కడకు వచ్చారు. ఆయన అన్ని విషయాలను స్వయంగా పరిశీలించారు. ఆయనకు మనం కృతజ్ఞులం. మొత్తం వ్యవహారంపై తిరిగి దర్యాప్తు చేయమని ఆయన పోలీసులను ఆదేశించారు. పోలీసులు ముందు దీనిని ప్రకృతి వైపరీత్యం అని, మనుష్యులెవ్వరూ బాధ్యులు కాదని ఫైలు మూసివేసారు."

"సిగ్గు సిగ్గు" అని రాజగోపాలరావు అన్నమాటలతో శ్రోతలు చాలా మంది గొంతు కలిపారు.

పోలీసులు విచిత్రమైన పరిస్థితిలో చిక్కుకుని కోపాన్ని లోపల లోపలే మింగసాగారు.

"మీకు తెలుసు- ముఖ్యమంత్రిగారు మన జమిందారుగారి ప్లీడరు. ఈయన కేసులన్నీ ఆయనే చూస్తూ వుండేవాడు. ఆ రూపంగా ఈయన సొమ్ము ఆయన చాలా తిన్నాడు. వారిద్దరూ చాలా మంచి మిత్రులు. ఆయ నిక్కడకు ఎప్పుడు వచ్చినా జమిందారుగారి భవనంలో బస చేస్తారు. ఆయన ఎన్నికల ఖర్చుకూడా చాలావరకు ఈయనే భరిస్తూ ఉంటాడంటారు. ఇంతటి స్నేహసంబంధాలున్న వ్యక్తి తిరిగి దర్యాప్తు చేయమని ఆదేశించటం బహుశా మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. పోలీసులు మరల దర్యాప్తు చేస్తారు మరలా ఫలితం కూడా ఏమి ఉండక పోవచ్చు.

అయితే ముఖ్యమంత్రిగారు ఇదంతా ఎందుకు చేసారని మీరు అనుకుంటున్నారు? ప్రస్తుత పరిస్థితులలో ఏ రాజకీయ నాయకుడైనా ఈ విధంగా చేయక తప్పదు. ఏసుదాసు చెప్పిన విషయాలు నేను విచారించాను. అవి నిజమే అని తేలాయి. పైగా ఏసుదాసు వంటి వ్యక్తులు ఇతరులమీద, అందులోనూ సమాజంలో ఉన్నతులుగా చెలామణి అవుతున్న వారిమీద బురద చల్లటానికి సాహసించరు. అతనిని అనుమానించవలసిన అవసరం నాకు కలుగలేదు. ప్రక్క నియోజక వర్గపు ప్రజాప్రతినిధిగా ఈ విషయంలో నేను చేయగలిగినంత చేయటం నా బాధ్యతగా భావిస్తున్నాను. అయితే నా దగ్గర ఏసుదాసు మినహా సాక్షులెవ్వరూ లేరు.

అయినా ఏమైతే అది అవుతుందని నేను ముఖ్యమంత్రిగారిని కలిసాను. పత్రికలలో వ్రాసే విధంగానే, ఆయన నన్ను సాదరంగా ఆహ్వానించి, నేను చెప్పింది చాలా శ్రద్ధగా విన్నారు విన్న తర్వాత ఆయన తన అనుమానాలను ఈ విధంగా వ్యక్తం చేశారు.

"మీరు దీనిని ఎట్లా నిరూపించగలరు? ఆ తాలూకాలో ప్రసిద్ధుడైన ఒక వ్యక్తి, ఆ ఆనకట్ట కారణంగా తన తన పొలాలకు ఎక్కువ సేద్యపు నీరుపొందే వ్యక్తి ఆ ఆనకట్ట బద్దలు కొట్టించాడంటే ఎలా విశ్వసించాలి? చదువురాని, ఒక పల్లెటూరి రైతు సాక్ష్యంపై అటువంటి పెద్దమనుష్యుల మీద విచారణ ఏవిధంగా జరపాలి?"

అయితే ముఖ్యమంత్రిగారు వ్యక్తం చేసిన అనుమానాలు నాకు కష్టం కలిగించాయి. చదువుకోని వారిని మనం గుడ్డివాళ్ళుగా భావిస్తామా? చదువుకున్న వారిలా వాళ్ళు అందంగా మాట్లాడలేకపోవచ్చు. కాని వాళ్ళు తమ కళ్ళతో చూసిన విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పగలరు. చదువుకున్నవాళ్ళు ఎవ్వరూ చెప్పలేని అన్ని విషయాలను రామయ్య చెప్పాడు.

అందుచేత ప్రభుత్వం సరియైన విచారణ జరిపించకపోతే, జమిందారుకు వ్యతిరేకంగా నేను ఉద్యమం ప్రారంభిస్తానని ముఖ్యమంత్రిగారికి చెప్పాను. ముఖ్యమంత్రిగారిని కూడా ఈ వ్యవహారంలో విడిచిపెట్టనని చెప్పాను. మీ శాసన సభ్యురాలు కూడా నాకు సహకరించి వుంటే ఇంకా చాలా బాగుండి వుండేది. అయితే నాబోటి వాళ్ళతో మాట్లాడే తీరికకూడా ఆమెకు లేదు.

ముఖ్యమంత్రిగారు ఇంత తీవ్రమైన చర్యలు ఎందుకు తీసుకున్నారో కూడా మీరు తెలుసుకోవాలి. అన్ని రాజకీయ పక్షాలవారు ప్రజాసేవే మా లక్ష్యం, గమ్యం అంటున్నారు. అయితే ప్రతి ఒక్కరూ వీటి ముసుగులో అధికారాన్ని, పదవిని సుస్థిరంగా వుంచుకోవటానికి నిరంతరం ప్రయత్నిస్తున్నారు. మన ముఖ్యమంత్రిగారు ఇటువంటి రాజకీయనాయకుడే అయితే సాధారణ రాజకీయ నాయకులకంటే ఈయన ఎక్కువ తెలివిగలవాడు. ఆయన ఇప్పటివరకు, తనకు వీలయినంత మేరకు జమిందారును రక్షించుదామని ప్రయత్నం చేసారు. లేకుంటే ఆనకట్ట నిర్మాణంలో ఏ విధమైన అనుభవం లేని జమిందారు కంపెనీకి ఆయన కాంట్రాక్టు ఎందుకు ఇప్పించారు? అసమర్థత మినహా ఏమీ తెలియని వ్యక్తికి, అప్పు మినహా ఏమీ పెట్టుబడి లేని వ్యక్తికి ఇంత పెద్ద పని ఎందుకు అప్పగించబడింది? జమిందారుకు పైన పటాటోపం మినహా ఏమీలేదు. ఏమన్నావుంటే ఆయన కుమారుడు పొలాలు అమ్మటానికి ఇక్కడకు ఎందుకు వస్తాడు? జమిందారు అప్పుల్లో మునిగిపోయి వున్నాడు బాకీదార్లు డబ్బు వసూలుకోసం కోర్టుల్లో దావాలు వేసిన సంగతి ఆయన కప్పిపుచ్చలేదు. ముఖ్యమంత్రిగారు ఇక్కడకు ఎందుకు వచ్చారు? పోలీసులకే మరల దర్యాప్తును ఎందుకు అప్పగించారు?

ముఖ్యమంత్రిగారు ఈ ప్రాంతం నుండి ఎన్నికైనా, ఆయన పరిస్థితి అంతంత మాత్రంగానే వున్నది. మనం ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభిస్తే దాని ప్రభావం ఆయనమీద, ఆయన మద్దతు దారులైన జమిందారు మీద, అన్నపూర్ణమీద తప్పక పడుతుంది. మీ అందరి సహకారంతో మన ఉద్యమం తప్పక విజయం సాధించుతుంది. ఈ ఆనకట్ట విధ్వంసపు దురాగతాన్ని బట్టబయలుచేస్తే వీళ్ళందరి బండారం బయటపడుతుంది. ముఖ్యమంత్రిగారికి చెడ్డ పేరు వస్తుంది. ఆయన రాజనీతి చతురుడైన కారణంగా, తనకు చెడ్డపేరు

రాకుండా వుండటానికి మరల దర్యాప్తు చేయిస్తున్నారు. అయితే దీనివలన ఆయన పరిస్థితి మరింత చెడిపోతుందే కాని, బాగుపడదు.

ఆనకట్టను నిర్మించిన కాంట్రాక్టు కంపెనీ వారే దానిని బ్రద్దలు కొట్టారు. ఆ కంపెనీ మూలవిరాట్టు జమిందారు యస్. ఆర్. వి. కుటుంబరావు దీనికి బాధ్యుడు. ప్రధాన నిందితుడు అతనే. ముఖ్యమంత్రిగారి దర్యాప్తు దీనిని మరుగు పరచలేదు. మొత్తం విషయాన్ని మరుగుపర్చటానికి ముఖ్యమంత్రిగారు వేసిన ఎత్తు ఇది.

మనం వీలయినన్ని కష్టాలు పడ్డాం. సహించగలిగినన్ని అత్యాచారాలు సహించాం. ఇంకా సహించే శక్తి మనకు లేదు దేనికయినా హద్దుంటుంది. మన సహనానికి ఇక హద్దులేదు. పరస్పర శాంతియుత పద్ధతులద్వారా మన కష్టాలు గట్టె క్కించుకోవటానికి మనం ప్రయత్నం చేసాం. అయితే మన ప్రయత్నాలు ఫలించలేదు. జమిందారులు హింసను పోషించరని వారు చెపుతున్నారు. అయితే వాళ్ళను సమర్థించే పాలక వర్గంవారు ఆ కార్యక్రమాన్ని చేపట్టారు. ప్రభుత్వం ఏదో ఒక రూపంలో హింసను పోషిస్తూనే వున్నది. వాళ్ళ హింసను మనం అహింసతో ఎదుర్కోవటం సాధ్యంకాదు. అన్యాయపు అగ్ర పీఠం అధిష్టిం చిన వారినుండి మనకు న్యాయం లభించదు. న్యాయాన్ని మనమే సాధించు కోవాలి."

సభికులలోని కొందరు లేచి చప్పట్లు కొట్టసాగారు. కోటేశ్వరరావు కొంచెం సేపు ఆగి, తిరిగి ప్రసంగాన్ని కొనసాగించాడు—

"న్యాయమూర్తులు చట్టాలకు అనుగుణంగా న్యాయం చేస్తున్నారు. అయితే వారి నిర్ణయాలు వ్యక్తిగత విలువల, పునాదులపై ఆధారపడి వుంటున్నాయి. వారిలో కూడా చాలామంది ఉన్నత వర్గాల వారే అయిన కారణంగా వాళ్ళ నిర్ణ యాలుకూడా చాలావరకు ఆ వర్గాల ప్రయోజనాల సంరక్షణకే ఉపయోగపడుతు న్నాయి. చట్టానికి ప్రాణం లేకపోవచ్చు. కాని ఆ చట్టాన్ని అమలు చేసేవారికి వారి వారి స్వంత అభిరుచులు, అభిప్రాయాలు వున్నాయి. ప్రజల చైతన్యం వారి కెప్పుడూ అంగీకారం కాదు. కాగితాలపై సమర్పించే నివేదికల మినహా, వాస్తవ కారణాలను వారి విశ్లేషించరు. జమిందారు వంటి ద్రోహులను ప్రభుత్వం శిక్షించ కుండా వుంటే, వారిని మనమే శిక్షించటం మినహా మనకు మార్గం లేదు."

ఉద్రేకంతో తన ప్రసంగాన్ని ముగించిన కోటేశ్వరరావు వేగంగా వేదిక దిగి జమిందారు భవనం వైపు నడిచాడు. చాలామంది 'జమిందారు నశించాలి' అంటూ నినాదాలు చేసుకుంటూ ఆవేశంతో కోటేశ్వరరావును అనుసరిస్తూ భవనం వైపు కదిలారు.

# 36

రాజగోపాలరావు వేగంగా కుంటుకుంటూ వేదిక దిగి భవనపు ప్రధాన ద్వారం దగ్గరకు వెళ్ళాడు.

"మీరంతా ఆగండి, వెనక్కి పదండి. కావాలంటే ముందు నన్ను చంపండి." రాజగోపాలరావు బిగ్గరగా అరిచాడు.

పోలీసులు అప్పటికే ప్రధాన ద్వారం దగ్గరకు వచ్చేసారు. వాళ్ళ దగ్గర తుపాకులు వున్నా, వాళ్ళు ఈ పరిస్థితులలో ఆ గుంపును ఆపలేకపొయ్యేవారు. వాళ్ళ దగ్గర తుపాకులు లేకపోయినా వాళ్ళు ప్రజలను బాధించగలరు. వాళ్ళలో కొందరిపై ప్రజలు రాళ్ళు విసిరారు. కొందరు భవనం వెనుకకు వెళ్ళారు. రాజగోపాలరావు గుంపును తన మాటలతో అదుపు చెయ్యకుండా వుండివుంటే వాళ్ళు పోలీసులను సైతం త్రొక్కుకుంటూ వెళ్ళి ఆ భవనాన్ని నాశనం చేసివుండేవారు.

ఇంద్రజాలం జరిగిందా అన్నట్లు, కోపంతో, ఆవేశంతో పొంగివచ్చే ఆ గుంపు రాజగోపాలరావు మాటపై వెనుకకు తగ్గారు.

రాజగోపాలరావు భవనపు ప్రధానద్వారం దగ్గరనుండి చేయెత్తి చెప్పాడు: "మీరు ఈ భవనాన్ని దోచి ధ్వంసం చేసేముందు నన్ను చంపండి. శిథిలమై పోతున్న ఈ జమిందారులను మట్టిలో కలపటానికి మనం హింసకు దిగవలసిన పనిలేదు."

రాజగోపాలరావును ఆ గుంపులో కోపంగా వున్నవారు ఏమైనా చేస్తారేమోననే భయంతో ఆ గ్రామస్త్రీలు కొందరు అతనిచుట్టూ నుంచున్నారు.

కోటేశ్వరరావుతో సహా ఆవేశంతో వున్నవారంతా వెనుకకు తగ్గారు. కోటేశ్వరరావు కళ్ళల్లో ఎర్రని జీరలు తొంగిచూసాయి. ఆయన పోలీసులను, జమిందారును, ప్రభుత్వాన్ని, రాజగోపాలరావును మనస్సులో తిట్టుకోసాగాడు. మరుగుతున్న ఆగ్రహం క్రింద మంటను అకస్మాత్తుగా లాగివేసాడని రాజగోపాలరావుపట్ల ఆయనకు కోపం వచ్చింది. అయితే రాజగోపాలరావును ద్రోహం చేసాడని అనే ధైర్యం అతనికి లేదు.

కొందరు రాజగోపాలరావును తమ భుజాలపై ఎత్తుకుని వేదికపైకి తీసుకు వచ్చారు. రామయ్య, ఏసుదాసు వేదికదిగి క్రిందకు వెళ్ళిపోయారు కోటేశ్వరరావు ముఖం ముడుచుకుని, తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో వేదికపైన ఒకప్రక్క కూర్చున్నాడు. రాజగోపాలరావు నిలబడి మాట్లాడసాగాడు:

“మీరింతా మాట్లాడారండి. నేను చెప్పేది కూడా వినండి. నేను అహింసావాదిని కాను. అట్లాగని హింసావాదిని కాను. కాని మంచి లక్ష్యానికి, మంచి సాధనాలు కూడా అవసరమని భావించే వాళ్ళలో ఒకడను. మన లక్ష్యం మంచిదైతే, దానిలోని శక్తి మనలను సహాయం చేస్తుంది. హింస మరియు అహింస రెండింటినీ ఉపయోగించేదానికి సమయం సందర్భాలుంటాయి. ప్రస్తుతం మన లక్ష్యసాధనకు హింస అవసరం లేదని నా ఖచ్చితమైన అభిప్రాయం.

ఈ అనికట్లను ధ్వంసం చేసినవారిని మనం బహిరంగంగా దోషులుగా ప్రకటించాలి. తరువాత చర్యలు తీసుకోవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ప్రభుత్వం తన బాధ్యతను, కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించకపోతే ఏమి చెయ్యాలో మనకు తెలుసు. ఈ ప్రభుత్వాన్ని వచ్చే ఎన్నికలలో ఓడించి ఇంటికి పంపించవచ్చు. అప్పుడు లక్ష్యాన్ని సాధించుకోవచ్చు.

మీలో ఎవరైనా కేవలం హింసద్వారానే మన లక్ష్యాన్ని సాధించుకోగలం అని నమ్మితే చెప్పండి. మన లక్ష్యసాధనకు హింస ఒక్కటే మార్గమైతే, హింసను సమర్థించేవారిలో నేను మొట్టమొదటివాడి నవుతాను. కాని ప్రస్తుత పరిస్థితులలో హింసను ఉపయోగించటం ఉన్మాదమే అవుతుంది. మిత్రులు కోటేశ్వరరావుగారు ఈ విషయంలో నన్ను క్షమించాలి. నేను ఆయన శక్తిని, సామర్థ్యాన్ని, నిజాయితీని శంకించటం లేదు. ఆయన భావాలను, వాటిని సాధించటంలో ఆయనకున్న శక్తి యుక్తులను నేను అభినందిస్తాను. కాని ఆయన ఆలోచనలతో పూర్తిగా ఏకీభవించలేను.

అహింసకారణంగానే మనదేశం స్వాతంత్ర్యాన్ని పొందింది. ప్రజల ముక్తికి, అభ్యున్నతికి కూడా ఈ అహింసే సాధనమని నా ఉద్దేశ్యం. అయితే మనం జాగ్రత్తగా వ్యవహరించవలసివుంది. ఈ ప్రక్రియ ఇప్పటికే మొదలయ్యింది. కాని కొంచెం నత్తనడక నడుస్తున్న విషయం మాత్రం యథార్థమే.

ఏ ఉద్యమమైనా ప్రజల మద్దతులేకుండా ముందుకు సాగదు. హింసద్వారా మనం ప్రజల మద్దతు సాధించలేం. అనుకూలవాతావరణం ఏర్పడినప్పుడు, ప్రజల మద్దతుతో పెద్ద సైన్యం కూడా సాధించలేని విజయాలను మనం సాధించవచ్చు. కాకపోతే దీనికి సమయం పట్టుతుంది. ప్రజా చైతన్యం మెల్లగానే వస్తుంది. మనం ఉద్యమం నడిపి ప్రభుత్వంపై వత్తిడి తేవచ్చు.

స్వాతంత్ర్యం రాగానే మనం అహింసామార్గాన్ని, సత్యాగ్రహ పోరాటాన్ని వదిలివేస్తున్నాం. స్వాతంత్ర్యం వచ్చింది గాని మన సమాజంలోని కల్మషం ఇంకా పూర్తిగా పోలేదు. తరతరాలుగా మనలను, మన సమాజాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మతలు మనలను విడిచిపెట్టటం లేదు.

మనలను మనమే పాలించుకుంటున్నాం కనుక, మన అధికార పీఠాన్ని అధిష్టించినవాళ్ళు మనవాళ్ళే కనుక మనం ప్రతిదీ సరిఅయినదే అనుకుంటున్నాం. సత్యాగ్రహ ఆయుధానికి తుప్పు పట్టిస్తున్నాం.

హింసామార్గానికి గోపనీయత చాలా అవసరం. కాని వీలయినంత ఎక్కువ మంది ప్రజలను మనం ఈ ఉద్యమంలో భాగస్వాములను చేద్దాం అనుకుంటున్నాం. ఈ పరిస్థితులలో గోపనీయత పాటించటం అసంభవం. అహింసా ప్రాధాన్యత కలిగిన సంస్థలే కాలగతిలో హింసను పాటిస్తున్నాయి. అయితే మనం అహింసను పాటించటమే అన్ని విధాలా శ్రేయస్కరం.

ఏమాత్రం తొందరపడకుండానే మీరంతా వెనుకకు తగ్గినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. మనమేమీ నేరం చెయ్యలేదు. ఏ దోపిడి చెయ్యలేదు. పోలీసులు త్వరపడి ఏ అనుచితమైన చర్య తీసుకునేదానికి తోడుండేటట్లు వ్యవహరించకూడదనే నేను ఇదంతా చెపుతున్నాను.

ఒకవేళ మనం జమిందారు కుటుంబరావునే అంతంచేసినా ఏమీ ఉపయోగం లేదు ఆ వర్గంనుంచి చాలామంది కుటుంబరావులు ఉద్భవిస్తుంటారు. అరణ్యంలో ఒక చెట్టు నరకబడితే మరో చెట్టు పెరుగుతుంది. ఈ పిరికివాళ్ళను మనం చంపనవసరంలేదు. ప్రజలలో తమకు జరుగుతున్న నష్టాలను గురించిన చైతన్యం రావటమే ఒక విప్లవం. చైతన్యానికే ఆ ధనస్వామ్య వర్గం బెదిరిపోతుంది. మనకు కావలసింది ప్రజాచైతన్యం హింసా విధానంతో ఈ చైతన్యం సాధించలేం.

రక్తపాత విప్లవానికి ఈ ప్రజాచైతన్యమే వికల్పం. మనం ధైర్యాన్ని పోగొట్టుకోకూడదు. ఈ రెండు మూడు సంవత్సరాల స్వాతంత్ర్యం మనకు ఏమిచ్చినా యివ్వకపోయినా ఈ చైతన్యాన్ని మాత్రం ఇచ్చిందని నా అభిప్రాయం. ఈ చైతన్యం ఇంకా పెరగాలి. మన హక్కులపట్ల మనం అప్రమత్తంగా వ్యవహరించాలి. ఈ చైతన్యానికి హద్దులు లేవు.

వ్రణానికి శస్త్రచికిత్స అవసరమే. ఈ జమిందారులు, ఈ ధనవంతులు, ఈ పెట్టుబడిదారులు సమాజానికి వ్రణాలవంటివారే. అయితే ప్రస్తుతం వీటికి శస్త్రచికిత్స అవసరం లేదని నా అభిప్రాయం.

చచ్చినవాళ్ళను మరల మరల చంపవలసిన అవసరం లేదు. ఈ జమిందారీ వర్గం ఆఖరిశ్వాస తీసుకుంటున్నది.

ఇహ మన జమిందారు సంగతి ఆలోచిద్దాం. నాలాగానే మీలో చాలామందికి సైతం జమిందారు, ఈ ఆనకట్టను ఎందుకు బద్దలు కొట్టించాడా అని ఆశ్చర్యం కలుగుతూ వుండవచ్చు. ధనవంతులకు డబ్బు సంపాదించవలసిన అవసరం లేదని ప్రజలు భావిస్తూంటారు. కాని ఆ అభిప్రాయం సరైనది కాదు. ధనదాహం పట్టినవారికి బంగారపు గనులుకూడా సరిపోవు. ఈ జమిందారుకూడా అటువంటివాడే.

ధనవంతులుగా వుండాలంటే, చుట్టూవున్నవారిని పేదవాళ్ళుగా వుంచటం చాలా అవసరమని వాళ్ళ ఉద్దేశ్యం. చుట్టూ వున్నవాళ్ళు కూడా ధనవంతులైతే వీళ్ళ గొప్పతనమేమున్నది? వారి దృష్టిలో ప్రతి ఒక్కరూ వారికి పోటీదారులే. ఇటువంటి ఆలోచనలు కలిగినవారు సైతానులాగా మారిపోతుంటారు.

జమిందారు చాలా పనులు ఒక్కసారే ప్రారంభించాడు. 'హైర్ పర్చేజ్' వ్యాపారం చేసాడు. చాలా కంపెనీలు ప్రారంభించాడు. పొరుగు రాష్ట్రాలలో వ్యవసాయం కూడా చేసాడు. డబ్బు సంపాదించే ప్రతి ప్రయత్నం చేసాడు. ఆయన దురదృష్టం కొద్ది ఈ ప్రయత్నాలేవీ ఫలించలేదు. కానీ ఖర్చులు తగ్గలేదు. ఆడంబరం సాగుతూనే వున్నది. ధనవంతుడు కాకుంటే ఆయన అస్తిత్వమే లేదు. అందుచేత ఏమైనా సరే, ఏదైనా చేసి ధనవంతుడుగా వుండాలన్నదే ఆయన ధ్యేయం.

ఈయనకు సంబంధించిన కాంట్రాక్టు కంపెనీయే ఈ ఆనకట్ట పని చేపట్టింది. ఇటువంటివే చాలా కాంట్రాక్టులు కుదుర్చుకున్నది. అయితే కష్టం మిగహా

మరేమీ మిగలలేదు రైట్ ద్వార మనుష్యులను, సామాగ్రిని, డబ్బును అటూ, యిటూ చెయ్యటం అందరికి తెలిసినదే. ఆయన జమిందారుకంటే ఎక్కువ తెలివి గలవాడు. ఈ ఆనకట్ట పనిలో ఆయనకు లాభం వచ్చింది. కాని ఆయనకు అది సరిపోలేదు. కాలవ ప్రత్యేకం పని కూడా కాంట్రాక్టు తీసుకుందామనుకున్నాడు. ఆనకట్ట పని ఈయనకే ఇచ్చినందున, కాలవల పని వేరే ఎవరికైనా యిస్తే మంచి దని, ఆ పనికూడా ఈయనకే ఇస్తే ప్రజలలో అలజడి చెలరేగుతుందని అధికారులు భావించారు. అందుచేత జమిందారు కంపెనీకి ఈ కాంట్రాక్టు లభించలేదు. ఏ ఇతర కాంట్రాక్టులు కూడా లభించలేదు పని లేదు. ఖర్చులు తగ్గలేదు. కంపెనీని మూసివేయలేదు. అందుచేత ఆనకట్టనే పడగొట్టి, మళ్ళీ మరమ్మత్తులకు కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. డబ్బులు సంపాదించటానికి ఈ మార్గాన్ని ఎన్నుకున్నారు. మనలను నష్టపరచి, ఆయన లాభం చేసుకున్నాడు. ప్రభుత్వాన్ని, ప్రజలను, రాష్ట్రాన్ని తమ స్వార్థం కోసం బలిపెట్టాడు.

ఇదే భయంకరమైన కుట్ర! తాను స్వయంగా అందులో పాల్గొనకపోయినా, ఈ కుట్రలో ప్రతి అడుగూ ఆయన వేయించినదే. అందుచేత దీనికి ఆయనే బాధ్యుడు.

ప్రభుత్వం దర్యాప్తు సంఘం వేసినప్పుడు ఆయన ఆశ్చర్యపోయాడు. ఈ విధంగా జరుగుతుందని ఆయన ఊహించలేదు. ప్రజలు ఆయన అడుగులకు మడుగు లొత్తుతారని భావించాడు. ప్రజల సానుభూతి పొందటానికి దానధర్మాలు ప్రారంభించాడు. ఆయన చేపట్టిన దానధర్మాలు, తన అకృత్యాలను దాచే కోట గోడలుగా భావించాడు. తనను తాను రక్షించుకోవటానికి ఈ కుటిల ప్రయత్నాలు సాగించాడు స్కూలు భవనం నిర్మించే భారం తన నెత్తిన వేసుకున్నాడు. హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించాడు. వరద బాధితులను ఆదుకోవటానికి వాగ్దానాలు చేసాడు. దేవాలయ పునర్నిర్మాణం చేయించటం మొదలుపెట్టాడు. అయినా తాను చేసిన పాపం వెంటబడుతూనే వున్నది. తన సహచరులకు, అనుయాయులకు ధైర్యం కలిగించటానికి ఇక్కడే మకాంకూడా పెట్టాడు. ఇదంతా పెద్ద కుట్రలో భాగమే. ఈ దానాలన్నీ పశ్చాత్తాప ఫలితాలు కాదు. డబ్బు, దానాల రూపేణా వెదజల్లుతున్నట్లు నటించి ఇంతకు పదిరెట్లు ధనం సంపాదించే ప్రయత్నం చేస్తున్నాడు.

ఇదీ మన జమిందారు యస్.ఆర్ వి. కుటుంబరావు కథ "

రాజగోపాలరావు తన ప్రసంగం ముగించలేదు— ఈ లోగానే ప్రజలు లేచి జమిందారుకు వ్యతిరేకంగా నినాదాలు చేయసాగారు. రాజగోపాలరావు మరల వారిని నిశ్శబ్దంగా వుండమని చెప్పాడు. వారు అతని మాట విని ప్రసంగం వినసాగారు.

"ఇది కేవలం ఆనకట్టకు సంబంధించిన విషయం మాత్రమే కాదు. ఇది సామూహిక నిర్మాణానికి ప్రతీక. సామూహిక సంకల్పానికి, జాతీయ చైతన్యానికి ప్రతీక. ఇది దేశపు ఆస్తి. జమిందారు వర్గీయులు దీనిని దోచుకోవటానికి నిరంతరం ప్రయత్నం చేస్తూనే వుంటారు దీనిని అడ్డుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇటువంటి ఆనకట్టలనుండే వారిని అంతం చేసే పెను వరద ఒకటి వస్తుందని వారికి తెలియచెప్పాలి.

జమిందారు, అతని సహచరులే ఈ అకృత్యం చేసివుంటే నేరం కేవలం వారిది మాత్రమే కాదు వారు చేసిన ఈ దుర్మార్గాలను మౌనంగా ఇంతవరకు సహించిన మనమందరంకూడా దోషులమే. మనం రాజకీయ నాయకుల అకృత్యాలను చాలాకాలంగా చూస్తూనే వున్నాం. చూస్తూ ఉద్యోగస్తులు కూడా లంచాలు తీసుకుని వారికి మద్దతు ఇస్తున్నారు. వారూ ఇందులో దోషులే. సామాజిక జీవితంలో నీతి, నిజాయితీల అవసరం ఎంతైనా వుంది. వాటంతట అవి రాకుంటే వాటిని పెంపొందించవలసిన అవసరం వున్నది.

ఈ రోజు మనకు కావలసింది నిజాయితీ, నైతిక విలువలు ఇవి సామూహిక, వ్యక్తిగత స్థాయిలలో అవసరం.

మనం ఈ రోజే నడక ప్రారంభించాం. మనం శక్తిమంతులం కాదు. మనం చాలా దూరం పయనించవలసి వున్నది. మనం ఆత్మవిశ్వాసాన్ని పెంచుకుంటే ప్రపంచంలో ఏ శక్తి మనలను దారి మళ్ళించలేదు.

పరస్పరం ఒకరిపై ఒకరు ఆధారపడకుండా ఎవ్వరూ వుండలేరు. అయితే ఒక వ్యక్తి ప్రక్కవాడిని దోచుకోవటాన్ని మనం వ్యతిరేకించాలి. వ్యతిరేకించి తీరుదాం."

ప్రసంగం చివరకు వచ్చేసరికి రాజగోపాలరావు గొంతు స్థాయి పెంచాడు. అతనిలో భావావేశం, అందులో దృఢ నిశ్చయం తొంగిచూసాయి.

"సోదర సోదరీమణులారా! మీరు చాలా సేపటి నుండి ప్రసంగాలు వింటున్నారు. మీ శక్తిని మీరు గుర్తించండి మీలో చైతన్యాన్ని రగుల్కొల్పండి. మనమంతా జమిందారును దోషిగా నిర్ణయించాం. ఒకవేళ న్యాయస్థానం అతనిని శిక్షించకపోతే మనమే శిక్షిద్దాం. మన దృష్టిలో, గ్రామ దృష్టిలో దోషి అయిన జమిందారును గ్రామంనుండి బహిష్కరిద్దాం"

రాజగోపాలరావు తన ప్రసంగం ముగించి కూర్చున్నాడు. సభికులు కరతాళధ్వనులు చేస్తూ రాజగోపాలరావుకు అభినందనలు తెలియచేసారు. ఈలోగా కోట ద్వారం వద్ద కలకలం మొదలయ్యింది. అందరు ఆ వైపుకు పరుగెత్తారు. ఆ గ్రామంలోని కొందరు యువకులు జమిందారు గడ్డిబొమ్మ తయారుచేసి అక్కడకు తెచ్చారు. జమిందారు శక్తికి, అధికారానికి కేంద్రమయిన ఆ కోటలోనే జమిందారు గడ్డిబొమ్మను వాళ్ళు తగలబెట్టసాగారు. కొద్ది క్షణాలలోనే ఆ గడ్డిబొమ్మ తగలబడి బూడిదైపోయింది.

సభ ఒక ఉత్సవంలాగా ముగిసింది. రాజగోపాలరావు ఆ గుంపుతో పాటు కోట బయటకు నడిచాడు. మిగిలినవా రందరూ అతనిని అనుసరించసాగారు. అయితే అతని మిత్రుడు కోటేశ్వరరావు మాత్రం వడిగా నడుస్తూ వేరే మార్గం వైపు వెళ్ళిపోయాడు

నలుగురు మనుషులు పోగైన ప్రతిచోటా ఈ సభ గురించే చర్చ. జమిందారు సంబంధీకులంతా తలుపులు వేసుకుని తమ తమ ఇళ్ళల్లో దాక్కున్నారు. సామంతీయ వ్యవస్థలో కూరుకుపోయిన ఈ పల్లెటూరి నిరక్షరాస్యులకు ఒక్కసారిగా కళ్ళు తెరిచినట్లయ్యింది. వారు తమ జమిందారును ఇప్పుడు అన్నదాతగా భావించటం లేదు. దోపిడిదారుగా చూస్తున్నారు. ప్రజలు రెచ్చిపోయినప్పుడు చట్టాలకు నష్టం జరుగుతున్న సంగతి రాజగోపాలరావుకు తెలుసు. ఇప్పుడు ప్రజలు రెచ్చిపోయి వున్నారన్న సంగతి కూడా అతనికి తెలుసు.

పోలీసులు వెనక్కు వెళ్ళిపోయారు. భవనంలో ఎవరూ లేరు, అయినా రాజగోపాలరావుకు నిదురపట్టలేదు. భవనంలో వున్న ఒకరిద్దరు నౌకర్లను భయపెట్టి ఎవరైనా ఆ భవనాన్ని దోచేస్తారనో, నాశనం చేస్తారనో, ఒకవేళ ఆ విధంగా జరిగితే అది గ్రామానికి మంచిది కాదని రాజగోపాలరావు భావించాడు. మహల్‌లో ఏమీ లేకపోవచ్చు. ఉన్న కొత్త-పాత నగలు, విలువైన వస్తువులు ఏనాడో

మద్రాసు తరలించబడ్డాయి అవన్నీ వడ్డీ వ్యాపారస్తుల బీరువాలలో జాగ్రత్తగా వుండే వుంటాయి. అయినా భవనం భవనమే కదా! గతించిన వైభవాల చిహ్నంగా మిగిలిన భవనమది.

రాజగోపాలరావు, అతని సోదరుడు, మిత్రులతో కలసి చాలాసార్లు కోట లోని భవనానికి వెళ్ళారు. అందుచేత రాజగోపాలరావు, అతని సహచరులు కోటకు మరల ఎందుకు వెళుతున్నారో గ్రామంలోని చాలామందికి అర్థంకాలేదు. జమిందారు ఆనకట్టను బ్రద్దలు కొట్టించినట్లే, రాజగోపాలరావు కూడా ఆ మహల్‌ను డైన మెట్‌తో పేల్చివేయటానికి వెళుతున్నాడేమో నని కొందరు భావించారు. కాని రాజగోపాలరావు ఉద్దేశ్యం అదికాదు. ఎవరైనా భవనానికి నష్టం కలగచేస్తారేమో నని అతని భయం. అతని దృష్టిలో ఆ భవనం గ్రామానికి చెందిన సంపత్తి. అందుచేతనే దానిని రక్షించటం తన బాధ్యతగా భావించాడు.

అన్నపూర్ణకిచ్చిన మాట ప్రకారం రాజగోపాలరావు హైదరాబాద్ వెళదా మనుకున్నాడు కాని గ్రామంలో తాను లేకుంటే అల్లర్లు హత్యలు జరుగుతా యేమోనని ఆలోచించసాగాడు. ప్రజల ఆగ్రహం చూస్తుంటే జమిందారు బంధువుల ప్రాణాలకు నష్టం జరుగుతుందనిపించింది రాజగోపాలరావుకు అటువంటిదేదైనా జరిగితే గ్రామం మొత్తం నష్టపోతుందని, ప్రజలు, ప్రభుత్వం అసలు విషయాలు మరచిపోతారని, అనవసరపు గొడవలకు ప్రాధాన్యత లభిస్తుందని, అభివృద్ధి కార్యక్రమాలు కుంటుబడిపోతాయని భయపడుతున్నాడు.

తన మిత్రుడు, ప్రక్క నియోజక వర్గపు శాసన సభ్యుడు కోటేశ్వరరావు తనమీద అలిగాడని రాజగోపాలరావుకు తెలుసు. ఇనుము కాలివున్నప్పుడు సమ్మెట దెబ్బ వేయకుండా రాజగోపాలరావు నీళ్ళుచల్లాడని కోటేశ్వరరావు ఉద్దేశ్యం. జమిం దారును నాశనం చేసే ఒక మంచి అవకాశాన్ని రాజగోపాలరావు పాడు చేసాడని కోటేశ్వరరావుకు కోపంగా వుంది. తాను గ్రామంలో లేకపోతే ఆయన మరల గ్రామస్తులను రెచ్చగొడతాడేమోనని రాజగోపాలరావు భయం. ఆ కారణంగా వాతావరణం చల్లబడేవరకు రెండు మూడు రోజులు గ్రామంలోనే వుండటం మంచి దని భావించాడు.

అన్నపూర్ణ యింటి గోడలపై ఆమెను నిందిస్తూ అసభ్యమైన పదాలతో వాల్‌పోస్టర్లు అంటించి వుండటం రాజగోపాలరావు చూసాడు.

"గ్రామం తగలబడిపోతున్నది. అన్నపూర్ణ జమీందారు మందిరంలో వీణ వాయిస్తూ వున్నది."

"పిల్లి హాజ్ యాత్రకు వెళ్ళింది."

ఈ విధమైన రకరకాల వ్రాతలు గూడా గోడలమీద వ్రాయబడ్డాయి. శక్తిమంతుడైన జమీందారు ప్రభావాన్ని బూడిదచేసిన ప్రజాచైతన్యం అన్నపూర్ణను వదిలిపెట్టలేదు.

తాను గ్రామం వదిలివెళితే అన్నపూర్ణ ఇంటిని తగలబెట్టేస్తారని కూడా రాజగోపాలరావుకు అనుమానం కలిగింది. ఇటువంటి మంచి అవకాశాన్ని వాళ్ళు వదులుకోరనిపించింది.

అతని మనస్సు రకరకాల ఆలోచనలతో నిండిపోయింది. తనను గ్రామంలో నాయకుడుగా ప్రజలు భావించసాగారు. జమిందారు స్థానంలో ఆతనిని తమ సర్వస్వంగా ప్రజలు భావించసాగారు గ్రామానికి సంబంధించిన ప్రతి చిన్న విషయాన్ని గురించి ఆలోచించవలసిన కొత్త బాధ్యత రాజగోపాలరావుపై బడింది. అతనిలో కొత్త ఉత్సాహం, ఉత్తేజం ఉరకలు వేస్తున్నది. అతను ఎప్పుడూ అల్లరి చిల్లరగా వ్యవహరించనప్పటికీ, ప్రస్తుతం మరింత గంభీరంగా మారిపోయాడు. ప్రతి అడుగూ ఆచి తూచి వేయసాగాడు.

రాజగోపాలరావు ప్రతి విషయాన్ని కొత్త దృష్టితో ఆలోచించసాగాడు. ఈరోజు ఇక్కడ జరిగితే, మరోరోజు మరొకచోట జరగవచ్చు. మనది సామంతీయ వ్యవస్థ కాదు. వ్యవసాయ ప్రధానమైన ఈ దేశంలో హెచ్చు తగ్గుల తేడాలు కూడా పోవాలి. పాత వ్యవస్థ పతనం, కొత్త వ్యవస్థ నిర్మాణం రెండూ ఒకేసారి జరుగకపోవచ్చు.

ఒక్కొక్కసారి పాత వ్యవస్థ చాలా వేగంగా పతనం చెందుతుంది. అయితే దాని స్థానంలో రావలసిన నూతన వ్యవస్థ అంత వేగంగా పుంజుకోకపోవచ్చు.

రాజగోపాలరావు వెళ్ళిన ప్రతి చోటుకు యువకులు పెద్ద సంఖ్యలో అనుసరించసాగారు. అతని సోదరుడు కూడా తరచుగా అతని వెంట వుంటున్నాడు. రాజగోపాలరావును ఒంటరిగా వెళ్ళనీయటంలేదు. ఆటవిక పద్ధతులు మినహా ఏమీ తెలియని జమిందారు మనుష్యులు మరల రాజగోపాలరావును దొంగదెబ్బ తీస్తారేమోనని వాళ్ళ భయం.

రాజగోపాలరావుకు ఆ గ్రామంలో రక్షణ అవసరం లేదు. పైగా ఈ అనుయాయుల గుంపు అతని స్వేచ్ఛకు భంగంగా వున్నది. తన వైపు ప్రజలకు ఇంత మూఢ భక్తి వుండటం కూడా అతనికి ఇష్టం లేదు.

నాయకులపట్ల అంతులేని అభిమానం, భక్తి పెంచుకొనే కారణంగానే అనుచరులు తమ ఊహలకు భిన్నంగా, ఆ నాయకులు లేనప్పుడు తీవ్రమైన నిరాశకు గురి అవుతూ వుంటారు. నాయకులు కూడా మనవంటి మనుష్యులేనని, వాళ్ళకు కూడా మానవ సహజమైన బలహీనతలుంటాయని భావిస్తే మన దేశపు సామాజిక జీవితంలో ఈరోజు వున్నంత దగా, మోసం వుండవు. రాజగోపాలరావుకు ఇవన్నీ తెలిసినా ఏమి చెయ్యలేని నిస్సహాయస్థితిలో వుండిపోయాడు.

కోటేశ్వరరావు తన గ్రామానికి వెళ్ళిపోయాడు రాజగోపాలరావు అతనిని చూడాలనుకున్నాడు రాజగోపాలరావు అతని కోసం కబురు పంపాడు. అతను గ్రామంలో లేడని, ఎక్కడకు వెళ్ళాడో తెలియదని సమాచారం అందింది. కోటేశ్వరరావు ఉద్దేశ్యమేమిటో రాజగోపాలరావుకు అంతుపట్టటం లేదు

రాత్రి చీకటి పడిన తర్వాత వీధులన్నీ నిర్మానుష్యమైన పిమ్మట, రాజగోపాలరావు ఒంటరిగా యింటినుండి బయలుదేరాడు

"ఇప్పుడు ఎక్కడకు వెళుతున్నావు?" రాజగోపాలరావును సోదరుడు ప్రశ్నించాడు.

"కోటేశ్వరరావును కలవటానికి."

"ఆయన ఊరిలో వుంటే వచ్చేవాడు కదా! అయినా ఇంత చీకటిలో దేనికి? రేపు ఉదయం వెళ్ళవచ్చు కదా?"

"రేపు ఉదయం నన్ను ఒంటరిగా ఎవరు వెళ్ళనిస్తారు? అయినా ఇంకా ఆఖరు బస్సు వెళ్ళలేదు."

"తిరిగి ఎట్లా వస్తావు?"

"రాను. రాత్రికి అక్కడే వుంటాను."

"ఆయన అక్కడ లేకపోతే?"

"లేకపోతే ఎవరో ఒకరు వుంటారు కదా? ఆమాత్రం రాత్రికి ఆ గ్రామంలో ఆశ్రయం దొరకదా?"

వేణుగోపాలరావు ఏమి మాట్లాడలేకపోయాడు. రాజగోపాలరావు ముందుకు సాగిపొయ్యాడు.

రాజగోపాలరావు బస్సు స్టాండుకు చేరుకునేసరికి అతని అన్న కుమారుడు అక్కడకు వచ్చాడు. రాజగోపాలరావు అతనిని వెనుకకు పంపలేకపోయాడు.

ఇంతలో బస్సు వచ్చింది ఇద్దరూ బస్సు ఎక్కారు.

కోటేశ్వరరావు ఆ తాలూకాలో పలుకుబడి కలిగిన వ్యక్తులలో ఒకడు. రాజగోపాలరావుకు మంచి మిత్రుడు. దాదాపు ఇద్దరి ఆదర్శాలు ఒక్కటే. ఒకే కులం వారు. ఆయన సోషలిస్టు పార్టీ సభ్యుడు. కాని రాజగోపాలరావుకు ఏ పార్టీతోనూ సంబంధం లేదు. అతనికి సోషలిస్టులతో, గాంధీవాదులతో ఇద్దరితోను సిద్ధాంత పరమైన కొన్ని విభేదాలున్నాయి.

రాజగోపాలరావు బస్సులో ఒక కునుకు తీసాడు. బస్సు గ్రామం చేరేసరికి అతని మనస్సు కొంచెం ప్రశాంతంగా వుంది.

కోటేశ్వరరావు ఇంటిలో లేడు. అతని భార్య రాజగోపాలరావును పరామర్శించి, బయట మంచం వాల్చి, విశ్రాంతి తీసుకోమని చెప్పి, తన ఇంటిపనులలో మునిగిపోయింది. ఆమెకు ఇంటిలో నౌకర్లు ఎవరూ లేరు. ఉదయం నుండి సాయంత్రం వరకు అన్ని పనులు ఒక్కతే చేసుకుంటుంది. నలుగురు పిల్లల పోషణభారం కూడా పూర్తిగా ఆమెదే వయస్సు ముప్పై రెండు సంవత్సరాలే అయినా నలభై, నలభై అయిదు సంవత్సరాల వయస్సు వున్నదానిలా కన్పిస్తుంది.

ఆ ఇంటిలో సంపన్న లక్షణాలేవీ కన్పించటం లేదు. వైభవ చిహ్నాలైన ఏ వస్తువులూ అక్కడ లేవు. మాగాణి భూమిలో, రోడ్డు ప్రక్క వున్న పూరిల్లు.

కోటేశ్వరరావు చిన్నరైతు అతని తండ్రి, పొలాలలో వ్యవసాయ కూలీగా పనిచేస్తూ వుండేవాడు. కోటేశ్వరరావుకు నలుగురు సోదరులు. వాళ్ళు ఇప్పటికీ కూలిపనికి వెళుతూవుంటారు. వారికి ఒక్క సెంటు భూమి కూడా లేదు. పేదరికంలో పుట్టారు పేదరికంలో పెరిగారు పేదరికం తప్ప వేరే ఏమి ఎరుగరు.

కోటేశ్వరరావు అతి కష్టం మీద హైస్కూలు చదువు పూర్తి చేసాడు. కుటుంబమంతా అతని చదువును సహాయపడింది. స్కూలులో చదువుతూ వుండ

గానే సోషలిస్టు అని ముద్రవేసి స్వతంత్ర భారతదేశపు పోలీసులు హింసించారు. అప్పటినుండి సోషలిస్టు రాజకీయాలకు అంకితమైపోయాడు.

అతని సిద్ధాంతాలు, ఆదర్శాలు ఎట్లా వున్నా నీతికి, నిజాయితీకి పెట్టింద పేరు. నిస్వార్థ ప్రజాసేవకుడు.

అతని భార్య స్థానిక పాఠశాలలో ఉపాధ్యాయినిగా పనిచేయకుండా వుంటే, ఆ కుటుంబం పేదరికంతో క్రుమ్మగ్గిపోయి వుండేదే యం.ఎల్ ఏ గా అతనికి వచ్చే జీతం రాజకీయాలకు ఖర్చైపోతూ వుంటుంది.

గొప్పతనం యొక్క నిర్వచనం మనిషి మనిషికి మారిపోతూ వుంటుంది. కోటేశ్వరరావు చాలా మంది దృష్టిలో గొప్పవాడు అతని కోసం ప్రాణాలు సైతం అర్పించే అనుయాయులు చాలా మంది వున్నారు అతనికి రాజగోపాలరావంటే చాలా అభిమానం, గౌరవం వున్నాయి.

రాజగోపాలరావు కోటేశ్వరరావు ఇంటి బయట తాటిచెట్టు క్రింద మంచం మీద విశ్రాంతి తీసుకుంటున్నాడు. అతిథులొస్తే వుండటానికి వీలులేనంత చిన్న యిల్లు అది. ఇల్లు అనేదానికంటే దానిని పెద్ద గుడిసె అంటే బాగుంటుంది పిల్లలు గుడిసె బయట పేడతో అలికిన అరుగుల మీద పడుకుని వున్నారు.

కొంచెం సేపటికి అక్కడ కుక్కలు ఒక్కసారి మొరిగి నిశ్శబ్దమై పోయాయి. కోటేశ్వరరావు అక్కడకు వచ్చాడు రాజగోపాలరావును చూడగానే అతనికి ఆశ్చర్యం, సంతోషం రెండూ కలిగాయి.

"మీరొచ్చి ఎంత సేపయ్యింది? చాలాసేపు వేచి వున్నారా? పార్వతీ! ఈయనకేమయినా తింటానికి పెట్టావా?" కోటేశ్వరరావు రాజగోపాలరావును పరామర్శించి, భార్యను పిలిచి అడిగాడు.

"మేము ఇప్పుడే వచ్చాం. భోజనం చేసే వచ్చాం. నువ్వు భోజనం చెయ్యి."

"నేను పట్టణంలో భోజనం చేసే వచ్చాను. నేను ముందుగా వచ్చివుంటే ఈపాటికి మీరు మీ గ్రామం వెళ్ళిపోయి వుండేవారు. ఆఖరు బస్సు కూడా వెళ్ళి పోయింది. మిమ్మలను చాలా ఇబ్బంది పెట్టాను."

"నువ్వు అలసిపోయివచ్చినట్లున్నావు. విశ్రాంతి తీసుకో."

"పర్వాలేదు చెప్పండి, మీరేదో పనిమీద వచ్చినట్లున్నారు."

"ఊరేగింపు, మీటింగు అయిపోయాయి గదా! మనం హైదాబాద్ వెళ్ళి ముఖ్యమంత్రిని కలసి విషయమంతా ఒక్కసారి ఆయనకు తెలియచేస్తే బాగుంటుందని నా అభిప్రాయం నువ్వేమంటావు?"

"ఫలితం ఏమి ఉండదనుకోండి.... అయినా మనం కర్రతీసుకుని వెంటబడకపోతే ఎవ్వరూ కదలరు."

"అందుకే ముఖ్యమంత్రిని ఆఖరుసారిగా కలుద్దామని నా అభిప్రాయం."

"మీరు వెళ్ళిరండి."

"నాతోపాటు ఎవరైనా యం.ఎల్.ఏ.ని తీసుకువెళితే బాగుంటుందనుకుంటున్నాను. అన్నపూర్ణ ఈ గొడవలో ఒకవైపు కూరుకుపోయిందని నీకు తెలుసు కదా! నువ్వువస్తే బాగుంటుంది."

కోటేశ్వరరావు సంకోచిస్తూ "సరే, చూద్దాంలెండి. మీరు నిద్రపొండి. మా యింటిలో ఇంతకంటె పెద్దమంచం లేదు, చోటు లేదు. ఏదో విధంగా సర్దుకోండి."

"నాతో నువ్వువస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం."

"మీ మాట నేను ఎప్పుడు కాదన్నాను? మీ యిష్టం. మనం రేపే బయలుదేరుదాం."

కోటేశ్వరరావు ఇంటిలోనికి వెళ్ళిపోయాడు.

రాజగోపాలరావు మనస్సు ఇప్పుడు తేలికగా వుంది. ఏదోవిధంగా కోటేశ్వరరావును తనతో తీసుకువెళదామని నిర్ణయించుకున్నాడు. అతను లేకుంటే ఏ విధమయిన హింసకు దిగటానికి ఎవరికీ ధైర్యం వుండదని రాజగోపాలరావుకు తెలుసు.

రాజగోపాలరావుకు ఒక సమస్య తీరిపోయింది. ప్రక్క లేకపోయినా, తలగడ లేకపోయినా అతను ప్రశాంతంగా నిద్రపోయాడు.

# 37

"రండి, రండి. ఏమిటి విశేషాలు? మీరు ఇప్పుడు పూర్తిగా కోలుకున్నారను కుంటాను. అందరూ క్షేమమే కదా!" రాజగోపాలరావు తన గదిలో అడుగు పెడుతూనే ముఖ్యమంత్రి ప్రశ్నలవర్షం కురిపించారు.

"బాగానే వున్నాను. మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి"

"రావుగారూ! మీరెట్లావున్నారు?" కోటేశ్వరరావును అడిగారు ముఖ్యమంత్రి.

"బాగానే వున్నాను."

ముఖ్యమంత్రి అసలురంగు తెలియకపోతే ముఖ్యమంత్రి చూపిన ఆదరణకు వీళ్లు కరిగిపోయి వుండేవారే. ముఖ్యమంత్రితో ఇంటర్వ్యూ దొరకటం కూడా ప్రస్తుతం అంత తేలిక కాదని వారికి తెలుసు.

"మీ యిద్దరూ ఆలోచించినంత తీవ్రంగా నేను కూడా జమిందారును గురించి ఆలోచిస్తున్నాను."

"మాకు చాలాసంతోషంగావుంది. మీరు ఆ దోషిని శిక్షించేదానికి ప్రభుత్వ స్థాయిలో చర్యలు తీసుకుంటే మేమేకాకుండా ప్రజలంతా సంతోషిస్తారు. జమిందారు చేసిన పనులకు ఆయనను బందిపోటుంకంటే కూడా కఠినంగా చూడాలి." రాజగోపాలరావు ముఖ్యమంత్రితో దృఢంగా చెప్పాడు.

"బహుశా ఈ రోజుల్లో స్టాలిన్ కూడా ఆ విధంగా చెయ్యలేదనుకుంటాను."

"స్టాలిన్ సంగతి వదిలివెయ్యండి. మన ఉద్యోగ వ్యవస్థ, అధికార వ్యవస్థ స్టాలిన్ కంటే కూడా శక్తివంతంగా, నిరంకుశంగా వ్యవహరిస్తున్నాయి." కోటేశ్వరరావు కొంచెంకరుకుగా సమాధానమిచ్చాడు.

ముఖ్యమంత్రికి కోపం వచ్చినా, కనబడనీయకుండా తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు నవ్వాడు.

రాజగోపాలరావు వాతావరణాన్ని తేలిక పరుస్తూ "ఇప్పుడు పరిస్థితులు మారిన విషయం యదార్థమే. అయితే ఆనకట్ట దుర్ఘటనవల్ల ధ్వంసం కాలేదని,

కావాలని దానిని నాశనం చేసారని, ఎవరు చేసారో, ఎవరు చేయించారో రామయ్య, ఏసుదాసు గ్రామంలో బహిరంగ సభలో చెప్పారు" అని అన్నాడు.

"నేను దానిని కాదనటం లేదు. నాకు ఆయనతో ఏవిధమైన సంబంధం వున్నా, ఆయన చేసిన నేరం ఋజువైతే ఆయనకు కఠిన శిక్ష విధింపబడాలనే నేను కోరుకుంటాను. అధికారంలో వున్న ప్రతివారూ తాము చేసే ప్రతి పనికి ప్రజలకు, శాసన సభకు బాధ్యులై వుంటారు. చట్టం ప్రకారం నేను చేయవలసినదంతా చేస్తాను. అయితే రామయ్య, ఏసుదాసుల సాక్ష్యం సరిపోదు. వాళ్ళ సాక్ష్యం ఏ కోర్టులోనూ చెల్లదు. వాళ్ళు సభలో చెప్పిన విషయాలు నాకు తెలిసాయి."

"గ్రామంలో జరిగిన సభకు సంబంధించిన నివేదిక అప్పుడే మీకు వచ్చేసిందా?"

"ఆ-వచ్చింది. కాకపోతే అది అధికార రహస్యం."

"పోలీసులు తమ కనీస కర్తవ్యం నిర్వహించారన్నమాట! సంతోషించవలసిన విషయమే!" కోటేశ్వరరావు అన్నాడు.

"రామయ్యకు జబ్బుగా వుందని చెప్పాడు. అంత జబ్బుగా వున్న వ్యక్తి చీకటిలో మనుష్యులను గుర్తించటం చాలా కష్టం. పైగా డైనమెట్ పెట్టిన ముఖ్యమైన సాక్షి, అక్కడే ముక్కలు ముక్కలైపోయాడని రామయ్య చెప్పాడు కదా?"

"కాని ఈ దుర్మార్గం చేయించిన వ్యక్తి ఇంకా జీవించే వున్నాడు కదా?" రాజగోపాలరావు అన్నాడు.

"అవునవును. మేము చట్టం ప్రకారం అవసరమైన చర్యలన్నీ తీసుకుంటాం. సి. ఐ. డి. ల ద్వారా విషయాలు సేకరిస్తున్నాను. నేను మీ దగ్గర ఏ విషయం దాచాలనుకోవటంలేదు. నాకూ, మీకూ బాధ కలిగించే విషయమొకటి మీకు చెపుతాను. ఈ కేసులో అతి ప్రధానమైన వ్యక్తి, ముఖ్యసాక్షి, ఇప్పుడు భారత దేశంలో లేడు. ఆఫ్రికా పారిపోయాడు."

"ఎవరు? రైట్ పారిపోయాడా?" రాజగోపాలరావు, కోటేశ్వరరావు ఇద్దరూ నిశ్చేష్టులైపోయారు.

"ఈ పని చేసిన, అదే-ఆనకట్ట నిర్మాణం చేసిన కాంట్రాక్టు కంపెనీ కూడా మూతపడిపోయింది."

"జమిందారు వున్నాడు కదా?"

"ఆయనకు వ్యతిరేకంగా ఏ సాక్ష్యమూ లేదు. పైగా ఆయన ఆ రోజు గ్రామంలో లేడు. ఆయన అనారోగ్యంతో వున్నాడు. అనారోగ్యంగా వున్నా, ఆరోగ్యంగా వున్నా చట్టంనుండి తప్పించుకోలేరనుకోండి. అయితే మీరు మొదటి నుండి జమిందారును బహిరంగంగానే నిందిస్తున్నారు. అటువంటి అభిజాత్యం కలిగిన ఉన్నతవర్గాలవారిని శారీరకంగా చంపవలసిన పని లేదు. బహిరంగంగా నిందలు భరిస్తే వారు చనిపోయినవారితో సమానమే అయినా మేము చట్టపరంగా శిక్షించకుండా వదలమనుకోండి!"

"ఆయనకు ఏమి జబ్బు చేసింది? హార్ట్ ఎటాక్ రాలేదు కదా!" రాజగోపాల రావు ప్రశ్నించాడు.

"మీ అనుమానం సరైనదే."

"ఆయన చట్టం నుంచి తప్పించుకోవటానికి అస్పత్రికేం ఖర్మ, అవసర మనుకుంటే పిచ్చి ఆసుపత్రికి కూడా వెళ్ళగలడు." కోటీశ్వరరావు తన కోపం వెళ్ళగక్కాడు.

ముఖ్యమంత్రి బిగ్గరగా నవ్వారు.

"ఏది ఏమైనా ముఖ్యమంత్రిగా నేను నా బాధ్యత నెరవేరుస్తాను. దోషులు నాకు స్నేహితులైనా విడిచిపెట్టటం జరగదు. మీరు ఈ విషయాన్ని మీ మిత్రులకు చెప్పండి."

"జమిందారు వర్గానికి చెందిన చాలా మంది ఈ దేశాన్ని నాశనం చేస్తు న్నారు. మనం అవినీతిని అంతమొందించకపోతే మన ప్రజాస్వామ్యమే ప్రమా దంలో పడిపోతుంది." కోటేశ్వరరావు ఇంత స్పష్టంగా ముఖ్యమంత్రితో మాట్లా డటం రాజగోపాలరావుకు ఆశ్చర్యం కలిగించింది.

"అవును, అవినీతి పిచ్చిగడ్డిలా పెరిగి పోతున్నది. పీకిన కొద్దీ పెరుగు తున్నది. అయితే పరిస్థితి ఎప్పుడూ ఒకలాగా వుండదు ప్రసాద్‌వంటి నిజాయితీ గల ఆఫీసర్ల ద్వారా అవినీతిని అంతమొందించటానికే నేను కంకణం కట్టు కున్నాను."

"ప్రసాద్‌వంటి ఉన్నత అధికారులు ఎంతమంది వుంటారు?"

"కొద్దిమందే వుంటారు. మన విద్యలో శీల స్వభావాలకు ప్రాధాన్యత యిచ్చేవరకు ఈ పరిస్థితి తప్పదు. యువతను మంచిగా తీర్చిదిద్దవలసిన బాధ్యత మనమీద వున్నది." రాజగోపాలరావు ఈ విధంగా చెపుతూనే వున్నాడు. ముఖ్యమంత్రి తన దృష్టి మరలించుకుని గది కప్పువైపు చూడసాగారు.

"అన్నపూర్ణ ఎక్కడ వుంది? ఆమెను చూసి చాలా రోజులయ్యింది." ముఖ్యమంత్రి విషయం మారుస్తూ ప్రశ్నించారు.

"ఆమె మిమ్ములను కలసి, విచారణ సంఘపు నివేదిక మీకు యిచ్చి వుంటుందని మేము భావించాము." రాజగోపాలరావు సమాధానమిచ్చాడు.

"ఆమె ఆ విధంగా చేసివుంటే బాగుండి వుండేది."

"ఆమెకు ఇందులో భాగం లేకపోవచ్చు. ఆమె అమాయకురాలే కావచ్చు. కాని అనుమానాలకు అతీతంగా మాత్రం లేదు. తోడేళ్ళ మధ్య వుండవలసివచ్చినపుడు జాగ్రత్తగా వుండాలన్న విషయం ఆమె తెలుసుకుని ఉంటే బాగుండి వుండేది." కోటేశ్వరరావు మాటలకు ముఖ్యమంత్రి పగలబడి నవ్వారు.

"ఆమెకు కుట్రలో భాగం లేకపోయినా నిరపరాధి అని చెప్పలేము. జమిందారు ఆమెకు ఏమీ తెలియకుండా చేసి వుండవచ్చు. కాని దర్యాప్తు సంఘపు అధ్యక్షురాలిగా ఆమె తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించలేదు." రాజగోపాలరావు ముఖ్యమంత్రి కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు. ముఖ్యమంత్రికి ఈ ప్రసంగం అంతగా రుచించినట్లు లేదు.

"అట్లా అని మీరు ఎందుకు భావిస్తున్నారు?" ముఖ్యమంత్రి రాజగోపాలరావును ప్రశ్నించారు.

"జమిందారు అకృత్యాలు బయటపెట్టిన రామయ్య, ఏసుదాసు ఆమె దగ్గరకు కూడా వెళ్ళారు. ఆమెకు కూడా ఈ విషయాలు చెప్పారు. అయితే వాళ్ళు జమిందారుకు చెడ్డపేరు తేవటానికే కథ అల్లారని ఆమె భావించింది."

"అలాగా!"

"అంతేకాదు, ఆమె జమిందారు పక్షం వహించింది. అతని గుప్పెట్లో చిక్కుకుని, అతను ఆడించినట్లల్లా ఆడింది. శాసన సభ్యురాలుగా అది చాలా తప్పు.

ఆమె గ్రామంలో ఎక్కువ కాలం గడపకుండా అటూ ఇటూ తిరుగుతూ కాలం వెళ్ళబుచ్చింది."

"మీరు నిశ్చింతంగా వుండండి. నేను చేయవలసినదంతా చేస్తాను. రాజగోపాలరావుగారూ! మీరు ఎక్కడ వున్నారు?" ముఖ్యమంత్రి గడియారం చూసుకున్నారు.

"ఇవ్వాళే వచ్చాం. కోటేశ్వరరావు దగ్గర యం.యల్.ఏ. క్వార్టర్సులో వున్నాను. ఈయన లేకుంటే బహుశా రైల్వే ప్లాట్‌ఫారం మీదే వుండవలసి వచ్చేది." రాజగోపాలరావు నవ్వుతూ అన్నాడు.

ముఖ్యమంత్రి, కోటేశ్వరరావు కూడా నవ్వారు.

"ప్రభుత్వం యం.యల్.ఏ. లకు తమ తమ ఊళ్ళల్లో ఇళ్ళు కట్టుకోవడానికి గ్రాంటు యిస్తే బాగుంటుందేమో! మనం పేరుకు ప్రజాప్రతినిధులం. అయితే ప్రజలవలె సాధారణంగా జీవితం గడపటం మాత్రం మనకిష్టముండదు. రాజా, మహారాజాల్లా జీవించాలనుకుంటాం. బహుశా ఇళ్ళు కట్టుకోవటానికి నిధులు కూడా త్వరలోనే మా శాసన సభ్యులు అడుగుతారనుకుంటాను." కోటేశ్వరరావు గొంతులో వ్యంగ్యం తొంగిచూసింది.

"భలేవాడివే! ఈ సలహా మాత్రం మన మిత్రులకు ఇవ్వవద్దు. అసలే మన ప్రభుత్వం దగ్గర నిధులు లేవు. వుంటాను. మీరు కొద్దిరోజులు ఇక్కడ వుంటే మరల కలవండి. పి.ఏ.కి ముందుగా ఫోను చేసి అపాయింట్‌మెంట్ తీసుకోండి." ముఖ్యమంత్రి వారితోపాటు గది గుమ్మందాకా వచ్చి చేతులు జోడించి శలవు తీసుకున్నారు.

రాజగోపాలరావు, కోటేశ్వరరావు యం. యల్. ఏ క్వార్టర్సుకు వెళ్ళిపోయారు.

# 38

వాళ్ళిద్దరూ యం యల్ ఏ. క్వార్టర్సుకు వెళ్ళేసరికి అన్నపూర్ణ తన భర్తతో టాక్సీ దిగుతున్నది. రాజగోపాలరావు వాళ్ళకోసం ఎదురు చూస్తున్నట్లు వాళ్ళకు తెలియదు.

అన్నపూర్ణ తన భర్తతో ఆ అమ్మాయి గురించి మాట్లాడటానికి ముందే తాను అన్నపూర్ణతో మాట్లాడితే మంచిదని రాజగోపాలరావు భావించాడు. వాళ్ళు ముందు నడుస్తున్నారు. రాజగోపాలరావు వేగంగా నడవలేకపోతున్నాడు. అది చూసి కోటేశ్వరరావు వేగంగా నడిచి అన్నపూర్ణ దగ్గరకు వెళ్ళి రాజగోపాలరావు వెనుకవున్న సంగతి చెప్పాడు. అన్నపూర్ణ ఆగి వెనుకకు తిరిగి చూసింది. భర్తను నడుస్తూ వుండమని చెప్పి తాను రాజగోపాలరావు దగ్గరకు వెనకకు వెళ్ళింది. ఆమె చాలా ఆకర్షణీయంగా వుంది. రాజగోపాలరావును చూసిన తర్వాత ఆమె కళ్ళల్లో కొత్తకాంతి వచ్చింది.

"నువ్వు కోరినట్లే నీ సమస్య పరిష్కారమైనట్లుంది." రాజగోపాలరావు అన్నపూర్ణతో అన్నాడు.

"కొంతవరకు. ఆ అమ్మాయి మీద వ్యామోహం కొంచెం తగ్గినట్లుంది." అన్నపూర్ణ రహస్యం చెబుతున్నట్లు రాజగోపాలరావు చెవిలో చెప్పింది.

"ఇప్పుడు పూర్తిగా పోతుంది. ఆ అమ్మాయిని మేము బస్సులో పంపించి వేశాం."

"ఆ అమ్మాయి వెళ్ళిపోయిందా? ఏం చెప్పి పంపారు?" అన్నపూర్ణ ఆశ్చర్యంతో అడిగింది. ఆమె మనస్సు ఆనందంతో నిండిపోయింది.

"మీరేమిటి, పిక్‌నిక్‌కు వెళ్ళివస్తున్నట్లున్నారు?"

"అవును, పిక్‌నిక్ లాంటిదే." అన్నపూర్ణ నాలుగు వైపులా చూస్తూ వారిద్దరిని తనగదికి ఆహ్వానించింది.

కోటేశ్వరరావుకు వాళ్ళ వ్యక్తిగత విషయాలు తెలుసుకోవటం ఇష్టంలేని కారణంగా వేరేపని వున్నదని చెప్పి వెళ్ళిపోయాడు.

రాజగోపాలరావు అన్నపూర్ణ గదికి వెళ్ళేసరికి గణేష్ తలుపు దగ్గర నిలబడి వున్నాడు. అతను భయంతో సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు. రాజగోపాలరావు అతనిని చూసి సిగ్గుతో తలవంచుకున్నాడు.

"మీకు టీ తెప్పించమంటారా?" అన్నపూర్ణ అడిగింది.

"వద్దు మేమిప్పుడే భోజనం చేసాం. నువ్వు తీసుకో,అలసిపోయినట్లున్నావు."

"ఏమైనా పంపమని కాంటిన్‌లో చెప్పిరానా?" గణేష్ ఏదో పంకన అక్కడనుండి బయటపడదామని చూస్తున్నాడు.

"మీరు వెళ్ళనవసరం లేదు. మీరు కూర్చోండి. నేను వెళ్ళి చెప్పివస్తాను."

"ఫర్వాలేదు. నేను చెప్పివస్తానులే!" గణేష్ బయటకు నడిచాడు.

కొంచెంసేపటివరకు టీగాని, గణేష్‌గాని రారని అన్నపూర్ణకు తెలుసు.

"అసలు జరిగిందేమిటో చెప్పు. గణేష్‌ముందు ఇవన్నీ అడగటం ఎందుకని అడగలేదు."

"ఆ అమ్మాయిని గురించి నేనిక్కడ ఏమీ అడగలేదు. ఆయనను తీసుకుని నాగార్జున సాగర్ వెళ్ళాను."

"నువ్వు జీవితం మొత్తంమీద చేసిన తెలివిగల పని ఇదొక్కటే అనుకుంటాను." రాజగోపాలరావు స్నేహంతో కూడిన వ్యంగ్యంతో అన్నాడు.

"ఆయనను వెదకటం పెద్ద యజ్ఞమైపోయింది. నగరంలోని ప్రతి చిన్న లాడ్జింగ్ వెతికాను. పోలీసులకు ఏమి ఫిర్యాదు చేయలేదు. ఒంటరిగానే వెతికాను. ప్రతి సందూ, గొందూ తిరిగాను. చివరకు పాతబస్తీలో ఒక చౌకబారు లాడ్జింగ్‌లో దొరికారు. వాళ్ళదగ్గర అప్పటికే డబ్బు అయిపోయింది. పెళ్ళి చేసుకోలేకపోయారు. గ్రామానికి వెళ్ళటానికి వీలులేకపోయింది."

"పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకున్నారా?!"

"అవును. పెళ్ళి చేసుకోకపోతే ఆ పిల్ల తల్లిదండ్రులు చంపినేస్తామన్నారట. వేరే గత్యంతరం లేక ఒప్పుకున్నారు."

"తప్పనిసరి నిర్ణయమే కాని, ఇష్టముండి కాదుగా!"

"అట్లాగే అనుకోవాలి వాళ్ళకు ఈ విషయంలో చట్టాలు, నియమాలు తెలిసినట్లు లేవు. రాజకీయాలు వదిలివేస్తానని, గ్రామం వెళ్ళకుండా హైదరాబాద్ లోనే వుందామని చెప్పాను. మొదట అంగీకరించాడు. ఇప్పుడు గునుస్తున్నాడు."

"మనం ఎక్కడున్నా మన చరిత్ర మనలను వెంటాడుతూనే వుంటుంది. ఎక్కడున్నా సమస్య ఒక్కటే. అతను నీకంటే తక్కువవాడననే ఆత్మన్యూనతా భావంతో పీడించబడుతున్నాడు. ఇది స్వాభావికం కూడా. అతను చెప్పినట్లు అతనిష్టప్రకారం చేయటమే మంచిది."

"ఇప్పుడు ఆయన మనస్సు మారిపోయింది. కాని ఆ పిల్ల తల్లిదండ్రులకు భయపడుతున్నాడు. ఇప్పటిదాకా వాళ్ళు చాలా మెత్తగా వుండేవాళ్ళు. వాళ్ళిప్పుడు చాలా కరుకు తేలిపోయినట్టున్నారు."

"అయితే కావచ్చు. నీకు నీ ఇల్లూ, వాకిలీ వదలవలసిన అవసరం ఏమున్నది?"

"నేను రాజకీయాలలో వుండలేను. దర్యాప్తు సంఘం ఏమయ్యిందో చూసావు కదా? మొత్తం నీకు తెలిసిపోయింది కదా! నేను కళ్ళుమూసుకుని గుడ్డిగా జమిందారును బలపరుస్తూ వచ్చాను. నేను జమిందారు ఏజంటును కాదని, ప్రజా ప్రతినిధినని నాకు తెలుసు. కాని ఏం ప్రయోజనం? ఆయన దాతృత్వానికి లొంగిపోయాను. దారి తప్పాను. ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నా."

"మనమందరం తప్పులు చేస్తాం. అయితే తక్కువమందే తమ తప్పు తెలుసుకుంటారు. తప్పు తెలుసుకుని పశ్చాత్తాప పడనివాళ్ళే రాజకీయాలలో పెరిగిపోతూవుంటారు. అయితే మంచి రాజకీయ నాయకులు తమ తప్పులు ప్రజల ముందు అంగీకరించటానికి ఎప్పుడూ వెనుకాడరు. నువ్వు సామాజిక జీవితాన్ని వదలిపెట్టలేవు. అది మన జీవితంలో ఒక భాగమైపోయింది. పైగా ఇప్పుడు నీ సంసారం కుదుటబడింది. నీ ఆలోచన మార్చుకోవచ్చు."

అన్నపూర్ణ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. రాజగోపాలరావు ఆప్యాయంగా ఆమె వీపు తట్టసాగాడు. ఆ ఆప్యాయతలో స్నేహమే నిండివుంది. చెడు తలంపే ఇద్దరికీ కలుగలేదు. "ఏడుస్తున్నావా? నువ్వు భూమిలో పుట్టావు. ప్రతిదీ నిశ్చయించినట్లే జరుగుతుంది. నువ్వు ఇంతకు ముందు నిర్వహించినట్లే నీ కర్తవ్యాన్ని

నిర్వహించు." రాజగోపాలరావు ఉపదేశం చెయ్యసాగాడు. వాస్తవానికి ఎవరికీ ఉపదేశాలు చెయ్యటం రాజగోపాలరావుకు ఇష్టం వుండదు.

"నువ్వు ఎంత పెద్ద విషయాన్నైనా మామూలుగా మార్చివేస్తావు." అన్నపూర్ణ కళ్ళు తుడుచుకుంటూ అన్నది.

"విషయం కూడా చిన్నదే. మేము ఆ అమ్మాయిని నీ గదిలో చూసి నచ్చచెప్పి బస్సులో పంపించివేసాం. నువ్వు ఏదో ఊహించుకుని విషయాన్ని పెద్దది చేసుకున్నావు నీ పరిస్థితి బాగా లేదని నాకు తెలుసు వాస్తవాన్ని గమనించు అతనితో కలసి జీవించటం నేర్చుకో."

ఆమె ఎంత ఆపుకుందామన్నా కన్నీటిని ఆపుకోలేకపోతున్నది. ఆమె పైటచెంగుతో కళ్ళు కప్పుకున్నది. ఇంతలో గణేష్ లోపలకు వచ్చాడు. ఆమె నవ్వుదామనుకున్నా ఏడుపే వచ్చింది.

గణేష్ ఆమెనా స్థితిలో చూసి తల క్రిందకు దించుకున్నాడు అతనికి భార్య అంటే విచిత్రమైన భయంతో పాటు,ఆత్మీయత కూడా మెండుగా వుంది. "జరిగిందంతా మర్చిపో. ఆ అమ్మాయికి సంబంధించినంతవరకు ఆమె నీకు అడ్డం లేదు. కనీసం నీ ఆరోగ్యం కోసమైనా జరిగిందంతా మర్చిపోవటం మంచిది."

రాజగోపాలరావు గణేష్ చేతిలో కప్పు అందుకొన్నాడు.

"మనమేమీ చిన్నపిల్లలం కాదు. ఏవిషయం గురించైనా పదిసార్లు చెప్పుకో వలసిన పనిలేదు. అనుభవం నేర్పిన పాఠాలు గుర్తుంచుకుంటే చాలు." రాజగోపాలరావు మాటలతో గణేష్కు కూడా కన్నీరు ఆగలేదు.

అన్నపూర్ణ భర్త కన్నీరు కార్చటం చూడలేకపోయింది. ఇద్దరి మనసులు కన్నీటితో కడిగినట్లయ్యాయి.

ఇంతలో కోటేశ్వరరావు అక్కడకు వచ్చాడు.

"ముఖ్యమంత్రి పి.ఏ. ఫోను చేసాడు. ఆనకట్ట మరమ్మత్తు పూర్తయ్యిందని, ఎన్నికలకు ముందే దానిని ప్రారంభించాలని ముఖ్యమంత్రి ఆలోచిస్తున్నారని చెప్పాడు. మరల డబ్బు పెద్ద ఎత్తున ఖర్చు చేస్తారు తమ ఘనత చాటుకుంటారు. అది నాకిష్టంలేదు. అవును. మనం ప్రారంభోత్సవాల పేరుతో జరిగే ఈ అనవసరపు ఆడంబరాన్ని, ఖర్చును ఆపాలి. ఆనకట్టలు ఓట్లు సంపాదించటానికి కట్టబడవు. మనం మన కర్తవ్యాన్ని పూర్తి చెయ్యాలి."

రాజగోపాలరావు కొంచెం ఆవేశంగా అన్నాడు.

"మామూలు ఉత్సవం ఆడంబరం లేకుండా చేస్తే బాగుంటుందనిపిస్తుంది. ముఖ్యమంత్రి, ఆయన అనుచరులు ముఖ్య అతిధులుగా కాక సందర్శకులుగా వస్తే బాగుంటుంది. మొట్టమొదటినుంచి ఆనకట్ట నిర్మాణంలో పనిచేసిన రామయ్య, ఏసుదాసు వంటి కూలీలతో ఆనకట్ట ప్రారంభోత్సవం చేయించితే బావుంటుంది. అది జన చైతన్యానికి ప్రతీకగా వుంటుంది." కోటేశ్వరరావు తన ధోరణిలో సూచించాడు

"అట్లా అయితే అన్నివిధాలా బాగానే వుంటుంది. మరి ముఖ్యమంత్రిగారి ఆలోచన ఎట్లా వున్నదో, మీరు ఇద్దరూ శాసనసభ్యులు కదా! ఆయనను కలసి యీ ఆలోచన చెప్పండి. అయన కూడా అంగీకరించవచ్చు. పైగా ఆయన అన్నపూర్ణను కలవాలనుకుంటున్నారు."

"అవును. ఆయనను కలవటానికి నాకు కూడా ఒక కారణం దొరికినట్లవుతుంది."

రాజగోపాలరావు, కోటేశ్వరరావు ఆ గదినుండి బయటికి వెళ్ళిపోయారు. గణేష్ తలుపులు వేసి, ఇంతకు ముందెప్పుడూ తీసికోనివిధంగా భార్యను కౌగిలిలోనికి తీసుకున్నాడు. ఇద్దరి కళ్ళవెంట కన్నీరు ధార కట్టింది. దుఃఖం, సంతోషం, పశ్చాత్తాపం, సుఖం అన్నీ ఆ కన్నీటిలో కలగలిసిపోయాయి.

# 39

ఆహ్వాన పత్రాలు, ఏ విధమైన ఏర్పాట్లు, ప్రకటనలు లేవు. కానీ తెల్లవారే సరికి ఆనకట్ట వద్ద వేల సంఖ్యలో ప్రజలు గుమి కూడారు. ముఖ్యమంత్రి అక్కడికి వచ్చేసరికి ప్రజలు ఇంకా ప్రవాహం లాగా వస్తూనే వున్నారు. అక్కడ షామియానా ఏమీ లేదు. సూర్య కిరణాలు జలాశయం మీద తళ తళా మెరుస్తూ వున్నాయి.

అక్కడ మైక్ గానీ, టేబుల్ గానీ ఏమీ లేవు. కేవలం నాలుగైదు కుర్చీలు న్నాయి. ఎవ్వరూ ఆహ్వానించకపోయినా ముఖ్యమంత్రితోపాటు పత్రికా విలేఖరులు కూడా అక్కడికి వచ్చారు. వారు అధికారుల పక్కన నిలబడి వున్నారు.

రాజగోపాలరావు, అన్నపూర్ణ, వారిద్దరి మధ్య ముఖ్యమంత్రి ఒక పెద్ద కుర్చీలో కూర్చుని వున్నారు. రాజగోపాలరావు ప్రక్కన కుర్చీలో కోటేశ్వరరావు, అతని ప్రక్కన ఏసుదాసు కూర్చుని వున్నారు.

ముఖ్యమంత్రి లేచి మాట్లాడటం ప్రారంభించారు:

"నేను ఈ ఆనకట్టను ప్రారంభించటం లేదు. భారత దేశ చరిత్రలో బహుశా మొట్టమొదటిసారి ఆనకట్ట నిర్మాణంలో పాలు పంచుకున్న కూలీల చేతనే ప్రారంభోత్సవం చేయించటం జరుగుతున్నది."

సభలో చప్పట్లు మారుమ్రోగాయి.

"ముందు ముందు భవిష్యత్తులో పదవులలోనికి వచ్చేవారు కూడా ఇదే విధమైన పద్ధతి అవలంబిస్తారని నేను ఆశిస్తాను. మారుతున్న సమాజానికి అనుగుణంగా మనం కూడా మారాలి.

నేను ఇంతకు ముందు ఎక్కడా ఎవరికీ చెప్పని విషయ మొకటి ఇప్పుడు ఇక్కడ చెబుదా మనుకుంటున్నాను. ఆ విషయం చెప్పటానికి ఇంతకంటే మంచి సమయం, స్థలం వుంటాయని నేననుకోవటము లేదు."

ముఖ్యమంత్రి మాటలతో సభ యావత్తూ నిశ్శబ్దమై పోయింది. సభలోని ప్రతి ఒక్కరూ ముఖ్యమంత్రి నోటినుండి ఏమి వెలువడుతుందోనని చూడ సాగారు.

"యీ ఆనకట్ట తనంతట తానుగా కొట్టుకుపోలేదని, కావాలనే దుండగులు కొందరు దీనిని ధ్వంసం చేసారని మీకూ, నాకూ అందరికీ తెలుసు. ఈ దుశ్చర్యకు పాల్పడిన వారికి తప్పకుండా శిక్ష విధించబడుతుంది. దర్యాప్తు జరుగుతున్నది. దీనికి బాధ్యులైనవారు నిస్సందేహంగా దోషులే అయితే కోర్టులకు ఎక్కువ సాక్ష్యాలు కావాలి. ఆ సాక్ష్యాలు కూడా సేకరిస్తున్నాం.

మరమ్మత్తులు కూడా అనుకున్న దానికంటే ముందే పూర్తయ్యాయి. యీ ఆనకట్ట నిర్మించిన కంపెనీ మూతపడి పోయింది. ఇదొక విధంగా మంచికే జరిగింది. ప్రభుత్వమే యీ మరమ్మత్తులు పూర్తి చేయవలసి వచ్చింది. మనము ఇప్పుడొక గుణపాఠం నేర్చుకున్నాం. దోషులకు శిక్ష తప్పక పడి తీరుతుంది. ఇప్పటివరకూ జరిగిన మరమ్మత్తులకు వీరికి ప్రభుత్వం డబ్బు చెల్లించదు.

నేను యీ విషయాలే మీకు చెబుదామనుకున్నాను. ఇంతకంటే చెప్పటానికి కూడా ఏమీ లేదు." ముఖ్యమంత్రి తన ప్రసంగం ముగించి కూర్చుంటూ అన్నపూర్ణను మాట్లాడవలసిందిగా కోరారు.

అన్నపూర్ణ మాట్లాడటానికి లేచింది. కొంచెం సేపు ఆమె నోటివెంట మాట రాలేదు. కొద్ది క్షణాల తర్వాత సంబాళించుకుని మాట్లాడటం ప్రారంభించింది:

"నేను కూడా మీకు ఒక విజ్ఞప్తి చేసుకోవాలి. నేను కూడా ఒక గుణపాఠం నేర్చుకున్నాను. సమాజంలో ఎంత ఉన్నతులైనా రోజు గడవటం కోసం సంపాదనకు వెంపర్లాడుతూనే వుంటారు. నేను జమిందారును మంచివాడూ, గొప్పవాడూ అనుకున్నాను. కానీ అతనిచేత మోసగించబడి, దగా చేయబడి మీకు అన్యాయం చేసినందుకు దోషం ఆయనపై నెట్టడం లేదు. నేనే మీకు ద్రోహం చేసినట్లు భావించుకుంటున్నాను. సామాజిక జీవితంలో వుండేవారు ప్రతి అడుగూ జాగ్రత్తగా చూచి చేయవలసి వుంది."

సభలో కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.

"ఏసుదాసు నా దగ్గరకు వచ్చి ఆనకట్ట గురించి చెప్పినపుడు నేను విని వుండవలసింది నేను వినలేదు. పైగా ఇంకా ఎవ్వరికీ చెప్పలేదు. అసలు విష

యమే మరచిపోయాను. నేనతనిని అసలు నమ్మనే లేదు. ఎలా నమ్మగలను? గ్రామానికి ఇంత సహాయం చేసే వ్యక్తి, స్కూలు కట్టిస్తున్న వ్యక్తి, దేవాలయాన్ని పునర్నిర్మిస్తున్న వ్యక్తి, చదువును ప్రోత్సహిస్తున్న వ్యక్తి-ఇన్ని మంచి పనులు చేస్తున్న వ్యక్తి- ఆనకట్టను కట్టించిన వ్యక్తి ఆనకట్ట ధ్వంసం చేయించాడంటే ఎలా నమ్మాలి?"

"ఇది సిగ్గుపడవలసిన విషయం-" ప్రజలు బిగ్గరగా అరిచారు.

"దానాలు ధర్మాలు అన్ని ఆకృత్యాలను కప్పివేస్తాయని నాకు తెలవదు. ఇంత జరిగిన తర్వాత నాకు కనువిప్పు కలిగింది. ఒక విధంగా నేను కూడా బాధ్యురాలనేమో ననిపిస్తున్నది. నేను కొంచెం ముందు మేల్కొంటే బహుశా ఈ ఆనకట్టకు నష్టం జరిగివుండేది కాదేమో! నేను ఆనకట్ట నిర్మాణపు పని జమిందారు కంపెనీకి అప్పగించి అటూ ఇటూ తిరుగుతూ వుండిపోయాను. పని ఎట్లా జరుగుతుందో కనీసం మధ్యలో తెలుసుకోలేకపోయాను. నేను ఈ విధంగా తప్పు చేసాననే భావిస్తున్నాను

పెద్ద పెద్ద పదవులలో వున్నవారు ధనం సంపాదిస్తారు హోదా పెంచివేస్తారు. అయితే ఇతరులకు మాత్రం తమ అకృత్యాలు తెలవకుండా ఆడంబరంతో కప్పివేస్తుంటారు ఇది నేను అనుభవంతో తెలుసుకున్నాను.

మీరు నన్ను నిందించండి నన్ను శిక్షించండి. నేను ప్రజా జీవితంలో పని చేసే యోగ్యత కోల్పోయాను. జమిందారును సమర్థించి నేను కావలసినంత శిక్ష అనుభవించాను. కాని ఆ శిక్ష చాలదు నన్నింకా శిక్షించండి."

"అవసరం లేదు. మీరు మాలో ఒకరే." వేల కంఠాలు ఒక్కసారిగా పలికాయి. అన్నపూర్ణ హృదయపూర్వకంగా ప్రకటించిన పశ్చాత్తాపం, నిజాయితీతో కూడిన మాటలు వారి నావిధంగా పలికించాయి

ఆమె హైదరాబాదు నుండి తిరిగి వచ్చిన తర్వాత తాను అగ్నిపరీక్షకు నిలిచానని, అయితే దానిలో పూర్తి పునీతురాలను కాలేకపోయానని అంటూ వచ్చింది. కాని ఆమె పూర్తి పరిశుద్ధురాలైందని, ప్రజాభిమానాన్ని తిరిగి పొందిందని ప్రజలు భావించసాగారు. ఆమెకు వ్యక్తిగతంగా జరిగిన నష్టం, ఆమె మీద ప్రజలకున్న గౌరవాన్ని మరింతగా పెంచింది.

ఆమె ఇంకా ఎక్కువ మాట్లాడలేక కుర్చీలో కూర్చున్నది. కాని సభికుల హర్షధ్వానాలు చాలా సేపటివరకు చెలరేగుతూనే వున్నాయి.

అన్నపూర్ణ నాలుగు వైపులా చూసింది. ఆమెకు కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది. ముఖ్యమంత్రిగారు మంచినీరు తెప్పించి ఇచ్చారు. ఆమె భర్త కోసం గుంపులో చూడసాగింది. కాని అతను తన అలవాటు ప్రకారం ఎవరో చౌకబారు స్త్రీతో జారుకున్నాడు.

రాజగోపాలరావు మాట్లాడటానికి లేవగానే సభయావత్తూ హర్షధ్వానాలతో నిండిపోయింది. "ఇక్కడ పెద్దగా ప్రసంగాలుండవని భావించాను. అయితే మన దేశంలో ప్రసంగాలు లేకుండా ఏ కార్యక్రమమూ శోభించదు. మన ఆలోచనలను మన లక్ష్యాలను ఘనంగా ప్రకటించుకున్నాం. అయితే మన ఆదర్శాలను ఆమలులో పెట్టినప్పుడే మన లక్ష్యాలను సాధించగలుగుతాం.

మనలో లోటుపాట్లున్నాయి. శీలం అన్నింటికంటే ప్రధానమైనటువంటిది. కాని అదే మనకు లేకుండా పోయింది. మన సామాజిక రంగంలో ఆదర్శాలు చాలా వున్నాయి. కానీ అమలుపరిచేవాళ్ళే లేకుండా పోయారు. అందుకే ఇక్కడ జమిందారువంటి వాళ్ళ ఆటలు సాగుతున్నాయి. మన సమాజంలో ఇటువంటి వ్యక్తులు చాలామంది వున్నారు. వారినుండి సమాజాన్ని రక్షించుకోవాల్సిన బాధ్యత మనమీద వున్నది.

ఆనకట్ట మన సమాజము పునర్నిర్మాణానికి ప్రతీక. అయితే ఆనకట్టను ధ్వంసం చేసినవారు ఇంకా మిగిలే వున్నారు. మిగిలే వుంటారు. వారినుంచి మనలను మనం రక్షించుకోవాలి.

ఆనకట్ట నిర్మించే వాళ్లు, ధ్వంసం చేసేవాళ్లు వేర్వేరు వర్గాలకు చెందినవారు. వారిని కలపటం కష్టసాధ్యం. అయితే మనలో సామాజిక, రాజకీయ చైతన్యంవుంటే వారినుంచి మనలను రక్షించుకోవటం చాలా తేలిక. మనలో ప్రస్తుతం ఆ చైతన్యం వచ్చిందని నా విశ్వాసం.

జమిందారు దానధర్మాల ముసుగులో చాల అకృత్యాలు చేశాడు. దురుద్దేశ్యాలతో కూడిన దానధర్మాలు దానాలనిపించుకోవు. అవన్నీ కుట్రలు, కుతంత్రాలు. అందుచేతనే ఆయన ప్రకటించిన పెద్దపెద్ద కార్యక్రమాలన్నీ మధ్యలో ఆగిపోయి వున్నాయి. అవన్నీ జమిందారు దుర్మార్గాన్ని చాటి చెపుతున్నాయి. మన సామా

జంలో దానం ఇచ్చేవాడు, దానం పుచ్చుకునేవాడు అనే రెండు వర్గాలు ఎందు కుండాలి? దానం ఇవ్వటం బహుశా పుణ్యమే కావచ్చు. దానం చేసేవారు స్వర్గానికి వెళ్ళవచ్చు అయితే యిది ఒకవిధమయిన నైతిక బానిసత్వం. మానవతా విలువలకు విరుద్ధం నేను మరల యిదే విషయాన్ని నొక్కి చెబుతున్నాను. శీలం, నైతిక విలువలు ఎంతో అవసరం. ఈ ఆనకట్ట మనకు ఒకేపాఠాన్ని బోధిస్తున్నది. చూసి నడవండి, కళ్ళు మూసుకుని నడవవొద్దు. ఇతరుల పొట్టగొట్టి మీ పొట్టలు నింపుకోవద్దు.

ఎన్నికలకు ఆనకట్టకు సంబంధం లేదు. ఈ ఆనకట్టను ఒక వ్యక్తో, ఒక పార్టీయో నిర్మించలేదు. యావత్తు దేశం దీన్ని నిర్మించింది. ఇది దేశపు సంపత్తి.

ఆనకట్ట నిర్మించబడింది. ధ్వంసం చేయబడింది. ధ్వంసం చేసిన వాళ్ళు రక్షించబడ్డారు. మన సమాజంలో అవినీతి పేరుకుపోయిన కారణంగానే అయోగ్యులైన వ్యక్తులకు కాంట్రాక్టు ఇవ్వబడింది. యీ సందర్భంలో మీకు నాదొక విన్నపము. మనమందరం సమాజాన్ని వేరు పురుగులాగ తొలిచివేసే లంచాలకు సంబంధించి ఒక ప్రతిజ్ఞ చేద్దాం. 'మనం ఎవ్వరమూ ఇకపై లంచాలు తీసుకో కూడదు, ఇవ్వకూడ'దని ప్రతిజ్ఞ చేద్దాం.

మనం ఇప్పుడిప్పుడే నడక ప్రారంభించాం. ఈ నడకలో మన అడుగులు తడబడవచ్చు సుదీర్ఘమయిన మన లక్ష్యాన్ని చేరటానికి మనం శక్తిని కూడగట్టు కోవాలి. నేనెక్కువ మాట్లాడాలనుకోలేదు. అయినా మాట్లాడుతున్నాను. ఆనకట్ట తయారైపోయింది. ఒక కాలువ కూడా పూర్తిగా త్రవ్వబడింది. రెండవది కూడా త్రవ్వబడుతున్నది. ఎండిన పొలాలపైన, ఎండిన భూమాత గుండెలను యీ ఆనకట్ట ద్వారా వచ్చే నదీ జలాలు చల్లబరుస్తాయి."

ముఖ్యమంత్రి చప్పట్లు కొట్టడంతో సభయావత్తూ హర్షధ్వానాలు చేసింది.

"నేనిప్పుడు యీ ఆనకట్టను లాంఛనంగా ప్రారంభించవలసిందిగా ఏసు దాసును అభ్యర్థిస్తున్నాను."

ఏసుదాసు వణుకుతూ లేచి నుంచున్నాడు.

"నేను ప్రసంగాలు చెయ్యలేను. వాటి అవసరం కూడా లేదు" అంటూ స్విచ్ ఆన్ చేశాడు. నదిలోని నీరు ఉప్పొంగుతూ, గర్జిస్తూ ప్రవహించసాగింది.

ప్రజలక్కడ ఆగలేక ఆ నీటితో పాటు కాలవ ఒడ్డున పరిగెత్తసాగారు. ముఖ్యమంత్రి రాజగోపాలరావు వీపుపై స్నేహంగా తట్టారు. ఆయన తన కారు దగ్గరికి వెళ్ళిపోయారు. ఆయన వెంట ప్రభుత్వాధికారులంతా అనుసరించారు.

"నేను నడుద్దామనుకుంటున్నాను." రాజగోపాలరావు అన్నాడు.

"అవును, నేను కూడా." కోటేశ్వరరావు గొంతు కలిపాడు.

"ముఖ్యమంత్రిగారు క్షమించితే నాకు కూడ మీతోపాటే నడుద్దామని వుంది." అన్నపూర్ణ గొంతులో ఉత్సాహం తొంగిచూచింది.

"ఆయన ఏమంటాడులే- పద, వెడదాం" అంటూ రాజగోపాలరావు ముందుకు సాగాడు. ఆయన వెనక, ముందు ప్రజలు గుంపులు గుంపులుగా పోతున్నారు.

వాళ్ళంతా నిర్మానుష్యంగా వున్న కోట దగ్గరకు చేరారు.

రాజగోపాలరావు కోట ద్వారం వైపు చూశాడు. అక్కడ వీరాస్వామి మూటలాగ పడివున్నాడు అతని ప్రక్కనే కర్ర పడివున్నది. కుక్కలాగ సేవ చేసిన వీరాస్వామి అక్కడ కుక్కలాగ పడివున్నాడు. జైలు నుంచి విడుదలైన అతను వేరే జైలులో వున్నట్లే వున్నాడు.

రాజగోపాలరావు గ్రామం వైపు వెనుకకు తిరగ్గానే సోమయాజులు వంగి నమస్కారం చేస్తూ—

"అయ్యా, నన్ను క్షమించండి. ఆ జమిందారు వట్టి అవినీతిపరుడు. అతనే మిమ్మల్ని కొట్టించాడు ... ....నన్ను క్షమించండి. క్షమించి, మీరే రక్షించాలి" అన్నాడు.

రాజగోపాలరావు చిరునవ్వు నవ్వాడు. భవిష్యత్తును గురించిన అద్భుతమైన ఆశలూ ఆకాంక్షలూ అతని మనోఫలకంపై దర్శన మివ్వసాగాయి, నదీ కెరటాల కలకలం అతని ఉత్సాహంతో పోటీపడుతున్నట్లున్నది.

